# కాశీ మాహాత్మ్యము





అచ్యుతుని బాలకృష్ణమూర్తి



# కృతజ్ఞత

ఈ పుస్తకము తిరుమల తిరుపతి దేవస్థానము వారి ఆర్థిక సహాయముతో ముద్రించబడినది.

వారికి మా కృతజ్ఞతాభివందనములు.

# విషయ సూచిక


I. ప్రథమాశ్వాసం

1. వింధ్య గర్వాపహరణం .... 2

II. ద్వితీయాశ్వాసం .... 9

2. దేవతలు కాశికి వచ్చుట .... 14
3. దేవాళి అగస్త్యాశ్రమ దర్శనం .... 18
4. బృహస్పతి చెప్పిన పతివ్రత ధర్మాలు .... 21
5. అగస్త్యుడు నిర్వేదం .... 26
6. అగస్త్యుడు కాశిని వదలిపోవుట .... 32

III. తృతీయాశ్వాసం

7. అగస్త్యుని తీర్థయాత్ర .... 39
8. అగస్త్యుడు కొల్లాపురిని దర్శించుట .... 43
9. అగస్త్యుడు శ్రీశైలమున కేతెంచుట .... 46
10. శ్రీ పర్వత మహిమ .... 48
11. శివశర్మోపాఖ్యానం .... 51
12. సూర్యలోకవర్ణనం .... 63
13. వైశ్వానర చరిత్రం .... 69
14. వీరేశ్వర ప్రభావం .... 74

IV చతుర్థాశ్వాసం.

15. నిరృతిలోక వృత్తాంతం .... 83
16. కుబేరుని వృత్తాంతం .... 88
17. సప్తర్షి లోక వృత్తాంతం .... 114

V. పంచమా శ్వాసం

18. మణికర్ణికా మహాత్మ్యం .... 124
19. కాలభైరవ జననం .... 131
20. హరికేశుని వృత్తాంతం .... 138
21. జ్ఞానవాపికా తీర్థమహాత్మ్యం .... 139
22. ఆయురవసాన కాలం .... 157
23. దివోదాసు చరిత్ర .... 158
24. ఉత్తరార్క ప్రభావం .... 167

VI. షష్ఠా శ్వాసం

25. సాంబాదిత్య ప్రభావం .... 169
26. గరుడాదిత్య ప్రభావం .... 170
27. వృద్ధాదిత్య ప్రభావం .... 174
28. శివుడు విఘ్నేశ్వరుని కాశికి పంపుట .... 183
29. లక్ష్మీనారాయణులను కాశికి పంపుట .... 186
30. దివోదాసు నిర్యాణం .... 189
31. పంచనద వృత్తాంతము .... 193
32. కాశిలో విష్ణురూపాలు .... 195
33. వృషభధ్వజనిర్యాణం .... 198
34. శైలేశ్వర ప్రాదుర్భావం .... 200
35. త్రివిష్టపతీర్థ మహాత్మ్యం .... 202
36. దుర్గా మహాత్మ్యం .... 204

VII. సప్తమా శ్వాసం.

37. ఓంకారేశ్వర మహాత్మ్యం .... 209
38. త్రివిష్టపేశ్వర మహాత్మ్యం .... 211
39. ధర్మరాజేశ్వర మహాత్మ్యం .... 213
40. దుర్వాసేశ్వర ప్రాదుర్భావం .... 217
41. దక్షేశ్వర ప్రాదుర్భావం .... 219
42. వ్యాసేశ్వర ఆవిర్భావం .... 227

## నమశ్శివాయైచ నమశ్శివాయ

జగత్పితరులగు పన్న పూర్ణా విశ్వేశ్వరులయు వారి కాపాలి యగు కాశీక్షేత్రముయొక్కయు మహిమాభివర్ణనలతో విండిన యీ కాశీ మాహాత్మ్యము - శ్రీనాథుని 'కాశీఖండ'మను పద్య కావ్యమునకు వచన రూపమగు పరివర్తనము. రచయిత శ్రీ అచ్యుతుని బాలకృష్ణమూర్తి, M. A., B. Ed., గారు. ఆశురాస్యులగు వ్రాత్యాంధ్ర వ్యక్తియుం జదివి పఠింప వలెననియే కాబచ్చును, గ్రంథము సొంతము వ్యవహారికాంధ్రమున వ్రాసినారు. అంతియేకాదు. అధోజ్ఞాపికలలో (Foot-Note) ఆంగ్ల విజ్ఞాన భావికాంతకరములగు వేలాది విన్నిలకు, పెద్దలకు నచ్చునట్లు, చారిత్రక దృష్టితో, వైజ్ఞానిక దృష్టితోఁ గొన్ని యువపత్తులఁ జూపి సిద్ధాంత మొనర్చుట రమ్యముగా ఉన్నది.

మూలమునమన్న భక్తి, జ్ఞాన వైరాగ్యములను శేటతెల్లమొనర్చు యోగ విద్యా ప్రసంగమమున - F. N. లోని వారి వివరణము వారి యోచనా విద్యానుభవమునకు దృష్టాంతముగ నున్నది. అట్టి పరిణత చిత్తులు కాపుననే, శివపారమ్యము గల్గి యీ వర్ణాశ్రమ ధర్మముల కన్నిటికిని కరదీపిక యనఁదగు నిట్టి గ్రంథము వ్రాయఁ గలిగినారు. వ్రాయుటలో సుగమమగు పక్కిని ఆంధ్రలో కోవకారకముగ వ్రాసిన యీ రచయిత ధన్యజీవనులు- ఈ గ్రంథ రచనలో నిమగ్నులై శివపారమ్యములోను భజించిన వీరు, రచన పరిసమాప్తి చేసినదే తడవుగా శివైక్యము చెందినారు. ఇది లౌకికముగా మనకు బాధాకరమేగాని పారమార్థికముగా ఆయన ధన్యుడు. ఆంధ్రులెల్లరు చదివి పార్వతీపరమేశ్వర భక్తి భావితులగుదురుగాక.

కాకినాడ
రామారావుపేట

వెంపరాల సూర్యనారాయణశాస్త్రి
శ్రీ విశ్వనాథ సాహిత్య పీఠాధిపతి

## కాశీ ఖండమే - కాశీ మాహాత్మ్యము

శ్రీనాథుని పుణ్యాన తెలుగువారికి కాశీ ఖండం దక్కింది. వ్యాస ప్రణీతములైన అష్టాదశ పురాణములలో స్కాందపురాణం అతి విస్తృత మైనది. అందలి చతుర్థ ఖండం కాశీ ఖండం.

"కాశీ ఖండమయః పిండ" మన్నది జగత్ప్రసిద్ధమైన నానుడి. ఆ యినుప ముద్దను కరగించి కవి సార్వభౌముడు శ్రీనాథుడు కాశీక్షేత్రాన్ని తెలుగువారి కన్నులకు కట్టించి తన కవితా గంగా ప్రవాహంలో మునకలు వేయించాడు. అగాధమైన ఆ మహాగంగా ప్రవాహాన్ని తనివిదీర అవగాహన చేసికోవటం అంతంత మాత్రాన అందరికీ సాధ్యమైన పనికాదు.

సత్యలోకంనుండి రసాతలం దాకా సమస్త లోకాలలోని అశేష విశేషాలనూ తరంగింపచేసే ఆ మహాప్రవాహం పొడవునా రేవులు తీర్చి మెట్లు కట్టి నేటి తెలుగువారి అవగాహనకు అందుబాటులో ఉండే రీతిగా అందించిన పుణ్యం దక్కించుకొన్నవారు శ్రీ అచ్యుతుని బాలకృష్ణ మూర్తిగారు.

శ్రీనాథుడు కాశీఖండాన్ని పద్యాల్లో వ్రాసిన తర్వాత మరెవ్వరూ దాన్ని పద్యాల్లో వ్రాయడానికి సాహసించలేదు. అలాగే శ్రీ బాలకృష్ణ మూర్తిగారు ధారాళమై మందార మకరంద మధురమైన శైలిలో వ్రాసిన ఈ కాశీమహాత్మ్యముకూడా వ్యావహారిక వచనంలో పరిణతమైన రచన.

ఇందులో వర్ణింపబడినది కాశీ మాహాత్మ్యమే. అయినా పాతంజల యోగశాస్త్ర, వేద వేదాంగతత్త్వార్థ, సాముద్రికాది ఖగోళ, భగోళ, భూగోళాది విజ్ఞాన విషయ రహస్యాలు ఎన్నింటితోనో ముడిపడియున్న గ్రంథ మిది. అంతంతమాత్రాన కొరుకుడు పడేదికాదు. అటువంటి గ్రంథాన్ని

అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు అవసరమైన విషయాన్ని వదలకుండా అనవసరములను స్పృశించకుండా, స్పష్టతకు భంగం లేకుండా, సమగ్రత చెడకుండా, కావ్య గౌరవం ఇనుమడింపజేస్తూ, అందరికీ అందుబాటులో ఉండేరీతిగా, కవితా చమత్కృతి విశేషాలలో శ్రీనాథుని పరవడిగా పెట్టుకొని, ఆధునికమైన నవలలకు మోజుపడేజనానికికూడా గుండెలలో హత్తుకుపోయేటట్లుగా శ్రీ బాలకృష్ణమూర్తిగారు ఈ కాశీ మాహాత్మ్యాన్ని రచించారు.

అయితే అది కాశీ ఖండ ప్రభావమో లేక శివానుగ్రహమో కాని కాశీఖండంతోనే శ్రీనాథుని జీవిత చరమ ఖండం సమాప్తమైంది శ్రీ బాలకృష్ణమూర్తిగారి జీవితచరమాధ్యాయంకూడా కాశీమాహాత్మ్యంసమాప్తితోనే సమాప్తమైంది.

"శివః కాశీ శివః కాశీ శివః కాశీ శివశ్శివః
శివః కాశీ శివః కాశీ కాశీకాశీ శివశ్శివః" — అని పెద్దలు పఠించి జపించే శివస్వరూపమైన కాశీ, కాశీ స్వరూపమైన శివుడు నిరంతరమూ ఈ గ్రంథ రచనకాలమున శ్రీ బాలకృష్ణమూర్తి ప్రాణమయ మనోమయ కోశములందు సూక్ష్మాతిసూక్ష్మమైన రూపంలో ఆవేశించియుండి యుందురు అనటం శాస్త్ర ప్రమాణ సిద్ధమేకాని వట్టి అభిమాన ప్రశంసా పరమైన అతిశయోక్తి కాదు.

శ్రీ మద్భాగవతమున ఏకాదశ స్కంధములో సర్వ వాఙ్మయము భగవత్స్వరూపమే అన్న విషయాన్ని వివరిస్తూ వ్యాస భగవానుడన్న మాటలు సర్వదా ప్రమాణభూతములు. "స ఏష జీవః పరమాత్మ వ్యజ్ఞకః ప్రాణేన ఘోషేణ గుహాం ప్రవిష్టః మనోమయం సూక్ష్మముపేత్యరూపం మాత్రా స్వరోవర్ణ ఇతి స్థవిష్టః" పరమాత్మ స్వరూపమైన జీవుడు

నాదరూపమైన ప్రాణముతో గుహను ప్రవేశించి సూక్ష్మమైన మనోమయ రూపమును పొంది మాత్రా స్వర వర్ణాత్మకమైన అక్షరరూపం పొందు తున్నాడు. అందుకే వేదో నారాయణః" అని చెప్పబడింది. శబ్ద బ్రహ్మ తత్త్వావిష్కారమునకు జరిగిన మనోగతమైన మనన వ్యాపారమే వైఖరీ వాక్కునందు వాఙ్మయ రూపాన్ని ధరిస్తుంది. మలిన సత్త్వ ప్రధానమైన వ్యష్టిచైతన్యము, శుద్ధ సత్త్వ ప్రధానమైన సమష్టి చైతన్య మునందు లీనం కావడము వాఙ్మయమైన తపస్సుయొక్క పరమార్థము. ఆ విధంగా మనస్సు శివునియందు కాశీయందు లగ్నమైయుండగా శ్రీ బాల కృష్ణమూర్తి "కాశీ మాహాత్మ్యము"ను మనకు వదలి తాను కాశిలో శివునిలో లీనమైనారు విధి ప్రచోదన ఎంత చిత్రమో చూడండి! గ్రంథం ముగింపు చేస్తూ ఆయన వ్రాసిన వాక్యం—

"మహర్షీ! ఇది స్కాందమనే పర్వతంలో జనించిన కాశీ మాహాత్మ్య పవిత్రధార. దీని యందు మునిగినవారి పాతకములుహరించి విశ్వనాథుడు ముక్తినిస్తాడు. కాశీ విశాలాక్షి ఇహలోనే సౌఖ్యములతో బాటు ఆముష్మిక ఫలసిద్ధి కలుగజేస్తుంది."

విధి బలవత్తరమైనది. దానిని తప్పించుకోలేము.

కాని ఆయన జీవితం ముగింపు లోకోత్తరమైన పుణ్యకార్య సాధనతో జరిగింది. తెలుగు సారస్వత లోకానికి తాను అందించిన ఈగ్రంథం ఆయనకు అఖండమైన కీర్తిని ప్రసాదించడానికి సమర్థమైనది, "జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః."

ఈ రచనను ప్రకాశింపజేసిన శ్రీ ఒడయారుగారు ధన్యులు. శివ సాయుజ్యాన్ని పొందిన ఒక సారస్వత తపస్వి రచనను లోకానికి అందించటం వారి లోకోత్తర పుణ్య విశేషం.

శ్రీ విశ్వనాథ సాహిత్య పీఠము
కాకినాడ

పేరాల భరతశర్మ
పిఠికాపురాధీశ ప్రభుత్వ కళాశాలా
సంస్కృత శాఖాధ్యక్షుడు, కాకినాడ.

# ఇంతకన్నా

గ్రంథకర్త నాకు బంధువు. బాల్యమిత్రుడు. పది, పన్నెండు సంవత్సరాలు పరస్పరం దూరంగా ఉన్నాం. ఇప్పుడతడులేడు. ఎప్పటికీ కలవక పోవచ్చు. బాల్యస్మృతులు మరిచిపోలేం. బాల్యస్నేహం వదలిపోదు స్నేహం విడవకపోయినా స్నేహితుడు విడిచివెళ్ళాడు. పోతూ పోతూ 'కర్మణ్యే వాధికారస్తే మాఫలేషు కదాచన' అనేది మరోవిధంగా రుజువు చేస్తూ కాశీమహాత్మ్యం రచించి ప్రచురించాడు. కాశీమ్మరణ మాత్రాన జన్మ రాహిత్యం కలిగితే ఇక మేమెప్పటికీ కలుసుకోం ఉహూం సాధ్యంకాదు.

స్కాంద పురాణాంతర్గతమైన కాశీఖండాన్ని శ్రీనాథుడు అనువదించాడు 'కాశీఖండ మయఃపిండ'మనే అర్యోక్తికి అనువాదమే, దాని కాఠిన్యమే, కారణమని నమ్మేవాళ్ళలో నేనొకణ్ని. తెలుగులో పురాణరచన భక్తజనాళి కోసం ఉద్దిష్టం. ఆ ఉద్దేశం నెరవేరాలంటే భిన్నకాలాల్లో భిన్నభాషాపద్ధతుల్లో ఆయాగ్రంథాలు వెలువడాలి. పూర్వసంగతి తెలియదు గాని ఇప్పటి రామరాజ్యంలో నూటికి ఎనభైమంది నిరక్షరాస్యులు. అక్షరాస్యతకు అర్థం సంతకం పెట్టగలగటం - గుడ్డిగానైనా సరే. అందువల్ల ఈ కొద్ది మందికే అర్థంకావాలన్నా ఇప్పటిభాషలో ఇప్పటి పాఠకుల నుద్దేశించి వ్రాయటం సమంజసం, ఫలవత్తరం సరిగ్గా ఆ భావంతోనే నమ్ముకుంటాను. బాలకృష్ణుడు ఈ గ్రంథం రచించాడు. హరుడు గ్రంథం రాయించి గ్రంథకర్తను హరించాడు. గ్రంథంద్వారా శివభక్తి ప్రచారం జరుగుతుంది, పండితపామరు లందరికీ విందుగా.

బాలకృష్ణుడికి ప్రాచీనత మీద భక్తిపోలేదు. నవీనతమీద రక్తి పోలేదు. జీవితాంతం ఈ రెంటినీ సమన్వయించాలనే సంకల్పం ఉండేది. అది రచనా పద్ధతిలో గూడా ప్రతిఫలించింది. శ్రీనాథ పద్యాల సారాంశాన్ని

సాధ్యమైనంత సరళభాషలో చెప్పాలని ప్రయత్నించాడు. వృత్తిధర్మంగా ప్రాచీనభాష పట్టువడింది. ప్రవృత్తి ధర్మంగా నవ్య భాష నడిచింది. పాతకొత్తల కలయికలో కృత్రిమత్వం తప్పదు. అవ్యాప్తి అతివ్యాప్తులు తప్పవు. ఫలితం ఈ గ్రంథంలోని భాష. విషయం పురాతనం. వివరీకరణ అధునాతనం. అందువల్ల ప్రాచీనతా ప్రాబల్యం వదల్లేదు. నవ్యత తల మెత్తకనూ పోలేదు.

భాషావిషయంలో లాగానే విషయ వివరణలో కూడా బాలకృష్ణ మూర్తి కొన్నికొత్తపుంతలు తొక్కాడు. అర్చామూర్తులఆయుధ ధారణపద్ధతులను (పే 197–8)పట్టికగా ఇవ్వటం నవీనత. ఇదిపాఠకసౌలభ్యంకోసం అధస్సూచికల్లో అంతముఖ్యంగాని విషయాలను వివరించటం ఇప్పటిపద్ధతి సాష్టాంగ నమస్కారాన్ని ( పే 181-2 ), క్షేత్రమహాత్మ్యాల పరస్పర వైరుధ్యాన్ని (పే 54) సమన్వయించి చెప్పటానికి గ్రంథకర్త ఈ మార్గం అవలంబించాడు. భారతీయ సమాజంలో స్త్రీలకేనా నియమ నిబంధనలనే ప్రశ్న వేసుకొని పురుషుల కర్తవ్యాలను అలాగే వివరించాడు (పే.21,24)

ప్రాచీన గ్రంథాల్లో కులవర్ణ వ్యవస్థలను ప్రస్తావించే ప్రసంగాలనేకం ఈ కాలంలో వాటిని ప్రశ్నించేవాళ్ళ సంఖ్య అపారం. అందుకే ప్రాచీనా ధునాతన దృక్పథాలను సమన్వయించే ప్రయత్నంచేశాడు, గ్రంథ కర్త (పే 10-17) ప్రధానగ్రంథ గ్రంథులను పాదసూచికలో వివరిస్తూ, యోగ విద్యావిషయాలు చర్చిస్తూ ఇప్పటి విజ్ఞానశాస్త్రదృష్టిని, భౌతిక దృక్పథాన్ని అప్పటి ఆధ్యాత్మిక చింతనలతో సమన్వయించాలని ప్రయత్నించాడు. (పే.148-156) సమాజ ధర్మాలు మారినా శాశ్వతధర్మాలు కొన్ని నిలిచి జగన్నాటకం నిర్వహిస్తాయని అతడి విశ్వాసం. ఆ విశ్వాసంతో, విశ్వేశ్వ రభక్తితో ఈ గ్రంథం రచించి కన్నుమూశాడు.

భౌతికకాయంతో బాలకృష్ణుడు మరి కనిపించడు. గ్రంథరూపంలో కాలాంతయుగాంతాల వరకూ వినిపిస్తాడు. కాశీమహాత్మ్యం ఆస్తికలోకానికి శాశ్వతానందం కలిగిస్తుందని ఆకాంక్షిస్తాను. గ్రంథకర్త అకాలమరణం పొందినా గ్రంథం సార్వకాలికంగా ఉండాలని ఆశిస్తాను.

ఇంతకన్నా ఏమి వ్రాయాలో తోచటంలేదు.

బూదరాజు రాధాకృష్ణ,
డిప్యూటి డైరెక్టర్ : తెలుగు అకాడమి,
హైదరాబాదు.



# మణి దీపం

పురాణానువాదమూ, పురాణ ఖండానువాదమూ ప్రాచీనాంధ్రసాహిత్య యుగాలలో ప్రత్యేక కావ్య ప్రక్రియలుగా కవులచే నిర్వహింపబడి సహృదయుల మన్ననలకు పాత్రాలయినవి. అందులోనూ పురాణ ఖండానువాదం శ్రీనాథాది మహాకవుల ప్రయోగాల్లో ప్రౌఢ విస్ఫూర్తిని వెలార్చింది పురాణ ఖండానువాదాల్లో క్షేత్ర మాహాత్మ్యాలకు ప్రముఖస్థానం లభించింది. క్షేత్ర, తీర్థ, పర్వ, దైవ మాహాత్మ్య వర్ణనం ఆ కావ్యవస్తువులలో ముఖ్యమైన అంశం. చతుర్విధ పురుషార్థ సాధనాత్మకమైన మానవ జీవిత ప్రస్థానంలో క్షేత్రసందర్శనం, తీర్థావగాహనం, పర్వవ్రత నిర్వహణం, దైవారాధనం అనేవి కర్మ భక్తి మార్గాలకు సంగమ తీర్థాలుగా సంభావింపబడటం సర్వజన హృదయామోదకాలు కావటం సంప్రదాయంగా భారతీయ జీవనంలో వస్తున్నది. క్షేత్రాలలో కాశీ క్షేత్రం కల్యాణ కల్పద్రుమం.

'కాశ్యాం ధర్మ స్త చ్చతుష్పాద రూపః
కాశ్యా ముక్తిః సోఽ ప్యనేకప్రకారః
కాశ్యాం కామః సర్వ సౌఖ్యైకభూమిః
కాశ్యాం శ్రేయ స్తత్తు కిం నాయత్ర యచ్చ"

అని స్కాంద పురాణం ప్రశంసించింది, స్కాందం క్షేత్ర మాహాత్మ్య గాథా ప్రపంచానికి పుట్టినిల్లు, అందులో కాశీ ఖండం కాశీక్షేత్రమాహాత్మ్యం. కీ. శే. అయ్యగారి బాలకృష్ణమూర్తిగారు దానిని మధురమైన వచన రచనంలో తెలుగువారి కందించి ప్రశంసాపాత్రులైనారు.

అయ్యగారి బాలకృష్ణమూర్తిగారు కాశీఖండాన్ని కాశీమాహాత్మ్యంగా తెలుగు చేశారు. వారీకృతిని వచనంలో నిర్వహించటం ఆధునిక యుగ

లక్షణం. పురాణాలను కావ్య రచనాస్ఫూర్తితో చంపువులుగా సంతరించటం ప్రాచీన కవుల మార్గం. ఆధునిక యుగంలో కొందరు పురాణాలను పద్యాలలో రచించినా కావ్య గుణ ప్రకాశనంకంటె తాత్పర్య ప్రతిపాదనానికే ప్రాధాన్యాన్ని కల్పించి నిర్మించారు. మరికొందరు పద్యరచనలు కాకుండా వచన రచనలు వెలయించారు. అందులోనూ గ్రాంథికభాషలో వ్రాసినవారు కొందరు, శిష్ట వ్యావహారికంలో వ్రాసినవారు కొందరు. భారతీయ సంస్కృతి వైభవాన్ని సామాన్య మానవులకు అందించటంలో నేడు వ్యావహారికాంధ్రభాష ఎంతో శక్తిమంతమైన సాధనంగా పనికి వస్తోంది. దీనిని గుర్తించి శ్రీ అచ్యుతుని బాలకృష్ణమూర్తిగారు సరళ శిష్ట వ్యావహారిక రచనలో దీనిని నిర్మించటం సమకాలీన సాహిత్య మర్యాదను మన్నించి, సామాజికులకు తమ రచనా తాత్పర్యాన్ని సూటిగా అందించటానికి చేసిన విశిష్ట ప్రయత్నమని భావించటానికి వీలుగా వుంది.

శ్రీ అచ్యుతుని బాలకృష్ణమూర్తిగారు వస్తుతః కవితాత్మ కలవారు అందువల్ల వచనం రచించినా లయాత్మకమైన మధుర వాక్ప్రవృత్తిని రచనలో రంగరించి రాణింపచేశారు. మూలాన్ని అనుసరించి అనువాదాన్ని సాగించినా స్వతంత్ర రచనగా భాసించేటట్లు నిర్వహించారు. చదివే వారికి చవులూరించే వచనశైలి ఈ రచనకు ఆయుస్సూత్రం, మొదలు పెడితే చివరిదాకా ఆసక్తిదాయకంగా పఠితచేత గ్రంథాన్ని చదివింపచేస్తుంది వీరి రచన. ఈ లక్షణం లేకపోతే ఎంతటి మహాగ్రంథమైనా ప్రాచుర్యం పొందటం అసాధ్యం. రచయితశైలి ఈ కృతి కల్పిన రమణీయ జీవితం. !

శ్రీ అచ్యుతుని వారికి ఆధునిక పఠితయొక్క సంస్కార విశేషాలు తెలుసు. ఆధునికయుగం హేతువాదాన్ని బలంగా ఆశ్రయించి నడుస్తోంది

తర్కసహమైన వాస్తవానికి హేతువాదం పట్టంకడుతుంది. చారిత్రక పరిణామగతిని సమాదరిస్తుంది. దీనిని గుర్తించి రచయిత ఆయా సందర్భాలలో వివరణలను అధస్సూచికల్లో పొందుపరచి రచించటం జరిగింది. మరికొన్ని చోట్ల గ్రంథంలోనే బ్రాకెట్లలో వివరణలను పొగించటం చూడవచ్చు. ఈ పద్ధతి సమకాలీన సామాజిక ప్రవృత్తికి అనుగుణమైనది. రచయిత ఉచితజ్ఞతకు చక్కని తార్కాణం.

ఆధునిక జీవితంలో ఆధ్యాత్మిక జీవన ప్రవృత్తికి క్రమంగా ప్రాధుర్యం తగ్గుతుంది. అయినా కర్మమార్గం సమాదరింప బడుతోంది. సమాజశ్రేయస్సు నుపలక్షించి చేసేకర్మ సర్వకాలాలలో గౌరవింపదగిందే సమాజ శ్రేయస్సు జాతియొక్క ఆర్థిక, లౌకిక, పారమార్థిక ప్రవృత్తులను ఆలంబనంగా చేసికొని ప్రవర్తిల్లుతుంది. మానవ జీవితం ఆర్థికంగా అభ్యుదయం సాధించినా, లౌకిక వ్యవస్థను నాగరికంగా నిర్మించుకొన్నా, ఆధ్యాత్మిక దర్శనంతో ముందంజ వేయకపోతే స్వయంసమగ్రం కాదు. సమాజంలో జ్ఞానులున్నారు, భక్తులున్నారు, కర్మఠులున్నారు. వీరిలో అధిక సంఖ్యాకులు కర్మఠులు, కర్మఅంటే వేద విహితమైనకర్మగానేరు భావించకపోయినా, మానవ సంస్కృతిని విశ్వశ్రేయోను సంధానంగా తీర్చిదిద్దే మానవసాధన అనేభావంతో సామాజికుడు ముందుకు నడుస్తున్నాడు. సర్వమానవ సమానత్వం, విశ్వమానవ సౌభ్రాతృత్వం, విజ్ఞానాత్మకమైన వివేచనత్వం, అనేవిఆధునిక మానవుని కర్మమార్గానికి లక్ష్యాలుగా నిలుస్తున్నాయి. వీటిని సాధించటానికి ఎన్నిమార్గాల నన్వేషించినా ఆధ్యాత్మిక చింతనాన్ని విడనాడిన ఏ ప్రస్థానమైనా లక్ష్యసాధన కుపయోగిస్తుందన్న నమ్మకం సమాజంలో సన్నగిల్లుతోంది. 'ఆత్మవత్సర్వ భూతాని' అన్న ఆధ్యాత్మిక భావసిద్ధి మానవుడు సాధించిననాడే మానవకర్మ మార్గం సార్థకంగానూ, సామాజిక పరంగానూ సమన్వయిస్తుంది. విశ్వశ్రేయస్సుకూ, విశ్వశాంతికే వెలుగు

జాతను ప్రసాదిస్తుంది. సామాజికశక్తి సన్మార్గంలో పయనించాలంటే కర్మకు శ్రద్ధ తోడుకావాలి. శ్రద్ధకు భక్తి శక్తిగా నిలవాలి; భక్తి ఆధ్యాత్మిక ప్రవృత్తికి పోషకం కావాలి. ఆధ్యాత్మిక దర్శనంతో అఖిల విశ్వాన్ని దైవస్వరూపంగా గ్రహించాలి. దాన్నే మనవారు జ్ఞానమన్నారు. అదే మోక్షస్థితికి మూలమన్నారు. భౌతికవిజ్ఞానం విశ్లేషణ వ్యుత్పత్తిని అందించినంతగా మానవ నైతికాధ్యాత్మికాభ్యుదయాన్ని కలిగించదు. కర్మ నైతికమైన ఆదర్శాన్ని కాదంటే జాతిలో సంక్షోభం తప్పదు. నేటి ప్రపంచం ఎదుర్కొంటున్న సంక్షోభం ఇదే. చిత్తశుద్ధిలేనికర్మ, శీలంలేని ప్రవర్తన అధునిక సమాజాన్ని పీడిస్తున్న ప్రధాన సమస్యలు. వీటికి పరిష్కారం చెప్పేది ఆధ్యాత్మిక జీవన విధానమే. దాని నందించే సాహిత్య ప్రక్రియ లెన్నోఉన్నా, వాటిలో క్షేత్రమాహాత్మ్యం ఒక ప్రత్యేక ప్రతిపత్తిని గడించుకొన్నది.

కాశీ మాహాత్మ్యంలో ప్రధాన ప్రతిపాద్యవస్తువు విశ్వేశ్వర విభూతి మహత్త్వం. వస్తుధ్వని నాశ్రయించి. సర్వం శివమయంగా కావ్యార్థాలు ఏక వాక్యతను భజిస్తాయి. శివలింగం భౌతికంగా శిలామయం. అయినా శివలింగాన్ని దర్శించి, అభిషేకించి. అర్చించి, ఆరాధించిన ఏ వ్యక్తి అయినా శిలను పూజించానని భావించడు. శిలలోసైతం శివుణ్ని చూచే సంస్కృతి ప్రతీకాత్మకంగా శివార్చనంలో ప్రతిష్ఠాపింపబడింది. అది పతివ్యక్తులలోసైతం శివత్వాన్ని దర్శించేవరకూ ప్రస్థానాన్ని సాగిస్తుంది. "మాతృదేవోభవ" "పితృ దేవోభవ" "ఆచార్య దేవోభవ" అతిథిదేవోభవ" మొదలైన సూక్తులన్నీ మనిషిలో మాధవుణ్ని దర్శించుమని చెప్పేవే. దైవత్వం అనేది మానవుడాశించే పరిపూర్ణతకు ప్రతీక. పరిపూర్ణత ఎక్కడ భావింపబడుతుందో అక్కడే మానవునకు సహానుభూతి. ఆ సహానుభూతిని భౌతికంగా, రసమయంగా. ఆధ్యాత్మికంగా సాధించే మార్గ

త్రియం మననంస్కృతి నిర్దేశిస్తున్నది. దేవాలయ సంస్కృతి భౌతిక సాధనకూ, పురాణకావ్యాధ్యయన సంస్కృతి రససాధనకూ, కర్మభక్తిజ్ఞాన మార్గ ప్రస్థాన సంస్కృతి ఆధ్యాత్మిక సాధనకు ఆలంబనంగా అను శీలింపబడుతున్నాయి. ఈ సాధనలో భౌతికంగా దర్శించే విగ్రహం, లేక, లింగరూపం అంతమైన సాధనకు ప్రేరకం. బాహిరమైన క్షేత్రం అంత మైన క్షేత్రంగా పరిణమింప చేసికోవటమే క్షేత్రమహాత్మ్య పఠనంవల్ల సామాజికుడు సాధించేసాధనం. ఈతత్త్వం కాశీమాహాత్మ్యంలో స్పష్టంగా ప్రతిపాదింపబడింది.

అగస్త్య మహర్షి లోహితార్థమై కాశిని బాసి దక్షిణావర్తానికి వెళ్ళవలసి వచ్చింది. సంయమియైన ఆమహర్షికి కూడా కాశీమీది వ్యామో హంవల్ల వియోగదుఃఖం కలిగింది. సత్త్వగుణ సంపన్నుడైన ఆసంయమి ఎంత సహృదయుడో అంతజ్ఞాని. ఆతనిలోని సహృదయుడు కాశీక్షేత్ర వియోగానికి విలవిలలాడి పోయాడు. అతనిలోని జ్ఞాని కాశిని తనలోనే దర్శించాడు. వ్యామోహజనితమైన విషాదానికి విజ్ఞానం విరుగుడు. ఆయన చింతనం ఆయనకే కాదు ఆయన చరిత్రన్ని చదివే సహృదయు డికికూడా సాధన మార్గోపదేశం. అగస్త్యునికి వితర్కం చూడండి.— "తీర్థాలు బాహ్యతీర్థాలనీ- అంతర తీర్థాలనీ రెండురకాలు. కాశి, ప్రయాగ, మొదలైనవి బాహ్యతీర్థాలు. అంతరతీర్థాలు మానవుని శరీరంలోనేఉన్నాయి భ్రుకుటి అవిముక్తస్థానము, శిరస్సు శ్రీశైల మల్లికార్జునస్వామికి ఉనికి పట్టు. ఫాలభాగము కేదారేశ్వరం స్తనముల మొనలయందు కురుజాంగల క్షేత్రం నిలిచిఉంది. ఈ తీర్థరాజములన్నీ మహాదేవునికి విహార స్థానాలు. ఈ మాటలు క్షేత్రతీర్థమాహాత్మ్యాలు ప్రతిపాదించే పరమార్థబోధలు. ఆమ హర్షి ఈమహార్థాలను తనభార్యయైన లోపాముద్రకు బోధిస్తుంటాడు. సహధర్మ చారిణితోకలిసి కర్మమార్గాన్ని నిర్వహించే ఆదర్శ గృహస్థుకు

అగస్త్యుడు ప్రతీక. లోపాముద్ర జిజ్ఞాసకు చిహ్నం, అగస్త్యుడు అను ష్ఠిక చింతనకు చిహ్నం. దాంపత్యం జీవనంలో నరనారీమణులు సాగించవలసిన జ్ఞానమార్గానికి, సాధించవలసిన తత్త్వ దర్శనానికి వారి జీవితం ఉపనిషత్తుల్యం. అది లోకానికి ఉపాదేయం. తత్త్వ దృష్టిలేని జీవితం తాపత్రియంగానే మిగిలిపోతుంది. శివలింగాన్ని అర్చించి 'శివోఽహం' అన్న ఆధ్యాత్మికానుభవం పొందకపోతే క్షేత్ర దర్శనం పాదయాత్రగానే మిగిలిపోతుంది. అందువల్ల కాశీమాహాత్మ్యాన్ని అగస్త్యుని నాశ్రయించి అనుశీలించాలి. పరమాత్ముని బహిర్విభూతిని దర్శించి అంతర్విభూతిగా అనుభవించాలి. 'అహంకర్తోఽస్మి' నుండి 'అహంబ్రహ్మాఽస్మి' వరకూ పయనించాలి. అప్పుడే ఈ సాహిత్య ప్రక్రియ సార్థకమౌతుంది.

అమ్మ్యతుని బాలకృష్ణమూర్తిగారు స్కాంద పురాణాంతర్గతమైన కాశీఖండాన్ని, శ్రీనాథుని అనువాదాన్ని కూడా తమ రచనలో సంపదించుకొన్నారు. అగస్త్యుడు కాశీవియోగాన్ని అభివ్యక్తీకరించిన ఘట్టంలో శ్రీనాథుడు మూలాతిశాయిమైన రసభావ ప్రపంచనాన్ని చేశాడు. ప్రసిద్ధమైన ఈ పద్యం తెలుగువారికి తెలిసిందే —

'కలహంసి ! రారాదె కదలి నాతోఁ గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి !

కదళికా కాంతార ! కదలిరా వనఁ గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి !

శ్రీ విశాలాక్షి ! విచ్చేయు నాతోఁ గూడి
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి !

నాతోడ ! గూడి యంతర్గేహ ! యేతెమ్ము
నీవేల వత్తమ్మ నెమ్మి నుండి !

రండు నను ; గూడి యో పరివ్రాట్టు లార !
వత్సలత ! గల్గి మీరేల వత్తురయ్య
పరమనిర్భాగ్యుఁడై న నాపజ్జఁ బట్టి
కటకటా ! పౌష్యజలరాశిఁ గాశిఁ బాసి"

ఈ రచయిత శ్రీనాధుని రసధునినికూడా తన రచనలో అంతర్వాహినిగా ప్రవహింప చేయడం అభినందనీయం.

ఏడాశ్వాసాల ఈ వచన కృతి ఎక్కడ చదివినా ఎదను కదిలించే టట్లు సాగింది. ఉపాఖ్యానాలను నిర్వహించటంలో రచయిత రసభావాలను సందర్భోచితంగా సంపటించి ఉపజ్ఞ ప్రదర్శించారు. శివశర్మోపాఖ్యానం, దివోదాసు చరిత్రం, మొదలైనవి లఘుకృతులుగా గౌరవింపదగినవి. వివిధ తీర్థలోక దేవ వర్ణనాపసారాల్లోకూడా రచయిత రచనలో ఆశక్తి అడుగడుగునా రక్షింపబడింది. పఠితలను రంజింపచేసే ప్రక్రియలోని మర్మాలను తెలిసిన మనస్వి శ్రీ అచ్యుతుని బాలకృష్ణమూర్తి, తెలిసి తీర్చిన శిల్పం ఈ శివ ప్రబంధం !

ఈ గ్రంథంలో కథ యెంత ముఖ్యమో, గ్రంథకర్త ఎడనెడ చేసిన వివరణలూ అంతే ముఖ్యం. హేతువాద యుగంలో ఆధ్యాత్మిక జీవిత ప్రవృత్తికి గల అవశ్యకతనూ, దాని అవగాహననూ ఈ గ్రంథం లోని వివరణలు విశేషించి చెప్పాయి. సూత్ర వృత్తులవంటి ఈ సూక్తులు ఈ కృతి విభూతికి జ్ఞానతీర్థాలు, మచ్చు కొక్కటి -

"పూర్వ గ్రంథాలలో చెప్పబడినవి అద్భుత విషయాలుగా కనబడటమే గాక అవి ఋజావు పరచగలిగేస్థితిలో ఆధ్యాత్మికజ్ఞాన సంపన్నులు గూడ లేరు. ఇవి హేతువాదానికి నిలువవని ప్రచారకులభావన, వాదన....

విజ్ఞానికి హేతువాదానికి విలువనిది లేదు. అసలు మానవుని నాగరికత అభి
వృద్ధి హేతువాదనతో కలిగినదేకదా ! చివరకు అన్నిపురాణములు, శాస్త్ర
ములు వ్రాసిన బాదరాయణుడు బ్రహ్మ సూత్రములు ప్రారంభిస్తూ
'అథాతో బ్రహ్మ జిజ్ఞాసా' అన్నారు. ఆ తరువాత, ఇందువలన బ్రహ్మ
పదార్థమును గురించిన ఆలోచన చేయవలె అనిగదా భావం. ఇందులో
'అథః' 'అతః' అను మాటలు ఎందుకు ప్రయోగింప బడినాయి ? ఇందు
వలన అనటంలోనే ఫలానా కారణం వలన అని చెప్పటానికన్నట్లు గదా !
ఆ తరువాత అథః అన్నపదం ప్రాథమిక జ్ఞానమును సంపాదించిన తరు
వాత బ్రహ్మపదార్థచర్చకు తగినస్థాయి పొందగలరని సూచిస్తుంది. కనుక
హేతువాద ప్రాతిపదిక మీదనే ఆధ్యాత్మిక చర్చకూడ జరిగిందని రూఢి
అవుతున్నది"

ఈ వివరణం చదివిన తరువాత ఈ రచయిత ఈ గ్రంథాన్ని
నిర్దిష్టమైన ఒక ప్రయోజనం కోసమే వ్రాశారని స్పష్టమవుతుంది. ఇది
వస్తువును బట్టి క్షేత్రమహాత్మ్యమైన, విషయమును బట్టి ఆధునిక జీవితంలో
ఆధ్యాత్మిక ప్రవృత్తిని గూర్చిన ఆలోచనను రేకెత్తించే అధ్యయన
గ్రంథంగా రూపొందింది. అభినందనీయులు శ్రీ అచ్యుతుని బాలకృష్ణ
మూర్తిగారు, వీరి వ్యాఖ్య మాహాత్మ్యానికి మణిదీపం !

ఇంత చక్కని రచన చేసిన గ్రంథకర్త తన రచన వెలుగులోకి
రావటం చూడక ముందే కన్ను మూయటం విధి విలాసం. వారిగ్రంథానికి
నాచేత ముందుమాట వ్రాయించాలని సంకల్పించటం నా సుకృత విశేషం.
వారి ప్రతిభామూర్తికి నా జోహారులు ! వారు శివసాయుజ్యంలో ఉండి
అక్షరార్చన చేస్తున్నారు. మనము వారికీర్తి మూర్తికి వాఙ్మయ ప్రసూ
నాల నర్పించుటకంటె ఏమి చేయగలం.

నాకీ ముందుమాట వ్రాయటానికి వాత్సల్యంతో
అవకాశమిచ్చిన మిత్రులు డా॥ బూదరాజు రాధాకృష్ణగారికి
గ్రంథకర్త పుత్రులు శ్రీ అచ్యుతుని సుందర్ గారికి
కృతజ్ఞతాభివందనలు. ఇది శక్తితో వ్రాసిన మాటలుకావు. భక్తితో పలికిన పలుకులు మాత్రమే.

హైదరాబాదు
6-9-1981

జి. ఎ. సుబ్రహ్మణ్యం
ప్రొఫెసర్
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాద్

# మన్నవ గిరిధరరావు, ఎం. ఏ.

సంపాదకుడు "యువ భారతి"

గుంటూరు


## ప్రవేశిక

దేశంలో శివుని పూజించే వారున్నారు. విష్ణువును పూజించే వారున్నారు. కానివారిలో శివుని గురించిగాని, విష్ణువుని గురించిగాని ఏమైన తెలిసినవారు తక్కువగా ఉన్నారు.

ఇందుకు కారణములున్నాయి. అర్థం తెలుసుకోకుండా మనం చాలాపనులు చేస్తుంటాం. పెద్దవారివిజూచి చిన్నవారు చేయడం, ఎందు గలు వస్తాయి గనుక అనాది శివునికి అభిషేకమో విష్ణువునకు సహస్రనామమో చేయడంతప్ప ఈ పూజలు ఎందుకేర్పడ్డాయో తెలుసుకొనే జిజ్ఞాస చాలామందికి లేదు.

ఒకవేళ తెలుసుకోదలచిన వారున్నప్పటికీ, అందుకు సంబంధించిన గ్రంథాలు కొరుకుడు పడని సంస్కృతంలోనో, తెలుగు ప్రాచీన కవిత్వం లోనో పొందుపరచ బడివున్నాయి. అవి పండితులకు అర్థంకావలసిందేగాని సామాన్య చదువరులకు అందుబాటులో లేవు.

ఇకపోతే, హిందూ మతమనేది కేవలం అగ్రకులాల వారికొరకు మాత్రమే ఏర్పడిన ఆరాధనా మార్గమనే అభిప్రాయం పలువురిలోవున్నది అందుచేత మిగతా కులాలవారు హిందూమత విషయంలో అనురక్తి పెంచు కొనేటందుకు తగిన ప్రయత్నం జరగడం లేదు.

వీటితోబాటు ఇటీవల మరొక అపోహకూడ ప్రబలు తున్నది. మనది లౌకిక రాజ్యంగనుక మనం మతాన్ని అంటిపెట్టుకొని వుండరాదనే దురభిప్రాయం ఏర్పడుతున్నది. అందుచేత అసలు మతం ఎడల వైముఖ్యం పెరుగు తున్నది.

ఇట్టి కారణాలవలన హిందువులు క్రమంగా మతమునకు దూర మవుతున్నారు. ఇవన్నీ పొరపాటు అభిప్రాయాలు.

మనం అనుదినం అసంఖ్యాకమైన కార్యకలాపాలు నిర్వహిస్తున్నాం చేతులతో, కాళ్ళతో, నోటితో, మెదడుతో పనులు చేస్తున్నాం. ఆయా చర్యలు చేయడానికి శరీరానికి శక్తి ఎక్కడనుండి వస్తున్నది? భోజనం చేయడం వలన శక్తివస్తున్న దనుకుంటున్నాం భోజనాన్ని జీర్ణింపచేసి శరీరంలో విద్యుత్తును నిర్మాణం చేస్తున్నదెవరు? ఒక్కొక్కసారి అకస్మాత్తుగా శరీరం తన కార్యకలాపాలను విరమిస్తుంది. అన్నం మింగుడుపడదు కాలు కదలదు. నాడి కొట్టుకోదు. నిన్నటివరకు పనిచేసిన శరీరం ఎందుకు అచేతనమై రాయివలె పడివున్నది ?

దానిలో 'ఆత్మ' వున్నంత వరకు అది పనిచేసింది. ఆత్మ దాన్ని వదలిపోగానే శరీరం అచేతనమయింది. శరీర అవసరాలైన ఆహారం, దుస్తులు, నివాసం, వినోదం, విజ్ఞానముల కొరకు అహరహం తపించి నానాపాట్లు పడతాడు మానవుడు. అసలు ఈ శరీరం యొక్క ఉనికికి కారణమైన 'ఆత్మ'ను గురించిన జ్ఞానం పొందడం తప్పా? దానిని తెలుసుకోనవసరంలేదా? అట్టి ఆత్మజ్ఞానం కలిగించేదే మతం, కొందరను కొనే ట్లు మతం 'భయం' వలన ఏర్పడిందికాదు. అది మనమందే ఏమి టనే జిజ్ఞాసవలన ఏర్పడింది.

మతం ఒక కులస్తులకొరకో ఒక వర్గంవారికో ఏర్పరిచింది కాదు. మానవులందరికోను, మరియు జీవకోటి అంతటికోనువున్న 'ప్రాణశక్తి'ని అర్థంచేసుకోవడం కోసం ఏర్పడింది. దేవుడంటే విగ్రహంకాదు, చెట్టు కాదు, పుట్టకాదు. దేవుడంటే ప్రాణశక్తిని ఉద్దీపింప చేసుకోడానికి, ఆత్మ బలం కలిగి యుండటానికి. ఆ బలంతో మరింత స్వచ్ఛంగా, నిర్మలంగా, దోషరహితులుగా పెంపొందగలం. జీవితాన్ని మరింత ప్రేమ మయింగా మలచు కోగలం.

లౌకిక రాజ్యమంటే మతాన్ని బట్టి ప్రభుత్వం ఎవరిమొతల వివక్షణ చూపదు. (No discrimination on the basis of religion) అని అర్థం. అంతేగాని ప్రజలంతా మతరహితులు కావాలని అర్థంకాదు. ప్రజలు మతాన్ని విడనాడాలి అని తప్పుఅర్థం చెప్పుకోవడం వలన మనిషిని పశుస్థాయిలోకి దిగజారకుండా కాపాడేటటువంటి, అతనిలో మానవతను, పవిత్రదైవగుణాలను పెంపొందించేటటువంటి చక్కని సాధనాన్ని మనం విడనాడుతున్నాం.

హిందూమతం ఎవరో కొద్దిమంది ఉన్నత కులాలకు చెందినవారి కోసంకాదు. ఇది హిందువులందరి కోసం. మారమాలోచిస్తే ఇది మానవులందరికోసం. "మానవుడు అనగా కేవలం శరీరం మాత్రమే కాదు. శారీరిక సుఖముల మాత్రమే అతనికి పరిపూర్ణ సుఖము నివ్వజాలవు. శరీరంతోబాటు మనస్సు, బుద్ధి, ఆత్మలుగూడ అతనికున్నాయి. వాటినిగూడ సంతుష్టిపరిస్తేగాని అతనికి నిజమైన సౌఖ్యం చేకూరదు", అని హిందూమతం తెలిపిన సత్యం మానవాళికి మార్గదర్శకం.

హిందూమతాన్ని హిందువులందరకీ అందుబాటులోకి తీసుకువచ్చే అవసరం నేడు ఎంతైనా వున్నది. శ్రీ అమ్మతుని బాలకృష్ణమూర్తిగారు

ఇట్టి లక్ష్యంతో శైవ క్షేత్రమైన కాశీమహాత్మ్యం వ్యావహారిక భాషలో వ్రాశాను. శ్రీనాధుని కాశీఖండానికి అనుసరణ అయిన ఈ గ్రంధంలో కాశీక్షేత్రం గురించిన అనేక పౌరాణిక కధలతోబాటు ఇతర శైవ క్షేత్రాల వర్ణనలు గూడ వున్నాయి, హిందూ ఆచారములు కొన్ని ఎలా ఏర్పడ్డాయో, వాటి అంతరార్ధములేమిటో గూడ చెప్పారు.

"ఇక్కడ వరణ, అసి అనే రెండు నదులు ప్రవహించడం చేత ఆ రెండు పదాల కలయికతో వారణాసి అనే ఖ్యాతి కలిగింది. కాశృదీప్తి అంటే ప్రకాశించేది అని యర్థం. దానివలన కాశి అనే నామంతో విరాజిల్లు తున్నది.

ఇష్టమున్నా లేకున్నా అగ్ని శరీరానికి అంటితే కాల్చివేయ గలదు. అదే విధంగా అయిష్టంతోనైనా గంగాస్నానం చేస్తే పాతకాలు పోతాయి.

ఆత్మ మనస్సుల సంయోగమే యోగమంటారు. మూలాధార చక్రంనుండి తేజోరాసిన్ని (కుండలిని) వెన్నెముకలోని రంధ్రం ద్వారా ఊర్ధ్వగతం చేయడమే యోగ సాధన - ఇలా ఎన్నో గ్రహింప దగిన అంశములీ గ్రంధంలో వున్నాయి.

కాశిలో ఏ మహర్షులు ఏ ఏ లింగాలను ప్రతిష్ఠించారో, ద్వాదశ రుద్రులకు ఆ పేర్లు ఎలా వచ్చాయో, దేశంలోని వివిధ శివక్షేత్రాలు ఎక్కడెక్కడున్నాయో వాటిని ఎవరు ప్రతిష్ఠించారో ఇందు వర్ణింప బడింది.

అగస్త్య మహర్షి దక్షిణ భారతంలో పుణ్యక్షేత్రాలను దర్శిస్తూ, తుంగభద్రానదీ తీరంలో వెలసిన కుమారస్వామి ద్వారా వారణాసి మహాత్మ్యం వింటాడు. అదే ఇందలి ప్రధాన కధ. పాఠకులు చదివి ఆనందించ గలరని నావమ్మకం.

మన్నవ గిరిధరరావు

# అక్షరాంజలి

1. అమ్మకు అమ్మయైన అల అమ్మకన్ కను విందు భక్తితో
నమ్మిన నమ్మకన్ బహుజనాదరణమ్మున పట్టభద్రుడై
కమ్మని కైతలల్లి సుకవి కావ్యముతో విజ్ఞప్తి సేవలో
నెన్నగరాని ఖ్యాతిగడియించె నహర్నిశముల్ శ్రమించియున్॥

2. నవరసము లొలుకు సుమధుర
కవితాగంధంబు లష్టగజములు జల్లన్
భువన విజయమై దనరగ
కవికులమున జేరి వికటకవియై వెలసెన్॥

3. కాశీవిశ్వనాథు కథలను తెనిగించి
అచ్చువర్తుల స్వామి కిందజేసి
బరువు దీరెననగ బ్రతుకు చాలించెరా
బాలకృష్ణమూర్తి బ్రహ్మమూర్తి॥

4. అన్నయను వాడు నాకొక
డున్నాడని మున్నెపుడు నుప్పొంగితినే
దన్నాయని బిలువనునా
కన్నుల జూడంగలేను కవి రాజకటా॥

5. అన్న యనిన నాకు నధికాభిమానంబు
అన్న కెదురు మాట లాడలేదు
కన్నవారితో డి కలహంబు వారింప
విన్నవించ వలసె విశదముగను

అచ్యుతుని సత్యనారాయణ మూర్తి

# కృతజ్ఞత

మిత్రులు శ్రీ కుమార్ ఒడయార్ నాకు ఇటీవల కొలది కాలం క్రిందనే పరిచయమైనారు. నేను ఆస్తికుడను. వారు దైవచింతనా పరులు. కనుకనే కాటోలు మా ఇరువురిమధ్య సాన్నిహిత్యం ఏర్పడింది

శ్రీ కుమార ఒడయార్ గుంటూరు జిల్లా రేపల్లె వాస్తవ్యులు పండిత శ్రీ చుక్కా బసవయ్య కోటమ్మల పుత్రులు, పంచవర్ష ప్రాయు లయిన శ్రీ కుమార ఒడయార్‌కు పితృవియోగం సంభవించుటచేత సోద రులు శ్రీ చుక్కా వీరనాగయ్యగారి పెంపకంలో ఇంతవారయ్యారు చిన్న వయస్సులోనే రెవిన్యూ శాఖలో ఉద్యోగిగాచేరి నేటికీ అదేశాఖలో తహ సీల్‌దారుగా పనిచేస్తున్నారు.

కనగాల వాస్తవ్యులు శ్రీ రాచంశెట్టి పెదమల్లయ్యగారి తృతీయ పుత్రిక భ్రమరాంబ వీరి ధర్మపత్ని — ఈ దంపతులకు వసుమతి, శివ కామేశ్వరి-ఇద్దరు పుత్రికలు - మల్లికార్జునరావు, అమరనాథ్, శ్రీనివాస చక్రవర్తి ముగ్గురు పుత్రులు.

నేను పత్రికా విలేఖరి కావటం ఉద్యోగరీత్యా మా పరిచయానికి దారి తీసింది. ప్రస్తావవశంగా నా కాశీమహాత్మ్య రచన విషయం చెప్పటం ఆయన అన్నివిధాల ప్రోత్సాహం యివ్వటం రెండూ పరమేశ్వరసంకల్పం

అనే భావిస్తాను. సహృదయులైన శ్రీ కుమార ఒడయార్‌కు చిరాయు రారోగ్య ఐశ్వర్యాలు శివంకరుడైన శంకరుడు ప్రసాదించాలని నా ఆకాంక్ష.

నా యీ రచనపై తమ అమూల్యాభిప్రాయములను నొసంగి ప్రోత్సహించిన పెద్దలకు కృతజ్ఞతాభివందనములు.

అచ్యుతుని బాలకృష్ణమూర్తి

# కాశీమాహాత్మ్యము

## ప్రథమాశ్వాసం

అది నైమిశారణ్యం. దాని కాపేరు కల్గటాని కొక పురాణ కథ ఉంది. ఒకప్పుడు మహర్షులు బ్రహ్మదేవుని వద్ద కేగినారు. అయ నకు నమస్కరించి ప్రశాంతంగా తపసులు చేసుకొనటానికి తమకొక పవిత్ర ప్రదేశం చూపవలసిందని ప్రార్థించారు. చతుర్ముఖుడు ఆలోచించి మనోమయమైన ఒక చక్రాన్ని సృష్టించి దొర్లించాడు. చక్రం సత్యలోకం నుంచి క్రిందికి దొర్లుకుంటూ వచ్చింది. భూలోకానికి వస్తూ పర్వతాలపై నుండి దొర్లింది. ఎత్తుపల్లములలో పడినందువల్ల దాని కల్లు (నేమి) పగిలిపోయింది. చివర కొకచోట పడిపోయింది. నేమి పూర్తిగా పగిరి పడిపోయిన ప్రదేశమే నైమిశమని పిలువబడింది.

దీనిని గురించి మరొక కథకూడా ప్రచారములోఉంది. పూర్వం ఈ ప్రాంతాన్ని నిమి అనే చక్రవర్తి పాలించాడు. ఇతడు సీతాదేవి తండ్రయిన సీరధ్వజుని (జనకుని) పూర్వీకుడు. నిమి పాలించిన దేశంలో కొంత భాగం నైమిశ మయింది. కాలక్రమేణా ఆ ప్రాంతం దట్టమైన అరణ్యంగా మారిపోయింది.

ఈ దేశంలోని ప్రదేశాలకు గల పేర్లతో ఇలాటి పురాణకథలు ముడిపెట్టబడినాయి. సంస్కృతపు పేర్లు కలవాటికి వ్యుత్పత్తులు చెప్ప వచ్చు. వీటన్నిటికి చారిత్ర కాధారాలు లభించవు. అంతమాత్రంచేత ఈ గాథలను కాదంటామా ?

నైమిశారణ్యం చల్లని నీడనిచ్చే చెట్లతోను, మధురములయిన ఫలాల నొసగే వృక్షాలతోను నిండిఉంది. అక్కడక్కడ చెరకు పానకం వంటి నీటితో నిండిన సెలయేరు లున్నాయి. అది విధాత చూపిన ప్రదేశం. నివాసానికి ఎంతో యోగ్యమయిన చోటు. మునీశ్వరు లెందరో అక్కడే ఆవాసం ఏర్పరచుకొన్నారు. శౌనకుడక్కడ కులపతి. అతడు పన్నెండు సంవత్సరాలు బ్రహ్మసత్రయాగం చేశాడు. ఆ యజ్ఞానికి దేవతలే స్వయంగా వచ్చేవారు. ఎక్కడెక్కడి ఋషీశ్వరులు ఆ యాగంలో పాల్గొన్నవారే. హవిస్సులర్పణ చేసింతర్వాత విరామ సమయాలలో భగవత్కథలను విని ఆనందపడేవారు. పురాణ ఇతిహాస కథలన్నీ వాళ్ళకు సూతమహర్షి చెప్పేవాడు. మునీశ్వరులతోబాటు నైమిశారణ్యంలో గల మృగాలు పక్షులుగూడ ఆ పురాణకథలు విని పవిత్రము లయ్యాయి.

వ్యాసునకు రోమహర్షణుడనే శిష్యు డున్నాడు. రోమహర్షణుని పుత్రుడే సూతుడు. ఇతని మొదటిపేరు ఉగ్రశ్రవసుడు. పురాణకథలు చెప్పటంలో ఈతరు దిట్ట.

సత్రయాగానికి వచ్చిన మునులు సూతుని పురాణకథలు వివరించ మన్నారు. అతడు స్కాంద పురాణంలోని వృత్తాంతాలు వివరిస్తుంటే కొందరు సూతమహర్షీ! మాకు కాశీ ప్రాశస్త్యాన్ని చెప్పవలసిందని ప్రార్థించారు. సరేనని సూతుడు కాశీఖండం ప్రారంభించాడు. ఋషీశ్వరులు ఎంతో శ్రద్ధగా వింటున్నారు.

## వింధ్యగర్వాపహరణం

ఒకప్పుడు బ్రహ్మమానస పుత్రుడయిన నారదుడు తీర్థయాత్రలు చేయనారంభించాడు. ఆయనవెంట ఒక గంధర్వకన్యగూడ ఉంది. ఆమె

ముఖమంతా ధూళితో నిండిఉంది. ప్రయాణపు శ్రమచేత కాబోలు దేహం వసివాడింది. ముఖంమీది చెమట బిందువులు ముత్యాలవలె ప్రకాశిస్తున్నవి. ఆమెను చూడగానే అందగత్తె అనిపిస్తుంది. ఫాలభాగం పైబడిన ముంగురులు పద్మంమీద వ్రాలిన తుమ్మెదలా అన్నట్లున్నాయి. ఆమె దేవర్షి యొద్ద గాంధర్వ విద్య నేర్చుకొంటున్నది. నారదుని వీణ మహతి ఆమె చేతిలోఉంది. గురుశిష్యులు తీర్థయాత్రలు సేవించుకొంటూ దండకారణ్యం ప్రవేశించారు. అరణ్యం మద్ది, ఏగిస, నేరేడు మొదలయిన వృక్షాలతో నిండిఉంది. మామిడిపంటి ఫలవృక్షాలు ముదురుపండిన పండ్లతో వంగినాయి. జాజిమొల్ల మల్లెవంటి పూలతీగలు మహా వృక్షాలను ఆలంబనం చేసుకొని ఆకాశంపైపు మోరలెత్తుకొని యున్నాయి. విరబూచిన పూలు పిల్లగాలి మోతను పంపగానే బారులుతీరి తుమ్మెదలు ఝుమ్మని కేరింతలిడుతూ పరువులెత్తి వస్తున్నవి. తేటి ఝంకార నినాదం శుకపికగీతాలకు శ్రుతివలెఉంది. సింహ శరభ శార్దూలదులాయాది జంతు సంతానాల గర్జనలతో అరణ్యం భయంకరంగా ఉంది. ఇసుక చల్లితే రాలనంత దట్టంగా తీగలల్లుకొన్నాయి. ఆ అడవిశోభను చూస్తూ గురుశిష్యులు ముందుకు సాగుతున్నారు.

అల్లంత దూరంలో పర్వతపంక్తి కనుపించింది. అది వింధ్యము. ఎత్తైన పర్వత శిఖరాలనుండి క్రిందనున్న గండశిలలమీదికి దుముకుతూ నర్మద నృత్యంచేస్తూ నేలను తాకుతున్నది. నదియొద్దునకు చేరిన నారదుడందులో స్నానమొనర్చాడు. అంగములన్నిట భస్మమలదినాడు. రుద్రాక్షమాలను ధరించి ఓంకార రూపుడయిన పరమేశ్వరుని స్తోత్రము చేశాడు. పంచాక్షరి మంత్రాన్ని జపిస్తూ ముందునకు అడుగులు వేస్తున్నాడు.

వింధ్యుడు దూరంనుంచే నారదమహర్షిని చూచాడు. మనుష్య రూపంలో ఆయన కెదురేగినాడు. ఇదొక దేవరహస్యం. పర్వతాలకు నదులకు స్థావరరూపమని, జంగమరూపమని రెండు రూపాలున్నాయి. పర్వతాకృతిలో ఉండటం స్థావర రూపము. రెండవది జంగమరూపం. వింధ్యుడు జంగమ రూపంతో బయలుదేరినాడన్నమాట. అభ్యాగతుడు సాక్షాత్తు విష్ణురూపమో, శివునిరూపమో అని శాస్త్రము. అభ్యాగతుడంటే ఆహ్వానము లేకుండానే మన యింటికి వచ్చినవాడు. అతిధి అభ్యాగతుల నాదరించటం గృహస్థ ధర్మం. ముక్కు మొగం తెలియనివారు వచ్చినా ఆతిధ్యం ఇచ్చి అర్చించట మనేది భారతీయ ధర్మం. అలాటప్పుడు బ్రహ్మ మానసపుత్రుడంతటివాడు అభ్యాగతు డయితే వింధ్యుడు ఊర కుంటాడా! భక్తిభావంతో ఎదురేగినాడు. సాష్టాంగ నమస్కారము చేశాడు. తన గృహాని కాహ్వానించాడు. ఇంటికి వచ్చిన దేవర్షిని దధిమధుపుష్పాలతో అర్ఘ్యమిచ్చి పూజించినాడు. మార్గాయాసము పోవటానికి సేవలు సపర్యలు చేయించినాడు. విశ్రాంతిగ ఉన్నపుడు మేఘ గంభీరభాషణములతో ఇలా విన్నవించాడు.

మహాత్మా! మీరాకచేత నా గృహం పావనమయింది. మీ దయా దృష్టి సోకటంతో నా పాపాలు పటాపంచ లయినాయి. పురాకృతసుకృతం వల్లగాని తమవంటివారిని సేవించేభాగ్యం కల్గదు. నేను ధన్యుడనయి నాను. తమ దయవలన నాకే కొరతలేదు. కాని నా దొక విన్నపం. అవధరించండి. భూమండలంలో తాను చూడని పర్వతాలు లేవు. ఈ కొండలెన్ని ఉంటేమాత్రం ఏమి ప్రయోజనం? దిగ్గజాలకు సహాయ కారిని, ఆదికూర్మానికి స్నేహితుడను శ్వేతవరాహానికి సమానుడను నేను. నాతో సరితూగగల మహీధరము ఎక్కడయినా ఉందా? ఉదయ పర్వతము అనభ్యుదయ కరమైనది. అస్తాద్రి అస్తవ్యస్తం గదా! నీలాద్రి

నలుపు. గంధమాదనము నిరుపేద. మహేంద్ర ద్రోణ పర్వతములు దారిద్ర్య పీడితాలు. త్రికూట మలయ పర్వతాలు ఒకపాటివి. హేమకూటము నాతో సరితూగదు. ఇన్నెందుకు ? నాతో సమానమేమోనని అనుకోవటానికైనా అర్హతగలది ఒక్క మేరు పర్వతమే. మేరువుమీద దేవతలు విహరిస్తారు. వానిపైనగూడ అరణ్యాలున్నాయి. సూర్యాది గ్రహాలు తనను చుట్టి వస్తున్నాయని మేరువుకు గర్వం. ఈ మధ్యకాలంలో మా యిద్దరిమధ్య స్పర్ధ పెరిగింది. మీరు సర్వజ్ఞులు. మా యిద్దరి అంతరం బాగా తెలిసినవారు. పక్షపాతం లేకుండా మాలో ఎవ్వరధికులో సెలవీయండి అన్నాడు.

ఆ మాటలకు నారదుడు ఎంతో జాలిపడినాడు. వింధ్యుని గర్వము చూస్తే ఆయనకెంతో ఏవగింపు కలిగింది. కొంతతడ వూరుకున్నాడు. నిజానికి తాను కలహప్రియుడు. ఇద్దరిమధ్య యుద్ధము రేగితే తనకు కడుపునిండా మృష్టాన్నము లభించినట్లే. అయినా అది లోకవినాశనానికి దారితీస్తుందని విచారించాడు. మెత్తగా చీవాట్లు పెట్టవలె ననుకొన్నాడు.

వింధ్యుడా ! ఇప్పుడు నీవడిగినట్లుగానే ఒకప్పుడు మేరువుగూడ నన్ను ప్రశ్నించాడు. తన బలాధిక్యతను నాచేత ఒప్పించడానికి యత్నించాడు. నీ బలం నీ కెరుక. మేరువు సత్వం అతని కెరుక. మీ యిద్దరి బలాబలాలు నిగ్గు తేల్చడానికి ఇతరు లెంతటివారు? శ్రీశైలం, వేంకటాచలం, అహోబిలం, కేదారాద్రి, సాలగ్రామ పర్వతాలు మాహాత్మ్యంలో మీకంటె అధికులు. మీ గర్వాన్నిచూచి ఏమనాలి ? కదిలి కూర్చోనలేక మీ కెందుకీర్ష్య? అయినా తీర్థయాత్రలు చేయించుకొంటూ భగవన్నామం జపిస్తూ తిరిగే సాత్వికులగు మా బోంట్లకి వివాదమెందుకు ? నే నిక్కడ నిల్వకూడదు వెళ్ళుతున్నాను అని చెప్పి నారదుడు శిష్యురాలితో సహా వెడలినాడు.

దేవముని మాటలు విన్నతరువాత గూడ వింధ్య పర్వతానికి జ్ఞానోదయము కాలేదు. మనసులో ఎంతో ఆవేదన, ఆవేశము కలిగాయి. ఈర్ష్యాద్వేషాలు బుసలుగొట్టాయి. మనోరుజ ఏర్పడింది. హృదయములో ఎప్పుడూ ఇదే చింత. గురుపు సన్నిధిని అధ్యయనంచేసి జ్ఞానము సంపాదించాలి. సాహసంతో ప్రతిజ్ఞలు నెరవేర్చుకోవాలి. జ్ఞాతులను జయించాలి. ఇవి చేయని జనుడు జనుడేనా ? తనతో సమానుడయిన శత్రు వున్నాడని తెలిస్తే ఎవడికయినా కంటిమీద కునుకు వస్తుందా? ఆహారం రుచిస్తుందా? భార్యా సమాగమం సయితము సుఖముగా ఉంటుందా ? ఇతర వైభవాలు మనస్సున కానందం కల్గించగలుగుతయ్యా ? ఎవరితోనైనా కలహానికి కాలుదువ్వనేరాదు. దువ్విన తరువాత నలుగురు నవ్వకుండ చూసుకోవాలి. ఈ విధంగా ఆలోచిస్తుంటే అతనిలోని ఈర్ష్యాగ్ని దావాగ్నిగా మారి దహింపసాగింది. ఏ జ్వరానికైనా మందున్నదిగాని చింతాజ్వరానికి ఔషధమే లేదుగదా ! లంఘనముతో కొన్ని రోగముల ఏపు నశిస్తుంది. కాని చింతాజ్వరం దానికి లొంగదు. ఉత్సాహమును తగ్గిస్తుంది. బుద్ధి మాంద్యం కలిగిస్తుంది. నిద్ర రానీయదు. ఆకలిని చంపుతుంది. బలాన్ని నశింపజేస్తుంది. దినములు గడిచినకొద్దీ చింతారుజకు బలం పెరుగుతుంది. వింధ్యుడి స్థితి ఇలాగేఉంది. నానాటికి దిగజారుతున్నది. మేరువును జయించడం ఎట్లా అన్నదే అతని విషమసమస్య. తనలోతానే ఏమో అనుకొంటుండేవాడు. మా కులంలో ఎవరో అహంకరించి యేమో అన్నారని దేవేంద్రుడు మా కందరికి రెక్కలు తెగనరికినాడు. కాని ఆనాటి పక్షములే ఉంటే ఒక్క ఊపునవెళ్ళి ఆ మేరువుగాడి శిఖరాలు విరగదన్ని వాడి గర్వాన్ని రూపుమాపిరానా? నా ఆధిక్యతను చాటుకోనా ? దేవతలు కూడ ఆ పాపిష్ఠివాడినే అభిమానిస్తున్నారు. నానాటికి వాడి పలుకుబడి పెరుగుతున్నది. ఇదంతా కళ్ళారాచూస్తూ నావంటి పరాక్రమశాలి, బల

వంతుడు, అభిమాని తీరకుండటమా! నలుగురిలో అవమానము పొందు తానా! కాదు నా శరీరాన్ని పెంచి ఆకాశంవరకు పెరుగుతాను. సూర్యుడు, చంద్రుడు మొదలయిన గ్రహాల మార్గాన్ని నిరోధిస్తాను. అని ఆలోచించి వింధ్యుడు అహంకారంతో కన్నుమిన్ను కానలేక శరీరాన్ని పెంచాడు. ఒకప్పుడు లింగాకృతితో పరమేశ్వరుడు, బలిచక్రవర్తిని పాతాళమునకు పంపడానికి త్రివిక్రముడు ఆది అంతంలేని రూపాలను ధరించినట్లు పెరిగి పోయినాడు. దేవతలు తన ఆకారాన్నిచూచి తన గొప్పతనం అర్థంచేసు కొని మేరువుకంటె నీవే అధికుడవు అని పొగడవలెనని వింధ్యుని కోరిక.

సూర్యోదయమైంది భానుడు బంగారు కాంతులతో లోకానికి ఆహ్లాదం కలిగిస్తూ పొడుపు కొండమీద పొడసూపినాడు. నివిడాంధకారం పటాపంచలయింది. కమలములు మందస్మిత వదనంతో కర్మసాక్షికి స్వాగతం ఇస్తున్నాయి. పశుపక్షి మృగాదులు మానవులు దినారంభ సమయంలో తమతమ పనులకు సమధికోత్సాహంతో వెళ్ళుతున్నారు.

అది దక్షిణాయనం. (అందరికి దక్షిణాయనం కాదు. కొందరికి ఉత్తరాయణం. ఒక దీవికి ఒక కొండ ఉదయాద్రి అయితే అదే మరొక దీవికి అస్తాద్రి కాగలదు. ఒకచోట పగలుకాగా అదే సమయంలో మరొక చోట నక్షత్రములు, చంద్రికతో వెలిగేరాత్రి అవుతుంది. సౌరగమనంలో ఈ మార్పులు కలుగుతున్నాయి. సూర్యుడు కదులు తున్నాడనటానికి వీలు లేదు. ఇతర గ్రహాలు గోళాలు కదిలి సూర్యుడే చలించినట్లు కనబడు తుంది. అయితే ఇలాటి సూర్యగోళములు కోట్లకొలది ఉన్నాయి. అవి మనకు చిన్న నక్షత్రములవలె కనుపిస్తాయి. నిజానికి అవి మనముచూచే సూర్యునికన్న చాలపెద్దవి. ఈ అనంత విశ్వాన్ని చూస్తుంటే ఆశ్చర్యంతో పాటు భయముకూడ కలుగుతుంది సుమా! గ్రహాల పరిభ్రమణంలో కద లకపోయినా సూర్యుడు కదిలినట్లుంటుంది. కాని ఒక్కొక్క సూర్యగోళం

టానికి సంబంధించిన ఉపగ్రహాలు మొత్తంగా కదులుతుంటాయి. అవి మేరువును కేంద్రంగా చేసుకొంటాయని మనపూర్వుల సిద్ధాంతం. ఇది ఖగోళశాస్త్రము. ఆలంకారికంగా సూర్యుడే కదులుతున్నట్లు పౌరాణిక గాధలలో వర్ణింపబడి ఉంటుంది).

సూర్యుడు తన మార్గంలో పయనిస్తున్నాడు. ఒక్కసారిగా ఆయన రథం ఆగిపోయింది. సప్తాశ్వాలు ముందుకు అడుగిడటానికి వింధ్యుని శిఖరాలు అవరోధంగా నిలిచాయి. సూర్యుని చలనం ఆగిపోవటంతో కాలగమనమే ఆగిపోయింది. కొందరికి సూర్యోదయమై ఆగిపోయింది. కొందరికి మిట్టమధ్యాహ్నమే నిలబడింది. కొన్ని ప్రాంతాలలో అంధకారం అలుముకొని రాత్రిగనే ఉండిపోయింది. అగ్నిహోత్రవిధులాగి పోయినాయి. చిత్రగుప్తాదులు కాలగణనం చేయలేక దిక్కులు చూస్తున్నారు. ఋతువులు లేవు. వర్షములు లేవు. పంటలు శూన్యమయినాయి. కొన్ని దేశములు నడివేసవిలో నిలిచి మాడుతున్నాయి. కొన్ని శీతోపేతములు. లోకము లాకులమైనాయి. ప్రజలకేకాదు దేవతలకు కూడ ఈ ఉత్పాతములుచూస్తే భీతిగలిగింది. వింధ్యుని విజృంభణం ప్రపంచానికట్టి దుస్థితి కలిగించింది.



# ద్వితీయాశ్వాసం

తదనంతర కధను సూతుడు మునులకు వివరిస్తున్నాడు. (దిక్కు తెలియని దేవతలు సత్యలోకాని కేగినారు. అది చతుర్ముఖుడుండే స్థలం. అతడు ముగ్గురు మూర్తులలో ఒకడు. దేవతల కతడు పెద్ద. అతని నివాసం సత్యలోకం. దేవతలు కాందిశీకులవలె పోయి ప్రణమిల్లి పలువను స్తోత్రము చేసినారు.

హిరణ్యగర్భా! అనాదినిధనా! నీకు నమస్కారం. మనోబుద్ధ్యహంకార రూపుడవు నీవే! సర్వశక్తి సమన్వితుడవు. నీ నిశ్వాసాన వేద త్రయం జన్మించింది. మమ్మలను కాపాడవలసింది. నిన్ను శరణు తొచ్చినాము.

ఆ మాటలు విని బ్రహ్మ దేవతలను చూచి, గీర్వాణులారా! ఇది సత్యలోకం. ఇక్కడ ఉన్నవాళ్ళకు క్రోధమదమాత్సర్యాదులు లేవు. కావున బాధలు కలుగవు. మీ రిక్కడకు వచ్చి ఎందుకు విచారంగా ఉన్నారు, ఈ లోకంలోని మహనీయులను చూడండి. ఎంత ఆనందముగ ఉన్నారో. ఇదిగో ఈ ప్రక్కనఉన్న వాళ్ళ తల్లిదండ్రులకు శుశ్రూషచేసిన అకల్మషమతులు. భర్తృసేవాపరాయణులయి జీవితం ధన్యమొనర్చుకొన్న వాళ్ళు వీళ్ళు. ప్రతిఫలం కోరకుండానే ఇతరులకు ఉపకారంచేసిన సత్పవిత్రులు వీళ్ళు. వాళ్ళ యజ్ఞయాగాది సత్కర్మ లాచరించిన వాళ్ళు. వీరంతా బ్రహ్మవిద్యావిదులై శాశ్వతానందాన్ని అనుభవిస్తున్నారు. ఈ ఉన్నతాసనములపై వెలుగుతున్నవాళ్ళు ద్విముఖము లయిన గోవులను దానమిచ్చిన ధర్మపరులు. (అవు ఈనునప్పుడు

2)

ముందుగా దూడతల, ముందరికాళ్ళు ముందు వెలికివస్తాయి. గోవు కవుదు వెనుక వైపుగూడ ముఖం కనబడుతుంటుంది. ఆ సమయంలో గోవును దానమిస్తే పుణ్యం లభిస్తుందని పెద్దలంటారు. అలాంటి గోవు ద్విముఖ మైన గోవు అంటారు).

ఇలా చెబుతూ బ్రహ్మదేవుడు ప్రస్తావవశంగా గోబ్రాహ్మణుల సామర్థ్యం వివరించాలను కొన్నాడు.

'నాకు విష్ణువునకు సంతృప్తి కలిగించేవి రెండు. ఒక్కటిఉలమే రెండుగా అయింది. బ్రహ్మజ్ఞాన సంపన్నులయిన వాళ్ళు జంగమతీర్థాలు. వీళ్ళయందు స్నానమొనర్చిన వాళ్ళకు జన్మజన్మల బంధాలు, మహాపాత కాలు నశించి పోగలవు. పరమేశ్వరుని జటాకలాపంలోనటించే పావన

• కుల వ్యవస్థను గురించి నే డనేక విమర్శలు వినబడుతున్నాయి. ఒకనా దొక భావనతో ఏర్పరచబడిన ఆచారాలు కాలపరిణామంలో సమాజములో వచ్చిన మార్పు ననుసరించి నేడు అను చితాలుగా తోచవచ్చు. వాటిని సమాజం వదిలివేయవచ్చు. అలాంటి వాటిపై చర్చలుచేసి పరస్పరనిందారోపణలు దూషణలు చేసుకొనటం వ్యర్థమేగాక నేటి సమా జములో వర్గవైషమ్యాలు ఏర్పడే అవకాశం ఉంది.

ఒకనాడు సమాజంలో నేడు కనిపిస్తున్న వర్ణవ్యవస్థ లేదు. జాగ్ర త్తగా పరిశీలిస్తే కులంపేరు వర్ణంపేరుగా గోచరిస్తుంది. నిర్వర్తించే పనినిబట్టి వర్ణవ్యవస్థను నాడు సమాజం ఏర్పరచింది. బ్రహ్మజ్ఞాన సంపన్నులంతా బ్రాహ్మణులనే పిలువబడినారు. విమర్శనా దృష్టితో చూసినప్పుడే మనకీ విషయం గోచరిస్తుంది. వర్ణవ్యవస్థ ఏర్పడిన విధం పెద్దలిలా వివరిస్తారు.

గంగాజలం కంటె గోవుల గొజులచే రేపబడిన ధూళి పవిత్రమైంది సుమా! గోవుల ఖురములలో సమస్త తీర్థాలున్నాయి. శృంగముల మధ్యప్రదేశంలో శంకరుడు పార్వతీ సమేతుడై నివసించి ఉండగలడు. గోదానం చేస్తే పితృదేవతలు సంతోషిస్తారు. మునీశ్వరులకు, గురువులకు ఆనందం కలుగుతుంది. గోమయం యమునానది, గోమూత్రం నర్మదా, గోక్షీరము గంగానది. ఇంతకన్న పవిత్రమైన దేది?

"గవామఙ్గేషు తిష్ఠన్తి భువనాని చతుర్దశ
యస్మాత్తస్మాత్ శివం మేస్యాదిహ లోకేపరత్రచ"

ఈ మంత్రాన్ని జపిస్తూ గోదానం చేసిన వాళ్ళను లోకం నుతిస్తుంది. గోప్రదక్షిణం చేస్తే సమస్త భూమికి ప్రదక్షిణం చేసిన పుణ్యం లభిస్తుంది. గోపుచ్ఛానికి భక్తితో హారతి ఇచ్చినవాళ్ళ పాపాలు నశించి ఎల్లప్పుడు సుఖాలతో ఉంటారు.

---

పూర్వకాలంలో మానవులు నదీతీరాలలోను, లోయలలోను నివాసాలు ఏర్పరచుకొన్నారు. పచ్చిమాంసము తిన్నరోజులనుండి పంటలు పండించి, గృహాలు నిర్మించుకొనే నాగరికత కలిగిన తర్వాత సారవంతమైన ప్రదేశాలు వెదకికొని గుంపులు గుంపులుగా నివసింపసాగినారు. ఒక గుంపుమీద మరియొక గుంపు దాడిచేసి దోచుకుంటుండే వాళ్ళుకూడ. దాడులు జరిగే విపత్కర సమయాలలో తమ్ముతాము రక్షించుకొనటానికి ప్రజలంతా ఆయత్తపడేవాళ్ళు. అయితే కొట్లాటలలో ఆరితేరినవాళ్ళు క్రమశిక్షణతో ఉన్నవాళ్ళదే పై చేయిగా ఉండేది. ఆ కారణంచేత తమ రక్షణకొరకు యుద్ధవిద్యలు నేర్చుకొనటం, ఒక నాయకుడి క్రింద క్రమశిక్షణతో మెలగటం ఎంతో అవసరమైంది. నాయకులుగా ఉన్నవాళ్ళు వ్యవసాయాది పనులు చేయటానికి సమయం చిక్కేదికాదు. నిరంతరం బలిష్ఠులయిన యువకులను చేర్చటం, వాళ్ళకు ఆయుధాలు ఉపయోగించ

గోవులు, విప్రులు, వేదములు, పతివ్రతలు, లోభరహితులు, దాన శీలురు సత్యమూర్తులు ఈ యేడుగురు ప్రపంచాన్ని ఏ భయంలేకుండా భరిస్తారు. సత్యలోకానికి పై భాగంలో వైకుంఠముంది. దానిపైన గుహానిలోకం ఉంది. గుహాని లోకమునకుపైన గోలోకంఉంది. అది సకలసం పత్సమృద్ధి కరమైంది. సుశీల మొదలయిన గోమాతృకలు అక్కడ నివసిస్తూఉంటారు. అదలా ఉంచండి. ఈ లోకంలోఉన్న వీరంతా పుణ్యమూర్తులు. సరస్వతితీర్థంలో మృతిచెందిన వాళ్ళు, మకరసంక్రమణ పుణ్యకాలాన ప్రయాగలో స్నానమొనర్చిన వాళ్ళు కాశీక్షేత్రంలోని పంచనద తీర్థంలో కార్తికమాసంలో స్నానమొనర్చిన వాళ్ళు.మీరునువిచారించ వలసిన పనిలేదు. మీ వచ్చిన పని నే నెఱుగుదును. వింధ్యుని విజృంభణంతో ఏర్పడిన అకాల ప్రళయాన్నిచూచి భయపడివచ్చారు. ఈ విలయనివారణకు

---

టంలో శిక్షణ ఇవ్వటం సరిపోయేది. వాళ్ళు సమాజానికి ఉపయుక్తమైన పనిలో నిమగ్నులు కావటంచేత తక్కినవారి శ్రమఫలితంలో వాళ్ళకు పంచి ఇవ్వవలసివచ్చింది. దానికి సమాజం అంగీకరించింది. అంతే కాదు. రక్షణభారం వహిస్తున్న వాడి నాయకత్వంలో అందరూ ఒక్క త్రాటిపై నడువవలసిన అవసరం ఏర్పడింది. ఆ నాయకుడు చెప్పినట్లు నడవటానికి అందరూ ఒప్పుకొన్నారు. ఒప్పుకొనటమేగాదు. అంతర్గతంగా కూడా ఏవైన దుష్టశక్తులు చెలరేగినప్పుడు కల్లోలం నివారించటానికి తగిన అధికారాలుకూడ దత్తతచేసింది సమాజం. అలా నాయకులుగా ఎన్నుకోబడినవారు, వారి కొడుకులు - వారి సంతతి అదే నిర్వర్తిస్తూ రావటం వాళ్ళకా అధికారం వంశపారంపర్యా వచ్చినట్లయింది. వాళ్ళే రాజులయ్యారు.

నాగరికత పెరిగినకొద్దీ మానవుడి అవసరాలు పెరిగినాయి. సుఖకరమైన జీవితాన్ని సాధించుకొనటమే నాటికీ, నేటికీ ధ్యేయం. సుఖప్రద

మార్గంతెలుపుతాము. వినండి. వారణాసీ క్షేత్రంలో అవిముక్తసీమలో పరమ మాహేశ్వరుడయిన అగస్త్యుడు నివసిస్తున్నాడు. మోక్షదాయకుడైన విశ్వేశ్వరుని సేవలో నిమగ్నుడయి యున్నారు. మీ రక్కడికేగి ఆ మహాత్ముని అర్థించండి. అతడు సామాన్యుడుగాడు. ప్రజాకంటకు లయిన వాతాపీ ఇల్వలులను ఇద్దరు రాక్షసులను నిమిషమాత్రంలో హరించి లోకానికి మేలుకూర్చినవాడు. వింధ్యుడికి అగస్త్యుడు గురువుకూడ. కనుక వింధ్యుడి ఆటోపాన్ని అణచటానికి అతనొక్కడే సమర్థుడు సుమా।

పితామహుని మాటలువిన్న దేవతలు ఎంతో సంతోషపడినారు. నిబిడాంధకారంలో దారితెన్ను తెలియనివారికి వెలుతురు చూపినంత ధైర్యం కలిగింది. బృహస్పతిని ముందిడుకొని దేవతలంతా ఆ క్షేత్రానికి పయన మయినారు.

పైన జీవితానికి కావలసిన వస్తువులు ఒకచోటనే లభ్యంకాలేదు. అందు చేత ఆ వస్తువులు దొరికే ప్రదేశానికి వెళ్ళటం, అక్కడ వస్తువుల నిక్క డికి తీసుకురావటం, వానికి బదులుగా యిక్కడ అధికంగా లభించేవాటిని అక్కడికి చేరవేయటం జరిగేది. వస్తుమార్పిడితో అవసర వస్తువుల సరఫరా నిర్వహించిన వాళ్ళు వైశ్యులనబడినారు.

తక్కినవాళ్ళు వ్యవసాయ కార్యక్రమ బాధ్యతను చేపట్టినారు. ఇక్కడ మరల ఒక సమస్య తలయెత్తింది. కృషిసాధనకు కావలసిన వివిధ రకములయిన సాధనాలు, వివిధరీతులలో సహకారం అవసరమయినాయి. దాంతో మళ్ళీ వర్గాలువర్గాలుగా చీలిపోయింది సమాజం. నాటి మానవుని అవసరాలలో తిండి, బట్ట, గృహవసతి ప్రధానాలు. ఆహార సంపాదన ప్రతియింటా ముఖ్యం. ఇంటిలోని పెద్దా చిన్నా అందరూ పనిచేస్తేనే తప్ప జీవనం గడువదు. ఆ కారణంతో యింటికి కోడలుగ వచ్చేయింట

# దేవతలు కాశీకి వచ్చుట

సత్యలోకం వీడి ఉత్సాహంతో వస్తున్న దేవతలు హిమవత్పర్వత సానువులు సమీపించారు. హిమశైలకన్యక పరమేశ్వరునిగూర్చి తపము చేసినచోటు, ఓషధీప్రస్థానం, సగరుముమ్మనుమడు భగీరథుడు గంగకై తపస్సుచేసిన పవిత్ర ప్రదేశములను దర్శించారు. దేవతలను చూచిన శైలేశుడు వారి కాతిథ్యం ఒసంగినాడు. నాటికట విశ్రమించారు దేవతలు. మరునాడు వారణాసీ సందర్శనోత్సుకులై కదలివస్తూ శైలగిరీంద్రుని ఆతిథ్య వివరములు, ఆదిదంపతుల కళ్యాణ విశేషములు కథలుకథలుగా చెప్పుకొంటూ, ఆనందంతో కాశీపట్టణ ప్రాంతప్రదేశాలకు చేరినారు.

---

కొనేటప్పుడు తమతమ వర్గాలకే ప్రాధాన్యం ఇచ్చారు. మరొక వర్గం నుంచి వచ్చిన స్త్రీకి ఈ వర్గపు పని అలవాటుండదు అని ఆలోచించి తమ పనిచేసే వర్గాలనుంచి మాత్రమే కోడళ్ళను తెచ్చుకొనేవాళ్ళు. ఈ పద్ధతి మొదట అవసరానికై ఏర్పడి, కొన్నాళ్ళకు సంప్రదాయంగా మారి చివరకు మరొక వర్గంలోని పిల్లను కోడలుగా తెచ్చుకొనటం, ఇవ్వటం దోషం అనే స్థాయికి వచ్చారు. ఇతరులతో సంబంధబంధాలు త్రెంచుకొన్నారు. అవే కులాలుగా రూపొందినాయి.

వంశపారంపర్యా నాయకత్వాన్ని అధికారాన్ని వహిస్తున్న వారిలో అధికారవాంఛ పెరగటం జరిగింది. ఇది నాటికీ నేటికీ సత్యంగా మనకు గోచరిస్తూనే ఉన్నది. అధికారం దుష్టభావనలకు దారితీయటం క్రొత్తేమీ కాదు రాజా అనబడే వారిలో ఇదే జరిగింది. వీరిని అదుపులో ఉంచే మార్గం వెదకింది సమాజం. నాటివారి మేధస్సు, ఆలోచనా పరిశీ వమన

పట్టణానికి పంచక్రోశముల దూరంనుండి కైవల్యనిధానంయొక్క మహిమాన్విత దృశ్యాలకు వైభవానికి అచ్చెరువునందినారు.

ఏ దిక్కున చూచినా పంచాక్షరీ మంత్రజపపూతదేహాలే. త్రిపుండ్రాంకములను ధరించినవాళ్ళే. ఎల్లరూ నిస్సంగులే. ప్రాపంచకము విరాగులే. ఎక్కడచూచినా లింగాకృతి ధరించిన పరమశివు నారాధించే వాళ్ళే. అది పరమేశ్వర జటాకలాప నిర్గతమైన పవిత్రతోయధార గంగ. భాగీరథీ ప్రవంతిని దర్శించగానే దేవతలకు ఒడలు పుల్కరించింది. పరమ పావనమైన మణికర్ణికా ఘట్టంలో దేవతలు మునులు స్నానమొనర్చారు. వివిధ పూజాద్రవ్యములు తీసుకొని మోక్షప్రదుడగు విశ్వేశ్వరుని దర్శనానికి వెళ్ళినారు. విరూపాక్షుని నివాసానికి ప్రదక్షిణాలుచేశారు. యోగపీఠాసమారూఢయయిన విశాలాక్షీదేవిని స్వర్ణపద్మాలతో అర్చించారు. అక్కడ

---

రించి యజ్ఞయాగాదులు నిర్వర్తింపచేయటం, ఆధ్యాత్మిక చింతనలో ఉన్న వాళ్ళను, ఈ రాజుల అధికారపు అశ్వాలకు కళ్ళెములుగా ఏర్పరచారు. పై మూడు వర్ణములలో ఆధ్యాత్మిక చింతగలవారు, బ్రహ్మజ్ఞాన సంపన్నులు బ్రాహ్మణు లనబడినారు. శాస్త్రములలో వాడబడిన బ్రాహ్మణ శబ్దానికి నేడు కులాన్ని సూచించే బ్రాహ్మణ శబ్దానికి సంబంధం లేనట్లుగా తోస్తుంది.

ఈ బ్రహ్మజ్ఞాన సంపన్నులయిన ఋషులు వచ్చినపుడు రాజులు సింహాసనమునుండి లేచి తగినట్లుగా గౌరవమర్యాదలు చేయవలెనని సమాజం శాసించింది. తప్పుచేసినపుడు రాజునుగూడ నిరసించి అడిగే అధికారం ఈ జ్ఞానసంపన్నుల కిచ్చారు. అయితే శిక్షను వేసేవృత్తి లేకుండా చేసి వాళ్ళు ఎల్లప్పుడు సమాజంమీద ఆధారపడేటట్లు చేశారు. రాజులకు శిక్షను దండించే అధికారంకూడ పరిమితం చేశారు. అంటే

గల గణపతికి ఢుంఠివిఘ్నేశ్వరుడని నామం. ఆయనను సేవించి లడ్డులు అపూపాలు సమర్పించారు. ఆస్థాన మంటపమున జరుగుతున్న సత్పురాణ పఠనం శ్రవణానందకరముగ ఉంది. కొంతసేపు సర్వాన్ని మరచి శివపురాణ దివ్యగాథలను విన్నారు. మరియొక ప్రదేశంలో కాశికాపురి మాహాత్మ్యము వివరింపబడుతున్నది. దేవతలు అచటి కేగినారు.

'మృత్యుముఖంలో చొరబోయే జంతునివహాలవద్ద జేరి నీలకంఠుడు' తారకబ్రహ్మోపదేశం చేస్తుంటే ఆ మంత్రమహిమ నెరిగిన తుమ్మెదలు ఆనందపారవశ్యంలో మందరస్వరాలతో ఝంకారము చేస్తున్నాయి. పగలు ఉపవాసమున్న నక్తభోజనవ్రతస్థులతోకూడి చకోరాలు చంద్రికతో పొట్టనింపుకొంటున్నాయి. దేవతలు ఈ వింతలుచూచి ఆశ్చర్య భరితులై తమలోతాము ఇట్లనుకొంటున్నారు.

---

రాజువలన ప్రజలకు చెడుజరగకుండా ఉండటానికి ఈ విధానం ఏర్పరచబడింది. అందువలననే "రాజారాష్ట్రకృతంపాపం రాజపాపంపురోహితః" అన్నసూక్తి కలిగింది. కట్టుదిట్టంగా పరిపాలన చేయవలసినవాడు కావున రాజ్యంలో ఏదయినా అకృత్యం జరిగితే ఆ పాపంలో రాజుకు ఎక్కువ పాలు చెందుతుంది. రాజు చేసే దుర్మార్గాలకు ఫలితం పురోహితుడు అనుభవించాలి. ఇవన్నీ దృష్టిలో ఉంచుకొనే సమాజం క్షేమంగా ఉందా అని అడగటానికి 'బ్రాహ్మణాస్సంతు నిర్భయాః' అని అడిగేవారు, అంటే అధికార రోగపూరితులను నిర్భయంగా అడిగే స్థితిలో ఈ వర్గం ఉందా ? అలాఉంటే అధికారం వెర్రితలలు వెయ్యదని సంఘం క్షేమంగా ఉంటుందని నాటి అభిప్రాయం.

అయితే ఆయాకాలాలలో స్వార్థపరులు లేకుండా పోలేదు. ఈనాడు గూడ అదేస్థితి గదా! స్వార్థపిశాచికి గజ్జెకట్టి కొందరు ఆడించటం లేదా!

ఏ నాటికీ నాశనం లేదు సరికదా లేశంకూడా కీడులేని ఈ మహా పుణ్యప్రదేశంలో ఉన్న జంతువులకు స్వర్గమెందుకు ? స్వర్గసౌఖ్యములు కాలపరిమితితో కూడినవి గదా ! పుణ్యసంచయం పూర్తికాగానే స్వర్గ నివాసయోగం పోతుంది. అటువంటి స్వర్గ మెవరు కోరుకుంటారు ? పునర్జన్మ లేకుండాచేసి శంభులోక నివాససౌఖ్యం యిచ్చే పవిత్రప్రదేశం ఇది. ఇచ్చటగల క్రిమికీటకాదుల స్థితి మనకన్న ఉన్నతంగా ఉంది. కాశిలో నివసించే ఎవ్వరితోనైనా ఇంద్రుడు సయితం సమానుడుకాడు. ఈ ఆనందవనంలో భోజనంలేకుండా ఉన్నా స్వర్గంలో ఉన్నదానికన్న మిన్న. ఎంతటి దుష్టుదయినా అవిముక్తదేశంలో కొన్నాళ్ళుంటే అశ్వ మేధయాగంచేసిన ఫలాన్ని పొందుతాడు. వారణాసిలోని మశకం ఐరా వతముకంటె గొప్పది. ఇచ్చటనున్న వారెవరైన ఆగ్రహం కలిగినపుడు రుద్రుడివంటి వారే ! ముక్తిసయ్యం పంప్లు రాలదన్నగలరట. ఎంత మంది ఇంద్రులు గతించినా, ఎన్ని మన్వంతరములు సాగిపోయినా ఎన్ని కల్పములు గడచినా కాశీపట్టణం నాశిపోదు. నిశ్చలమైన మనస్సుతో గంగాప్రవాహంలో స్నానమాడి భక్తితో విశ్వేశ్వరుని అర్చించి స్తోత్రాలు చేసినవాళ్ళు ముక్తికాములు సర్వసౌఖ్యాలు సమకూరుస్తారు. కాశిలో ధర్మం ఎల్లప్పుడు నాలుగుపాదాల నడుస్తుంది. నిత్యకళ్యాణం పచ్చ తోరణమై సకల సంపత్సమృద్ధిని కలిగిఉంటుంది. వారణాసిలో నివసించే వాళ్ళకు తీరని కోరికలులేవు. ఇక్కడివారికి మోక్షం కరతలామలకము.

---

అంతమాత్రాన ఆజాతిమొత్తాన్ని నిందిస్తామా ! అది ఆయావ్యక్తులకు మాత్రమే పరిమితంచేయవలసి ఉంటుంది. పై కారణాలవల్ల పురాణ ఇతిహాసాలలో బ్రాహ్మణాధిక్యత కనుపిస్తుంటుంది. అది నేటి బ్రాహ్మణ కులస్థులకు సంబంధించిందికాదు.

3)

చతుర్విధపురుషార్థాలు సిద్ధించేనెలవు. కళ్యాణముల కాకరం. అణిమాది అష్టసిద్ధుల కిది ఆటపట్టు. నిజంగా కాశి ఈ లోక లోని వాళ్ళకు కల్ప వల్లి. ప్రళయకాలంలో కులపర్వతాలు ఉగ్రూతలూగేటట్లు గాలివీస్తుంది. ఆదిత్యుడు ద్వాదశమూర్తులై లోకాలను దహించివేస్తాడు. పుష్కలావర్త మేఘాలు కుంభవోతగా వర్షించి సప్తసముద్రాలను ఏకంచేస్తాయి. భూతకోటి నశిస్తుంది. ఆ సమయంలో సైతం కాశికి ఐదుక్రోసుల దూరం మేరకు ఏ ఉపద్రవం కలగదు. శాశ్వతంగా ఉండగల్గింది కాశి ఒక్కటే. చంద్రకళలు దినదినం ప్రవర్ధమానం అవుతున్నట్లు వారణాసిలో ధర్మార్థ కామమోక్షాలు అతిశయిల్లుతూఉంటాయి.

కాశిలో మృతిచెందే వాడిభాగ్యం ఏమని చెప్పవచ్చు. తొండం నిండ నీరునింపుకొని వచ్చి విఘ్నేశ్వరుడు ఆ నీటితో కడిగి పావనం చేస్తాడు. గంగాభవాని స్త్రీ రూపం ధరించి తన మృదువైన హస్తాలతో శరీరం విసురుతుంది. ఏ భయంలేకుండా చేయటానికి భృంగీశ్వరుడు ఒడలంతా భస్మం అలదుతాడు. పరమేశ్వరుడు స్వయంగా తారక మంత్రోపదేశం చేస్తాడు. ఇంతకంటె ఇంకేం అదృష్టం కావాలి అని చెప్పుకుంటూ కాశిలోని విశేషాలుచూస్తూ దేవతలు ముందుకు పోతున్నారు. కైలాసంలో ఉన్నదానికంటె ఎంతో ఆహ్లాదం కల్గిస్తున్నది కాశి వాళ్ళకు. సంతోషంతో పరమ మాహేశ్వరుడయిన అగస్త్యుడి కుటీరం వెదకుతూ పోతున్నారు. అగస్త్యుని ఆశ్రమప్రాంతం చేరగానే అక్కడి దృశ్యాలు దేవతలను మరింత చకితులను కావించాయి.

ఒక సింగపుపిల్ల ఏనుగుచెక్కిళ్ళ కండూతిపోవటానికి గోకు తున్నది. పెద్దపులి ముందటికాళ్ళతో లేడి ముఖమెత్తి ముద్దుపెట్టుకొంటు న్నది. తోడేలు స్నేహంతో చింబోతు కొదమను కౌగలించుకొని బుజ్జ

గిస్తున్నది. పొదరింట్లో ఒక ఆడవిపిల్లి ఎలుకతో ఆడుకొంటున్నది. ఒక ముంగిసకు ఎందతగులకుండ సర్పమొకటి పడగబట్టింది. కొండ గొర్రె కోతితో స్నేహంచేస్తున్నది.

బాలెంతయిన ప్రియురాలికి మగలేడి ఒకటి వివ్వరిసనం పుక్కిట బట్టి మెల్లగా త్రాగిస్తున్నది. ఈ ప్రకృతిపై రుద్య దృశ్యాలు చూచి దేవతలు విస్తుపోయారు. మనోహరంగా ఉన్న అక్కడి వృక్షలతా ప్రకృతిని చూసి దేవతలు ఒక్కక్షణం మైమరచారు. శాశ్వతా । నీలకంఠా । మహేశ్వరా । అంటూ నుతిస్తున్న అగస్త్యుడి కంఠధ్వనితో వాళ్ళకు స్మృతి కలిగింది. గంగానది ఒడ్డునగల మారేడు చెట్టుక్రింద పద్మాసనస్థుడయి కూర్చున్న అగస్త్యుని సురలు తిలకించారు. ఆయన కుడిపార్శ్వంలో లోపాముద్రాదేవి కూర్చొనిఉంది. దేవతాళి ఆ దంపతులను సమీపించారు.

# దేవాళి అగస్త్యాశ్రమ సందర్శనం

అంతర్దృష్టి వదలి అగస్త్యుడు బాహ్యానికి దృష్టిమరల్చారు. రుద్రాక్షమాల కుడిపై వునఉన్న జటాజూటానకిచుట్టి పద్మాసనంవదలించారు యోగసమాధి చాలించి, పంచాక్షరీ మంత్రపరిపూతదేహు డయిన అగస్త్యుని చూడగానే దేవతలు మనస్సులలో మతించటమేగాదు. పైకి జయజయ ధ్వానాలుచేశారు. భక్తితో నమస్కరించారు. అగస్త్యుడు ప్రతినమస్కారం చేసి వాళ్ళందరినీ కూర్చుండజేశారు. కుశలాదికంతోపాటు వాళ్ళరాకకు గల కారణం ప్రశ్నించారు. దేవతలంతా అంగీరసుని ముఖంచూచారు. తాము వచ్చినపని నేర్పుగా చెప్పవలసిందని ఆ చూపుల భావం. బృహస్పతి దేవ గురువు. వారి భావాన్ని గ్రహించాడు. తాను వివరించటమే సమంజసంగా ఉంటుందని భావించాడు. అగస్త్యుడితో ఇలా అన్నాడు.

మైత్రావరుణీ, పరమేశ్వరు సన్నిధానంలో ఉంటున్న నీవు ధన్యు డివి. లోకానికంతటికీ గౌరవింపతగినవాడివి. పైగా నీవు ఎల్లప్పుడు ప్రపంచయొక్క మేలుకోరేవాడవు కదా ! పృధ్విలో ఎన్ని అరణ్యాలు లేవు ? ఎన్ని ఆశ్రమాలు లేవు? ఎంతమంది నియమనిష్ఠలతో తపస్సులు చేయటంలేదు ? నీ ఔదార్యం ప్రాభవం తేజస్సు మరెక్కడా కన్పించవు. నీ హస్తమే ఓంకారంతో కూడిన పంచాక్షరీ బ్రహ్మవిద్యోపనిషత్తు. ఇట్టి మహాత్ముడివయిన నిన్ను ఒకవరం యాచింపవలసిందని బ్రహ్మ మమ్మిక్కడకు పంపించినాడు. ప్రపంచ మిప్పుడు సంక్షోభానికి గురయింది. ఈ ఉపద్రవంనుంచి నీవే కాపాడాలి సుమా ! అని వాక్చాతుర్యంతో మాట్లాడి బృహస్పతి సతీమణియైన లోపాముద్రనుచూచి ఆమెను పల్కరిం చాడు అమ్మా! లోపాముద్రా! పూవుతావులవలె అవినాభావసంబంధంతో విరాజిల్లుతున్న వారు మీ దంపతులు. అరుంధతి, సావిత్రి, అనసూయ, ముగ్గురుమూర్తుల భార్యలు, స్వాహాదేవి మొదలయిన సతీమతల్లులతోటి కలిపి చెప్పవలసిన పతివ్రతవు నీవు. మీ దంపతులకు, శిష్యులకు క్షేమమా ? సమస్తము శుభప్రదంగా జరుగుతున్నదా ? సాధ్వీ నీకు నీకు తెలియని సతీధర్మాలులేవు. అయినా పతివ్రతా ధర్మాలు చెప్పవలె నని నాకెంతో ఉత్సాహంగాఉంది.

(పురాణ ఇతిహాసాలలో అవకాశం లభించిన చోట్లలో ధర్మాలు, నీతులు.చెప్పబడినాయి. అవన్నీ కథలోని పాత్రలకంటె మనకొరకనే [illegible]తేగాని ఆ పాత్రలను న్యూనతపరచటానికి కాదు. ధర్మ ప్రబోధమే శా[illegible]పముల రచనా లక్ష్యం).

# బృహస్పతి చెప్పిన పతివ్రతా ధర్మాలు

భర్త భుజించకముందు భార్య భుజించరాదు. మగనికన్న ముందు మేల్కొనాలి. భర్తమాటకు ఎదురు చెప్పరాదు. చెరగుమాసిన మూడు రోజులు భర్తకు కనిపించరాదు. నాల్గవరోజు స్నానమాడి ప్రథమంగా భర్తను చూసింతర్వాతగాని మరో పురుషుని చూడగూడదు. పసుపు, కుంకుమ, కాటుక, పయ్యెద, తాంబూల సేవనం కేశములు ముడిచి పూలు ధరించటం, చెవియాకులు, (నేడు కమ్మలు) ధరిస్తే భర్తకు శుభం కలుగుతుంది.

రజస్వలయైన స్త్రీ, నింద్యజీవనముగల వనిత, శ్రమణక సన్యాసిని, విధవరాలు, పతిత, రంకులాలు వీరితో ముత్తయిదువ ఏపరిస్థితులలోను తగవు పెట్టుకోరాదు. భర్త అంగీకారం లేనిదే ఎంతదగ్గరి చుట్టమునకైనా ఏమియు ఈయరాదు. అనుష్ఠానముకొరకు తప్ప సుఖంగా నిద్రిస్తున్న భర్తను మేల్కొల్పకూడదు. ఒంటరిగ ఎక్కడికి పోరాదు. వస్త్రమును ధరించక స్నానమాడుట దోషము. కడపమీద సన్నికల్లుమీద తిరుగలిమీద కూర్చొనరాదు. ఏకాంత సమయమునతప్ప పతియెదుట జాణతనం, వాచాలత్వం చూపకూడదు.

---

నియమాలు, ధర్మాలు, కట్టుబాట్లు, స్త్రీలకు మాత్రమేనా? పురుషుడేమి చేసినా దోషం లేదా అన్న సందేహం కలుగుతుంది. శాస్త్రాలలో ఇంతకన్న కఠోర నియమాలు పురుషునకుకూడ చెప్పబడినవి. భార్యనెప్పుడును కొట్టరాదు. తల్లికిచ్చినంత గౌరవం ఈయవలె. ఎంత ఘోర మైన కష్టాలలోను త్యజించరాదు: పరస్త్రీని గురించి
కేవలం మానసికంగా పరస్త్రీని స్పృశించినావరే ...నరకం పా...
కాగలడు. స్త్రీలయెదుట అసభ్య సంభాషణ చేయ...

ఆనంద దుఃఖములను భర్తతో పాలుపంచుకొనవలె. కొందరు కులటలు భర్తహీనస్థితిని పొందినపుడు లేక రోగగ్రస్థుడయినపుడు వదలి వేస్తారు. దారిద్ర్యంలో ఉన్నపుడు కొందరు దుర్మార్గులు మత్సరం వహించి ఏవేవో తీసుకురమ్మని వేధించి భర్త లజ్జపడేటట్లు చేస్తారు. కొందరు వనితలు భర్త ఎంత యిచ్చినా సంతృప్తిపడక తగవులాడుతారు. కొందరు చెడిపెలు మగని మోసగించి పోరానిచోట్లకు పోవటం కద్దు. కొందరు భర్తయెదుట అశ్లీలంగా మాట్లాడుతారు. దుశ్శీల లయిన సతులు తాము నరకంలో పడటమే గాక భర్తను, ఆ వంశీకులనుకూడ నరకంలోకి తోస్తారు.

భర్తను మోసగించి పరపురుషునికూడిన నారి గుడ్లగూబయి చెట్టు తొర్రలో నివసిస్తుంది. ఇతరులను కామదృష్టితోచూచిన స్త్రీకి మెల్లకన్ను కలుగుతుంది. కోపావేశంలో భర్తను కొట్టిన యింతి ఆడపులిగా జన్మిస్తుంది. భర్తను నిందించే స్త్రీ మూగగా జనిస్తుంది. రహస్యంగా అరగించే యామె పందిగా జన్మ యెత్తుతుంది.

ఎండలో అలసివచ్చిన భర్తను వాకిటిలోనే ఎదురేగి తెచ్చి స్నానం భోజనాదులయిన తరువాత పాదసేవ చేయటం భార్య ధర్మం. స్త్రీకి న్యాయ సమ్మతమైన ఏకొద్ది ధనమో తండ్రి యిస్తాడు. అంతకంటె తక్కువిస్తారు సోదరులు, పుత్రులు. అడిగిన ధనమంతా యిచ్చేవాడు భర్త ఒక్కడే సుమా! ఎందరు బంధువు లయినా, చివరకూ కుమారుడయినా భర్తతో సమానం కారు.

"లోకంలో పతివ్రత యిమువ స్థానం గొప్పది. ఉప్పుపిండి తిని, ఉప వాసాలున్నా, భక్తితో దేవతార్చన చేసినా, పుణ్యతీర్థాలు ఎన్నింటిలో మున

గినా విధవరాలు బిడవతో సమానం గాదు. నిద్రలేచి సూర్యుని చూడక ముందు విధవముచూడరాదు. విధవలయినా తల్లి, వదిన, అత్తమ మాత్రము చూచినా దోషం లేదు. ఎంతటి ప్రేమాభిమానములు గలవైనా ఉదయానవే విధవరాలి దీవన పొందరాదు. అది విషంతో సమానం.

పెండ్లివారు పురోహితులు వెన్నెల చంద్రులవలె ఎల్లప్పుడు కలసి ఉండవలసిందని దీవిస్తూ అమ్మా! ఎప్పుడు భర్తను అనుసరింపవలసిందని బోధిస్తారు. పతివ్రతయైన స్త్రీ పయ్యెదను తొలగించటానికి వాయువుకు కూడ భయమే. సాధ్వికి అసాధ్యం లేదు ప్రపంచంలో. తల్లివంశాన తండ్రి వంశాన, భర్త వంశాన ఏడు తరాలవారిని యిల్లాలు ఉద్ధరిస్తుంది.

ఇలా కొన్ని ధర్మాలు చెప్పి బృహస్పతి తల్లీ! లోపాముద్రా! నీవంటి పుణ్యవతులు ఉండటం వలననే వసుంధర స్థిరంగా ఉండగల్గింది. నీకు నమస్కారము. మేము వచ్చిన ఈ కార్యమునకు నీ భర్త అనుకూలు డగునట్లుగా చేయవలసింది అనిపలికి అగస్త్యునితో ఇలా అన్నాడు.

ఇల్వలారీ! నీవు ప్రణవ స్వరూపం. ఈమె వేదవిద్య. నీవు తపస్సువు. ఈమె సాధ్వి. ఈమె సత్క్రియ నీవుఫలం. నీవు సూర్యు దవు. ఈతల్లి చైతన్యం. మీ యిద్దరి తేజములు విశ్వకళ్యాణానికి కారణాలు. ఇతడు ఇంద్రుడు. ప్రక్కనున్నవాడు అగ్ని. నీలవర్ణుడు యముడు. ఆతడు నిరృతి. ఆ వెనుకనున్న తేజస్వి జలధిరాజు వరుణుడు. వరుణుని కవతల ఉన్నవాడు గంధవహుడు. ఈ పింగళ నేత్రుడు కుబేరుడు. వారెల్లరు పరమర్షులు. మేము కార్యా ర్థులమై వచ్చాము.

వింధ్యుడు మేరువుతో మచ్చరించి శరీరాన్ని పెంచి సూర్యుని మార్గాని కడ్డుగా నిలిచినాడు. దినమాసాది గణనం లేకుండా పోయింది. సంధ్యా తర్పణాదులు లేవు. సూర్యోదయ అస్తమయాలు లేకుండా పోయినాయి. అకాండ ప్రళయం కలిగింది. మేమంతా విరించివద్దకు

---

ధనంచేత, వస్త్రములచేత, ప్రేమచే, నమ్మకంచే మధురమైన మాటలచే భార్యను సంతుష్టపరచవలెను. తల్లి, తండ్రి, బిడ్డలు భార్య, పేదలకు పెట్టవిదే ప్రాణం పొయ్యే సమయములోనైనా సరే భుజించరాదు.

మహా నిర్వాణ తంత్రము – అష్టమోల్లాసము

" న భార్యాం తాడయేత్క్వాపి మాతృవత్పాలయే సదా
న త్యజేత్ ఘోర కష్టేపి ....
స్థితేషు స్వీయదారేషు స్త్రియ మన్యాం న సంస్పృశేత్
దుష్టేనచేతసా విద్వాన్ అన్యథా నారకీభవేత్ ॥
" ధనేన వాససా ప్రేమ్ణా శ్రద్ధయామృత భాషణైః
సతతం తోషయేత్ దారాం నా ప్రియం క్వచిదాచరేత్ ॥
మా తరం పితరం పుత్రం దారా నతిధి సోదరాన్
హిత్వాగృహీ నభుఞ్జీయాత్ ప్రాణైః కంఠగ తైరపి.
నమిథ్యాభాషణం కుర్యాత్ నచశాఠ్యం సమాచరేత్॥

అయితే పురుషుడు ఆర్థికాధిపత్యం వహించి యుండుటంవల్ల, శారీరిక పటిష్ఠత కలిగినవాడు కావటంచేత స్త్రీపై పురుషుడు అధికారం చలాయిస్తూవచ్చాడు. కాని భార్యలేనివాడు ఏ పుణ్యవ్రతాలకు, శుభకార్యాలకు పనికిరాడనే సిద్ధాంతం. (గ్రంథవిస్తరణ భీతితో. ఈ భాగం సంక్షిప్తం చేయబడింది.)

వెళ్ళి ప్రార్థించాము. ఆ మహర్షియుడు మాతో ఈ ఉత్పాతం నివారించ టానికి మహేశ్వర తుల్యుడగు అగస్త్యమహర్షికి తక్క మరెవ్వరికీ సాధ్యం గాదు, మీరు వెళ్ళి ఆయనను అర్థించండి అని అనతిచ్చారు. హుంకారమాత్రంచేతనే ఇంద్రపీఠమెక్కిన నహుషుని మహేంద్రపీఠం నుంచి క్రిందికి త్రోసి శచీదేవిని కాపాడిన ప్రభావం కలవాడవు. లోకకంటకు లయిన వాతాపి యిల్వలులను యమలోకానికంపి లోకాల పీడ తొలగించిన తేజోమూర్తివి. నేడీ వింధ్యుడి గర్వం అణచటానికి సమర్థుడవు నీవే। మా విన్నపం ఆలించి ఈ ఆపదనుండి కాపాడవలసిందని భక్తితో ప్రార్థించాము.

అగస్త్యునకు పరిస్థితి అవగతమైంది. మనస్సున ఏమాలోచించు కొన్నాడో ఏమో। గంభీర భాషణాలతో ఇలా అన్నాడు. దేవగురూ। దేవతలారా। ఈర్ష్యకు దాసుడై, శిలాహృదయంతో సంచరిస్తూ గర్విష్ఠిమై ఉండే వాడి ఐశ్వర్యం నిలువదు. మీ బాధలు నివృత్తిచేస్తే లోకానికి గూడ క్షేమం కలుగుతుంది. ఈ కార్యభారం నేను వహిస్తాను. విదారాన్ని వదలి మీ మీ స్థావరాలకు వెళ్ళండి. సమస్త కల్యాణ కారకు డయిన కాశీ విశ్వనాథుడు మన పాలిటి కల్పతరువై ఉన్నాడు గదా।

ఆ మాటలు దేవతలకు అమృత వర్షం కురిసినట్లయింది. అప్పటి కప్పుడే తమ బాధలన్నీ పోయినట్లుగా సంతసించారు. ఆ పుణ్య దంపతు లకు మ్రొక్కి వారి అనుమతిని తీసుకొని తమ లోకాలకు ప్రయాణ మయి నారు. వికసిత ముఖ పద్మాలతో దేవతలను సాగనంపినామని ఆ యిద్దరు సంతృప్తి చెందారు.

# వారణాసిని విడచిపోవటానికి అగస్త్యుని నిర్వేదం

అనంతరం అగస్త్యుడు వింధ్యుని విజృంభణం ఎలా తగ్గించవలెనా అని ఆలోచించాడు. దేవతల విచార వదనాలు చూచి ద్రవించిన హృదయంతో వెనుక ముందులు చూడకుండ ఈ కార్యమునకు అంగీకరించాడు. ఇప్పుడు దీర్ఘంగా ఆలోచిస్తుంటే తాను కాశిని వదలి వెళ్ళవలసి వచ్చినట్లు అవగతమవుతున్నది. ఆ తలపు రాగానే ఆయన గుండె ఝల్లుమన్నది. ఒడలు కంపించింది. నోటివెంట మాటకూడా పెగలటంలేదు. మనస్సులో ఏవో ఊహలు రేగినాయి. వదనంలో ఉన్న ఉత్సాహం తగ్గింది. విచారం అలుము కొంది. అస్పష్టంగా 'ఎంత అనాలోచితంగా పరేనన్నాను' అని అన్నాడు. భర్త ముఖ కవళికలు చూచి లోపాముద్ర ఆందోళన చెందింది. భర్తకు పరిచర్య చేయసాగింది. కొంతసేపటికి కొంచెం కలక తేరిన మనస్సుతో అగస్త్యుడు గద్గదస్వరంతో ఇలా అన్నాడు,

లోపాముద్రా ! చూచావా ? మనుజుడొక విధంగా ఊహిస్తే పరమేశ్వరుడు మరొక విధంగా నిర్ణయిస్తాడు. కాశిలోనే ఉండి జీవితమంతా విశ్వేశ్వరారాధనలో గడుపుదామనుకొన్నాను. కాని యింతలోనే కాశిని వీడి వెళ్ళవలసిన దుర్భర పరిస్థితులు కల్గినాయి. ఏదో అసమయాన అంగీకరించాను గాని నిర్లిప్తులయి ముక్కుమూసుకొని తపస్సుచేసుకొనే ఋషులు ఇంతటి పనులు చేయగల్గుతారా ? మదించిన ఆబోతులు రెండు క్రుమ్ము లాడుతుంటే నడుమ చిక్కిన లేగదూడ వలె అయింది నా స్థితి.

ఆలోచించిన కొలది కొన్ని చాల ఆశ్చర్యంగా కనిపిస్తాయి. సుమా ! వజ్రంతో పర్వతాల రెక్కలు ఛేదించి గోత్రారి అని పేరుపొందిన ఇంద్రుడికి వింధ్య పర్వత మొక లెక్కా ? ప్రళయకాలంలో పర్వతాలతో

కూడిన ప్రపంచాన్నే ఉద్ధూతయాగించే ప్రభంజనుడు ఈ చిన్నకొండ యొక్క గర్వాన్ని అణచలేకపోయినాడా ? సమస్త ప్రాణికోటిని కాపి స్తాడు, అంత్యంలో ప్రాణాలను హరిస్తాడు గదా ఈ యముడు. ఏమ యిందాతని పరాక్రమం. సప్తజిహ్వాలతో లోకాలను భస్మీపటలం చెయ్య గల సమర్థుడు గాదా దహనుడు. ఆ సర్వ భక్షకుడికి వింధ్యుడు అసాధ్యుడయినాడా ? ఆదిత్యులు రుద్రులు మరుద్గణాలు తక్కిన దేవత లేమి సామాన్యులా ? వింధ్య భూధర గర్వాపహారక్రియ ఎవ్వరికిని చేత గాలేదా ?

కామధేనువు కల్పవృక్షం మొదలయిన సర్వ అభీష్టప్రదాలు కల ఇంద్రుడంతటి వాడు నన్ను యాచిస్తే ఎట్లా కాదంటాను ? కార్యభారం వహిస్తానని దేవతలకు మాట ఇచ్చి యిప్పుడు వెనుదిరిగితే లోకం నన్ను హేళన చేయదూ ? ఆడిన మాటలను తప్పిన వారికి సద్గతులు కల్గుతాయా? ఎవరినైనా భరిస్తాను గాని అసత్యాలు పల్కేవాడిని మోయలేనని భూదేవి ఒకప్పుడు బ్రహ్మదేవునితో మొరపెట్టుకొన లేదా ? అంత యెందుకు లోక కంటకులయిన మధుకైటభులు, హరికి యిచ్చినమాట నిల్పుకొనటానికే గదా ఆయన చేతిలో మరణించింది. మొగమాటంవల్ల గదా గరుత్మంతుడు విష్ణువునకు వాహన మయినాడు. వాగ్దత్తం చేసిన తర్వాత వెనుదీయ టానికి ఇష్టపడక, కులగురువైన శుక్రుని హితబోధను కూడ త్రోసిపైచి బలిచక్రవర్తి తన వినాశమునకు అంగీకరించాడు. సత్యంమీది విశ్వాసం చేతనే వృత్రాసురుడు ఇంద్రుని చేతిలో హతుడయినాడు. ఉపకారమొనర్చిన వారికెప్పటికైనా మేలు కలుగుతుంది. మనస్సులోనయినా ఇతరులకు కీడు తలిస్తే తనకే కీడు సంప్రాప్తిస్తుంది. ఎన్నటికయినా మానవునికి తన ధర్మమే రక్షిస్తుంది.

దేవీ! మరొక విషయం ఉన్నది. సుకృతం ఉంటేగాని కాశిలో స్థిరనివాసం లభించదు. వారణాసిలో చిరకాలం ఉండటానికి వీలుకాకుండా ఎన్నో అంతరాయాలు కల్గుతాయని పురాణాలలో వింటున్నమాటలు యధార్థమైనాయి. ఇంతకు విశ్వేశ్వరునికే నామీద దయ తప్పింది కాబోలు. లేకుంటే నాకు కాశీవియోగం ఎలా సంభవిస్తుంది. చేతి లోని ఆహారపు ముద్దను విసరికొట్టి మోచేయి నాకే వెర్రి వెంగళప్పగాని భోగమోక్షాలకు నిలయమైన కాశిని వదలిపోడు. దూరాలోచన చేయక దేవగురుని మాటలకు అంగీకరించాను. వారణాసిని వదలవలసి వస్తుందని అనుకోలేదు. అయ్యయ్యో! మోక్షలక్ష్మిని ప్రసాదించే కాశీ వియోగం ఎలా భరిస్తాను.

రాజపుత్రీ! హిమశైల సానువుల నుంచి క్రిందికి దిగుతూ గైరి కాది ధాతువులతో కలసి పవిత్రమైన జలముగల గంగకెలా దూరం కాగలను? మందార మధుర మధు రసాస్వాద నిమీలిత నేత్రుడైన వటుకనాధుని మరువగలమా! విఘ్నాంధకారానికి సూర్యునివంటివాడయిన డుంఠిగణపతిని వదలిపోగలమా! మధ్యాహ్న కాలాన, నిరతాన్నదాత ఆ విశాలాక్షి మహాదేవి చేతిభిక్ష ఎవరు మానుకుంటారు? పంచక్రోశ విస్తీర్ణమైన కాశీక్షేత్రం మోక్షప్రదాయిని అని శ్రుతులు వల్కుతుంటే దానిని వదలి దూరంగా పోయే నిర్భాగ్యుడుంటాడా?

ఈవిధంగా పరిపరి విధాల విచారించాడు మైత్రావరుణి. ఇంతలో ఆయన హృదయంలో ఒక్క భావన తళుక్కుమంది. కాశీవియోగ వేదనను ఉపశమింప చేసే యోచన కలిగింది. భార్యతో కలువకంటీ, వారణాసిని వదలితే ఏమిలే. నేను అంతరవిముక్త క్షేత్రాన్ని ఆశ్ర యిస్తాను. ఇదొక రహస్యమైన విషయం. ఇతరు లెవ్వరికి తెలియదు

నీకు వివరిస్తాను విను. తీర్థాలు బాహ్య తీర్థాలని అంతర తీర్థాలనిరెండు రకాలు. కాశీ, ప్రయాగ మొదలయినవి బాహ్యతీర్థాలు. అంతర తీర్థాలు మానవుని శరీరంలోనే ఉన్నాయి. భ్రుకుటి అవిముక్తస్థానము. శిరస్సు శ్రీశైల మల్లికార్జునస్వామికి ఉనికిపట్టు. ఫాలభాగము కేదారేశ్వరం. స్తనముల మొనలయందు కురుజాంగలక్షేత్రం నిలచిఉంటుంది. ఈతీర్థరాజము లన్నీ మహాదేవునికి విహరణస్థానాలు. ఇవన్నీ వేదవిశ్రుతాలేసుమా. అయితే అన్నివిధములయిన క్షేత్రాలలో మనము వివరిస్తున్న అవిముక్తమే శ్రేష్ఠమైనది. ఇలాటిస్థానంలో ఉండి నిష్కళంక నిర్వికార పరబ్రహ్మరూపుడు అద్వితీయుడు అయిన పరమేశ్వరుని ఆరాధించటానికి అవకాశం లేకుండా పోతున్నది. ఈసంసారం సముద్రంవంటిది. దీన్నితరించడానికి మార్గాలు కనుక యివన్నితీర్థాలయినాయి. అవిముక్తం త్రిమూర్తులకు స్థానమయి నప్పటికీ ఈశ్వరుడికి ప్రధానమైన స్థానంగా చెప్పబడుతుంది అని మనస్సు సంతృప్తి పరచుకొంటూ మాట్లాడినారు.

లోపాముద్ర ఆమాటలకు నాథా ! చిరకాలంనుంచి మిమ్మొక ప్రశ్న అడుగ దలచాను. దయచేసి నాకు వివరంగా చెప్పండి. ఆత్మను తెలుసుకొనే విధానం ఏది ? అన్నది.

దాని కగస్త్యుడు ఇలా వివరించాడు. దేవీ ! పూర్వం అత్రి మహాముని యిదేవిధంగా యాజ్ఞవల్క్యుని ప్రశ్నించాడు. దాని కతడు తెల్పిన సమాధానం విను.

అవిముక్తము వరణయందు అశియందు ఉంటుంది. వరణ సంసార దోషాలను నివారిస్తుంది. అశి ఇంద్రియ దోషాలను హరిస్తుంది. అవి ఉండే స్థలం భ్రూమధ్య స్థానం. అభ్యంతర అవిముక్త క్షేత్రం. బ్రహ్మ నాడి వాయు జయంతోగాని సిద్ధించదు. సిద్ధించినపుడు యీఆత్మ తత్వం తెలుస్తుంది.

సర్పాకృతిగ ఉన్న ప్రకృతి రూపిణి కుండలినికి మహత్తు మొద లయినవి ఏడు మలకలు. కుండలిని ముఖం విప్పుకొని సుషుమ్న మూల రంధ్రమును మూసిపైచి వెంకాస్థి సంబంధంతో పైకి సాగుతుంది. మధ్యమ నాడితో కూడి తోక చివరిభాగంలో బ్రహ్మ రంధ్రాన్ని కప్పివేస్తుంది. ఆ సమయంలో ఇడా పింగళనాడులలో గాలి పీల్చబడి విడువబడుతుంది. ఈ రెండు (ఇడా-పింగళ) రంధ్రాలను మూసివేసి మధ్య రంధ్రాన్ని తెరవటం అభ్యాసం చేయాలి. అప్పుడుగాని సాధకుడికి పవన విజయం లభించదు.

లోపాముద్ర కోరికమీద నాడీత్రయము వాటి విశేషాలు వివరించాడు అగస్త్యుడు. దేవీ! ఇడ ఎడమవైపునుండు నాడి, పింగళ కుడివైపున ఉండే నాడి. ఈ రెంటికి నడుమ సుషుమ్నానాడి కలదు. ఇడకు విష్ణువు, పింగళకు బ్రహ్మ, సుషుమ్నకు పరమేశ్వరుడు అధిదైవతాలు.

సుషుమ్నానాడి మూలముననే బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది. అందువల్లనే దానికి బ్రహ్మనాడి అని పేరు. తొంభై ఆరు అంగుళాల నిడివిగల ఈ దేహం నట్టనడుమ ముక్కోణాకారంలో కోడిగ్రుడ్డువలె ఉండే ప్రదేశాన్ని కందస్థానం అంటారు. ఇది నాభి. ఈ నాభి కందం క్రిందిభాగమే కుండలినీ శక్తి ఉండే ప్రదేశం. అది సర్పాకారంలో ఉంటుంది. దీనినే ప్రథమధమని అంటారు. అదే మూల ప్రకృతి. మహత్తు, అహంకారం మొదలయిన వికారాలు ఏడు దాని శరీరంలోని మలకలు. అది సుషుమ్నానాడితో పెనవేసుకొని యుంటుంది. కుండలిని ఈ మలకలను భేదించి శిరమువరకు పైకెగబ్రాకుతుంది. అయితే దాని ముఖం అధో భాగాన్ని చూస్తుంటుంది అంటారు పెద్దలు. దాని చుట్టు డెబ్బదిరెండువేల నాడులుంటాయి. వీటిలో పదునాల్గు మాత్రం ప్రధానమైనవి.

ఇడానాడియందు చంద్రుడు అధివసించి యుంటాడు. అందుచేత

దీనినుండి వాయువు రాత్రికాలంలో నిర్గతమౌతుంది. ప్రవేశించేకాలం పగలు. పింగళనాడి సూర్యుడికి అధివాస స్థానం. కనుకనే దీనియందు గాలి పగటికాలాన వెలికివస్తుంది. ప్రవేశ సమయం రాత్రి. మనుజుడు తూర్పు ముఖంగా నిలచినపుడు పింగళనాడి దక్షిణదిశగా ఉంటుంది. మకర సంక్రమణం మొదలు కర్కాటక పర్యంతం సూర్యుడు ఉత్తర దిశగా పయనిస్తాడు. కనుకనే అది ఉత్తరాయనం అయింది. ఈ విధంగా పింగళయందుండే సూర్యుడు ఇడానాడియందు ప్రవేశించినప్పుడు కాలం ఉత్తరాయణం. తిరిగి పింగళయందు సక్రమణం చేసినపుడు దక్షిణాయనం అవుతుంది. సూర్యుడు చంద్రుడు ఏకకాలంలో ప్రాణ వాయువుతోగూడి పింగళనుచేరి అస్తమించే కాలాన్ని "యమ" అనే పేరుతో పిలుస్తారు.

దేవీ : కుండలిని సర్పం. చంద్రుడు ప్రాణవాయువు. ఆ పాము ఈ గాలిని భుజించే సమయం సంపూర్ణగ్రహణం. ప్రాణమే సూర్యుడు సూర్యుడే చంద్రుడు. ఆ ప్రాణవాయువు మూలాధార ప్రవేశానంతరం జనిస్తుంది. మూర్ధప్రవేశం చేయగానే అస్తమిస్తుంది. దేవతలకు మొదటి విషువం అయిన మేషాయనంలో సూర్యుడుదయిస్తాడు. తులా యనంలో అస్తమిస్తాడు. ప్రాణోదయ అస్తమయాలు రెండూ రెండు విషవత్తులంటారు.

ఇడలో ఉదయించిన శ్వాసం సుషుమ్నలో ప్రవేశిస్తుంది. తరువాత సుషుమ్నలో పుట్టిన వాయువు ఇడానాడిలో ప్రవేశిస్తుంది. ఇలా గాలులు అనేక పర్యాయాలుగా అటునుంచి యిటూ, ఇటునుంచి అటూ పొర బారుతూ ఉంటాయి. ఆగమశాస్త్రం తెలిసినవాళ్ళు ఈ వాయుసంక్రమణ వేళలనే సంక్రమణాలంటారు.

ఈ విధంగా అవిముక్త క్షేత్రాన్ని వదలి పోవలసి వచ్చిందనే విచారంతో అగస్త్యుడు అంతరమైన అవిముక్తక్షేత్రాన్ని గురించి భార్యకు వివరించాడు. ఎంతగా తాను మనస్సును సరిపుచ్చుకొందామని ప్రయత్నించినా కాశీవియోగం మనస్సులో మెదలగానే ఆయనకు మరల దుఃఖం ముంచుకొచ్చింది.

కాశీలో ఎంత చనవు, ఎంతటి స్నేహవచనాలు, ఎంత అనురాగ పూరిత సంభాషణలు. వారణాసీ ! నిన్ను వదలి ఎలాపోగలను నీకు నమస్కరిస్తాను. వేదాల సాక్షిగా, గంగాభవాని సాక్షిగా, విశ్వేశ్వరుని సాక్షిగా, పరమేశ్వరుని సాక్షిగా యథార్థాన్ని పలుకుతాను. కళ్యాణ మందిరమైన ఓకాశీ ! నీతో సమానమైన పట్టణాలు, క్షేత్రాలు, తీర్థాలు మరెక్కడా లేవు. అవిముక్త క్షేత్రంలోని లింగమూర్తికి సమానమైన లింగమూర్తులు లేరు. అంటూ రెండడుగులు ముందుకు వేసినాడు. అతని స్థితి అపస్మారము కలిగినట్లున్నది. మదము ఎక్కువయితే ఏనుగకు ఒడలు తెలియనట్లు, విషం తలకెక్కుతుంటే మాగన్ను పెట్టినట్లయి, తూలుతూ, ఉస్సురంటూ, ఉమ్మలిస్తూ నడువలేక పోతున్నాడు అతడు. మనస్సును పట్టలేక రెండు చేతులెత్తి నమస్కరిస్తూ కాశికి, అచటగల వారందరికడ అనుజ్ఞ తీసుకొంటున్నాడు. కళ్యాణ గుణాస్పదా గంగమ తల్లీ నేను వెళ్ళివస్తాను సుమా ! కారుణ్య కటాక్ష విరాజితా విశాలాక్షీ ! నాకు సెలవుతల్లీ ! పూర్ణభద్రాది గణాధిపతులారా ! వటుక భైరవా ! నేను కాశిని వీడిపోతున్నాను. తీర్థసంవాసులారా ! పశుపతి సేవా మహా భాగ్యవంతులారా దురదృష్టం కప్పిన అగస్త్యుడు మీకందరకు దూర మవుతున్నాడు.

## అగస్త్యుడు కాశిని వదలిపోవుట

కలహంసమా ! నాతో రారాదా ! ఏమెందుకు వస్తావులే. కదళికా

వనదేవతా! నీవయినా నాతో రాగలవా? ఈప్రదేశంనుంచి నీవెందుకు దూర మౌతావులే! విశాలాక్షీదేవీ కరుణించి నీవైన నాకు తోడుగ రాగూడదా? అమ్మా! నాబుద్ధి ఎంత మందగించింది. పరమశివుని వీడి నీవు క్షణకాల ముంటావా! పరివ్రాజకులారా! మీరు నావెంట ఉంటే కొంతయినా ఊరట కల్గుతుంది. వస్తారా! మీకేమి కర్మబట్టింది రావటానికి? పుణ్యగుణ రాశియైన వారణాసిని వదలి వివ్యాగ్యుడనైన నావెంట వస్తారా? ఈ విధంగా ఉన్మాదునివలె కేకలు వేశాడు. తన దురదృష్టానికి చింతించి చింతించి తిన్నగా అగస్త్యుడు కాశిని వదలి ప్రయాణ మైనాడు, వెంట లోపాముద్ర అనుగమిస్తున్నది.

కొంత దూరం ప్రయాణం సాగింది క్రమక్రమంగా కాశీ దూరస్థు లయినారు. ఒక అరణ్యాన్ని ప్రవేశించారు. అసలే యిష్టం లేని ప్రయాణము. దానికితోడు అది కీకారణ్యం. త్రోవనిండా ముళ్ళు, మొనలు తేలిన రాళ్ళు. నడక చాల బాధాకరంగా ఉంది. అడుగు సాగటం లేదు. మిక్కిలి కష్టంమీద తిన్నగా ముందుకు అడుగులు వేస్తున్నారు ఆ దంపతులు. కొంతసేపటికి అడుగుతీసి అడుగువేసే వత్తువకూడ సన్నగిల్లింది. ఒక మర్రిచెట్టు నీడలో కూలబడినారు. అగ స్త్యుడు భార్యతో లోపాముద్రా! నీవు బుద్ధిమంతురాలవు. ఆలోచించు. కారణం లేకుండా ఏదయినా జరుగుతుందా? నిష్కారణంగానే మనకు కాశీవియోగం కలిగిందంటావా? సుఖదుఃఖాలు ఊరికనే సంప్రాప్తిం చవు గదా!

చూడు! కాశ్మీరంలో కుంకుమ పూపుండటం దేశాపేక్ష. పగలు కమలాలు వికసించటం రాత్రులు కలువలు విచ్చుకొనటం కాలాపేక్ష. పుణ్యమూర్తికి సుఖం, పాపికి దుఃఖం కల్గటం అదృష్టాపేక్ష. సమస్తం

స్వామి సంకల్పం అనటం ఈశ్వరాపేక్ష. ఈశ్వరుని ప్రేరణవల్లనే కర్మము సుఖదుఃఖాలను కల్పిస్తుంది. పరమేశ్వరుడు ఎవరిని రక్షింప దలచుకున్నాడో వారిచేత పుణ్యకర్మలు చేయింపగలడు. నాశన మొనర్ప దలచుకొన్న వారిచేత పాపకార్యాలు చేయిస్తాడు. అవిద్యతోకూడి రాగ ద్వేషాది క్లేశ పంచకం వలననే కర్మాతిశయం కలుగుతుంది. చేసిన కర్మల ఫలాన్ని ఈ లోకంలోను పరలోకంలోను అనుభవిస్తారు. కర్మకు మూలం క్లేశ పంచకం. అది ఎంతకాలం అనువర్తిస్తుందో అంతకాలానికి పరమే శ్వరుడు త్రివిధమైన పరిపాకాన్ని సమకూరుస్తాడు. వివిధ యోనులలో జన్మించటం, ఆయుస్సు, సుఖదుఃఖాది ఫలాలు అనుభవించటం త్రివిధ పరిపాక లక్షణాలు. జన్మకు కారణభూతమైన కర్మ చరితార్థం అయితే ఆయుస్సు, భోగములకు హేతువులయిన కర్మలకు తగిన భోగాలు భగవంతుడు కల్పిస్తుంటాడు. ఇంక చెప్పవలసిన దేముంది ? కాల కంఠుడే మనలను కాశినుండి పంపివేస్తున్నాడు. మనము లోబడితే శివాజ్ఞ లోబడుతుందా ? ఉదుము భయపడితే బడియపెట్టు భయపడు తుందా ?

కాశీ వైభవం మరెక్కడాలేదు. వక్షస్థలంపై నాగ యజ్ఞోపవీతం జమిలిగా తాల్చి, జటలు ముడిపెట్టి, వంకరగా చంద్రరేఖను అమర్చి, కస్తూరికి బదులుగా కంఠమూలాన కాలకూటం ఉంచి, మెరుపులు గొలిపే పులిచర్మం ధరించి వెంట పార్వతీదేవి వస్తుంటే నగరానికి ఐదు క్రోసులు మేరలో చచ్చిన వారికి మోక్షం ప్రసాదించటానికి ఈశ్వరుడు కాశీ పట్టణంలో విహరిస్తుంటాడు. ఇట్టి వారణాసిని వదలి పోవలసిన దుస్థితి ఏర్పడింది గదా. నేనెంత పాతకుడనో ! అని అనేక విధాల దుఃఖించి కలశసంభవుడు కొంతవడికి తేరుకొని సప్రణవంగా పాశుపత మంత్రాన్ని జపించుకొంటూ వింధ్యాద్రివైపు పయనం సాగించాడు.

అది కారడవి. క్రూరమృగాలతో నిండి భయం కొల్పుతున్నది. అడవిలో నడుస్తున్న మైత్రావరుణికి కాశీవిశేషాలు మనస్సునుండి తొలగిపోవటం లేదు. క్షణక్షణం జ్ఞప్తికి వస్తున్నాయి. కుబేరుడు వరుణుడు, కుంతి, విశాలాక్షీదేవి ఎల్లరు మనస్సులో మెదులుతుంటే ఆయనకు ఒడలు గగుర్పొడుస్తున్నది. మనో నేత్రంతో కాశీలోని పుణ్య ప్రదేశాలను ముక్తిదాయిని యైన మణికర్ణికా ఘట్టాన్ని చూస్తున్నారు. దీనితో అతని క్లేశం మరల ఎక్కువయింది. హృదయ సంక్షోభ నివృత్తికోసం కఠోపనిషత్తు, ముండకోపనిషత్తు, ప్రశ్న, తలవకార శ్వేతా శ్వతరోపనిషత్తులలోని మంత్రాలు పఠిస్తున్నారు. అరణ్యకముల భావాన్ని సంశోధిస్తున్నారు. అధర్వ మంత్రములను స్మరిస్తున్నారు. భగవద్గీతా సారం తలపోస్తున్నారు. ఎన్ని చేసినా అగస్త్యునికి మనశ్శాంతి లభించటం లేదు. భర్త దుఃఖంచూచి లోపాముద్ర మనస్సులో కుందుతున్నది. వేదవాఠరితులైన ఆ దంపతులు వింధ్య పర్వత ప్రాంతానికి చేరినారు. వారిరాకతో ఆ అరణ్యానికే శోభ కల్గింది. చూచేవారికి వారిద్దరు ఆది దంపతులవలె ఉన్నారు. వన దేవతలు లోపాముద్రనుచూచి ఏమి ఈ పతివ్రతాను తల్లి ప్రాభవం. లక్ష్మి సరస్వతి గిరికన్యకలకు పోటి వస్తున్నది. మహారాజ పుత్రియైన ఈమె ఐశ్వర్యాలు కోరుకొనక భర్త వెంట దుర్గమారణ్యాలకు వచ్చింది. కంటక ప్రాయమైన ఈ అడవిలో నడుస్తూ భావంలోగూడ విసువు పడటంలేదే। ఏమి యీ సాధ్వి పతి భక్తి అంటూ ఏటికోళ్ళ సమర్పించారు.

కాశీ దూరమవుతున్న కొద్దీ అగస్త్యుని ఆవేదన హెచ్చవుతున్నది. త్రోవలో అక్కడక్కడ ఆగి హరా। పురహరా। కాశీపుర విశ్వేశ్వరా। శంకరా ! దుష్టమదాసురేంద్రనాశంకరా ! నీలకంఠా! అని కేకలు వేస్తున్నారు. కాశీ వియోగబాధ అతనిని అడుగు ముందుకు వేయనివ్వటం లేదు.

ఉత్సాహం తగ్గింది. నైరాశ్య భావం నీరసాన్ని పెంచింది. అవయవాలు స్వాధీనం తప్పి మాగన్నుపైచి మూర్ఛిల్లినాడు. పతీ పరిచర్యతో మరల స్మృతి వస్తున్నది. ఇలా ఎన్ని మారులో ! తనలోతానే ఏమో పల్కాడు.

క్రిందటి జన్మలో ఎన్ని మహా పాపాలు చేసినానో ! కాశిలో ఉంటూ మోక్షలక్ష్మిని ఎల్లరు కొల్ల గొంటుంటే నేను దూరం వెళ్ళిపోవల సిన దురవస్థ ఎందుకు కలిగింది? రాజకుమారీ ! నన్ను పెండ్లాడిన నేరానికి నీకుకూడ వారణాసీ వియోగం ప్రాప్తించింది. ఇనుముతోకూడిన అగ్నికికూడ సమ్మెటపెట్లు తప్పవుగదా!

నా గర్వమే నన్నింత చేసింది. వాతాపిని ఎందుకు గర్భంలో జీర్ణించుకొన్నాను? ఇల్వలుడు చనిపోయేటట్లు ఎందుకు చేశాను? నహూ మని సర్పరూపునిగా స్వర్గం నుంచి ఎందుకు కూల్చాను? నా ప్రభావ ప్రదర్శనమే నన్నీ దుస్థితికి తీసుకొని వచ్చింది. మరల నా జీవితంలో ఎన్నటికయినా కైవల్య పదాన్ని కాశిని చూడగల్గుతానా ? జగదేకపావని గంగాభవానిని దర్శించే అదృష్టం కల్గుతుందా ? సర్వ లోకాధీశ్వరుడు విశ్వనాధుని సేవించే భాగ్యానికి నోచుకుంటానా ? ధుంఠి విఘ్నేశ్వరుడు దుర్గ, కాలభైరవుడు, గుహుడు మరల నా కన్నులను పావనం చేస్తారా ? మరే !

ఈవిధంగా పరిపరివిధాల కకావిక లవుతున్న మనస్సుతో అగస్త్యుడు వెంట లోపాముద్ర నడయనిస్తుంటే వింధ్య భూధర సమీపానికి వచ్చాడు సౌవర్ణ శిఖరీ మండితుడయిన వింధ్యుడు అల్లంత దూరంలోనే అగస్త్య దంపతులను చూచాడు. మహిమాభిధానుడు పరమేశ్వరు నంతటివాడయిన కుంభసంభవుని చూడగానే అతడి ఒడలు పులకరించింది. భక్తి పెల్లుబి

కింది. అవష్టంభాన్ని తగ్గించాడు. వినమ్రుడయినాడు. అగస్త్యునకు ఆతిథ్యం ఇవ్వటానికి ఎదురుగా వెళ్ళినాడు.

విహాయసపథంలో వింధ్యుడి అవరోధం తొలగింది. సూర్యుడి రథం ముందుకు సాగింది. వాయువు స్తంభనం వదలి యథావిధి సంచలింప సాగింది. బృహస్పతి, శుక్రుల, శనైశ్చర బుధాది గ్రహాలు తమతమ కక్ష్యలలో మరల పయనిస్తున్నారు. లోకంలో సాధారణస్థితి ప్రవర్తిల్లింది. మరల కాలగతి యథాతథంగా సాగింది.

వింధ్యుడు మనస్సులో కలశజుని ప్రాభవాన్ని భావించాడు. ఏమి ఈ మహామహుని తేజస్సు. ప్రణవసహిత పంచాక్షరీ మంత్ర మాహాత్మ్యం సమగ్రంగా తెలిసినవాడు. ఇంద్రపీఠం అధివసించిన నహుషుని శతాశ్వమేధ ఫలవిరాజితుని అధోలోకానికి త్రోసిన దిట్ట. త్రిగుణాతీతుడని ఫాలంమీది భస్మత్రిపుండ్రాంక రేఖలు తెల్పుతున్నవి. ఇతని శరీర స్పర్శచేతనే రుద్రాక్షమాలికకు పావిత్ర్యం సంభవించింది. అగ్ని దేవుని వెంటనుండు స్వాహాదేవివలె ప్రకాశిస్తున్న యీతల్లి లోపాముద్రా దేవి కాబోలు. వీరి దర్శనం చేతనే నా పాతకాలన్నీ నశించి పోగలవు సుమా! అనుకొంటూ ముందుకువచ్చి సాష్టాంగ నమస్కారం చేశాడు. కుంభసంభవుడు వింధ్యుని ఆదరంతో లేవనెత్తి కుశల ప్రశ్నలు వేశాడు. వింధ్యుడు ఆ దంపతులను శాస్త్రవిహితంగా పూజించి అతిధి సత్కారాలు చేశాడు. పరమ మాహేశ్వరా! మీరాకచేత పవిత్రుడ నయినాను. నా జన్మ తరించింది. ఏమియాజ్ఞ? నెరవేర్చటానికి సిద్ధంగా ఉన్నాను అన్నాడు.

అతని వినయానికి సంతోషించి అగస్త్యుడు వింధ్యాచలేంద్రా! దక్షిణ దేశమందలి తీర్థయాత్రలు చేసి పుణ్యక్షేత్రాలు దర్శించాలని కోరిక

కలిగింది. వయసు మళ్ళిన వాళ్ళము. నీ పాసువులను అధిరోహించ లేము. నీ స్వరూపాన్ని యింకా క్రిందికి దించు. మేము తీర్థయాత్రలు సేవించి తిరిగి వచ్చేవరకు అలాగే ఉండవలసిందని ఆజ్ఞాపించారు. దానికి వింధ్యుడు స్వామీ ! మహా ప్రసాదము. నీ యానతి కాదనువారు ముల్లో కాలలో లేరు. మీరు మరలి వచ్చే పర్యంతం శరీరాన్ని పెంచను. అని మాటయిచ్చి శరీరాన్ని మరీ కుంచించాడు. అగస్త్య దంపతులు అనాయసంగా వింధ్యనుదాటి దక్షిణదిక్కుగా పయనించారు. వింధ్యుడు కుంభసంభవుని రాకకై ప్రతీక్షిస్తూ ఉన్నారు. మునివేషధారి యెవరైనా ఆ ప్రక్కకు వస్తే అగస్త్యుడేనని చూస్తుంటాడు.

గర్వాంధకారాన కన్నుమిన్ను కానక పెరిగి పెరిగి చివరకు మొదటి స్థితినికూడ తగ్గించుకోవలసి వచ్చింది వింధ్యునికి. దుష్టులగతి యింతే. ఇతరుల వృద్ధికి ఓర్చుకోలేనివానికి సద్గతి ఎలా కలుగుతుంది? ఈర్ష్యాగ్నిచే దహింపబడతాడు. శుభాలు కలుగవు. ఇది లోకంలో సహజం. ఇలాంటి గాథలు వినికూడ లోకం అసూయాగ్రస్త మవుతుంటుంది.



# తృతీయాశ్వాసం

## అగస్త్యుని తీర్థయాత్ర

ఆకాశం నిర్మలంగా ఉంది. గ్రహాలన్నీ యథాతథంగా తమతమ కక్ష్యలలో పరిభ్రమిస్తున్నవి. దివాకరుని రథం అప్రతిహతంగా ముందుకు సాగుతున్నది. సప్తాశ్వాలు మహా వేగంగా ముందుకురుకుతున్నాయి. స్ఫటిక స్థలాలలో కనిపించే ప్రతిబింబాలు చూచి వేరు అశ్వాలనే భావనతో హేషలు చేస్తున్నవి. పద్మరాగాల కాంతి పెదజల్లినపుడు సంధ్యాసమయమని భ్రమిస్తున్నవి. మరకతమణి శిలల మధ్యలో దృశ్యాదృశ్యాలయి సారధిని తికమక పెట్టుతున్నవి. వైడూర్య కాంతులు గంటోట పిరినే భ్రాంతితో తలలు వంచుతున్నవి. కిన్నెర కన్యలనుచూచి కామపికారంతో లంఘిస్తున్నవి. ప్రకృతి అంతా చాల ఆహ్లాదకరంగా ఉంది.

భువనోపద్రవం నివారించిన అగస్త్యుడు దక్షిణదిశగా ప్రయాణం చేస్తూ, దక్షిణకాశియని ప్రసిద్ధి చెందిన దాక్షారామ సందర్శనంతోగాని కాశీ వియోగ వేదన నివృత్తి కాదని భావించాడు. పతీ సమేతుడై సప్త గోదావరీ పరీవాహ ప్రాంతాని కేతెంచాడు.

ప్రస్రవణ పర్వతాగ్రాలనుండి దుముకుతూ నాట్యం చేస్తున్నట్లుగా విలాసాన్ని ఒలకబోస్తున్న గోదావరీ ప్రవాహం మీదనుంచి చల్లని గాలులు వీస్తున్నాయి. అవి శరీరానికి సోకగానే కొంచెం హాయి అని పించింది అగస్త్యునికి. ప్రయాణశ్రమను ఆ వాయువులు కొంత పోగొట్టినాయి. కాని అంతర్గతంగా కాశీవియోగవిదాహోష్ణాధిక్యం ఆ సౌఖ్యాన్ని ఎంతోకాలం నిల్వనీయలేదు. హృదయ తాపం శీతల వాయువులను వడగాలులుగా మార్చింది.

ముని దంపతులు వస్తూ త్రోవలోని క్షేత్రాలను దర్శిస్తున్నారు. పట్టిసంచేరి అక్కడి వీరభద్రస్వామిని సేవించారు. సోమనాధునికి అర్చనలు చేశారు. అక్కడనుండి కదలి అనంతభోగేశ్వరస్వామిని, పార్వతిని సందర్శించారు. పద్మ పర్వతంపైనున్న రుద్రుని అభిషేకించారు. మార్కండేయ ప్రతిష్ఠిత మని ప్రసిద్ధిగాంచిన మహేశ్వర లింగమూర్తికి నతులొనర్చారు. అటనుండి కదలి కోటిపల్లికి వచ్చారు. ఆ తీర్థంలో స్నాన మొనర్చినారు. ఆ ప్రదేశానగల విటూపాశనామాంచితుడగు ఈశునికి కేల్మోడ్చినారు. కణకకౌంతేయాన వృద్ధగంగలో మునిగినారు. అనంతరం సప్త గోదావరిలో ఆ దంపతులు క్రుంకులిడి పవిత్ర శరీరు లయినారు. భీమేశ్వరస్వామిని దర్శించగానే వారికి ఎంతో ఆనందం కల్గింది.

ఆ క్షేత్రంలో ఉండినన్ని రోజులు లోపాముద్ర సూర్యోదయము నకు ముందే నిద్రలేచి భర్తృపాదములకు నమస్కరించి గోదావరిలో స్నాన మొనర్చి భక్తితో జ్యోతిర్లింగ రూపుడయిన భీమేశ్వరునకు అర్చ నలు చేసి సంతస పడేది.

అగస్త్యుడు చతుష్షష్టి కళల పారం తెలిసినవాడు. భీమేశ్వర స్వామి సన్నిధికి శని వారోత్సవ సమయంలో గంధర్వులు, అప్సరసలు వచ్చి నృత్యం చేస్తారు. వారికళా వైదగ్ధ్యం చూచి ఆ మునిదంపతులు ఎంతో ఆనందించారు.

కుంభసంభవుడు దక్షిణ ప్రాంతానికి వచ్చాడన్నవార్త తెలుసు కొన్నదేమో శరత్కాలం భీమనాధుని సేవించటానికి వచ్చింది. నాల్గు నెలలనుండి పాల సముద్రంలో ఉన్న శ్రీ మహావిష్ణువు మెల్లగా కన్నులు విచ్చి చూచాడు. తెరవగానే ప్రసరించిన తొలిచూపు కౌస్తుభమణి దీప్త

లకు వలిగినట్లయింది. ఒరలు విరుచుకొని ఆవులించినంతలో పరమాత్మ దర్శనం కొరకు వేచియున్న దేవతలు చిటికెలు వేశారు. సంవర్తుడు భృగుడు మొదలయినవారు స్వామి సుఖంగా నిద్రించారా యని ప్రశ్నించి ముకుళిత హస్తులయినారు. శంఖ చక్రాది ఆయుధాలు సచేతనాలయి జయజయ ధ్వానాలు చేశాయి. కలువ రేకులవలె మన్న ఆదిశేషుని కుబుసపు పొరలు శరీరమునకు అంటుకొని ప్రకాశిస్తున్నాయి. జగన్నాటక సూత్రధారి నిద్ర మేల్కాంచి కూర్చున్నాడు.

శరత్కాలంలో ఆకాశంలోని తెల్లని మబ్బులు ఎంతో అందంగా ఉన్నాయి. పాకానికి వచ్చి పగిలిన బూరుగుకాయల నుంచి విడివడి గాలికి అటూ ఇటూ పోతున్న దూదిపింజలవలె మబ్బుతునకలు ఆకసంలో విస్తరించి ముక్కలు ముక్కలుగా విడిపోయినాయి. వాటి మధ్యలో నుంచి ఇంద్రధనుపు భాగాలు కనిపిస్తున్నాయి. పదగంప్ల చప్పుడులు మద్దెల ధ్వనులవలె ఉండే మెరపుతీగె నాట్యం ప్రారంభించింది. రాత్రి అనే కాంత ధరించిన హారాలలోని ముత్యాలలాగా ఆకాశంలో చుక్కలు ప్రకాశించాయి. దాక్షారామంలో విహరించే అప్సరస స్త్రీల ముఖకాంతులో అన్నట్లు వెన్నెలలు విరాజిల్లినాయి. కలువలు పకపక నవ్వినాయి. దోస, కాసర మొదలయినవి విరగ కాచాయి. వంగ, గనగనలు యేపుమీరినాయి. దవనపు గుమాయింపుతో పరవశించిన వాయువు అటునిటు పరువెత్తుతున్నాడు. కలహంసల కేరింతల కోలాహలం ఎక్కువయింది. శీతకాలం రాకున్నా చలి అనిపిస్తున్నది. లోకమంతా ఆనందమయంగా ఉంది.

ఆ కార్తీక మాసంలో పాపాలు నశింప చేసే ఆలయం ముందున్న

చిచ్చరతోరణం క్రిందినుండి పతీవమేతుడై అగస్త్యుడు దూరినాడు. దాక్షారామం చేరినప్పటినుంచి అగస్త్యమునికి కాశిలో ఉన్నంత ఆహ్లాదంకలిగింది.

పరోపకారి అయినవాడికి సంపదలు మిక్కిలిగా కలుగుతాయి. తీర్థస్నానము, జపము, తపము, హోమము, దేవతార్చన ఏవీగూడ పరోప కారంతో సమానంగావు. ప్రపంచానికి ఇంతటిమేలు చేకూర్చిన కలశ జుడికి ఎల్ల ప్రయోజనాలు కలుగకుంటాయా! ఆ భార్యాభర్తలు తృప్తి తీరేటంత కాలం దాక్షారామంలోనే సుఖంగా వున్నారు.

తరువాత కొన్నాళ్ళకు ఇల్వలారికి చుట్టుపట్ల గల క్షేత్రాలు సందర్శించాలనే కోరిక గలిగింది. ముఖ్యంగా కొల్లాపురంలో వెలసిన శ్రీ మహాలక్ష్మిని చూడవలెనని ఆయన కోరిక. భార్యతో ప్రయాణంచేసి వీరభద్ర పర్వతం దగ్గరకు వచ్చారు. ఈ పర్వతం మిక్కిలి ప్రశస్తి చెందింది. దీని ప్రక్కనే తుల్యభాగా నది జనించింది. కొంద అడుగు భాగాన కల్లేటితో వృద్ధగంగ జనించి ప్రవహించింది. దీనికి ఉత్తర దిక్కున పాతాళమే ఉదరంగాగల సప్తగోదావరి పుట్టింది. లవణ సంద్ర ప్రేయసియైన కణ్వ యిక్కడనే జన్మించింది. మేరువు కీపర్వతం తోబుట్టువు, ఇదే పంచలింగ క్షేత్రం. వీరభద్ర శైలం చేరిన అగస్త్యుడు భార్యతో ఇలా అన్నాడు. కువలయాక్షీ! వీరభద్రుడు యజ్ఞాన్ని ధ్వంసం చేసి దేవతల నందరిని తరిమికొట్టి, అందినవారిని నరికివైచి గౌతమీ ప్రవాహంలో అర్ఘాన్ని కడిగాడు. పద్మ పర్వతం వీరభద్ర శిఖరి ఆంధ్ర భూరమణికి కుచద్వయం వంటివి సుమా! గౌతమీ ప్రవాహం మెడలోని ముత్యాలమాల వంటిది. ఈ పర్వతంమీదనే వీరభద్రుడు భద్ర కాళితోకూడి ఉంటాడు. ఇక్కడ అడుగు పెట్టగానే వీరభద్రుడి విక్రమం జ్ఞప్తికి వస్తుంది. ఏమి ఆ విజృంభణం. ఎడమ

చేతి గోటితో సరస్వతి ముక్కు గిల్లి వేశాడు. సూర్యుడి పళ్ళు రాలదన్ని వాటిని మొలనూలికి గ్రుచ్చి ధరించాడు. కాలి బొటనవ్రేలితో చంద్రుని పొట్ట చీల్చాడు. అగ్ని ఏడు నాలుకలు అంటబట్టి కత్తితో కోసివేశాడు. ముప్పదిమూడు కోట్ల దేవతలు కుయ్యో మొర్రో అని కేకలు పెడుతూ పరుగెత్తుతుంటే తరిమి తరిమి మోదినాడు. ఆ మహాత్ముడు వసించిన ఈ కొండ గోదావరీ నదీహారానికి నాయక రత్నం వంటిది.

# అగస్త్యుడు కొల్లాపురి సందర్శించుట

ఇలా పురాణగాథలు, క్షేత్రముల మాహాత్మ్యములు భార్యకు వివరించేవాడు అగస్త్యుడు. కొలది రోజులకు వారు క్షీరారామం (పాలకొల్లు) చేరుకున్నారు. అక్కడ ఉన్న స్వామిని వారు ఆరాధించి మెల్లగా బయలుదేరి సహ్యగిరి కన్యకా ప్రవాహంలో స్నానంచేసి పశ్చిమంగా పయనించారు. పడమటి సముద్రతీరాన ఉన్న సౌరాష్ట్రంలోని సోమనాథేశ్వరుని శిరస్సుపైనున్న చంద్రరేఖా కాంతులతో విరాజిల్లుతున్న కొల్లాపురానికి చేరుకున్నారు. పదునెన్మిది యోగపీఠాలలో ఇది మిక్కిలి ప్రసిద్ధిచెందినది.

ఇక్కడి దేవి శ్రీ మహాలక్ష్మి. ఆ దేవి యిక్కడ వసించటానికి ఒక పురాణ కథ చెప్పుకొంటారు. శ్వేతవరాహకల్పంలో శ్రీ మహావిష్ణువు సూకరరూపం ధరించాడు. తన కోరలపైన భూమిని నిల్పి ఉద్ధరించాడు. భూదేవి ఆయనను కాంక్షించింది. ఆమె కోరిక తీర్చటానికి వెన్నుడు ఆమెను భార్యగా స్వీకరించాడు. దానితో మహాలక్ష్మికి ఆగ్రహం కల్గింది. వైకుంఠాన్ని వదలి కొల్లాపురానికివచ్చి నెలసిందట.

భద్రకాళీ రూపం ధరించి భయంకర శరకుఠారాలతో కోలరూపుడైన దైత్యునిసంహరించిన జగజ్జనని ఆమె. ఆ తల్లిని చూడగనే ఆ

దంపతులకు పులకాంకురాలు కలిగినాయి. హ్నేల్లేఖ మంత్రోపనిషత్తు అనే తీవెకు పూవువంటిదగు ఆ లోకేశ్వరిని దంపతులు భక్తితో స్తోత్రం చేశారు.

పాలసంద్రపు గారాలపట్టీ ! కమలా ! కమలనేత్రీ ! నిఖిల లోకేశ్వరీ ! నాల్గువేదాలు నిన్ను నుతిస్తున్నాయి. కరుణాయుత దరహాస విరాజితా ! సర్వదేవతావందిత శ్రీ పాదపద్మ పీఠోపకంఠవిలసితా ! అనాదిశక్తివి. లోకమాతవు. ఇందిరా ! హరిమనోమందిరా ! ఆశ్రిత కల్పవల్లీ ! నీకు నమస్సులు. నిన్ను సేవించే సమస్తభూతములు జీవిస్తున్నాయి. చంద్రునిలోని చంద్రికవు నీవే ! దినకరునియందు కాంతిపుంజం నీవే ! అగ్నియందలి దహనశక్తివి నీవే ! నీ ప్రభావం చేతనే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు సృష్టిస్థితిలయ కారకులుగ ఉన్నారు. నీకృపలేశం ఉంటేచాలు. వాడే పండితుడు. వాడే ప్రాభవం కల వాడు. వాడే మేధావంతుడని కీర్తింపబడతాడు. నీ దయాదృష్టి సోకిన వాడే శూరు డవుతాడు. కులీను డవుతాడు. కళారహస్యవేది యౌతాడు. మహాదాత, ధన్యుడని లోకంచేత కీర్తింపబడగలడు. పురుషుల యందుండే భాగ్యం, స్త్రీల యందలి విలాసరేఖ నీవేసుమా ! పశువులు పక్షులు పాములు కీటకాలయందు నీ అంశద్యోతక మవుతు ది.

మహాదేవీ! నీవెవ్వరిని అభిమానిస్తావో వాడిని స్త్రీలు మన్మథునిగా చూస్తారు. ప్రజలు రాజుగా గౌరవిస్తారు. ఆశ్రితులు కల్పవృక్షంగా పొగడుతారు. శత్రువులు అర్జునుడుగా ఎంచి భీతిచెందుతారు. కవులు కర్ణుడుగా వర్ణిస్తారు. ఆదిగర్భేశ్వరీ! నీవున్నచోటు నరసము, నీవులేని చోటు నీరసం. ఇన్ని యెందుకు తల్లీ! నీవుకలవాడే కలవాడు. నీవులేని వాడు లేనివాడే !

పరతత్వ విచారణ చేయబూనితిమా! శక్తివంతుడయిన ఈశ్వరునకు శక్తికి నీకు భేదంలేదు. కనుక ఈశ్వరునికి గల సృష్టిస్థితి, సంహారములు తిరోభావ, అనుగ్రహ రూపములయిన అయిదు కృత్యములు నీవొనర్చునవే. అగ్నికి దహనశక్తి, సూర్యునకు కాంతి ఈశ్వరునికి నీవు సహజశాశ్వతశక్తులు. జన్మజన్మాంతరాలలో విహితమైన వ్రతాలు దానాలు చేసి సంచితాన్ని పోగొట్టుకొని రజోగుణం తమోగుణం నశింపగా శుద్ధ సత్వగుణ విరాజితులయినవారు నీ స్వరూపాన్ని తత్వాన్ని విచారణచేస్తారు. ఇహపర సౌఖ్యములనొసగే ఫలితాన్ని భూతములకు ఇచ్చేటప్పుడు పరమేశ్వరుడు నిన్ను ముందిడుకొని గాని ఈ జాలడు.

శబ్దబ్రహ్మం తానేకారణబిందువై, ఆ బిందువు ప్రవిస్తూండటం వల్లనూ, పురుష ప్రయత్నంచేతనూ, మూలాధారంలోని వాయువు వహించటంచేత అభివ్యక్తిపొంది పరావాక్కు అనేపేరు పొందింది. ఆ బ్రహ్మమే నాభివరకుసాగి, విమర్శనాత్మకమైన మనస్సుతోకూడి సామాన్య బిందుతత్వంతానై ఈశ్వరుడు అధిదేవతగా చెప్పబడి పశ్యంతీవాక్కు అని పిలువబడింది. ఆ బ్రహ్మమే వాయువుచేతనే హృదయంవరకు వెళ్ళి నిశ్చయాత్మక బుద్ధితోకూడి విశేష స్పందరూపందాల్చి నాదబిందుమయమైన మూర్తితో హిరణ్యగర్భుడు అధిదైవతంగా గల మధ్యమవాక్కుగా ప్రసిద్ధి చెందింది. ఆ శబ్దబ్రహ్మమే వాయువుచేత కంఠము, నోరువరకు సాగి ఆయాస్థానాలలో అభివ్యంజనం పొందుతూ అకారాది వర్ణమాలరూపమై చెవులకు వినబడుతూ వైఖరీవాక్కు అని పేరుచెందింది. ఈ నాలుగు విధములయిన సూక్ష్మమాతృకల స్వరూపమువైన మహాలక్ష్మి! నీకు ప్రణతులు అంటూ నిశ్చలమైన శక్తితో అగస్త్యుడు స్తోత్రంచేశాడు.

అగస్త్యుని స్తోత్రానికి మిక్కిలిగా సంతసించిన మహాలక్ష్మి ప్రత్య

ఉమై అతనితో కుమారా! నీవుకోరిన వరమునిస్తాను కోరుకో - మరొక్క విశేషం వెల్లడిస్తాను విను.

రాబోయే ఇరవైతొమ్మిదవ ద్వాపరయుగంలో నీవు వ్యాసుడివై జన్మిస్తావు. వారణాసీపురంలో వేదపురాణ సంహితలు ధర్మశాస్త్రాలు చెప్ప గలవు. నీకొక హితోపదేశంచేస్తాను. తుంగభద్రానది ఒడ్డున కిష్కింధా చల ప్రాంతంలో స్వామిమల అనే పర్వతం వనంఉన్నాయి. అక్కడ కుమారస్వామి వెలసిఉన్నాడు. నీవుఅక్కడికిపోయి ఆతనివలన వారణాసీ మాహాత్మ్యం విను.

ఈవిధంగా చెప్పి ఆ కమలాలయ లోపాముద్రను వాత్సల్యంతో పల్కరించి ఆమెకు కడియములు, హారాలు ముద్రిక మొదలయిన ఎన్నో బంగారు ఆభరణాలు కానుకగాఇచ్చింది. లోపాముద్ర అగస్త్యుడు ఆ జగజ్జనని దయాసాంద్రతకు సంతోషించారు. తిరిగి నమస్కారములు సమర్పించి ఆతల్లి యనుమతితో అప్పుడే సామిమలకు పయనమైనారు.

## అగస్త్యుడు శ్రీశైలమును కేతెంచుట

అగస్త్య దంపతులు స్వామిమల వైభవాన్ని ఊహించుకొంటూ పోతున్నారు. త్రోవలో ఒక భయంకరమైన అరణ్యంలోకి ప్రవేశించారు. అది చీమలు దూరటానికికూడ సందులేనంత దట్టంగా వృక్షాలు లతలతో నిండిఉంది. ఒకవైపున సింహాల గర్జనలు, మృగేంద్రుని గోళ్ళచే వ్రచ్చిన కుంభస్థలములతో ఏనుగులు చేస్తున్న ఘీంకారాలు, వేటకై బయల్వెడలి తెరచిన వదన గహ్వరాలతో ప్రతిధ్వనులు వచ్చేటట్లు అరుస్తున్న వ్యాఘ్రాలు, పులుల వాతబడిన మృగముల మరణకాల ఆర్తారవములు, నానావిధ పక్షి సంతానాల ధ్వనులతో నిండిన ఆ వనంలో ఒంటరిగా ప్రయాణించటానికి ఎవ్వరూ సాహసించరు. ఆ అరణ్యం ప్రక్కనే

భ్రమరాంబా సహితుడైన మల్లికార్జునస్వామితో ఒప్పారుతూ శ్రీశైలం ఉన్నది.

ముని దంపతులు అరణ్యం దాటిరాగానే చల్లనిగాలి వీచెంచింది. పాతాళగంగా ప్రవాహం మీదిమంచి రావటంతో మంచుతుంపరలు సోకి వట్టుంది. పరమేశ్వరుని జటాజూటంమీది కుసుమవరాగ సుగంధ వాసనలు గుబాళిస్తున్నాయి. ఆ గాలి ఎంతో పవిత్రమైనదని అంటారు పెద్దలు. విఘ్నేశ్వరుని జందెములుగానున్న సర్పములచేత పీతపరిముక్తమైనది గదా మరి !

బ్రహ్మ తేజస్సుతో ప్రసన్న వదనంతో ఆ దారివెంట వెళుతున్న అగస్త్యునిమూచి ఆటవిక స్త్రీపురుషులు రెప్పవేయకుండా చూస్తున్నారు. పార్వతీ పరమేశ్వరులే వస్తున్నారనుకొని కొందరు దూరంనుంచే నమస్కరిస్తున్నారు.

శ్రీశైలంచేరిన ఆ దంపతులు అఘమర్షణ సూక్తాలు చదువుతూ స్నానంచేశారు. హాటకేశ్వరుని వివిధ పుష్పాలతో అర్చించారు. వైకుంఠ బిలంలో నెలకొన్న గణాసమని పూజించారు. ఏకాంత రామేశ్వరుని ధర్శించారు. అనంతరం భ్రమరాంబా మల్లికార్జునులను షోడశోపచార పూజలతో అలరించారు. అక్కడ గల సహస్రబిలములోని అమృత లింగమూర్తులను అభిషేకించారు. మండూకకుండంలో స్నానాలుచేశారు. పంచధారాది సమస్త తీర్థాలలో అవగాహనంచేసి సంతృప్తిపడినారు. వీరభద్రుని సేవించారు. ఘంటాపథేశ్వరుని అర్చించి మంత్రసిద్ధి పొందినారు. ఇష్టకామేశ్వరుని సంతుష్టి పరచినారు. అక్కడ వెలసిన సమస్త దేవతామూర్తులను భక్తిశ్రద్ధలతో పూజించి ధన్యులయినారు.

# కుంభజుడు శ్రీపర్వత మాహాత్మ్యం వివరించుట

పిమ్మట ఆ దంపతులు ఒక విజనప్రదేశంలో కూర్చున్నారు. మైత్రావరుణి భార్యకు శ్రీపర్వతంమహిమ వివరించాలనుకొన్నాడు. కమల నయనా! ఇదే శ్రీపర్వతం. పరమేశ్వరుడు మల్లికార్జునస్వామి పేరుతో ఇక్కడ ఎల్లప్పుడు అధివసించియుంటాడు. ఈ శ్రీశైలం మహిమను వర్ణించటానికి బ్రహ్మకుకూడ తరంగాదు. ఇచ్చటి గండశిలలన్నీ పరమేశ్వరుని రూపాలే. సిద్ధులయిన మునీశ్వరులిక్కడ చెంచులరూపంతో తిరుగుతుంటారు. చచ్చిన అనంతరంగాని కాశీ ముక్తినియ్యదు. శ్రీపర్వతం అలాకాదు. శిఖరదర్శనమాత్రం చేతనే మోక్షంఇస్తుంది అన్నాడు. ఆ మాటలు విన్న లోపాముద్ర అప్రయత్నంగానే చేతులు ముకుళించి పర్వత శిఖరానికి నమస్కరించింది. కాని ఆమెముఖంలో ఏదో సందేహాన్ని అడుగ దలచినట్లు కనబడుతున్నది. ఏమోఅడగబోయి మరల ఊరుకుంది. కలశజుడిది గమనించాడు. అతి రహస్యమైన విషయమేదో ఆమె ప్రశ్నించాలను కున్నదని గ్రహించాడు. ఆమెతో, దేవీ! నీ వదనంచూస్తే ఏదోసందేహం నివృత్తిచేసుకొనదలచినట్లు కనబడుతున్నది. మాటలేరానిదానివలె కూర్చున్నావేమిటి? ఏకాంతసమయంలోగూడ అరమరలు లేకుండా భర్తతో మాట్లాడటానికి సంకోచిస్తే ఎలా? పరాయి వారెవ్వరున్నారని ఇంత సిగ్గు పడుతున్నావు. అనగానే లోపాముద్ర మౌనముద్రవీడి భర్తతో ఇలా అన్నది.

స్వామీ! ఎనుబదినాలుగు యోజనాల పొడవు ముప్పది యోజనాల వెడల్పుగలిగి ఎనుబదిఎనిమిదివేలమంది మునీశ్వరులకు నివాసస్థలమయి, ముక్కోటి తీర్థసంవాసులచే దర్శింపబడుతూ, మహామహిమకలిగిన శ్రీ

పర్వతం శిఖరదర్శన మాత్రం చేతనే మోక్షాన్ని ప్రసాదిస్తున్నది గదా। దీనిని వదలి కొందరు చచ్చిన తర్వాతగాని, మోక్షాన్నియ్యని కాశికి ఎందుకు వెళ్ళవలెనని సంకల్పిస్తారు?

అదీగాక కొందరు విజ్ఞానాన్ని ప్రసాదిస్తారు. కొంతమంది విజ్ఞాన సముచితములైన కర్మలను అపేక్షిస్తారు. కొందరు దానములు చేయటమే ఉత్తమం అని పల్కుతారు. కొందరు తపస్సు శ్రేష్ఠమంటారు. కొందరు బ్రహ్మచర్యాన్ని మతిస్తారు. కొందరు గృహస్థజీవితాన్ని అభినందిస్తారు. మరికొంతమంది వానప్రస్థం మంచిదంటారు. సన్యాసమే అన్నిటికంటె ఉత్కృష్టమని కొందరు వాదిస్తారు. కొందరు స్వాధ్యాయనం మేలుకలిగిస్తుందంటుంటే మరికొంతమంది పుణ్యక్షేత్రదర్శనం పుణ్యప్రదం అని వివరిస్తారు. ఇన్నింటిలో మేత్తరమైనదేది? ముక్తిని ప్రసాదించేదేది? ఇవన్నీ ముక్తికి సాధనాలేనా? అనే సంశయానికి అగస్త్యుడు మనస్సులోనే నవ్వుకొన్నాడు. రాజకుమారీ! అడుగవలసినదానినే అడిగావు. నిజానికి ఇది ఎల్లరకువిడదీయరాని చిక్కుసమస్యగా మనస్సులలోనే ఉంది. శ్రద్ధగావిను.

శ్రీశైలం మొదలయిన క్షేత్రాలుముక్తికి కారణాలని విమతింపబడుతున్నాయి. నిజంగా వాటికంతటి శక్తిఉన్నమాట యథార్థమే. కైవల్యలక్ష్మి కాశి ప్రసాదిస్తుందన్నదాంట్లో విప్రతిపత్తిలేదు. ప్రయాగ, నైమిశం, కురుక్షేత్రం, అవంతి, అయోధ్య, మధుర, ద్వారక, సరస్వతీనది, సహ్యపర్వతం, గంగాసాగరసంగమం, కాంచి, త్ర్యంబకాచలం, సప్తగోదావరి, కాలంజరం, ప్రభాసం, బదరికాశ్రమం, మహాలయం, ఓంకారం, పురుషోత్తమం, గోకర్ణం, భృగుతీర్థం, పుష్కరం శ్రీశైలం-ఇవి మోక్షకారణములైన తీర్థాలు, క్షేత్రాలు.

పరమేశ్వరుని కరుణలేకుంటే తీర్థయాత్రకు పోవలెననే మనస్సే

కల్గదు. తీర్థయాత్రలకేగకుంటే పాపంనశించదు. పాపరాహిత్యం కాకపోతే కాశీకి వెళ్ళవలెననే భావంకల్గదు. వారణాసిలోనివసించవిదే విజ్ఞానంకల్గదు. జ్ఞానం లభించకపోతే మోక్షంసిద్ధించదు. ఆధ్యాత్మికమైన జ్ఞానమే సుజ్ఞానం అంటారు. అదిలేకుంటే అజ్ఞానం ఆవరిస్తుంది. ధారాతీర్థమని పేరుగల దొకటుంది. ఆ ఖడ్గధారలలో మృతిచెందినవారు ముక్తి వైభవం పొందగల్గుతారు. ఇవన్నీ బాహ్యతీర్థాలు. అంతరతీర్థాలు వీటికంటె శ్రేష్ఠమైనవి. మానవుడు అంతరతీర్థాలను వదలి బాహ్యతీర్థాలకు పరువెత్తినా నిష్ఫలమే అవుతుంది.

తీర్థాలంటె ఎక్కడోలేవు. సత్యం, ఇంద్రియనిగ్రహం, అనసూయత, దానం, సంతోషం, దయ, బ్రహ్మచర్యం, ధైర్యం, యశం, సమత, పుణ్యం ఇవన్నీ మనస్సులోని తీర్థాలు.

చేపలు, పీతలు, మొసళ్ళు, తాబేళ్ళు మొదలయిన నీటిజంతువులు బాహ్యతీర్థాలలోఉన్న మాత్రంచేత వీటికి తీర్థయాత్రాఫలం లభిస్తుందా? అంతరతీర్థాలను తిరస్కరించి బాహ్యతీర్థాలకు ప్రాకులాడితే ఏ ప్రయోజనం ఉండదు సుమా। అంతశ్శుద్ధిలేనిదే ఏఫలంసిద్ధించదు. కల్లుకుండను బయట వేయిసార్లు కడిగినా శుద్ధియౌతుందా?

మానసతీర్థం రాగద్వేషములాన్ని పోగొట్టుతుంది. ధూళి, బురద మొదలయినవాటిని కడిగి శుద్ధిచేస్తాయి బాహ్యతీర్థాలు.

దర్శనమాత్రంచేత మానవికబంధాలు తొలగించి, మనస్సుకు స్వస్థత చేకూర్చి, కల్మషరహితమై దుర్గంధంలేని నీటిలోఉండే, పుణ్యక్షేత్రంగాని పుణ్యప్రదమైన పర్వతంగాని, పవిత్రమైన నదీధారగాని కలిగియుండేవాలు. ప్రశాంతియమాధుర్య గలిగి సమ్మనిశ్రేష్ఠులసాంగత్యం కలిగినవి తీర్థాలుగాని తక్కినవి తీర్థాలుకావు.

లోపాముద్రా, తీర్థాంగాలు వివరిస్తాము విను. దానం పుచ్చుకోకుండా ఉండటం, కోపం వదలివేయటం, అహంకారం లేకుండా ఉండటం, విధులపట్ల సోమరితనం లేకపోవటం, సత్యంచెప్పటం, మనస్సును అదుపులో ఉంచుకొనటం, ధర్మంపట్ల శ్రద్ధకలిగిఉండటం, హోమనిష్ఠ, క్షేత్రోపవాసం, పితృతర్పణం, పితృశ్రాద్ధం, పిండప్రదానం, బ్రాహ్మణభోజనం, శకో మండనం తీర్థాంగాలు. ఇవి సంపూర్ణంగా ఫలాన్ని ఈయగలుగుతాయి. ఇక తీర్థాలతారతమ్యం వివరిస్తాను. శ్రీపర్వతంపైనున్న శిఖరేశ్వరశిఖరాన్ని చూస్తేనే ముక్తిగల్గుతుంది. శ్రీశైలంకంటె కేదారేశ్వరం త్వరితంగా ముక్తినీయటానికి సమర్థవంతం. దానికన్న వేగంగా ప్రయాగమోక్షాన్నిస్తుంది. ప్రయాగకంటె వేగంగా కాశిముక్తినిస్తుంది. సమస్తతీర్థాలు అనందపద ప్రాప్తిని కలిగించేవే. కాశినివిడచి ఎన్ని తీర్థాలలో మునిగినా మోక్షం లభ్యంకాదు. ఈ విషయాన్ని తేటపరిచే పురాణకథను చెబుతాను. సావ ధానంగా విను. అంటూ కుంభసంభవుడు ఎంతో ఉత్సాహంగా భార్య సంశ యాలు వివరిస్తున్నాడు.

## శివశర్మోపాఖ్యానం

మధురా పట్టణంలో శివశర్మ అనే బ్రాహ్మణుడున్నాడు. అతడు నాల్గువేదాలు అధ్యయనం చేశాడు. సర్వశాస్త్ర పారంగతుడు. పురాణము లను అవగాహన చేసుకొన్నాడు. తర్కం మీమాంస మొదలయిన శాస్త్రా లలో దిట్ట. ధనుర్వేదం, ఆయుర్వేదం, నాట్యవేదం అర్థశాస్త్రం కూడ ముట్టనేర్చాడు. మంత్రశాస్త్రాలు కూలంకషంగా తెలిసిన [illegible]డు. శివశర్మ విద్యాభ్యాసం పూర్తయిం తర్వాత ఒక గు[illegible] కొన్నాడు. ఆమె యందు సంతానం పొంది పిత్రు[illegible]ంచి విముక్తి



తయినాడు. కొన్నాళ్ళకు ముదిమి సంప్రాప్తించింది. జమల కందరికి అది సహజమే గదా ! వృద్ధు డౌతున్నకొద్దీ అతని మనస్సు కల్లోలపడ సాగింది. ఇలా వితర్కించుకొన్నాడు.

శాస్త్రాధ్యయనానికి, ధనం సంపాదించటానికి, గార్హస్థ్య సుఖాలు అనుభవించటానికి సంతాన లబ్ధికి కాలంగడిచిపోయింది. కాని పరమాత్మను గూర్చి ఒక నిముషమైనా వెచ్చింపకపోతిని. విశ్వేశ్వరుని అర్చింపలేక పోయాను. గోపికావల్లభుని సేవింపలేదు. ఏయితరవేల్పును స్మరింప లేకపోయాను. చివరకు కర్మసాక్షి అయిన సూర్యునకు నమస్కారం అయినా చేయకపోతిని. హవ్యవాహనుని అర్చించి హోమవిధి నెరవేర్ప లేకపోయాను. పోపీదాన ధర్మాలుచేసితినా అదిగూడ లేదే ! ఒక సత్రం అయినా నిర్మించలేదే ! శ్రీసూక్తంగాని పురుషసూక్తంగాని పఠింపలేక పోతిని. పంచాక్షరీ మంత్రమైన జపింపకపోతిని.

ఈ ఐశ్వర్యం మేడలు, మిద్దెలు, బంగారం మరణ సమయాన నా వెంటవస్తాయా ! వెంటవచ్చే ఒక్క పుణ్యకార్యమైనా చేయలేకపోయాను గదా ! ఈ దేహం అస్థిరమైనది. శరీర అవయవాలు స్వాధీనం తప్పక ముందే, దృష్టి చెడకముందే, చెవుడు మొదలయిన లక్షణాలు కల్గకముందే శరీరం శిథిలావస్థకు చేరకమునుపే తీర్థయాత్రలు చేయాలి. పుణ్యతీర్థా లలో స్నానంచేయాలి. విచారంలేని వాడనై కాలమంతా వృథాపుచ్చాను. పరలోక పాథేయాన్ని గురించి ఇప్పుడైనా ప్రయత్నం చేయాలి అని ఆలోచించాడు. కావలసిన ధనం తీసుకొని తీర్థయాత్రలకు వెళ్ళాడు. కొంతదూరం ప్రయాణంచేసి అలసట పోవటానికి ఒక వటవృక్షం క్రింద విశ్రమించాడు. అతని మనస్సులో ఎన్నో ఆలోచనలు తరంగాలవలె పొంగినాయి. ఆయుష్షు క్షణక్షణం తరిగిపోతుంది. యౌవనం యుక్తి

వేగంతో సమానమైంది. మృత్యువు ఏ సమయాన నైనా కబళింపవచ్చు. అన్ని తీర్థాలు సేవించి వచ్చేవరకు రావురాదని నియమమం ఎక్కడయినా ఉందా? కనుక ముందు అతి ముఖ్యమైనవి మిక్కిలి పుణ్యప్రదమైన క్షేత్రాలు చూసివస్తాను. ఉజ్జయిని, కాశి, మాయ, అయోధ్య, కాంచి, మధుర, ద్వారక ఈ యేడు కైవల్యం లభింపచేసే పట్టణాలు అని పెద్ద లంటారు గదా! అని ఆలోచించి మొట్టమొదటగా అయోధ్యకు వెళ్ళా లనుకొన్నాడు. వెళ్ళాడు.

శివశర్మ సరయూనదిలో స్నానంచేసి అయోధ్యను దర్శించాడు. అక్కడనుంచి ప్రయాగ దర్శించాడు. అక్కడ మూడునదులు కలిసి ప్రవహిస్తున్నాయి. ఎర్రని నీటితో గంగ, నల్లని నీటితో యమున, ప్రవహిస్తుంటే అంతర్వాహినిగా సరస్వతీ నది ప్రవహిస్తుంటుంది. ఎంతో పుణ్యప్రదమైన ఆ త్రివేణీ సంగమంలో స్నానంచేశాడు.

ప్రయాగ ఎంతటి పుణ్యక్షేత్రం. మకరసంక్రమణ పుణ్యకాలంలో వైకుంఠంనుంచి లక్ష్మీసమేతుడై నారాయణుడువచ్చి తీర్థమాడేప్రదేశం అది. కాశీపట్టణం పరమేశ్వరుడుగౌరితో కూడి ఇక్కడ స్నానంచేస్తాడు. గోలోకంనుంచి గోమాతృకలు, దిక్కులనుంచి దిక్పాలురు, యక్షులు, కిన్నరులు కింపురుషాది దేవగణాలు ఆ సమయంలో ప్రయాగలో తీర్థమాడి పవిత్రులమయినామని సంతోషిస్తారు.

ప్రయాగ ప్రజాపతిక్షేత్రం. అన్నియాగాలకంటె ప్రకృష్టమైనది కావటంచేత దానికాపేరుకల్గింది. అంతపవిత్రమైనది కావటంచేత శివశర్మ మకరసంక్రమణ కాలంలో ప్రయాగలో స్నానంచేశాడు. కృతార్థుడయినట్లు భావించాడు. అనంతరం తిరిగి కాశీకేగినాడు. కాశిలో కొన్నాళ్ళుండి మరల ప్రయాగకు, అటకొంతకాలంఉండి కాశికి వచ్చేవాడు.

శివశర్మకు కాశీయందలి మణికర్ణికయన్న ఎంతోభక్తి. ఇక్కడ జీవులు మరణించే సమయంలో శివుడు వారిచెవికదచేరి తారకమంత్రోప దేశంచేసి మోక్షంప్రసాదిస్తాడు కనుకనే ఇది మణికర్ణిక అనిపిలువబడింది. ఆతీర్థంలో చచ్చినకీటకాలు, జంతువులు, పక్షులు నీటిలోమునుంచగానే అక్కాశ్చర్యకరంగా పరమశివుని ఆకారంధరిస్తాయి. కాశీలో చనిపోయ్యే దోమకుసైతం శివుడు ఓంకారమంత్రం ఉపదేశిస్తుంటే దేవతలు తమ జీవి తాలు వృధాయైనవని సిగ్గుపడతారు.

పాపమా శివశర్మ శాస్త్రఅధ్యయనం చేసినవాడుకావటంవల్ల మనస్సు స్థిరంగా ఉంచుకొనలేక మరొకక్షేత్రానికి పోయిరావాలని సంకల్పించాడు. శాస్త్రములో ఆయాక్షేత్రాలను గురించి విశేషంగా వ్రాయబడి ఉందిగదా! •

మనస్సున స్థిరత్వంలేని ఆ విప్రుడు కాశిని వీడి మరోక్షేత్రానికి వెళ్ళుతున్నాడు. ఆనందకానన ప్రభావం తెలియదా? దేవలోక నివాస స్థితి గంగానది కల్గిస్తుందని ఎరుగడా? మణికర్ణికా మాహాత్మ్యం తెలి

---

• ఇక్కడ సందేహం కలుగుతుంటుంది. ఆయాక్షేత్రాల చరిత్ర మాహాత్మ్యం వర్ణించేటప్పుడు ఆక్షేత్రమే మోక్షాన్ని ప్రసాదిస్తుంది అని చెప్పబడిఉంటుంది. అలాగే వ్రతాలనుగురించి చెప్పేటప్పుడు ఆ వ్రతమే ఉత్తమమైనదని వ్రాయబడి ఉంటుంది ఇంతకూ ఏక్షేత్రంగొప్పది? ఏ వ్రతం ఉత్తమమైనదని సందేహాలు కలుగుతాయి. అన్నీ పుణ్యప్రదాలే. ఇందొకటి అధికం మరొకటి న్యూనంలేదు. కనుక కావలసినది శ్రద్ధాభక్తులు 'బహుధావి ప్రతిపత్తి భీ విషయముల్ పాటైన శాస్త్రార్థముల్' అని శ్రీనాధుడే శివశర్మ కథలో అంటాడు. స్థిరంగా ఒకదానిని సేవించటమే మానవుడు చెయ్య వలసినది. అందరికీ అందుబాటులో ఉంచటానికి అన్నితీర్థాల మాహాత్మ్యాలు వివరించబడ్డాయి.

యదా ? పురాణ ఇతిహాసాలలో కాశీ గొప్పతనం వినలేదా ? నీరు ఎత్తున నిల్వలేక పల్లానికి ప్రవహించినట్లు శాస్త్రములలోని అర్థరహస్యము నెరుగని శివశర్మ వారణాసిని వదలి ఉజ్జయిని చేరినాడు.

ఉజ్జయిని మహిమాన్వితమయిన పట్టణాలలో ఒకటి. అవీటి ఉద్యానవనంలో నీలకంఠుడు నివసించి యుంటాడు. పురంనిండా ఎక్కడ చూచినా కోట్ల సంఖ్యలో శివలింగా లుంటాయి. కల్పాంత సమయంలో లోకాలను ముంచివేసే సముద్రజలం ఈ పురాన్ని తాకదు. ఇచ్చటి స్వామిపేరు మహాకాళుడు.

శివశర్మ అచ్చటికి వెళ్ళి హాటకేశ్వరుని దర్శించి హఠయోగంతో కొన్ని దినాలు నివసించాడు. ఆ పట్టణంలో ఎదమచేపి భూమిపైనుంచి చనిపోయిన జంతు కళేబరాలు ఎన్నాళ్ళకైనా దుర్గంధంకొట్టవు. వాడిపోవు. శిపీనం శరీరం రంగుకూడా మారదు. ఇది ఎంత ఆశ్చర్యకరమైన విషయం. ఇచ్చటి జనులు మహాకాళ, మహాకాళ అని జపంచేసి ముక్తి పొందుతారు. శివశర్మ కాశీ మహాకాళేశ్వరులను సేవించి కంచికి ప్రయాణమైనాడు.

విప్రుడు కంచిలోని ఏకామ్రనాథుని సేవించాడు. అనంతరం బాల శశాంక మౌళీశ్వరుని అర్చించి తన పాపాలు నశింపచేసుకొన్నాడు.

కాంచి ఒక గొప్పపట్నం. అక్కడి వారెక్కువమంది అరవలు. అరవ స్త్రీలు అందగత్తెలు. ఎడమపైపు వంగటట్లు కొప్పులు తీర్చి దిద్దుతారు. అల్లిపూలను చెవులయందు ధరిస్తారు. జొన్నపూవువలె ఉండే పొక్కిటి క్రిందికి చీర ధరిస్తారు. పదహారువన్నె బంగారుపు శరీరాలపై పట్టుచీరలను సింగారిస్తారు. ఒడలికి మంచిగంధం అలదుతారు. పాలిండ్లు ఓరగా కనుపించేటట్లు పయ్యెదలు వేస్తారు. వారు నడుస్తుంటే

మన్మథుని పూలబాణములా అన్న సందేహం కలిగే టట్లుంటుంది. కురు వింద రత్నకాంతులతో విరాజిల్లటంచేత ఈ పట్టణాన్నికాంతి అని గూడ పిలుస్తారు. శివశర్మ కంచిలో ఏడుదినాలున్నాడు. అక్కడినుంచి అతడు ప్రభాసతీర్థం మీదుగా ద్వారవతి చేరాడు. అచ్చట గల భాగవతులతో హరి నారాయణ పుణ్యకథా శ్రవణంతో సంతృప్త హృదయుడైనాడు. లోపాముద్రా : ద్వారవతిలో చనిపోయిన వారి అస్థులు పరికించిచూస్తే శంఖచక్ర చిహ్నాలు కనిపిస్తాయి.

ఆ పట్టణంలోని భాగవతోత్తములు సంపంగి, మొగలిపూల గర్భదళ ములలో చేర్చబడిన అగరువాసనలతో కూడిన గోపిచందనం శరీరానికి రాసుకుంటారు. పాపములనే ముండ్ల తోకూడిన లతలను తెగగొట్టుఖడ్గ ధారలవలె ప్రకాశిస్తున్న ఊర్ధ్వపుండ్రరేఖలను ఫాలభాగాన తీర్చిదిద్దుతారు.

ఆ ద్వారవతిలోని భాగవతులను చూచితీరాలి. నిత్యం గోపి చందనం, ఊర్ధ్వపుండ్రాలు ధరిస్తారు. కుడి చెవులందు తులసిమాలలు ధరిస్తారు. ఆపకుండా ఎల్లప్పుడు పుండరీకాక్ష నామం స్మరిస్తుంటారు. పరతత్వజ్ఞానం అవగతం చేసుకొని ముక్తికాంతా విహారమంటపంలో విహరిస్తుంటారు. ప్రతి యుగాంతంలో ద్వారకాపట్టణాన్ని ముంచి అందలి రత్నరాసులను తనలోకి చేరవేసుకొన్నాడు గనుకనే సముద్రుడికి రత్నా కరుడనే పేరు గల్గింది.

ద్వారవతియందు చనిపోయిన కీటకములు మృగములు పయితం విష్ణువుతో సారూప్యం పొందుతాయి. మృతిచెందిన అనంతరం వాటికి కటిభాగంలో పట్టువస్త్రం అమరుతుంది. వక్షస్థలంలో కౌస్తుభం, మెడలో వనమాల విరాజిల్లుతుంటాయి. కేశములలో శిఖిపింఛమమరుతుంది. కమ్మ కస్తూరిశరీరాన అలదినట్లవుతుంది.అంతటి మహత్తరపుణ్యప్రదేశంద్వారవతి

ఆ పవిత్రప్రదేశంలో అయిదురోజులుండి పద్మాక్షుని సేవించి శివశర్మ అక్కడనుండి మాయానగరానికి పయనమైనాడు. ఈ పట్టణానికి హరిద్వారమనే మరోపేరుంది. హిమవత్పర్వతములనుండి గంగ ఇక్కడనే భూమికి దిగుతుంది. అందువలననే దీనిని గంగాద్వారమని, మోక్షద్వారమని పిలుస్తారు. పరమేశ్వర జటాజూట విర్గతగంగా విస్ఫురులు నృత్యంచేస్తూ పృథివికిదిగి అక్కడనుంచి సమతలప్రదేశంమీద ప్రయాణం సాగిస్తాయి.

శివశర్మ మాయానగరంలో ఉండి జాగరమున్నాడు. ఉషఃకాలాన భాగీరథిలో స్నానంచేసి పవిత్రుడయినాడు. యవసక్తుతో పితృదేవతలకు పిండప్రదానంచేశాడు. అగ్నికార్యంతీర్చాడు. మురహరుని ధ్యానించాడు. మోదుగాకులతో విస్తరి రచించాడు. రాగిహండీలలో వండినవంటకం భుజిద్దామని అనుకొంటున్నాడు. ఆసమయంలో శివశర్మకు శిరోవేదన కలిగింది. చలిముంచుకొనివచ్చి వణకసాగినాడు. శరీరమాద్యంతం నొప్పులుకలిగాయి. అంతులేనిదాహం కల్గింది. దుర్భరంగా ఉన్న తనస్థితిని చూచి శివశర్మ వాపోయినాడు.

ఇంటివద్ద పొలంపనులు ఎవరుచూస్తారు? పశువులను ఎవ్వరు పరిరక్షిస్తుంటారు. ఇంత పెద్దసంసారం నా భార్య యొక్కతె సమర్థించుకొనగలదా? ధనం పంచుకొనటానికి కుమారులు ఎంతగా పోట్లాడుకుంటారో? సమస్త శాస్త్రపురాణాది గ్రంథాలను సేకరించాను. వాటినెవరు కాపాడుతారు? అయ్యో! ఇల్లువదలి ఇంతదూరంవచ్చాను. ఇక్కడనే దిక్కుమాలినచావు చావవలసిన యోగముంది కాబోలు. ఈ రోగంతీరు చూస్తే నయమయ్యేజాడ కనిపించదు. ఇంక బ్రతకటంకల్ల. అయినా నాకెందుకింక చింత? ఇహలోకసుఖాలు అనుభవించాను. ఇన్ని పుణ్యతీర్థాలలో క్రుంకులిడినాను. ఇన్ని పుణ్యక్షేత్రాలు దర్శించాను. మృత్యువు దగ్గరపడిందన్న

సంతాపం ఎందుకు ? మహాదేవుని స్మరిస్తాను. కేశవుని మదిలోనిల్పు కొంటాను. అని వితర్కించుకొంటూ ఉండగానే జ్వరంతీవ్రత హెచ్చింది. నాలుక పిడుచకట్టుకొని పోసాగింది. శరీరం అంతా వణకు సంప్రాప్తిం చింది. కోట్లకొలది తేళ్ళుకుట్టి, ఆ విషం శరీరమంతా వ్యాపించినంత తీవ్ర వేదన కలిగింది. ఒడలు తెలియలేదు. ప్రాపంచిక స్మృతిలేక, నా అనే దిక్కులేక కొన్నిరోజులు అలాగే పడిఉన్నాడు. కొలదిరోజులకు ఆయుస్సమాప్తి అయిందికాబోలు మాయానగరంలో గంగానదిఒడ్డున శివ శర్మ కాలధర్మం చెందాడు

శివశర్మను తీసుకొనివెళ్ళటానికి ఇద్దరువిష్ణుకింకరులువచ్చారు. వారిద్దరూ చతుర్భుజులు. ఆజానుబాహులు. నీలవర్ణులు. పుణ్యశీలుడు సుశీలుడు వారి పేర్లు. శివశర్మకు విష్ణుసాయుజ్యం అబ్బింది. విష్ణు సాహిప్యంకల్గింది. తెల్లతామరలవంటి కండ్లు, నీలమేఘచ్ఛాయ, కౌస్తుభరత్న విరాజితమైన వక్షస్థలం పసిడికమ్మీల పట్టువస్త్రం. శిఖిపింఛంతోకూడిన శివశర్మ సాక్షాత్తు నారాయణునివలె ఉన్నాడు. కింకరులు తమవెంటతెచ్చిన బంగారుకాంతులు వెదజల్లుతున్న రథంమీద శివశర్మను ఎక్కించారు. శివశర్మకు ఎంతో ఆశ్చర్యంగాఉంది. కింకరులను ఇలా ప్రశ్నించాడు.

పురాణ ఇతిహాసాలలో పుణ్యశీలుడు, సుశీలుడు అని ఇద్దరు పరమాత్మ సాన్నిధ్యంలో ఎప్పుడూఉంటారని విష్ణుభక్తులుచెప్పగా విన్నాను మీ ఇద్దరి ఆకారాలు వాళ్ళువర్ణించినట్లే ఉన్నాయి. వారేకదా మీరు?

ఆమాటలకు వారు విప్రవర్యా! మీవంటివాళ్ళకు తెలియని విషయా లుంటాయా? మీరువిన్న పుణ్యశీల సుశీలురం మేమే. ఎన్నో లోకాలుదాటి గాని వైకుంఠానికి పోవటానికి వీలుకల్గదు. మార్గమధ్యంలో ఆయాలోకాల విశేషాలు వివరిస్తాం. మీరుకూడ మీరు తెలుసుకోదలచుకొన్న విషయాలు

అడగండి అని చెప్పారు. శివశర్మ అధిరోహించిన దివ్యవిమానం ముందుకుసాగుతున్నది.

కురుచలయిన జాంజారు జుట్టు గచ్చకాయలవంటి కనుగ్రుడ్లు, గొగ్గిపళ్లు వికృతమైనముఖం, గూని, అంగాలపీపుపై పొంతనలుగా పెట్టిన కళేబరాలు, కర్ణకఠోరంగా గాడిద అరచినట్లుగా మాట్లాడుకుంటూ కొందరు కనబడినారు. వాళ్ళనుచూచి ఆశ్చర్యంతోపాటు జుగుప్సకలిగిన శివశర్మ దూతలతో వాళ్ళెవరిని ప్రశ్నించాడు.

దూతలు శివశర్మతో పుణ్యపురుషా! ఇది పిశాచలోకం. ఊబూది రంగుతో వికృతంగా ఉన్నవాళ్ళు పిశాచరాజులు. ప్రస్తావవశంగా పరమేశ్వరుని కొనియాడారు. అందువలననే వీరిలోకంలో ఉన్నారు. ఎవరైనా తాము చేసినకర్మకు అనుగుణ్యమైన ఫలాన్నే అనుభవిస్తారు అని వివరిస్తున్నారు. విమానం మరింతపైకి వెళ్ళింది. ఆయాలోకాలు దాటుతున్నది. ఆ లోకాలలోని దివ్యపురుషులను చూస్తూ శివశర్మ తనఅదృష్టాన్ని తానే అభినందించుకొంటున్నాడు. గుహ్యకలోకం, గంధర్వలోకం, విద్యాధరలోకాన్ని దాటి విమానం అప్సరసలలోకాన్ని సమీపించింది.

ఆ సమయంలో ఎదురుగా ఒక బంగారురథం వస్తున్నది. ప్రక్కన పదిమందికిపైగా కింకరులున్నారు. ముందు మంగళవాద్యనాదాలు మ్రోగుతున్నాయి. రథంమీద ఎవరో మహాపురుషుడు ఆసీనుడై యున్నాడు. విమానందగ్గరకాగానే అతడు రథం దిగి సౌమ్యమైన మందస్మితవదనంతో మేఘగంభీరభాషణాలతో శివశర్మతో ఇలా అన్నాడు. మహాత్మా! నీవు ధన్యుడివి. షడంగములతో వేదాన్ని అభ్యసించావు. గురువులకు పరిచర్య చేసిన పుణ్యాత్ముడవు. నానావిధ పురాణ ఇతిహాస శాస్త్రాదులను చదివి వాటి సారాన్ని గ్రహించావు, భేదబుద్ధిలేక ఈశ్వరుని, నారాయణుని సమంగా

అర్చించావు. నీవెంత అదృష్టశాలివి, నీ పుణ్యగరిమ ఎంతదో చెప్పలేము. మాబోటులు నయితం నమస్కరింపతగినవాడవు అని అభివందించి ముందుకు సాగిపోయినాడు.

శివశర్మకు అత దెవ్వరో తెలియలేదు. ఒక దేవతా పురుషుడని మాత్రం గ్రహించుకొన్నాడు. ఆ దివ్యపురుషుడు తనను అదరించి అభి నందించటం అతడిని ఆశ్చర్యపరచింది. తమకంపట్టలేక అత డెవ్వడని దూతలను ప్రశ్నించాడు. అతడు యమధర్మరాజని చెప్పగానే బ్రాహ్మ ణుడు ఆయ్యా! యముడు మహాక్రూరుడని, మిక్కిలి భయంకరంగా ఉంటాడనివిన్నాను–ఇంత సౌమ్యుడుగా కనిపిస్తున్నాడేమిటి? భూలోకంలోని ప్రజలు అతడు రౌద్రమూర్తి అని గుండెజల్లుమనేటట్లుగా వర్ణిస్తారు. ఇప్పుడా రౌద్రరేఖ ఎటుపోయింది? ధర్మని అసలు రూపం ఇదేనా? లేక మరొక రూపం ఉన్నదా? దయచేసి సందేహ నివృత్తి చేయవల సిందని అన్నాడు.

దానికి కింకరులు నవ్వి ఇలా అన్నారు. అనఘా నీవంటి పుణా త్ములకు సంయమనుడు సౌమ్యుడుగా దర్శనమిస్తాడు. మహాపాపులకు అత్యంత భయంకరంగా కనిపిస్తాడు. దుష్టులను చూడగానే ఆయన రౌద్రంతో చూస్తాడు. భయంకరమైన కోరలు, ఊర్ధ్వకేశం నల్లనివర్ణం మాటిమాటికి ముడుస్తున్న భ్రుకుటితో కఠినంగా శాసిస్తుంటాడు.

చట్రాతిమీద వీరిపాదాలు పట్టి ఉతర్వండి. కఠికందలుగా కంఠాన్ని నరకండి. శరీరాన గాట్లు పడేటట్లు కత్తులతో చెక్కండి. త్రాళ్ళతో కట్టి వీడిని తలక్రిందులుగా వ్రేలాడదీయండి. వీడిగొంతు రంపంతో నగంవరకు కోసి వదలండి. వీడి మర్మావయవాలు లేదిల్లేటట్లుగా ముద మంతో మర్దించండి. వీడి ముక్కు రంధ్రాలలో కరగబోసిన ఇనుప

ద్రవాన్ని పోయండి. పర స్త్రీల కుచములపై నఖాంకురాలుంచాడు, వీడి గోళ్ళల్లోను, కళ్ళలోను ఇనుపసూదులు దింపండి. ఇతరుల భార్యల ముఖాలను ముద్దుపెట్టుకొన్న వీడి ముఖాన ఉమ్మి వేయండి. మగనాలి ఇంటికేగి నీచంగా ప్రవర్తించిన ఈ చండాలుని కాళ్ళు నరకండి. పర స్త్రీల యందు కామాసక్తితో చూచిన వీడి రెంపలు వాయగొట్టి వాతలు పెట్టండి. హృదయంలో కత్తులు గ్రుచ్చండి. ఇతరులకు బాధ కలిగించేటట్లు నిష్ఠురంగా మాట్లాడినవాడిని మంగలంలో పడవేసి వేయించండి. ఇతరుల యందు అసత్యదోషం ఆరోపించిన ఈ ఖలుడిని అప్పూయంతో కూడిన మాంసపంకంలో పడవేయండి. గురునింద చేసిన దుష్టుని నోట మహా ద్రావకం పోయండి. ఇలా శాసిస్తూ, పాపాలుచేసిన వాళ్ళను వాటి క్రమ గుణంగా శిక్షలు విధిస్తుంటాడు.

రౌరవం, మహారౌరవం, కాలసూత్రం, కుంభీపాకం, అంధతామిస్రం మొదలయిన నరకాలు ఉన్నాయి సుమా ! శిశువులను చంపిన వాళ్ళను, కృతఘ్నులను గురుభార్యతో సంగమించిన వాళ్ళను, గోహత్యలొనర్చిన వాళ్ళను, మిత్రులను సంహరించిన వాళ్ళను, ఇతరుల ధనమును, పొలములను, గృహాలను అపహరించే వాళ్ళను, కూటసాక్షులను, బ్రాహ్మణ హత్యలు చేసినవాళ్ళను శాల్మలీ వృక్షాలు ప్రాకించి తలక్రిందులుగా వ్రేలాడదీయించి, చీకటి బావులలోకి నెట్టి, ఇనుప ముక్కులు గల కాకుల చేత పొడిపించి, అనేక విధాలుగా బాధలకు గురిచేస్తారు.

ఎవరు హరినామ కీర్తనంచేస్తారో వారికి నరకబాధ ఉండదు. శివభక్తులను, విష్ణు సేవాపరాయణులను బాధింపరాదని ఒకప్పుడు యముడు తన కింకరులతో కఠినంగా చెప్పాడు.

గోవింద, గంగాధర, చాణూరమర్దన, బాలమృగాంకధర, వాసుదేవ

కృత్తివాస అంటూ హరిహరులను జపించేవారు పుణ్యులు. ఇలాంటి భక్తులు అందరికీ వందనీయులు. వాళ్ళు మీకు ప్రభువులు, ఆ మహనీయులు మాననీయులు అని శమనుడు కింకరులకు ఆదేశించాడు.

శమనుడి రాజధానియైన సంయమనీ నగరాన కరంధముడు, కురు. ధర్మసేనుడు, దృఢధ్వజుడు, జయద్రథుడు మొదలైన రాజులు నివసిస్తుంటారు.

ఈ విధంగా యమలోక వృత్తాంతం వివరిస్తుండగానే వారి రథం అప్సరసల లోకానికి చేరింది. రాకాసుధాకర వదనలు, దివ్యమైన అలంకారాలతో మన్మథుని విజయధ్వజాలా అన్నట్లున్న అందగత్తెలను యౌవనవతులను చూచి శివశర్మ వీరెవ్వరని ప్రశ్నించాడు. కింకరులు సంతోషంతో ఇలా చెప్పారు.

వీళ్ళంతా అప్సరసలు. లక్ష్మీదేవితోపాటు పాలసంద్రాన జన్మించిన ధన్యలు. ఇనుప కవచాలు ధరించిన ఋషీశ్వరుల మనస్సుల స్థైర్యం కలచివైచి మన్మథాగ్ని సంతప్తులుగా చేయగలిగిన మోహనాంగులు. మహేంద్రుడు వీరిని దక్షిణ కాశీలో వెలసిన భీమేశ్వరస్వామికి కానుకగా ఇచ్చివేశాడు. ఊర్వశి, రంభ, మేనక, తిలోత్తమ, కాంతిమతి, లీలావతి మొదలయిన వీళ్ళ మొత్తం అరవైవేల మంది.

జీవితాంతం బ్రహ్మచర్యం అవలంబించి ఒక్కరోజు దానిని దిగజార్చినలేమ, కలకాలం కామ్యకవ్రతాలు చేసి బలవంతాన ఒకరికి లొంగి వారినే జీవితాంతం భర్తగా స్వీకరించిన స్త్రీ, భర్త దగ్గరలేనపుడు ప్రమాదవశాన మోసపోయిన తన్వి, కన్నెవయసున వరులచే మోసగింపబడి, వివాహానంతరం పాతివ్రత్యం నెరపిన సుదతి వీరంతా దేవకన్యలుగా జనించి ఈ లోకంలో నివాసం పొందగల్గుతారు.

విష్ణుదూతలు ఇలా వివరిస్తుండగానే దివ్యరథం సూర్యలోకానికి చేరువయింది.

## సూర్యలోక వర్ణనం

అప్సరోలోకపు వింతలు చూచి ఆశ్చర్యపడిన శివశర్మ ముందుకు చూస్తున్నాడు ఇంతలో ఒకేచక్రం,ఏడుగుఱ్ఱాలతో ఉంది, కొందరుఅప్సరసలు మునులు గంధర్వులచే అధివసింపబడిన ఒక రథం అటువైపుగావచ్చింది. శరీరంలో అధోభాగంలేని అనూరుడు రథం తోలుతున్నాడు. దుర్నిరీక్ష తేజోరాశియైన ఆ కర్మసాక్షిని చూడటంవల్ల తనజన్మ తరించిందనుకొని శివశర్మ రెండుహస్తాలు ముకుళించి నమస్కరించాడు. కింకరులు శివ శర్మతో మహాభాగా! లోకోపకారి సూర్యభగవానుని రథమిది. ఆ దేవుని సిద్ధులు నిష్కల్మషమైన ఆత్మతోను, దేవతలు విద్యుక్త ధర్మప్రకారం అర్చిస్తారు. చారణులు అనేకవిధ్వదారలతో నుతిస్తారు. కిన్నరులు గీతాలతో స్తోత్రంచేస్తారు. గరుడులు నమస్కారవిధితోను రాక్షసులు గాఢ భక్తితో సేవచేస్తారు. పాతాళవాసులంతా ఏకాగ్రతతో అస్వామిని ధ్యానిస్తారు.

సూర్యుడెంతో స్థిరమైనవాడు కాని లోకంకోసం సంచారపరితంత్రు డయి ఉంటాడు. తాను చైతన్యం కలుగజేసేవాడయినా లోకులకు దుష్ప్రహుడుగా వెలుగుతుంటాడు. మోక్షం ఇచ్చేవాడే అయినా ముని శ్వరులకు బాధాకరమైన వేడిని ప్రసాదిస్తాడు. అనంతరకాలంలో వర్షాన్ని కురిపించే వాటిఅయిన కిరణాలతో లోకాన్ని మార్చివేస్తాడు. తూర్పున ఉదయించినప్పటినుంచి దొన్నత్యంతోబాటు అధిక తేజస్సు కలిగి ప్రకాశిస్తుంటాడు.

ఆ మాటలు వింటున్న శివశర్మ ఆ కర్మసాక్షికి నమస్కరించాడు.

రెప్పపాటు కాలంలో ఆ మూర్తి రెండువేల అయిదువందల యోజనాలు ప్రయాణించాడు. బ్రాహ్మణుడు ఆశ్చర్యపడి మాతలతో అయ్యా! సూర్యబింబంలో ఒక మహా పురుషుడుంటాడని పండితులు అంటారు. సిద్ధులయిన వాళ్ళు ఆ పరమపురుషుని ఎలా సేవిస్తారు. అని అడిగాడు.

దానికి కింకరులు ఇలా అన్నారు. ఆకాశముమధ్యలోనున్న సూర్య బింబం లక్షయోజనాలు వైశాల్యం గలది. ఆ బింబం మధ్యలో తలపైన తెల్లని కిరణాలు ప్రసరిస్తూ ఉద్గీతవిద్యా ప్రయోగమార్గమైన బంగారు రూపుడు, బంగారు కేశములు గడ్డములు కలవాడు, చేతులు మొదలయిన సమస్త అవయవాలు బంగారమయిగనే ఉన్నవాడు విష్ణుదేవుడని, ఆయనకు తనకు భేదంలేదని, సూర్యోదయసమయంలో గాయత్రినిగూర్చి అర్ఘ్యమిచ్చే సమయంలో బ్రహ్మోపాసనాపరుడు నిర్మలమైన మానసంతో భావనచేయాలి. కాలలోపం చేయరాదు. కాలంఅంటే ఎల్లరు ఎదురుచూచేది. ఆయాకాలా లలో మాత్రమే ఓషధులు పరిస్తాయి. నిర్ణీతమైన కాలంలో తప్పచెట్లు పూలుపూయవు. కాలం ఆసన్నమయినపుడే మేఘాలు వర్షిస్తాయి. మందేహరాక్షసనాశనార్థం, త్రికాలములలో ఉపాసకులు విడిచిన, గాయత్రీ మంత్రంతోకూడిన, మూడు అర్ఘ్యములను చిత్రభానుడు కోరుతుంటాడు. కాలం తప్పకుండ ఉపాసింపబడిన భాస్కరుడు ఆయురారోగ్యాలు ప్రసాదిస్తాడు.

పదునెన్మిది విద్యలలో మీమాంస మహనీయమైనది. మిక్కిలి ఉపాదేయమైంది. మీమాంస కన్న తర్కం మేలైనది. తర్క శాస్త్రంకంటె వేదములు మహత్తరమైనవి. వేదాలకంటె ఉపనిషత్తులు మేలయినవి. ఉపనిషత్తులకంటె గాయత్రి మహిమ గొప్పది. గాయత్రి అనే పాదిలవు ఓంకారమనే దూడతోకూడి విప్రులకు అమృతధారలు

ఇస్తుంది. మంత్రాలలో గాయత్రి, పట్టణాలలో కాశి, దేవతలలో చంద్ర శేఖరుడు ఎన్నతగినవారు.

తనను గానంచేసినవాళ్ళను రక్షిస్తుంది కనుక అది గాయత్రి అయింది. ఇతర మంత్రాలకు దీనికిగల మాహాత్మ్యంలేదు. కనుకనే బ్రహ్మ మీమాంసాపరులు ఉదయం సాయంత్రం జ్యోతిర్మూర్తి అయిన పద్మమిత్రుని సేవిస్తారు. గాయత్రే పరబ్రహ్మం, దానికధీశ్వరుడు సూర్యభగవానుడు.

వేదమూర్తిఅయిన కమలాప్తుడికి ఎన్నో పేరులున్నాయి. హంసుడు, భానుడు, సహస్రాంశుడు, తపనుడు, తాపనుడు, రవి, వికర్తనుడు, వివస్వంతుడు, విశ్వకర్మ, విభావసుడు, విశ్వరూపుడు, విశ్వకర్త, మార్తాండుడు, మిహిరుడు, అంశుమంతుడు, ఆదిత్యుడు, ఉష్ణగుడు, సూర్యుడు, అర్యముడు, బ్రధ్నుడు, దివాకరుడు, ద్వాదశాదిత్యుడు, సప్తహయుడు, భాస్కరుడు, అహస్కరుడు, ఖగుడు, సూరుడు, ప్రభాకరుడు, శ్రీమంతుడు, లోకచక్షువు, గ్రహేశ్వరుడు, త్రిలోకేశ్వరుడు, లోకసాక్షి, తమోరి, శాశ్వతుడు, శుచి, గభస్తి, హస్తుడు, తీవ్రాంశుడు, తరణి, కళిందుడు, తార్క్ష్యవాహనుడు, దిక్పతి, పద్మినీనాయకుడు, కుశేశయకరుడు, హరి, మహారణి, ద్యుమణి, హరిదశ్వుడు, అర్కుడు, భానుమంతుడు, భయనాశకుడు, ఛందోశ్వుడు, వేదవేద్యుడు, భాస్వంతుడు, పూషుడు, వృషాకపి, ఏకచక్రరథుడు, మిత్రుడు, మందేహారి, తమిస్రహుడు, దైత్యహుడు, పాపహర్త, ధర్ముడు, ధర్మప్రకాశకుడు, హేళి, చిత్రభానుడు, ఘర్మరశ్మి, దుర్నిరీక్ష్యుడు, అరుణుడు, కశ్యపాత్మజుడు డెబ్బదిపేర్లు ప్రసిద్ధములైనవి.

మోకాళ్ళ భూమిపై ఆనించాలి. రెండు చేతులయందు పీటతో నింపబడిన తామ్రపాత్ర ధరించాలి. ఆ పీటలో దర్భాంకురాలు, అక్షతలు, ఎర్రచందనం, గన్నేరు మొదలయిన ఎర్రపూలు ఉండాలి. పైనచెప్పబడిన

నామములకు ప్రతిదానికి మొదట ఓంకారము, చివర నమః అను పదంచేర్చి, నామమును చతుర్థీ అంతంచేసి-ఓంసూర్యాయనమః, ఓందివాకరాయనమః-ప్రతినామం ఉచ్చరించేటప్పుడు అర్ఘ్యపాత్రను పైవరకుఎత్తి, సూర్యదేవుడికి అర్ఘ్యంసమర్పించాలి. సూర్యుడు సంతుష్టుడై ఆయుస్సు ఆరోగ్యం, బుద్ధి, ఐశ్వర్యం, ప్రాభవం కలుగజేస్తాడు.

అకారాది క్షకారాంతంగల ఏభై అక్షరాలు ప్రకృతిగా గలిగిన మంత్రరాజం మిక్కిలి రహస్యమైనది. అది మాతృక. ఈ మాతృక అయిదు అవయవాలతో పుట్టింది. దానిలో అకారానికి, ఓంకారానికి, ఉకారానికి, బిందువుకు, నాదానికి ఒక్కొక్కదానికి పదేసి అక్షరాలు జనించాయి. అట్టి ప్రణవమనే బంగారపు గద్దెమీద, భాస్కరుడనే మాణిక్య పదకం మెడలోధరించి వేదమాతయైన గాయత్రి విరాజిల్లుతుంటుంది. ఇరవై నాలుగు తత్వాలకు నివేశనమైన గాయత్రీమంత్రం మన కోరికలను తీరుస్తుంది. ఆ సావిత్రీ స్వరూపం వివరిస్తాను వినవలసింది.

ఆ తల్లికి మూడువేదాలు మూడుపాదాలు. ఆదిపురాణసమూహం నాభి. నాలుగుదిక్కులు వాగ్దనేత్రములు. లోకమేశకిరం. ఆకాశం ఉదరం, ధర్మశాస్త్రం హృదయపద్మం. ఛందస్సులు స్తనాలు, సాంఖ్యశాస్త్రాలు చెవులు. అగ్నిముఖము. శిక్ష మొదలయిన వేదాంగాలు ఆయుధతలలు. అధర్వణవేదం చేష్ట. శివుడుశిఖ, బ్రహ్మశిరస్సు, శ్రీహరిఆత్మ,మీమాంస భావలక్షణాలు.

అగ్నిదేవునివలె ఈ గాయత్రి పాతకాలను వశింపజేస్తుంది. బ్రహ్మజ్ఞానసంపన్నుడు, గాయత్రీమంత్రాన్ని ప్రతిలోమంగా ఉచ్చరిస్తూ శత్రువును గూర్చి అభిచారహోమంచేస్తే, అది బ్రహ్మాస్త్రమై చిటికకాలంలో శాత్రవుని వశింపజేస్తుంది.

గాయత్రియే విష్ణువు, గాయత్రియే శివుడు, గాయత్రియే బ్రహ్మ త్రిమూర్త్యాత్మకమైన ఆదిత్యుడున గాయత్రియే. ఆ దేవిని స్తోత్రంచేసి ముక్తిని పొందగలరు. ఆ మహాదేవికి గాయత్రీ, సావిత్రి, విశ్వజనయిత్రీ, చతుర్వేదమాతా, పరాపరబ్రహ్మయుగం అనేవి నామాంతరాలు.

ఈ విధంగా విష్ణుదూతలు గాయత్రీ మహిమను వర్ణిస్తుంటే శివశర్మ విని బ్రహ్మానంద భరితుడయినాడు. ఇంతలోనే వారియెదుట ఎంతో శోభాయమానంగా ఉన్న పట్టణం ఒకటి కన్పించింది. దాన్ని చూసిన విప్రుడు ఆ పురమేదో దాని వివరాలేమో తెలుసుకొందా మనుకున్నాడు.

శివశర్మ అభిప్రాయం తెలిసికొని దూతలు ఇలాచెప్పారు. మహాత్మా! ఇది స్వర్గలోకం. ఈ పట్టణమే అమరావతి. ఈ పట్టణంలోని మేడలను చూడు. బంగారుగోడలు, బంగారుతలుపులు, బంగారుగోపురాలు. హేమ వర్ణంతో ప్రకాశించే సూర్యుడు ఈ పట్టణసమీపంనుంచే పయనిస్తుంటాడు. అమావాస్యరోజులలో సూర్యుడిగర్భంలోకి చొరబొయ్యే సమయంలో చంద్రుడు తనకాంతిని ఇక్కడ ఉంచివెళ్ళినాడా అన్నట్లుగా ఈ పురంలోని మేడలు బంగారువన్నెతోబాటు తెల్లగాకూడ ప్రకాశిస్తున్నాయి.

అదుగో ఎగురుతూ గంతులు వేస్తున్నదే చూడు. అదే కామధేనువు బిడ్డ. కడుపార పాలు త్రాగి సంతోషంతో చెంగనాలు పెడుతూ ఎంత అందంగా ఉందో చూడు. ఆ తెల్లని ఏనుగే ఐరావతం. తన మెడలోని ఘంటారావం నాల్గు దిక్కులా ప్రతిధ్వనిస్తుంటే ఎంత ఠీవిగా రాజమార్గాన నడుస్తున్నదో చూడు. ఇదిగో ఈ ప్రక్క కనబడేదే నందనవనం. ఆ వనంలో పెద్దవిగా కనిపిస్తున్నవే అవి మందారం, కల్పం, సంతానం, పారిజాతం, చందనం అని పిలువబడే వృక్షాలు.

ఇక్కడికి వారికి వరమ్ములతో పనిలేదు. సుధాకరుని కిరణాంకు

చంద్రకాంత శిలలు కరగి సరస్సులుగా ఉంటాయి. కల్పవృక్షం వస్త్రాలు కూడ అందిస్తుంది. అందువలన ఇక్కడ సాలెలతో పనిలేదు. కోరిన కోరికలు తీర్చటానికి చింతామణీ రత్నాలున్నాయి. వంటల వాళ్ళతో పనిలేదు. కామధేనువే భోజ్యపదార్థాలు అన్నీ సమకూరుస్తుంది. అందుకే మానవు లంతా స్వర్గవైభవం, స్వర్గసౌఖ్యం అంటుంటారు. పాల సంద్రంలో లక్ష్మీదేవి వెంట జన్మించి, మన్మథ మొలకలు అనతగిన అప్స రసలు ఇక్కడి భోగకాంతలు.

స్వర్గంలో శ్రేష్ఠమైన వనం నందనవనం. తరువులలో పారిజాతం విశిష్టమైనది. స్త్రీలలో ఊర్వశి అందగత్తె. అశ్వాలలో ఉచ్చైశ్రవం, ఏనుగులలో ఐరావతం, రత్నాలలో చింతామణి మేలైనవి. ఇక్కడనే అగ్ని మొదలయిన దిక్పాలకులు, నారదుడు మొదలయిన దేవర్షులు, సగ రుడు, నలుడు, మాంధాత, దుంధుమారుడు మొదలగు చక్రవర్తులు, పౌండరీకాది యాగాలుచేసిన సోమయాజులు, తులాపురుషాది దానాలొనర్చిన వదాన్యులు, యుద్ధరంగంలో మరమ త్రిప్పక పోరాడిన వీరులు విహ రిస్తుంటారు.

వీరిలా వివరిస్తుండగనే రథం ముందుకుసాగి అర్చిష్మతీపురానికి చేరువయింది. దాన్ని చూపి విష్ణుదూతలు ఆ పురాన్ని గురించి చెప్పసాగారు.

మహాభాగా ! ఇది అర్చిష్మతీ అనే పేరుగల పట్టణం. అగ్ని లోకానికి రాజధాని. ఎనిమిది దిక్కులయందు ఇలాగే ఎనిమిది లోకాలు, పట్టణాలు ఉన్నాయి. సంయమనీ పురానికి పాలకుడు యమధర్మరాజు. నైరృతి దిక్కునగల పుణ్యవతీ నగరానికి పాలకుడు నిరృతి. వరుణుని పట్టణం అమరావతి. గంధవతీ పాలకుడు వాయువు. ఉత్తరదిక్కున

ఉన్న అలకాపురానికి కుబేరుడు అధిపతి. ఐశాని పట్టణాన్ని శంకరుడు ఏలుతుంటాడు.

అవనీసురా! అగ్నికిగల ప్రాధాన్యం మీవంటివారికి తెల్ప పనిలేదు. కర్మతులయిన విప్రులకు నిశ్శ్రేయసం ఇస్తుంది. వారికి అగ్నే తీర్థం. భూసురులకు గురువు, ప్రభువు, అంతరాత్మ, పరమేశ్వరుడు సమస్తం అగ్నిదేవుడే సుమా!

ఏ యజ్ఞంలోనైనా వివిధ దేవతాపురస్సరంగా వ్రేల్చబడిన ఏ పదార్థమయినా అగ్ని చవిచూచిన తర్వాతనే బ్రహ్మాదిదేవతలు స్వీకరిస్తారు.

వహ్ని మాహాత్మ్యం విన్న శివశర్మ కింకరులతో దూతలారా! నా దొక మనవి. ఈ వైశ్వానరు డెవరు? ఈతని కింత మాహాత్మ్యం ఎలా కలిగింది? అని ప్రశ్నించాడు. దానికి వారిలా వివరించారు.

## వైశ్వానర చరిత్రం

పూర్వం శాండిల్యగోత్రజు డయిన విశ్వానరుడను శంకర భక్తు డుండేవాడు. అతడు నియమం తప్పకుండా బ్రహ్మచర్యాశ్రమం నెరపి అనేక శాస్త్రాలు అధ్యయనం చేశాడు. విద్యార్జన పూర్తయిం తర్వాత ఒకనాడు మనస్సులో ఇలా వితర్కించుకొన్నాడు. పెద్దలు నాలుగు ఆశ్రమాలు ఏర్పరచారు. ఇందులో ఏ ఆశ్రమంలో జీవితం గడిపితే ఐహిక ఆముష్మిక సుఖాలు పొందవచ్చు? ఆలోచిస్తుంటే దేనికదే మంచిదిగా కనిపిస్తుంది. ఆశ్రమ ధర్మాలు నిర్వర్తించి మానవుడు కృత కృత్యుడౌతాడు. బ్రాహ్మణులకు బృహస్పతి యజ్ఞం, క్షత్రియులకు రాజ సూయం, వైశ్యులకు వైశ్యష్టోమం, వర్ణోచితకృత్యాలు. ఆశ్రమధర్మాలు అనేక విధాలుగా ఉంటాయి. అధ్యయనం మొదలయినవి బ్రహ్మచారి

ధర్మాలు. అగ్నికార్యం తీర్చటం గృహస్థుని ధర్మం. కామక్రోధాదులకు అతీతుడుగా సంచరించటం వానప్రస్థుడు చేయతగింది. తపస్సు నిర్వర్తించుకొంటూ ఆరణ్యాలలో నివసించటం సన్యాస్యాశ్రమ ధర్మం. వీటిలో బ్రహ్మచర్యంకంటె, గృహస్థాశ్రమం, దానికంటె వానప్రస్థం, అన్నింటికంటె యత్యాశ్రమ స్వీకారం ఉత్కృష్టములు అని పెద్దలవలన వింటాం. మానవుడు ఏ ఆ శ్ర మం లో ఉం డ యి నా తరింపవచ్చు. కాని అన్ని ఆశ్రమములకు ఆధారభూతమైన గృహస్థ ధర్మం ముక్తిసాధనమని తోస్తున్నది.

కొందరు వర్ణాశ్రమాచారములలో ఉండేవారికి బ్రహ్మనిష్ఠ సిద్ధించదు. సమస్త వ్యాపారాలను త్యజించి కేవలం పరమాత్మ తత్వాన్ని తెలుసుకొంటూ బ్రహ్మమును తెలుసుకొనటం బ్రహ్మనిష్ఠ. కర్మానుష్ఠానం, కర్మపరిత్యాగం పరస్పర విరుద్ధాలు అంటారు. అయితే కర్మానుష్ఠాన పరుడు తనకుకల్గిన అవకాశంలోనే బ్రహ్మమును గురించి తెలుసుకొనగల్గుతాడు. కనుక కర్మపరుడు పరతత్వాన్ని తెలుసుకొనలేడు అని చెప్పగూడదు. పరుల భార్యలయందు అనసక్తుడుగా తనభార్యయందు ఋతుకాలంలోమాత్రం భోగం అనుభవించేవాడు బ్రహ్మచారియే. రాగద్వేషాలు, అరిషడ్వర్గాలు జయించినవాడు నిజానికి వానప్రస్థుడే అవుతాడు. అయాచితంగా లభించిన దానితో తృప్తిపడి గృహస్థాశ్రమం నెరపేవాడు అన్ని యాశ్రములు ఆచరించినవాడే కాగలడు. దేవయజ్ఞం, పితృయజ్ఞం, భూతయజ్ఞం, మనుష్యయజ్ఞం, బ్రహ్మయజ్ఞం అనే పంచ మహాయజ్ఞాలు నిర్వర్తించి గృహస్థుడు ముక్తి పొందుతాడు. కనుక నేనుగూడ గృహస్థాశ్రమం స్వీకరిస్తానని నిశ్చయించుకొన్నాడు.

శుచిష్మతి అనే కన్యను శాస్త్రవిధిగా విశ్వానరుడు వివాహం చేసు

కొన్నాడు. ఆమె రూపవతే గాదు. గుణవతి కూడ. యౌవనవతి అయిన శుచిష్మతి మంచిగంధపు నీటితో స్నానంచేసి, మడుగువస్త్రం ధరించేది. కొప్పు చక్కగాపెట్టి పుష్పాలు ధరించేది. కాశ్మీరతిలక రేఖా మధ్యలో బొట్టు దిద్దేది. నిత్యం అగ్నిహోత్రం సిద్ధంచేసేది. దేవతానివేదనకు సమస్తపదార్థాలు సిద్ధంచేసేది. అనుకూలవతి అయిన భార్య దొరికినందుకు విశ్వానరుడు మనస్సులో ఎంతో సంతోషపడుతూ యథావిధిగా గృ హ స్థ ధ ర్మా న్ని నిర్వర్తిస్తున్నాడు. ఇలా కొన్ని సంవత్సరాలు గడిచాయి.

ఎన్ని ఐశ్వర్యాలున్నా, సుఖాలున్నా శుచిష్మతికి సంతానం లేక పోవటం ఎంతోలోటుగా కనిపించింది. ఎన్నోనోములు నోచింది. ఎన్ని వ్రతాలెల్ల ఎంతో భక్తిశ్రద్ధలతో ఆచరించింది. అయినా ఆ దంపతులకు బిడ్డలు కలుగలేదు. ఆ చింతాభారాన్ని భరించలేక శుచిష్మతి ఒకనాడు భర్తతో ఇలా అంది.

స్వామీ: పట్టుపుట్టాలకు, బంగారు ఆభరణాలకు నాకు లోటులేదు. చుట్టాలకు, అతిథులకు ఎంతో ఆదరంతో, శ్రద్ధతో ఆతిథ్యం ఇస్తున్నాము. నిరంతరం మీపాదసేవ చేస్తున్నాను. నిజానికి నావంటి అదృష్టవంతురాలు లేదు. కాని ఐశ్వర్యాలన్నీ ఒకఎత్తు. సంతానం ఒకఎత్తు. పరమేశునకు మనమీద ఎందుకు కటాక్షంతప్పింది. 'అపుత్రస్యగతిర్నాస్తి' అని పెద్ద లంటారు; సంతానంలేని ఈ వైభవాలన్నీ నిష్ప్రయోజనం గదా! కనుక సంతానంకలిగే ఉపాయం ఆలోచించవలసింది విశ్వానరుడు భార్యనూరడించి, దేవీ!చింతించకు. అర్థశశాంకధరుని కృపచేతమనకు సంతానం కలుగుతుంది. ఆ మహాదేవుని తపస్సుచేసి మెప్పించి వరాలు పొందుతాను. నీవూరడిల్లు మని అనునయించాడు. ఆ మాటలకే పుత్రులు కలిగినంతగా ఆమె

సంతోషించింది. భర్తకు నమస్కరించి నన్ను పుత్రవంతురాలుగా దీవించి, పరమేశ్వరుని వరముకోరేటప్పుడు ఆయనవంటికుమారుడు కావలెనని ప్రార్థించండి అన్నది. భార్యమీది అనురాగంతో విశ్వానరుడు సరేఅన్నాడు.

మరుక్షణంలో ఆయన మనస్సులో అనేక భావతరంగాలు చెలరేగినాయి. ఏమిటీ వింత ? ఈమెకు ఇటువంటి కోరిక కలిగింది. పరమేశ్వరునితో సమానుడు మరొకడెవరు ? అతడు సమానాధిక రహితుడే. అలాంటప్పుడు ఈమెకోర్కె ఎలాతీరుతుంది. ఈశ్వరునికి తెలియకే ఈమెకీ కోర్కె జనిస్తుందా ? భవితవ్యం ఎలా ఉంటుందో ! అని పరిపరివిధాల తర్కించుకొన్నాడు. ఒక శుభముహూర్తాన పుత్రసంతాన లబ్ధికై నియమవ్రతం పూనినాడు.

తన అర్ధాంగికోరిక తీర్చటానికి పరమశివారాధనమే మార్గమని విశ్వానరుడు కాశీక్షేత్రానికి వెళ్ళినాడు. అక్కడగల అన్నిఘట్టాలలో సమంత్రకంగా పెక్కుమార్లు స్నానంచేశాడు. కాశీయందున్న బావులు, తటాకాలు, కాలువలు నీటిబుగ్గలు అన్నింటిలో మునిగాడు. వారణాసిలో నెలకొన్న విఘ్నేశుడు, భద్రకాళి, లోలార్కుడు కాలభైరవుడు మొదలయిన సమస్తదేవతలకు, నివాళులర్పించాడు. భాగీరథీ తీర్థానగల అన్నితీర్థాలలో పిండప్రదానంచేశాడు. కనబడిన ప్రతిలింగమునకు మ్రొక్కినాడు. గూఢలింగాలను అర్చించాడు. కాశియందుగల ఓంకారేశ్వర, కృత్తివాసేశ్వర, కాశీశ్వర, వృద్ధకాశీశ్వర, కలశేశ్వర, కేదారేశ్వర, కామేశ్వర, జ్యేష్ఠేశ్వర, దశాశ్వమేధేశ్వర, దృక్కేశ్వర, గరుడేశ్వర, గోకర్ణేశ్వర, గణేశ్వర, ఢుంఠీశ్వర, గజసిద్ధేశ్వర, ధర్మేశ్వర, తారకేశ్వర, చండికేశ్వర, మోక్షేశ్వర, గంగేశ్వర, వ్రతేశ్వర, త్రిపురేశ్వర, మార్కండేశ్వర, మణికర్ణికేశ్వర, యమునేశ్వర, లాంగలేశ్వర, శ్రీవిశ్వేశ్వర, అవిముక్తేశ్వర

వ్యాఘ్రేశ్వర, వారాహేశ్వర, వ్యాసేశ్వర, వృషభధ్వజ మొదలయిన నామాలతో లెక్కకు మిక్కిలిగా ఉన్న శివలింగములను అర్చించాడు. ఒక్క దివ్యప్రదేశంలో తపస్సుచేసి పుత్రసంతానం పొందుతాను అని ఆలోచిస్తుండగా అతని మనస్సులో తటుక్కున ఒక్క ఆలోచన కలిగింది.

అయ్యయో ! మరచిపోయినాను. సర్వసిద్ధికరము, సిద్ధసేవితము తీర్థరాజము అవిముక్తక్షేత్రం జ్ఞప్తికి రాలేదు సుమా ! అసలు కాశీ క్షేత్రంలో ఏ ప్రదేశం పవిత్రమైనది కాదు ! సూదిమోపేటంత ప్రమాణమైన నేలకూడ వృధాఅయినది కాని, అపవిత్రమైనది గాని లేదు. ఇక్కడి తీర్థాలు అర్బుదాలు న్యర్బుదాలు. కాశీలో ఎక్కడ మృతిచెందినా వానికి మోక్షద్వారాలు తెరువబడి ఉంటాయి. ఇక్కడ నివసించే సమస్త జంతుకోటికి మోక్షం కరతలామలకం. విశ్వనాథుని సతి విశాలాక్షీదేవి ఈ పట్టణంలో ఎల్లప్పుడు నివసిస్తుంటుంది. కోరికలను తీర్చే సిద్ధి వినాయకుడు, క్షేత్రపాలకుడయిన భైరవుడు ఆ పట్టణానికి కాపుగా ఉంటారు. విశ్వేశ్వరుడు అన్నపూర్ణా సతితోకూడి ఎక్కడ ఉంటాడో అక్కడే భుక్తి ముక్తి ఉంటాయి. కనుక ఆ ప్రదేశంలోనే తపస్సు చేస్తాను.

అప్సరస స్త్రీలు ఆటపాటలు ప్రదర్శించి మనోరథ సిద్ధిని పొందినారు. గంధర్వ లోకడు తన గానవిద్యతో మహేశ్వరుని అర్చించి ముక్తిపొందాడు. యక్షదంపతులు ఈ చోటనే శివుని గొల్చి కైవల్యం పొందినారు. శతరుద్రమంత్రజపంచేసి వేదశిరుడనే విప్రుడు మోక్షం పొందినారు. సిద్ధులు సాధ్యులు వాంఛాఫలసిద్ధి పొందగలిగారు. ఎల్లరు సిద్ధిపొందిన ప్రదేశం కావటంచేత ఈస్వామికి సిద్ధేశ్వరుడని పేరు కల్గింది.

# వీరేశ్వర ప్రభావం

ఆ మహా జ్యోతిర్లింగమూర్తికి వీరేశ్వరుడనే ప్రసిద్ధి కలదు. అతడే జయద్రథుడికి, విదూరథుడికి, మగధరాజుకు, వసుదత్తుడికి కోర్కెలను తీర్చినవాడు. ఈ స్వామి నర్చించి అభిమతార్థములు పొందుతాను అని ఆలోచనచేశాడు విశ్వానరుడు. అనంతరం అతడు చంద్రకూప జలంతో అభిషేకం చేశాడు. నియమవ్రతుడయి ఒక నెల ఏకభుక్తం చేశాడు. ఒక నెల నక్షత్రదర్శనం అయింతర్వాత ఆహారం తీసుకొన్నాడు. ఒక మాసంరోజులు ప్రయత్నంలేకుండా దొరకిన ఆహారంతో గడిపాడు. ఒక నెల అసలు భోజనమే మానివేశాడు. పాలు మాత్రం సేవించేవాడు. ఒక నెల పంచ్ఞుతిని ఉన్నాడు. గుప్పెడు నువ్వులుమాత్రం తింటూ ఒక నెల కాలంగడిపాడు. ఒక నెల నీరు మాత్రమే త్రాగినాడు. ఒక నెల పంచగవ్యాలు తిన్నాడు. ఒక నెల చాంద్రాయణ వ్రతం ఆచరించాడు. దర్భచివరల ఉండే నీటిబొట్లతో ఒక నెల నియమం పాటించాడు. ఒక నెల వాయువును ఆహారంగా తీసుకొన్నాడు. ఇలా సంవత్సరం గడిచింది.

నూతన సంవత్సరంలో మొదటి దినం సూర్యోదయమైంది. అనూరుడు తీక్షణంగా వెలికివచ్చాను. ఏడు అంచెలుగా ఉండే గుర్రాలను తన ఆజ్ఞప్రకారం నడుపుతున్నాడు. వెండి పేత్రానికి బదులుగా మునికోల ధరించాడు. వెంటబడి తరుముతూ చీకటిని వెన్నుచరిచి సాగనంపుతున్నాడు. ఒక్కొక్క కొండనే గురుతుచూపుతూ వాటిమధ్యలో ప్రకాశిస్తున్నాడు. కర్మసాక్షి అయిన దినకరుని ప్రతీహారిగదా అతడు.

విశ్వేశ్వరస్వామి నగరిలో ప్రథమ సంధ్యాకాల బలికంఠధ్వని వినవస్తున్నది. అవిముక్తక్షేత్రంలో విశాలాక్షీదేవి నిలువుటద్దము

ముందుండి తిలకం ధరిస్తున్నది. కుక్కుటస్వాములు నాలుగువైపుల మండి హెచ్చరికలు చేస్తున్నారు. రేయంతా గడచి కాపలాకాచిన క్షేత్ర పుడు ఒక ప్రక్కన కూలబడి కన్నుమూస్తున్నాడు. విఘ్నేశ్వరుడు తొండమువింద పీడుపీల్చి ఆకసమువైపు నీటిధారలను చిమ్ముతున్నాడు.

తొలి సంధ్యాసమయంలో లోకమంతా జాగృతమయి తమతమ విధు లను నిర్వర్తింపసాగింది. ముక్తిమంటపంలో ద్విజులు సావిత్రి మపాసిస్తున్నారు. పరమహంసలు ఉపనిషద్వీధులలో బ్రహ్మసదాస్తి మీమాంసను శోధిస్తున్నారు. యోగులు వేదాంతవాసనా ఆనందామభూతిలో ధైర్యం వదలకుండా ఉన్నారు. ప్రత్యగ్రగోపాలరజ్జువులతో బహూ దకుడు దండత్రయం ధరించాడు. ఒడలినిండా భస్మం అద్దుకొని పాశు పతులు ఎర్రనిజడలు ముడివేసుకొన్నారు.

ఉదయ సూర్యకాంతి ప్రభలు లోకంతంతా వ్యాపించాయి. పర్వ తాలలోని ధాతుశిల, చెట్లయందలి చిగురాకులు, సముద్రాలలోని పగడపు తీగ, మబ్బులలోని మెరుపుతీవె, దిగ్గజములు ధరించిన సిందూరం, భూమి ధరించిన బంగారునగలు, బ్రహ్మాండం అనే ఇంటిలో వెలుగుతున్న దీప ములా అన్నట్లు ప్రకాశిస్తున్నాయి.

సూర్యోదయ సమయంలో విశ్వేశ్వరుడు అఘమర్షణ సూక్తులు పఠిస్తూ సమస్తపాపవినాశిని అన పవిత్ర గంగా ప్రవాహంలో స్నానం ఆచరించి సూర్యభగవానుడికి అర్ఘ్యప్రదానంచేసి అర్చించాడు. హోమ గుండంలోని భస్మాన్ని శరీరమంతా అలదినాడు. రుద్రాక్షమాలికలు ధరించాడు. మహా సరస్వతికి మ్రొక్కినాడు, స్కందునకు ఏటికోళ్లు సమర్పించాడు. విఘ్నేశ్వరుడికి ప్రణతులర్పించాడు. ఆదిత్యులనిలాగ్ను లను ఉపాసించాడు. పుండరీక వర్మాసనంపై తూర్పుముఖంగా పద్మా

నవస్థుడై కూర్చున్నారు. నిశ్చలుడయి ప్రాణాయామం ఆచరించి చిత్తశుద్ధి పొందించుకొన్నాడు. విశుద్ధవేదాంతజ్ఞానం కలవాడు కావటంచేత చూడ తగినవాడు, వినదగినవాడు, ధ్యానింపతగినవాడు, అఖండ సచ్చిదానంద రూపుడు, అద్వితీయుడయి జ్యోతిర్లింగమయ స్వరూపుడయిన అవిముక్తేశ్వరుని మనస్సులో నిల్పి నిశ్చలభావంతో ఆరాధిస్తున్నాడు.

విశ్వానరుని భాగ్యం పండింది. మహేశ్వరున కాతనిపై దయ కలిగింది. ఈశు డతనిని కటాక్షింపదలచాడు. వీరేశ్వరలింగం మండి మహాతేజస్సంపన్ను డయిన ఒక బాలుని పొడసూపినాడు. ఎంత అద్భుతం ! ఫాలంపై త్రిరేఖాయుతమై భస్మం రాజిల్లుతున్నది. అత్యంత మనోహరంగా ఆ బాలుడు పంచాక్షరీజపం చేస్తున్నాడు. కమనీయమైన ఆ ధ్వని దిక్కులన్నింట ప్రతిధ్వనిస్తున్నది. అతడిని చూడగానే విశ్వానరుడు ఆనందపులకితగాత్రు డైనాడు. అతని కన్నులవెంట ఆనంద బాష్పాలు జాలువారుతున్నాయి. బయటి ప్రపంచాన్నే మరచిపోయాడు. ఫాలంమీద అంజలి ఘటించాడు. ఆ మహదానంద స్థితిలో విశ్వానరుడు మందరస్వరంలో ఏమో అంటున్నాడు. బ్రహ్మమొక్కడే సత్యం. రుద్రు డొక్కడే కర్త. సమస్త విశ్వానికి ఆధారభూతు డతడే. అట్టి మహనీయుడవయిన నీకు నమస్కారము. నీటియందు చల్లదనం, అగ్నిలో దహనత్వం, సూర్యుడియందు తాపం, చంద్రుడియందు ప్రసాదత్వం, పూవులలో వాసన అంతర్లీనమై ఉన్నట్లుగా నిఖిల జీవకోటిలో అంతరాత్మ రూపానఉండే నీకు నమస్సులు. ఇంద్రియాలు లేకుండానే సమస్తజ్ఞానం పొందగలిగినవాడవు నీవే ! కులగోత్రములు, నామరూపములు శీలం ఏది తెలియరాని వాడవు నీవే ! భక్తుల అభీష్టాలు తీర్చటానికి పురుషాకృతి ధరించిన వాడవు నీవే ! సృష్టిస్థితిలయాలుచేసే

దివ్యస్వరూపం నీవే ! అని అనేకవిధాల స్తోత్రంచేసి సాష్టాంగ దండ ప్రణామం చేశాడు.

పరమేశ్వరుడు అతని నిశ్చలతకి, ఉపనిషద్వాక్యార్థ స్తోత్రానికి సంతసించాడు. ముగ్ధస్వరంతో అమృతసేచనమైన పలుకులతో "బ్రాహ్మణోత్తమా ! నీ మనోరథం నాకు తెలుసు. పతివ్రతా తిలకమైన నీ పత్ని శుచిష్మతియందు నీకు పుత్రుడుగా నేనే జన్మిస్తాను. కాశీయందు చేసిన తపస్సు వృధా అవుతుందా ! అచిరకాలంలోనే మీ దంపతుల కోర్కె ఫలిస్తుంది. నీ వింక ఇంటికేగవలసిందని" అనతిచ్చాడు. అనంతరం ఆ బాలుడు వీరేశ్వరలింగంలోనే అంతర్హితుడైనాడు. సంతుష్ట హృదయంతో విశ్వానరుడు ఇంటికేగి భార్యతో జరిగినదంతా వివరించాడు. ఆనందంతో ఆ దంపతులు యథావిధి శివార్చన చేస్తూనే ఉన్నారు.



# చతుర్థాశ్వాసం

అనంతరం కొద్దికాలానికే శుచిష్మతి గర్భందాల్చింది. చెక్కిళ్ళు తెల్లబడినవి. చనుముకులునల్లనైనవి. గర్భస్థుడు కాలకంఠుడన్న విషయం తెలియపరచటానికా అన్నట్లు నాభియందు నారుగారు కొన్నది. అవ్యక్తమైన కాంతి ఆమె శరీరంలో వ్యక్తం కాజొచ్చింది. చూచినవాళ్ళంతా ఆ కాంతికి ఆశ్చర్యపడుతున్నారు. యజ్ఞయాగాదులలో హుతద్రవ్యాలను పురోడాశమును తానే ఆరగింపవలెననే కోర్కె జనించేది. అవును మరి. యజ్ఞపురుషుడయిన పరమాత్మ ఆమె గర్భస్థుడు గదా! అలాటి కోరిక జనించటంలో ఆశ్చర్యం ఏముంది.

విశ్వానరుడు, బంధువులు ఆమెకు గృహ్యోక్తప్రకారం పుంసవనం సీమంతోత్సవాలు నిర్వర్తించారు. పదినెలలు నిండి ప్రసవసమయమాసన్నమైంది. గురువుకేంద్రంలో ఉండగా శివలగ్నంలో అవిముక్త వీరేశ్వరుని దివ్యతేజోరూప విశేషాలతో సమస్త శుభలక్షణాలతో శుచిష్మతికి కుమారుడు జనించాడు. ఆకాశంనుంచి పుష్పవర్షం కురిసింది. దేవదుందుభులు మ్రోగినాయి. ముల్లోకాలలోవారికి ఏదో తెలియరాని ఆనందం కలిగింది. బ్రహ్మావిష్ణులు దేవేంద్రాది దేవతలు విశ్వానరునింటికి వచ్చారు. జాతకర్మాదులు నిర్వర్తింపజేసి ఆ బాలుడికి గృహపతి అనే నామకరణం చేసి దేవతలు తమతమ లోకాలకు వెళ్ళారు.

శుక్లపక్ష చంద్రుడివలె ఆ బాలుడు దినదిన ప్రవర్ధమానుడవుతున్నాడు. అయిదవయేట ఉపనయనంచేసి గురుకులానికి పంపించారు. అత్యంత శ్రద్ధాసక్తులతో గృహపతి సాంగంగా వేదాన్నికూడ అభ్యసించాడు.

కొన్నిరోజులకు అక్కడకు నారదుడువచ్చారు. దేవర్షినిచూడగానే

విశ్వానరుడు భక్తితో ఎదురుగాపోయి ఆహ్వానించాడు. అర్ఘ్యపాద్యాదు లొసగి అర్చించాడు. మార్గాయాసం తీరినతర్వాత నారదుడు విశ్వానరా! పతివ్రతామతల్లీ! శుచిష్మతీదేవీ! కుశలమా కుమారుడు మీ యెడల భక్తి శ్రద్ధలుకలిగి ఉన్నాడా. తల్లిదండ్రులమాట ధిక్కరించకుండటమే తనయుల ధర్మంగదా. దైవం గురువు ధర్మం మాతాపితరులే సుమా! అందున తల్లి ఋణం తీర్చరానిది. నవమాసాలు మోస్తుంది. ప్రసూతిసమయంలో భరించరాని వేదనను భరిస్తుంది. పసిపాపలుగ ఉన్నపుడు ఏవగించుకొనక మలమూత్రాలు సైతం తీసివైచి శుభ్రపరుస్తుంది. తల్లిదండ్రులు పడరాని పాట్లయినాపడి బిడ్డలను పోషించుకొంటారు. ఇట్టి తల్లిదండ్రుల పాదాలకు ఉదయాననే నమస్కరిస్తే ఆయుస్సు పెరుగుతుందని పెద్దలంటారు. గంగా యమునా సరస్వతీ మొదలయిన పుణ్యనదీ జలాలకంటె తల్లిపాదములు కడిగినజలమే మిక్కిలి పవిత్రమైనది. ఎల్ల దేవతలు తల్లితరువాతనే అర్చింప తగినవారు అని ప్రస్తావవశంగా నారదుడు జననీజనకులసేవను ప్రశం సిస్తున్నాడు. గృహపతివచ్చి ఆయనకు నమస్కరించాడు. ఆ బాలుడిని ఎత్తి తొడపై కూర్చుండబెట్టుకొని నారదుడు అతని అవయవాలను పరిశీలించాడు. అరచేతిని పరీక్షగాచూచాడు. చూడగానే అతని ముఖం వివర్ణమయింది. నారదుని ముఖకవళికలను చూస్తున్న విశ్వానరుడి మనస్సు ఎందుకో ఆందోళనకు గురయింది. దేవర్షి విశ్వానరునితో విశ్వానరా! నీ కుమారుడు సర్వశుభలక్షణాలు కలవాడు, ఇన్ని మంగళకరమైన లక్షణాలను కూర్చిన విధాత ఎక్కడనో ఒక అవలక్షణం కల్పిస్తాడు. సాముద్రిక లక్షణాలు చూస్తే ఈ బాలుడు ఒక లోకానికే అధిపతి కాదగినట్లుంది. కాని ఏం ప్రయోజనం. ఈ తని అవలక్షణం చెప్పటానికి నోరురావటంలేదు. చెప్పకుండా ఉండటానికి మనస్సంగీకరించటం లేదు. కనుక యథార్థం తెల్పుతాను వినుమ. నీ కుమారునికి పన్నెండవసంవత్సరాన వజ్రాయుధం

కారణంగా గండంఉంది. అనిచెప్పి నారదుడు అక్కడనుండి వెడలినాడు.

పిడుగుపాటువంటి ఆ వార్తవిని శుచిష్మతి విశ్వానర దంపతులు కుప్పగూలినారు. దుఃఖభారంతో క్రుంగిపోయిన తల్లిదండ్రులను చూచి వైశ్వానరుడు అమ్మా ఎందుకు దుఃఖిస్తావు. తండ్రీ ఎందుకు విచారం. మీ పాదపద్మధూళి నాకు సర్వదా రక్షణగా ఉంది. అలాంటప్పుడు మృత్యువు నావద్దకెలావస్తుంది ? అహంకారంతో అది నాదగ్గరకువస్తే హుంకార మాత్రంచేతనే దూరంగా నెట్టివేయగలను. వజ్రసమానమైన నా ఎడమ పాదంతో దాని పళ్ళురాలదంతాను నేనిప్పుడే కాశీపట్టణానికి వెళ్ళి మహా కాలుడయిన విశ్వనాథుని చరణారవిందాలను శరణుజొచ్చి, మృత్యువుకే నేను మృత్యువును ఔతాను అని ఉఃరిటగా పల్కినాడు.

కుమారుని మాటలకు పాపమా దంపతులకు అంత దుఃఖంలోను సంతోషం కలిగింది. కొడుకును అక్కునచేర్చుకొని, నాయనా దీర్ఘాయుష్మంతుడవు కావలసింది. మహాదేవుడు అప్రతిమాన మాహాత్మ్యం కలవాడు కాలపాశబద్ధుడై ప్రాణభీతితోఉన్న శ్వేతకేతువి రక్షించాడు. శిలాదుని కుమారునకు మృత్యుభయం లేకుండాచేశాడు. కంఠబిలంలో కాల కూటాన్ని అదిమిపేసి లోకాలు ఆఖిలవిషాగ్నికి దగ్ధంకాకుండా నిలిపినాడు. ఆయుష్షునిండిన మార్కండేయుని చిరాయువుగా చేశాడు, అంధక, జలంధర, గజ, వ్యాఘ్రాసురుల మదమణచాడు. దక్షప్రజాపతి గర్వం రూపుమాపాడు. మన్మధుని బుగ్గిచేశాడు. లోకకంటకులయిన త్రిపురాసురులను ఖండించాడు. వారణాసీ పురాధీశ్వరుడికి నిన్ను రక్షించటం ఒక లెక్కగాదు పోయిరమ్మని ఆశీర్వదించి కాశికిపోవటానికి అనుమతించారు.

వైశ్వానరుడు కాశీయందు మణికర్ణికాఘట్టంలో తీర్థమాడి విశ్వనాథుని దర్శించాడు. జ్యోతిర్లింగమయ స్వరూపుడయిన ఆ పరమేశ్వరుని స్తోత్రం

చేశాడు. స్వామీ! పరమానంద నిలయాధిపుడవు నీవే!ముల్లోకాలు నీవలననే కలిగాయి. బ్రహ్మరసాయన పదార్థం నీవే! లింగరూపం ధరించిన నిర్వికార నిరాకారుడవు. దైవల్యంప్రసాదించే దైవానివి అని సాష్టాంగదండ ప్రణామాలు అర్పించాడు. ఆ పుణ్యప్రదేశంలో ఆశ్రమం నిర్మించుకొన్నాడు. ఒక శుభముహూర్తాన తాను పరమేశ్వరుని లింగరూపాన ప్రతిష్ఠచేశాడు. దాని సమీపంలో కూర్చుని ఘోరమైనతపస్సు చేయనారంభించాడు. రెండు పత్సరాలు గతించాయి. అనంతరం ఒకనాడు ఐరావతారూఢుడై ఇంద్రుడు ప్రత్యక్షమయినాడు. వజ్రాయుధం చేతిలో మెరుస్తున్నది. మహేంద్రుడా బాలునితో నీ తపస్సుకు సంతసించాను. నేను దేవేంద్రుడను. ఏం వరం కావాలో కోరుకొమ్మన్నాడు. వైశ్వానరుడు అతనికి నమస్కరించి బల సూదనా! నిన్నునేను వరంకోరను, నాకధిపతియైన కాశీశ్వరునే వరమిమ్మని ప్రార్థిస్తాను అన్నాడు. దానితో ఇంద్రుడు అహంకరించి ఏమిటీ! కాశీశ్వరుడని ఒక దైవం ఉన్నాడా? ముల్లోకాలాను పాలించేది నేనుకానా? సమస్తవిశ్వానికి నేనే అధిపతిని. నాకంటె వరాలిచ్చేవాడు మరొకడు లేడు అన్నాడు.

అతని మాటలకు వైశ్వానరుడు కంటగించుకొన్నాడు. సోత్కర్షతో పాటు ఈశ్వరనిందను అతడు సహించుకొనలేక పోయినాడు. మహేంద్రా ఎంతకీ గర్వోక్తులు. నీ మాటలు నన్ను పరీక్షించటానికి కాదుగదా? మహేశ్వరుని తూలనాడితివే! నీ శక్తి అఫాలనేత్రుని శక్తి లోకానికే తెలుసు. నీ అధికారం ఆధిపత్యం తెలియని వాడనుకాను. నిన్ను యాచించటం కల్పవృక్షాన్ని వదలి గడ్డిపరకను ప్రార్థించటం వంటిది. నీవంటివాళ్ళు మాబోంట్ల కోరికలు తీర్చటానికి సమర్థులు కారు. చంద్ర మౌళీశ్వరుడే నాకు దేవుడు. నీ వ్యక్తప్రసంగాలతో నా తపస్సుకు భంగం

కలిగించక వెళ్ళవో అని పరుషంగా పలికినాడు. దానితో ఆ అహల్యా జారుడు క్రోధాంధుడై విరోధిదళనదక్షమైన వజ్రాయుధాన్ని ఝళిపించాడు. కనులు మిరుమిట్లుగొలిపే కాంతులు, కొండలు బ్రద్దలవుతున్న భయంకర ధ్వనులు, భూనభోంతరాళాలు నిండాయి. దిక్కులు పిక్కటిల్లే ధ్వనులకు వైశ్వానరుడి గుండె తటతటమని కొట్టుకోసాగింది. మనస్సు కంఠే కాలునిపై నిలిపి ధ్యానంచేస్తూ మూర్ఛనొందినాడు. ఆ సమయంలో దంభోళిధారాధ్వానాన్ని మించిన మహాధ్వని మరొకటి వినిపించింది. కోటి సూర్యప్రభలతో కాంతిపుంజం వెలువడి మరుక్షణంలో ఆకృతి ధరించింది. జటాజూటంపై చంద్రరేఖ. కంఠమూలంలో కాలకూటచ్ఛాయ, పడగవిప్పి బుసలుకొడుతున్న నాగరాజు, శరీరమంతా అలదినభసిత ధవళకాంతులు వెదజల్లుతూ నిటలేక్షణుడు సాక్షాత్కరించాడు. ప్రళయకాలుని చూడగానే దేవేంద్రుడు కంపితగాత్రుడయి ముకుళితహస్తాలతో పాహి పాహి అని నమస్కరించి తనతప్పును క్షమించమన్నాడు. పరమ కృపాళువు భోళా శంకరుడయిన ఈశుడు అతనిని క్షమించాడు. అమృతహస్తాలతో వైశ్వా నరుని లేవదీసినాడు. త్రైలోక్యమల్లుని కరస్పర్శతో ఆ బాలుడు పూర్వ తేజస్సును సత్వాన్ని పొందాడు. పరమశివుడు అతనినిచూచి వైశ్వానరా! నీవు నా అంశలో జనించిన పావకుడవు. భక్తితో నన్ను జయించావు. నీ వాంఛితం నాకు తెలుసు. నీవు పూర్ణాయుష్కుడవే గాదు దీప్తి మంతుడవై అగ్నిలోకానికి అధిపతివై విలసిల్లు. ఆగ్నేయదిశాధిపత్యం నీకు ఒనగుతున్నావని చెప్పి అంతర్హితుడయినాడు. పరమేశ్వర కృపకు పాత్రుడయిన వైశ్వానరునిచూచి, ఇంద్రుడు పూర్వపు వైరంమాని సఖ్యంచేసుకొని అమరావతి కేగినాడు.

ఈ విధంగా దూతలు అగ్నిలోక వృత్తాంతం వివరించారు. ఇంత లోనే రథం మహర్లోకానికి దగ్గరగా వచ్చింది. అగ్నిలోక వృత్తాంతం

వివి ఆశ్చర్యభరితు డయిన శివశర్మ దూతలతో మహాపురుషులారా ! నాకు అన్నిలోకాలు చూపి అక్కడి వృత్తాంతాలు విపులంగా చెప్పవలసిందని ప్రార్థించాడు. దూతలు సంతసించి ఇలా చెప్పసాగారు,

## నిరృతిలోక వృత్తాంతం

మహాభాగా ! ఇంతకుముందు యమలోకాన్ని చూదారుగదా ! ఆసంయమనీపురానికి అవతల మరొక లోకం ఉంది. దానిలో జాతి మాత్రంచేత రాక్షసులయినవారు కొందరున్నారు. వారంతా వేదమార్గాన్ని అనుసరిస్తారు. నిత్యం తీర్థాలలో మంత్రపూర్వకంగా స్నానంచేసి దేవ పూజలయందు మిక్కిలి ఆసక్తి కలిగి ఉంటారు. దానశీలురు. దయా పరులు సత్యాహింసలు వ్రతంగా కలవారు. దానిని నిరృతిలోకం అంటారు. ఒక్క కాశిలోతప్ప తక్కిన క్షేత్రాలలో మరణించినవారు ఇక్కడకు చేరుతారు. ఈ లోకానికి నిరృతి అధిపతి.

వింధ్య పర్వతశ్రేణులమధ్య ఒక పట్టణంఉంది. దానిప్రక్కనున్న పల్లెను పింగాక్షుడనే కిరాతుడు పాలిస్తుండేవాడు. అతడు క్రూరకర్మముల పై ఆసక్తిలేనివాడు. సింహాలు పులులు మొదలయిన క్రూరమృగాలను తప్ప ఇతర జంతువులను చంపేవాడుకాదు. క్రూర జంతువులనుకూడ నీరు త్రాగేటప్పుడు, నిద్రించేటప్పుడు, రోగంతో ఉన్నవాటిని, అంగ వైకల్యం ఉన్నవాటిని చంపేవాడుకాదు. ఆ అరణ్యమార్గంలో వెళ్ళేయాత్రికులను ఎంతగానో ఆదరించేవాడు. పండ్లు, దుంపలు ఇతర పదార్థాలు సమర్పించి తృప్తిపరచేవాడు. పాదరక్షలు, గొడుగులు వస్త్రాలు తాళపత్రాలు మొదలయినవి ఇచ్చి సంతోషపరచేవాడు. మార్గమధ్యంలో రోగగ్రస్తు లయితే వారికుపచారాలు చేయించేవాడు. అడవిలో దొంగలవల్ల వారికే

బాధలురాకుండా కాపాడుతుండేవాడు. యాత్రికులు అతని సవర్యలకు ఆనందించి, అతనిని దీవించివెళ్ళేవారు.

పింగాక్షుడికి పినతండ్రి యొకడున్నాడు. వాడు మహాక్రూరుడు. పింగాక్షుడు లేనిసమయంచూచి బాటసారులను పేధించేవాడు. దోచుకొనేవాడు. ఒకరోజున అతడు తనపరివారంతో తీర్థయాత్రలకేగుతున్న ఒక గుంపుపై బడినాడు. దొరికినవారిని బాదమోది దోచుకొంటున్నారు. పాపం తైర్థికులు చెట్టుకొకరు పుట్టకొకరుగా పరుపెత్తినారు. ఆర్తనాదాలు చేస్తున్నారు. దైవవశాత్తు పింగాక్షుడు ఆపరిసరప్రాంతానికి రావటం తటస్థించింది యాత్రికుల దీనాలాపాలు అతనికి వినిపించాయి. వెంటనే అతడు ఎలుగెత్తి ఈ ప్రాంతాన్ని పాలించే పింగాక్షుడను నేనిదేవస్తున్నాను మీకేమీ భయం లేదు, అని అరుస్తూ ఆప్రాంతానికి పరుగెత్తినాడు. లేళ్ళగుంపుపైకి దుమికే సింహంలాగా గర్జిస్తూ నానావిధములయిన ఆయుధాలతో ఆ దొంగలను మర్దించాడు. తన్కూరులుకూడ చేతనయినంతవరకు ఆయుధాలు రాళ్ళు పింగాక్షునిపై విసిరారు, శక్తిచాలకచివరకు పారిపోయారు. అతని పిన తండ్రిముందే కనుమరుగయినాడు. దోపిడిదొంగలు పోయినతరువాత సార్థ వాహులు మరల గుంపుగజేరి ప్రయాణం సాగించారు.

కాని పింగాక్షుడి శరీరమంతా గాయాలు తగిలాయి. శరీరం అంతా రక్తమయం. ఒడలు ఎక్కడచూచినా సందులేకుండా చిల్లులుపడినాయి. చివరకతడు మరణించాడు. పరోపకారి పరాయణుడయిన పింగాక్షుడు తరువాతిజన్మలో దిక్పతియైనై ర్ఋతి దిశాధిపత్యం పొందినాడు.

పుణ్యమూర్తీ! నైర్ఋతిలోకానికి ఉత్తరంగా వరుణలోకంఉంది. అదిగో అదే వరుణలోకం. ఈలోకంలో బావులు చెరువులు త్రవ్వించిన వారు, మధ్యేమార్గంలో బాటసారుల శ్రమను పోగొట్టటానికి చల్లని నీడల

నీడనిచ్చే చెట్లు నాటించినవారు. ఉద్యానవనాలను నిర్మించిన పుణ్యులు నివసిస్తారు. నియమవ్రతులై నిత్యం రుద్రాభిషేకం చేసినవారు తీయని పానకములచే ప్రజలను సంతృప్తి పరచినవారు, వేసవిలో చలువ పందిళ్ళు వేయించి పాంథుల దప్పిక తీర్చినవారు, తీర్థములలో పుణ్యక్షేత్రములలో భోజనాది సౌకర్యాలు కూర్చినవారు, నీటిలో ఏదైనా జంతువు మునిగిపోయే సమయంలో ఒడ్డుకు చేర్చి కాపాడినవారు, వరుణలోకంలో చిరకాలం నివాసం చేస్తారు. పుణ్యతీర్థాలకు మెట్లు కట్టించినవారికి కూడ ఇది స్థిరనివాసం.

ఈ లోకాన్ని పాలించేది వరుణదేవుడు. ఆయన జలాధి దేవత. ఇతనికి లోకాధిపత్యం ఎలా వచ్చిందో విను.

కర్దమ ప్రజాపతికి శుచిష్మంతుడనే కొడుకున్నాడు. అతడు ఆకారంలోనే కాదు, గుణాలలోగూడ చక్కని అందగాడు. శుచిష్మంతుడు చిన్నవాడుగ ఉన్నప్పుడు తోటిబాలురతో కూడి తన ఆశ్రమానికి అనతి దూరంలో ఉన్న అచ్ఛోదమనే కొలనులో జలక్రీడ లాడుతుండేవాడు. ఒక నాడు అతడు నీటిలో ఆడుతుండగా ఒక మొసలి పట్టుకొన్నది. అది చూచి తక్కిన బాలురు భయంతో పరుగెత్తుకొనివచ్చి అతీంద్రియ స్థితిలో ఉన్న కర్దమునికి చెప్పారు. కుమారుని ఆపద మాట నిశ్చలధ్యానమగ్నుడయిన అతని చెవిన పడినదో లేదో తెలియదు. సమాధినిష్ఠుడయిన కర్దమునికి సమస్త భువనాలు కనిపించసాగాయి. అరణ్యాలు, సముద్రాలు అన్నీ కనిపించి చివరకు శుచిష్మంతుడు జలక్రీడలాడుతున్న సరస్సు గోచరించింది. మొసలి కోరలతో తన కుమారుని తీసికొని పోవటంకూడ కనిపిస్తుంది.

మొసలి శుచిష్మంతుని తీసుకొని సముద్రుని వద్దకు వెళ్ళింది. ఇంతలో క్రోధంతో ఎర్రబడిన నేత్రాలు కలిగి త్రిశూలం ధరించిన ఒక

మహాపురుషుడు అక్కడికివచ్చి సముద్రా! ఇతడు పరమశివభక్తుడయిన కర్దమప్రజాపతి తనయుడు. ఎందుల కితనిని ఇక్కడికి రప్పించావు. నీలకంఠుని ప్రభావం తెలియదా నీకు ? అని కఠినంగా ప్రశ్నించాడు. సముద్రుడు ఆ శివకింకరుని చూచి భయకంపితుడయినాడు. సముద్రుడు మొసలిని పాశంతో బంధించాడు. శుచిష్మంతునికి రత్నాలిచ్చి గౌర వించాడు. కింకరుని వెంట ఆ బాలుని పంపించాడు. ప్రమథు డాతనిని తీసుకొని కర్దమప్రజాపతియొద్దకు వచ్చినాడు. ఇదంతా కర్దమునకు గోచ రిస్తూనేఉంది. కన్నులుతెరచి చూడగానే కుమారుడు, శివకింకరుడు కని పించారు. కింకరుడు కర్దమునివద్ద సెలవు గైకొని వెళ్ళినాడు. పుత్రుని శరీరంమీద మొసలికోరల గుర్తులు కనిపిస్తున్నాయి. కళ్ళెర్రబడి ఉన్నాయి. తలవెంట్రుకల చివరల నీటి బిందువులు ముత్యాలవలె ప్రకా శిస్తున్నాయి. చాలాదూరం ప్రయాణంచేసిన అలసటతో నిట్టూర్పులు విడుస్తున్నాడు. శుచిష్మంతుడు తండ్రికి నమస్కరించాడు. చచ్చి బ్రతికివచ్చిన పుత్రుని కర్దముడు ఆనందాతిరేకంతో ఆలింగనమొనర్చు కొన్నాడు.

శివశర్మాభిఖ్యా ! మహానుభావా ! కర్దమునివంటి నిష్ఠాగరిష్ఠుని చూడం. ఇలాటి చోద్యం ఎక్కడా వినం. కర్దముని కుమారుని మొసలి తీసుకువెళ్ళినది గదా ! తిరిగి వచ్చేటప్పటికి నూటఅయిదు వత్స రాలు గడిచాయి. అంతకాలం అతడు సమాధిలో నిమగ్నుడయినాడు, ఇంతకాలం అతడు ముహూర్తకాలంవలె గడిపాడు. అనంతరం శుచి ష్మంతుడు తండ్రి అనుమతి తీసుకొని కాశీ పట్టణానికి చేరాడు. అక్కడ గల పుణ్యతీర్థాలలో స్నానంచేసి శివలింగ ప్రతిష్ఠచేసి అర్చించాడు. అతని తపోదీక్షకు మెచ్చి ఈశ్వరుడు ప్రత్యక్షమయినాడు. వరుణపదం అతనికి

వరంగా ప్రసాదించాడు. సమస్త సముద్రాలకు, నదీనదాలకు అధిపతియై పడమటి దిశకు పాలకు డయినాడు. వరుణుడని పిలువబడినాడు.

మణికర్ణికకు నైరృతి దిశనువరుణుడు ప్రతిష్ఠించిన వరుణేశ్వరుని కొలిచినవారికి నీటివలన భయముండదు, జలోదర వ్యాధులు రావు. ఐశ్వర్యవంతులు కాగలరు. అనంతరం విమానం మరో పట్టణానికి సమీపంగా వచ్చింది. దానిని చూసి విష్ణుదూతలు మహాత్మా! ఇది గంధవతి పట్టణం, వరుణ లోకానికి ఉత్తరంగా ఈ నగరం ఉంది. దీనిని వాయుదేవుడు పరిపాలిస్తుంటాడు. ఈ గంధవహుని చరిత్ర ఎంతో ఆసక్తికరంగా ఉంటుంది.

పూర్వం కశ్యపుని జ్ఞాతి పూతాత్ముడనే బ్రాహ్మణుడుండేవాడు. అతడు కాశిలో వేలసంవత్సరాలు తపస్సుచేశాడు. అనంతరం ఒకనాడతడు ఒక శివలింగమును ప్రతిష్ఠించి పరమేశ్వరు నారాధించాడు. అతని తపస్సు పండింది. పరమకృపా సాగరుడయిన శంకరుడు పూతాత్మునకు ప్రత్యక్షమయినాడు. అతడు మహానందమంది ఈశ్వరుని స్తోత్రంచేశాడు. నీవు అనంతనామములతో విలసిల్లే సగుణుడవు. అయినా పరికించిచూస్తే నామరూపాలులేని నిర్గుణుడవు. నీ శరీరంలో దక్షిణభాగం బ్రహ్మ. వామభాగం విష్ణువు. సూర్యచంద్ర అగ్నులు నీనేత్రములు. నీవు సర్వభూతమయుడవు. నీవే సంస్తుత్యుడవు స్తోతవు స్తుతివి. ఇట్టి నీకు ప్రణామములు.

అతనిభక్తికి అలరి పరమేశ్వరుడు అతడు కోరిన దిక్పాల పదవి దయచేసినాడు. తన మూర్తులలోని ఒక అంశాన్నిఇచ్చి అన్నిప్రదేశాలకు నిరాటంకంగా పోగలిగినశక్తి, ప్రాణ, అపాన, సమాన, ఉదాన, వ్యానములనే పంచరూపాలు ప్రసాదించాడు. పూతాత్ముడు ప్రతిష్ఠించిన లింగము పవనేశ్వరుడనే నామంతో ప్రసిద్ధికెక్కింది. అర్చించినవారికి

భోగమోక్షములు కలిగిస్తూ భక్తులకు కల్పద్రుమమై విరాజిల్లుతున్నది.

పిమ్మట ఆ రథం అలకాపట్టణ ప్రాంతానికి వచ్చింది. విష్ణుదూతలు ఆలోకాన్నిచూపి సుహాశ్మా! ఇది ఉత్తరదిశలో ఉన్నలోకం, దీనికధిపతి కుబేరుడు. ఈలోకానికి ముఖ్యపట్టణం అలకాపురి. ఈతని వృత్తాంతం అత్యంత ఆశ్చర్యకరమైనది వినండి.

## కుబేరుని వృత్తాంతం

కాంపిల్యపురంలో యజ్ఞదత్తుడనే బ్రాహ్మణుడున్నాడు. ఆతడు వేదవేదాంగ పారంగతుడు. గుణవతియైన ఒక పడతను వివాహమాడి గార్హస్థ్యధర్మాన్ని చక్కగా నిర్వర్తిస్తున్నాడు. అతిథి అభ్యాగతులను ఆదరించేవాడు. యజ్ఞంచేసి సోమయాజియైనాడు, సమస్తసంపదలున్నా యజ్ఞదత్తునికి సంతానంలేదు. ఆ దంపతులు ఆచరింపని వ్రతంలేదు. మునుగని తీర్థంలేదు. దర్శించనిక్షేత్రంలేదు. చేయనిదానంలేదు.

కొన్నాళ్ళకాదంపతులు కాశీకేగి విశ్వేశ్వరుని ఆరాధించారు. విశ్వనాథుని కృపవలన వారికి ఒకపుత్రుడు జనించాడు. తండ్రిఅతనికి గుణనిధి అని నామకరణంచేశాడు. పంచవర్షప్రాయుడు కాగానేచదువవేసినారు. ఏమి కర్మమోకాని గుణనిధికి విద్యపై ఆసక్తిలేదు. కాలచక్రమిట్టె తిరిగినది. గుణనిధికి వయసువచ్చింది. దానితోబాటు చెడు సహవాసములవడి దుర్గుణాలకు ఆలవాలమైనాడు. జూదమున కలవడినాడు. గురువు వద్దకుపోక ద్యూతగృహములలో నడిరేయివరకు ప్రొద్దులుపుచ్చేవాడు.

అంతతోపోక బ్రాహ్మణాచారమంతా పరిహాసించేవాడు. సంధ్యావందనం మరచి చాలాకాలమైంది. విట, గాయక, నట, పీఠమర్దులతో కాలంగడపేవాడు. జూదగాండ్రను సత్కరించి నానావిధములైన దుర్వ్యాస

లాలనం అతనికి ఆనందం. కులపుత్రులను మిక్కిలిగా గౌరవించేవారు. తండ్రి ఎంతటి ఆ చా ర వం తు డో కుమారుడంతటి దురాచారుడు. విశృంఖలంగా తిరుగుతున్న పుత్రుని చూచి తల్లి హృదయం క్షోభించేది. అతనిని కఠినంగా మందలించటానికి నోరురాదు. కానక కన్న సంతానం కదా! మంచిమాటలతో సన్మార్గంలోకి త్రిప్పాలని ఆతల్లిఆరాటం. యజ్ఞదత్తునికి నిత్యాగ్నిహోత్రవిధి నిర్వహణతోబాటు రాజపౌరోహిత్యం. వీటితో సమయం చిక్కని సోమయాజి గుణనిధిని పరామర్శించటానికి వీలుపడేది కాదు. ఎప్పుడయినా కొంచెం అవకాశం లభిస్తే భార్యను అడిగేవాడు.

గుణనిధి కనబడ డేమి ?

ఇప్పటివరకు ఇక్కడే ఉండి వెడలినాడు.

స్నానం చేసినాడా ? సంధ్యాకృత్యం తీర్చినాడా ?

స్నానంచేసి ఇప్పుడే సంధ్యాకృత్యం నిర్వర్తించి వెళ్ళినాడు ;

అగ్నిహోత్ర విధిని నిర్వర్తించాడా ?

అగ్నిహోత్ర విధి నిర్వర్తించి స్వాధ్యాయ మొనరించాడు ఇప్పటి వరకు.

సోమయాజికి యదార్థం తెలిస్తే కోపగిస్తాడని సోమిదమ్మ కుమారుని గురించి ఎన్నో అబద్ధాలు చెబుతూ కొడుకు తప్పులను కప్పి పుచ్చుతుండేది. తల్లి ప్రేమ అంతే. చూపరాని సమయాన ప్రేమ గారాబం చూపించి తమ బిడ్డలను తామే పాడుచేసుకొనే యిల్లాండ్రు ఎందరో లోకంలో ఉన్నారు. దీక్షితాయనిగూడ ఈ కోవకు చెందిందే. కొడుకు దుండగాలు ఆమె కడుపులోనే దాచుకొన్నది. పదహారు వత్సరాలు రాగానే గుణనిధికి వివాహం చేశారు. భార్య కాపురమునకు వచ్చినా గుణనిధి చెడుతనమును మార్చుకోలేదు. రాత్రింబవళ్ళు జూదం

తోనే కాలం వెళ్ళబుచ్చేవాడు. మిక్కుటంగా ధనం పోగొట్టుకొనేవాడు. ఒక్కొక్కప్పుడు బాకీపడేవాడు. అప్పులు తీర్చటానికి ఇంటిలోని బంగారపు వస్తువులు అమ్మేవాడు.

కుమారుని ప్రవర్తనచూచి తల్లి మిక్కిలి దుఃఖించేది. వానిని ఎట్లయిన సన్మార్గంలోకి తీసుకురావలెనని ఆమె ఆరాటం. ఒకనాడు ఏకాంతంగా కొడుకును పిలిచి ఎంతో ఆదరంతో తన ఆవేదన చెప్పుకొన్నది.

నాయనా గుణనిధీ ! మీ తండ్రి కోపిష్ఠి. నీవు చేసే పనులు ఆయన చెవినబడితే నిన్ను కఠినంగా శిక్షించటమే గాకుండా అబద్ధములు చెప్పినానని నన్నుగూడ శిక్షిస్తారు. మన కులపెద్దలంతా శ్రోత్రియులు గదా ! వేదాచార సంపన్నులు. యజ్ఞములుచేసి సోమపానం చేసిన వారు. మీ తండ్రి సత్యవిరతుడు. సదాచారపరుడు. నేను పతిసేవ చేస్తూ సోమిదేవినై నలుగురిలో మన్ననలు పొందుతున్న దానను. నీ సాటివారంతా వేదశాస్త్రాలలో ఉద్దండ పండితులయినారు. ఇరువదేండ్ల వయసు వచ్చింది. పెండ్లానికే మచ్చతెస్తున్నావు. పదారేండ్ల ప్రాయంలో పసిడిబొమ్మవలె ఉన్న నీ భార్యనుచూడు. ఇకనైనా నీ దుష్టవర్తనం, దుశ్శీలురిసహవాసం మానుకో. మీ మామ ఎంతటి కీర్తివంతుడు. రెండు పెండ్లాలలో ఎవ్వరికిగాని లేని చెట్టతనం ఎక్కడినుండి వచ్చినదయ్యా ? నీ వదత, దూర్తులతో కలసి నీవు పట్టణంలో చేసే అగడాలు రాజు వినెనా? అసలుకే చేటు కలుగుతుంది. సోమయాజిగా మనకు ఇచ్చిన మాన్యాలు తీసివేయగలడు. చివరకు కూటికి, గుడ్డకుగూడ అలమటింపవలసి వస్తుంది. పైగా దీక్షితుని కుమారుడు ఇలాంటి పనులు చేస్తున్నారని నలుగురిలో మీ తండ్రిని అవహేళన చేస్తారు. బాదరి తల్లి అని నన్ను

చులకనగ చూస్తారు. నా మాటవిని ఈ కొరగానిపనులు మానుకొన వలసింది.

తల్లి మాటలు విన్న గుణనిధి ఏమి బదులు పలుకక ఊరుకొన్నారు. వేట, త్రాగుడు, దొంగతనం, జూదం, పర స్త్రీగమనం అనేవివ్యసనాలు. వీటికి యౌవనంలో మానవుడు చిక్కినాడా వానిని సన్మార్గంలోకి త్రిప్ప టానికి బ్రహ్మవశంకూడా కాదు. గుణనిధి స్థితి అట్లే అయింది. తల్లి వద్ద మాట్లాడక ఊరుకొన్నాడుగాని, తన దుష్టచేష్టలు మానలేదు. యథే చ్ఛగా విహరిస్తూనే ఉన్నాడు.

ఒకనాడు యజ్ఞదత్తుడు పట్టణంలో ఒక వీధివెంటబోతూ ఒక జూదరివ్రేలి తన రత్నాంగుళీయకం చూచాడు. అది ఒక అపూర్వ రత్నం కలిగిన ఉంగరం. పూర్వ మొక వర్తకుడు ఆ రత్నపు టుంగరాన్ని ప్రభువుకు కానుకగా ఇచ్చారు. సోమయాజిపై గల గౌరాభిమానాలు కారణంగా రాజు ఒక పర్వదినాన ఆయనకు కానుకగా దానంచేశాడు. యజ్ఞదత్తుడి భార్య దానిపై మక్కువ చూపగా అతడు భార్యకు కానుకగా ఇచ్చాడు. ఆ ఉంగరానికి అంత కథ ఉంది. అలాటిది కావటంచేతనే ఉంగరం ఒక జూదరి వ్రేలిన చూడగానే సోమయాజి అది తనదిగా గుర్తిం చాడు. క్షణకాలం విభ్రాంతుడయినాడు. వెంటనే జూదరిని పిలిచి ఓరీ నీకీ ఉంగరం ఎక్కడినుండి వచ్చింది? అబద్ధం చెప్పితివా నిన్నిప్పుడే రాజువద్దకు తీసుకొనిపోయి దండింపజేస్తాను అని గద్దించాడు.

సోమయాజి కోపంచూచి జూదరి భయపడి నిజంచెప్పక తప్పలేదు, స్వామీ ! మీ యాన ! యథార్థాన్ని వివరిస్తాను. మీ కుమారు డయిన గుణనిధి జూదంలో ఓడిపోయిన ధనంక్రింద ఈ అంగుళీయకం నాకు ఇచ్చాడు. ఇదొక్కటే గాదు ! మీ ఇంటిలో ఉన్న వెండి, బంగారు

ఆభరణాలన్నీ తాకట్టుపడ్డాయి. కొన్ని అమ్ముడు పోయినాయి. చివరకు రాగి, ఇత్తడి పాత్రలుకూడ అంగడికి చేరాయి. నైష్ఠికులలో నీ యంతటి నైష్ఠికుడు లేడు. జూదరులలో నీ కొడుకువంటి జూదగాడు లేడు అని చెప్పాడు.

ఆ మాటలు వినగానే యజ్ఞదత్తుడికి భరింపరాని కోపం వచ్చింది. అవమానం కలిగింది. ధనం పోవటంకంటె తన వంశం అపకీర్తిపాలు గావటం, తను నలుగురిలో చులకనయి, నవ్వులపాలు కావటం అతని కెంతో ఆవేదన కలిగించింది. ఆవేశంతో ఎకాయెకిన గృహానికి వచ్చాడు. కర్కశ స్వరంతో భార్యను కేకవేశాడు. సోమిదమ్మా! యేమి చేస్తున్నావు? ఒకసారి ఇటురా! ఒకానొక రోజు అభ్యంజన స్నానం చేసే టప్పుడు నా ఒడలికి నలుగుపెట్టి ఒక నయ్యాటం కల్పించి రత్నాంగుళీయకం తీసుకొన్నావు. జ్ఞాపకముందా? ఆ ఉంగరం నా కిప్పుడు కావలె. దానిని ధరింపకుండా నే నీవేళ అగ్నికి హవిర్దానం చేయను సుమా! అన్నాడు.

దీక్షితాయని ఏదో కీడు శంకించింది. ముందీకోపం చల్లార్చి విదానంగా నిజం చెప్పి నద్దుదా మనుకొన్నది. మధ్యాహ్న సమయం అతిక్రమిస్తున్నది. స్నానం చేసివచ్చి త్వరగా అగ్నికార్యం తీర్చండి. ఈనాడు ఎందరో అతిథులు వచ్చిఉన్నారు. అంగుళీయకం భద్రంగా దాచి ఉంచాను. బరిణలో ఉంచి పెట్టెలో దాచాను. మడితో ఉన్నాను. ఇప్పుడు పెట్టె వెదకి తీయటానికి తగిన సమయం కాదు. భోజనానంతరం తెచ్చిఇస్తాను. అని భర్త ఆవేశం తగ్గించాలని ప్రయత్నిస్తూ అన్నది.

ఆమె మాటలకు యజ్ఞదత్తుడు మరింత భగ్గుమన్నాడు. భార్య పలికిన అసత్యాలకు అగ్నిలో ఆజ్యం పోసినట్లయింది.

వణుకుతున్న పెదవులతో సోమయాజి నిజాము అచ్చంగా సత్య ములే పలుకుతున్నావు! మహాసాధ్వివి! సత్పుత్రుడికి తల్లివిగదా, నీ కొడుకెన్నడయినా దేవకాలంలో నిద్ర లేదారా! ఎప్పుడయినా సంధ్యవార్చినాడా। ఏనాడయినా అగ్నికార్యం తీర్చాడా? స్వాధ్యాయం చేశాడా। నే నడిగినప్పుడు యథార్థాన్ని చెప్పక దాచి అబద్ధాలు చెప్పవల సిన అవసరం ఏమొచ్చింది నీకు। నీవు చెప్పిన కల్లలన్నీ నమ్మి కొడు కును చక్కదిద్దుకోక ఉపేక్షచేశాను. దానితో వాడు భ్రష్టుడయినాడు.

ఎంతపెద్ద సంపదగయినా బయటకు తీయక దాచిన మంజూష ఎటుపోయిందో గదా! బంగారు నగలన్నీ తాకట్టుకు పోయినవిగదా। ఎక్కడి నీ ఒడ్డాణం। ఏ కులకుమారి నడుమున కులుకుతున్నదో గదా। చంద్రకాంత మణులతో విరాజిల్లే సాలభంజికకు కాళ్ళువచ్చి పోయినట్ల యింది. రత్నఖచితమైన హంసతూలికా తల్పం ఏ ఇంటికి చేరిందో। నీవు నీ పుత్రుడు ఇద్దరుకలసి నా యిల్లు ఊడ్చిపెట్టగా నాశనం చేశారు. ఇప్పటి కయింది చాలు. నా కసలు బిడ్డలే జనించ లేదనుకొంటాను. వాడు బ్రతికున్నా చచ్చిన వారిక్రింద లెక్క. వాడి కిప్పుడే తిలోదకా లిస్తాను. దుర్మార్గు డయిన కుమారు డుండేకంటే అసలు బిడ్డలు లేకుండా ఉండటమే మేలు. కులపాంసను డయిన వానిని వర్జించి కులాన్ని రక్షించుకోవలెనని పెద్దలంటారు అని కోపావేశంతో శాసనము విధిం చాడు సోమయాజి. ఆ నాటికి చేయవలసిన నిత్యనైమిత్తిక కార్యాలు తీర్చుకొన్నాడు. అనంతరం కొన్నాళ్ళకు ఒక శ్రోత్రియుని కుమార్తెను మరల వివాహం చేసుకొని యజ్ఞదత్తుడు గృహస్థ ధర్మం నిర్వర్తించాడు.

ఆనాడు గుణనిధి ఇంటికివచ్చే సమయానికి తండ్రి తల్లిని దండిం చటం జరుగుతున్నది. లోపలకు రాకుండానే గుణనిధి తండ్రి ముక్కారి

పరుషంగా మాట్లాడటం విన్నారు. ఆ తరుణంలో తండ్రి ఎదుటకు
పోవటానికి భయపడినాడు. వాకిటనుంచే వెనుకకు మరలివెళ్ళాడు.
ఎక్కడకు పోవలెనన్నది గుణనిధికి పెద్ద సమస్య అయింది. చేతిలో
ధనమూలేదు. యాచన చేదామా అంటే ఇప్పటివరకు ఒకరి కివ్వానే
గాని దేహి అని ఎవ్వరిని అడుగలేదు. భిక్షాటనం ఎలా చేయగలను.
విద్యను ప్రదర్శించి బ్రతుకుదామంటే శాస్త్రపరిచయం హాళక్కగదా నాకు.
అయ్యయ్యో నేనేం చెయ్యగలను? చదువుకో తగిన వయస్సులో చదువు
కొనక పోవటం వల్లనే గదా నా గతి ఇట్లయింది. నిజంగా విద్యను
మించిన ధనం ప్రపంచములోనే లేదు ఏ విధంగా వ్యయించినా
తరుగబోదు. దొంగలపాలు కాదు. విశిష్టమైన సోమయాజి వంశంలో
జన్మించిన నాకు పరమ నికృష్టమైన ఈ జూదపు వ్యసనం ఎందుకు పట్టు
బడింది. ఇదంతా పూర్వజన్మలో నేను చేసిన పాపం. చేసినదానిని
అనుభవించకుండా తప్పుతుందా? సూర్యోదయం అవుతుందో లేదో! అని
గిందే తరువాయి. గిన్నెలలో వంటకాలు పెరుగు, ఊరగాయలతో సహా
ఎంతో ప్రీతితో నా తల్లి భోజనంపెట్టి సాగనంపేది. ఇప్పుడెవరు
నన్ను ఆదరంతో చూస్తారు. ఆదరం లేకుండె మానె. ఛీత్కారంతో
అయిన ఇంత ముద్ద పడవేస్తారా? అని వితర్కించుకొంటూ గమ్యంలేని
ప్రయాణం సాగించాడు. ఆ విధంగా ఎంత దూరం నడిచాడో తెలియదు.

ఇంతలో సూర్యుడు పడమటి కొండచాటుకు పోసాగాడు. క్రమ
క్రమంగా చీకటి అలుముకోసాగింది. కన్నుపొడుచుకొన్నా కనుపించటం
లేదు. గుణనిధికి ఆకటిచిచ్చు రేగింది. నీరసం ఎక్కువయింది. నడవ
లేక ఎట్లాగో కాళ్ళీడ్చుకొంటూ పోతున్నాడు. అతడి అదృష్టంకొద్దీ
కొద్దిదూరంలోనే ఒక శివాలయం కన్పించింది. దూరంగా జాజ్జ్వల్య

మానంగా దీపాలు వెలుగుతున్నాయి. గుణనిధి తిన్నగా శరీరాన్ని అక్కడకు చేరవేశాడు.

ఆ రోజు శివరాత్రి. మహేశ్వర భక్తులు కొంద రక్కడ చేరారు. వారంతా ఆనాడు శివరాత్రికి ఉపవాసం ఉన్నారు. నక్షత్ర దర్శనం కాగానే పరమేశ్వరునకు మహాన్యాసపూర్వక ఏకాదశ రుద్రాభిషేకం చేస్తున్నారు. ప్రక్కన నానావిధములయిన ఆహారపదార్థా లున్నాయి. అవన్నీ పరమేశ్వరునకు నివేదనకు చేయడానికి తెచ్చినవి. ఆ పదార్థముల మీదనుంచి కమ్మని వాసనలు గుబాళిస్తున్నాయి. ఆ వాసన ఆఘ్రాణించిన మాత్రాన గుణనిధికి ప్రాణాలు లేచివచ్చాయి. అవన్నీ తన కెలా లభ్యం అవుతయ్యా అని ఆలోచించుకొంటూ ద్వారంవద్దనే కూర్చున్నాడు. శివార్చనను రెప్పవేయక చూస్తున్నాడు.

పరమేశ్వర భక్తులు అభిషేకానంతరం నృత్యగీత వాద్యాలతో బాగా ప్రొద్దుపోయే టంతవరకు స్వామిని సేవించారు. మూడవజాము వరకు జాగరణ చేశారు. పిమ్మట పాపం వాళ్ళు నిద్రాదేవతకు లొంగి పోయారు. ఒక్కొక్కరే ప్రక్కకు వాలుతున్నారు. క్రమక్రమంగా అందరూ నిదురించారు.

కార్చిచ్చువంటి ఆకలితో బాధపడుతున్న గుణనిధికి మాత్రం నిద్ర రాలేదు. వీరంతా ఎప్పుడు నిద్రిస్తారా? ఎప్పుడు ఆపక్వాన్నము దొంగ తనంగానైనా తినగలుగుతానా? అని కంటిలో వత్తులేసుకొని మేలుకొని ఉన్నాడు. ఎక్కడి వారక్కడ నిద్రాదేవి మహిమతో ఒడలు తెలియకుండా పడగానే ఇదే మంచిసమయం అనుకొన్నాడు. తిన్నగా లేచాడు. పాదాలవరకు వ్రేలాడుతున్న దోవతిని పైకిలాగి కట్టినాడు. ఓరవాకిలిగా వేసిఉన్న తలుపుసందుగుండా శరీరాన్ని లోపలకు జారవేశాడు. ఊపిరి

బిగియబట్టి మునివ్రేళ్ళమీద చప్పుడుగాకుండా అడుగులో అడుగువేసు కొంటూ గర్భాలయందాకా వెళ్ళాడు. అక్కడున్న వత్తి కొండెక్కుతున్నది. గుణనిధి తన ఉత్తరీయంలో చివర ఒక పేలిక చించాడు. దానిని నేతిలో తడిపి వెలిగించాడు. ఆ వెలుగులో భక్తులుచేసిన అలంకారంతో విలసిల్లుతున్న లింగమూర్తిని చూచాడు. కళ్ళు ఆహార పదార్థాలమీదకు మళ్ళినాయి. అవి చూడగానే అతనికి నోరూరింది. ఒక పక్వాన్న పాత్రను అందుకొన్నాడు. అక్కడ తింటే ఇంకేమయినా ఉందా? ఎవరయినా నిద్రలేచి చూస్తే ప్రమాదం అనుకొన్నాడు. పాత్రతో శబ్దంచేయకుండా బయటకి నడుస్తున్నాడు. దురదృష్టవశాత్తూ అతని కాలివ్రేళ్ళు అక్కడ నిద్రిస్తున్న ఒకని శరీరానికి తగిలాయి. వాడు తత్తరపాటుతో లేచి దొంగ! దొంగ! యని కేకలు పెట్టినాడు. ఆ కేకలకు అందరూ లేచారు. దొంగను చూడకుండానే వాళ్ళుకూడ దొంగ దొంగ అని అరిచారు,

గుణనిధికి గుండెలు తటతట కొట్టుకోసాగాయి. భయంతో పరిగెత్తుతున్నాడు. అన్నపాత్రను మాత్రం వదలలేదు. నిద్రలేచిన భక్తులంతా పెద్దగా దొంగ! దొంగ! అని కేకలువేస్తున్నారు. కొందరు వెంటబడినారు. గుణనిధి పిక్కబలం చూపుతున్నాడు.

భక్తుల అరుపులకు తలారులు వచ్చారు. పరుగెత్తి పోతున్న గుణనిధిని చూచి నిజంగా తస్కరుడే అనుకొన్నారు. బాణాలు ప్రయోగించారు. అవి గ్రుచ్చుకొని అతడు ముందుకుపడినాడు. పడినదే తడవు మరణించాడు.

గుణనిధిని కొనిపోవటానికి యమకింకరులువచ్చారు. మరుక్షణంలో ఈశ్వర సేవకులుకూడ వచ్చారు. గణాధీశ్వరులను చూడగానే యమ

కింకరులు భయపడి రెండడుగులు వెనుకకు వైచి నమస్కరించారు. వారితో ఇలా అన్నారు.

మహేశ్వరదూతలారా! న్యాయం ధర్మం మీకుతెలిసినట్లు ఎవ్వరికీ తెలియదు. లోకంలోధర్మాన్ని సక్రమంగా ప్రవర్తిల్లేట్లు చేసేవారుమీరే. మూడులోకాలలో మీకెదురులేదు. మేమనగా ఎంత? వీడు కులాచారాలు మంటగలిపినవాడు. నిత్యనైమిత్తిక కర్మాచారభ్రష్టుడు. శివనిర్మాల్యాన్ని అపహరించినదొంగ. వీడు జన్మించినదిమొదలు చనిపోయేవరకు చేసిన పుణ్యం లేశంకూడ లేదు. ఇట్టి నీచుడికొరకు మీ రెందుకు వచ్చారు? వీడొనర్చిన పాపాలన్నిటికి ఫలితం మా లోకంలో అనుభవించవలసి ఉంటుంది.

ఆ మాటలు వింటూ శివకింకరులకు పెద్దయయిన వారు వారిని మాట్లాడవద్దని సంజ్ఞచేశారు. యమకింకరులు ఆశ్చర్యంతో మాటలనాపి చూస్తున్నారు. శమనకింకరులారా! మీరు చెప్పినదంతా సత్యమే. వీడనేక పాతకములు చేసినమాట యదార్థం. కాని శివధర్మం అతిరహస్యమయి నది, అతిసూక్ష్మమైనది. స్థూలదృష్టికి అది గోచరించదు. బ్రహ్మ అంత వానికీ అదిసుగమంకాదు. మిక్కిలి జాగ్రత్తగా దానిని పరిశీలించవలసి ఉంటుంది. శివధర్మం కొలదిగా ఆచరించినా పాపాలు దగ్ధమైపోతాయి. ఇతడి స్థితి వివరిస్తాము వినండి.

ఆహారం దొరకకపోయిన కారణంచేతనే కావచ్చు మహా పర్వ దినం అయిన శివరాత్రినాడు ఉపవసించాడు. ఆకలిమంటతోనే కావి యుండి ఆనాడు జాగరంకూడా చేశాడు. అన్నపాత్రలను చూచేనెపంతోనే కావచ్చు. పరమేశ్వరుని సన్నిధిని వత్తివేసి దీపారాధనచేశాడు. తను అర్పించకపోయినా, వాంఛ లేకపోయినా మహాభక్తులు చేసిన అర్చనను

శిలకించారు. కాలంమూడి చనిపోయినా పరమేశ్వరుని నగరి మోసాల ప్రాణాలు విడిచాడు. సూక్ష్మదృష్టితో విచారించి చూస్తే ఇంతకంటె కైవల్యప్రాప్తికి కావలసిన దేముంటుంది అని శివకింకరాధ్యక్షు డన గానే ధర్ముని సేవకులు నిరుత్తరులయినారు. గణాధీశ్వరులకు నమస్క రించి తమ లోకానికి వెళ్ళినారు.

శివకింకరులు గుణనిధిని విమానంపై అధిరోహింపజేసి తీసుకొని పోయి పరమేశ్వరుని ఎదుట నిలిపారు. ఈశ్వరు డతనిని సాదరంగా వీక్షించాడు. అతడు చేసిన ఆ పుణ్యకార్యములకు తగినఫలితం ప్రసా దించాడు. కైలాసంలో కొంతకాలం వసించి గుణనిధి మరుజన్మలో కళింగదేశాధిపతియైన అరిందమునికి కుమారుడుగ జన్మించాడు. ఈ జన్మలో అతని పేరు దముడు.

దముడు తండ్రి అనంతరం కళింగదేశానికి ప్రభువు అయినాడు పూర్వజన్మ స్మృతి గలవాడు కావడంచేత దీపమాహాత్మ్యం వల్ల తన కింతటి స్థితి కలిగిందని భావించాడు. తాను అన్ని శివాలయములలోను శతసహస్ర దీపకళికలను నిలిపినాడు. తన రాజ్యంలోని ప్రజలందరిని పుణ్యవంతులుగా చేయాలని సంకల్పించాడు. అందరు శివాగారంలో దీపారాధన చేయవలసిందని. దీపాలు నిల్పని వాళ్ళకు శిరశ్ఛేదనం చేయ బడుతుందని శాసించి చాటించాడు. రాజదండన భయంతో కళింగదేశ ప్రజలు శంభుని ఆలయంలో దీపములు నిల్పి తమ పాపాలు నశింపచేసు కొన్నారు.

చాలకాలం రాజ్యం పాలించిన అనంతరం దముడు కుమారునకు పట్టాభిషేకం చేసి తాను అరణ్యానికి వెళ్ళాడు. శతాయుష్మంతుడుగా జీవించాడు. కొన్నాళ్ళకు మరణించాడు. తరువాతి జన్మలో విశ్రవసు

నకు పుత్రుడుగా జనించాడు. బ్రహ్మమానస పుత్రుడు పులస్త్యుడు. పులస్త్యుని కుమారుడు విశ్రవసుడు. మహా తపశ్శాలియైన విశ్రవసునకు మరియొక భార్యయందు రావణ, కుంభకర్ణ, విభీషణులు జనించారు.

విశ్రవసుని జ్యేష్ఠ కుమారుడయిన కారణాన దమునికి తరువాతి జన్మలో వైశ్రవణుడని పేరువచ్చింది. వైశ్రవణుడు చిన్నతనంలోనే పరమేశ్వరునియందు గాఢభక్తి కలిగి ఉన్నాడు. కొన్నాళ్ళకు అతడు చిత్ప్రకాశకమగు కాశీకివచ్చి అవిముక్తక్షేత్రంలో తపస్సు చేశాడు. అక్కడనే తనపేర లింగమూర్తియైన పరమేశ్వరుని ప్రతిష్ఠించి ఆరాధించాడు. అతని తపస్సును మహోజ్జ్వల దీపకళికతో పోల్చవచ్చు. మహేశ్వరుడు వర్తియై జ్వలిస్తున్నాడు. హిమగిరి కన్యక దీపయష్టి. భక్తి విశేషమే తైలం. ధ్యానధార సమధిక విరాజమానమైన జ్వాల. కామక్రోధాది శత్రుషట్కం శలభాలు. ఈ విధంగా విజ్ఞానదీపాన్ని వెలార్చి, శాంతి ధారాజలంచేత అభిషేకించి, భావకుసుమాలతో నిర్మల మనోప్రవృత్తితో వైశ్రవణుడు లింగమును అర్చించాడు.

నిశ్చలభక్తితో అతిదీర్ఘకాలం వైశ్రవణుడు చేసిన తపస్సుకు పరమేశ్వరుడు ప్రత్యక్షమైనాడు. ఒక్కసారిగా కోటి సూర్యులు ఉదయించినట్లయింది. ధగద్ధగాయమానమైన ఆ తేజస్సును చూడగానే యాజ్ఞదత్తి భౌతిక నేత్రాలు శక్తిహీనం అయినాయి. అతడంధుడైనాడు. దృష్టిశూన్యుడయి అతడు అంధకభంజనుని ఛాందోగ్య, ముండక, బృహదారణ్యక, శ్వేతాశ్వతరోపనిషత్తులలోని స్తోత్రం చేత, పంచబ్రహ్మ షడక్షర, ప్రణవాది మంత్రములచేత స్తోత్రం చేశాడు. పరమేశ్వరునకు నమస్కరించి నిఖిల దేవతాకోటి కోటీరఘటిత మణిగణ రేఖావిరాజితములయిన మీ పాదపద్మములను దర్శించే భాగ్యం కలుగజేయవలసిందని ప్రార్థించాడు.

ఆ మాటలకు సదాశివుని మనస్సులో కృపారసంచిప్పిలింది. అతని మనోరథం తీర్చదలచాడు. అతనికి మరల దృష్టి దయచేశాడు. అంధత్వ మంతరించి వైశ్రవణుడు ప్రపంచాన్ని చూడగలిగినాడు. పరమేశ్వరుని దయవలన పినాకపాణిని సైతం అవలోకించగలిగాడు. ఆ సమయంలో తేజోమయదీప్తులు విరాజిల్లుతూ పదారు వత్సరాల ప్రాయంలో ఉన్న అపురూప సౌందర్యవతి శివుని వామభాగం ఒరసుకొంటూ నిలుచున్నది. ఆమె కాలిఅందెలు ఘల్లుమని మ్రోగుతున్నాయి. వానితో మేళవించిన కరకంకణ ధ్వనులు మనోహరంగా, శ్రవణానందకరంగా వినబడుతున్నవి.

ఆమెను చూచి వైశ్రవణుడు ఎందుకో ఈర్ష్య పడినాడు. ఎవ్వరీ కలువకంటి? ఏమి తపంచేసి నాకంటె అధికురాలయింది? మహాశివుని వామభాగంలో అంతచేరువగా స్థానం సంపాదించుకొన్నది. ఈశుడు ఈమెను మిక్కిలిగా మన్నిస్తున్నాడే. ఈమె ఎంతటి భాగ్యశాలి! తన కంటె ఉన్నతమైన స్థానం ఆమెకు లభించిన దన్నట్లు సవతిమత్సరంతో చూచాడు.

ఆ భక్తు డెవ్వడో తనవంక ఈసదృష్టులతో చూస్తున్నందుకు గిరిరాజపుత్రికి కోపం వచ్చింది. ఆమె సామాన్యురాలు కాదుగదా! జగన్మాత. ఆమె తోడ్పాటు లేకపోతే ఈశ్వరుడు కృత్యపంచకం సాగింప లేడు. ఆమెయే చంద్రమౌళికి ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి, జ్ఞానశక్తిని కల్పించి జగత్తుకు ఆధారమయింది. హ్రాల్లేఖామహా మంత్రానికి ఆమె అధిష్ఠాన దైవం. తపస్సుచేత పరమేశ్వరుని మెప్పించి, ఆయన అర్ధశరీరాన్ని పొందగలిగిన సాధ్వి. వైశ్రవణుని దృష్టివెనుక గల భావం గ్రహించిన ఆ తల్లి కోపంతో ఇలా అన్నది. నాథా! ఈ దుష్టు డెవడు? ఈ అవలక్షణుడు క్రీగంటితో నన్ను చూస్తూ వికారాలు

చూస్తున్నారు. ఏమో గొణుగుకొంటున్నారు. వీరికింత చికాకేం కలిగింది. నా సౌందర్యానికి అసూయపడుతున్నట్లున్నారు. మీ రెప్పుడూ ఇంతే. గుణదోషాలు విచారించకుండా అందరినీ నెత్తిన ఎక్కించుకొంటారు. మీ రెవరో చెప్పవలసింది?

ఆమె మాటలకు చిరునవ్వు నవ్వి నీలగళుడు ఆమెతో దేవీ! వీడు నాకు అంతరంగిక భక్తుడు. నీకు పుత్రునివంటి వాడు. కొడుకులు ధార్త్యపువనులు చేస్తే తల్లిదండ్రులు కోపిస్తారా? తనకన్న ఉన్నతస్థానం లభించిన ఈమె చేసిన పుణ్యం ఏమిటో అని అసూయపడుతున్నాడు. అంతేగాని మనోవికారం కాదు. అవిముక్త క్షేత్రంలో వేల సంవత్సరాలు మహోగ్ర తపంచేసి నా హృదయాన్ని కైవసం చేసుకొన్నాడు. ఇతనిని కరుణతో చూడు. నేను వరాలిస్తున్నాను. నీవుకూడ వరములు ప్రసాదించు అని వైశ్రవణునిచూచి కుమారా! నీ భక్తి నన్ను అలరించింది. దివ్యశక్తి సంపన్నుడవై నీవు యక్ష కిన్నర గుహ్యక లోకాధిపత్యం వహించు. అంతేగాక నా తోడి చిరంతనసాంగత్య సుఖాన్ని అనుగ్రహిస్తున్నాను అన్నారు.

శైలకన్య భర్త మాటల ననుసరించి వైశ్రవణా! ఈశ్వరు డిచ్చిన వరాలన్నీ నీకు సమకూరుతాయి. కాశిలో నీవు నిల్పిన దివ్య లింగాన్ని ఎవరు ఆరాధిస్తారో వారికి సమస్త కోరికలు తీరుతాయి. ఈ ప్రదేశం అత్యంత పుణ్యప్రదమై అలరారుతుంది. కాని వికృతదృష్టితో నీవు నన్ను చూచావు. దాని ఫలితంగా ఎడమకన్ను గ్రుడ్డిలేచి గవ్వవలె ఉబ్బినట్లు లాగుతుంటుంది. సవతివలె అసూయపడినావు గనుక కుబేరుడనే పేరుతో ఉత్తర దిశాధిపతిగా ఉండగలవు అని దీవించింది. పిమ్మట పార్వతీ పరమేశ్వరులు అదృశ్యమైనారు. శంభు వరప్రసాదియైన

పైత్రవణుడు కుబేరుడని ప్రసిద్ధిచెంది యక్షులకు అధినాథుడయినాడు. ఇతడు ధనాధిపతిగా లోకాన పేరు పొందాడు. ఈశ్వరునకు అమంగు చెలికాడై విలసిల్లినాడు. ఐశ్వర్యానికి అధిపతి కావటంచేత రాజరాజను పేరున పిలువబడినాడు.

ఈ విధంగా దూతలు వివరిస్తుండగనే రథం కదలి ముందుకు పోసాగింది. కొలది క్షణాలలోనే మహాక లోకానికి దగ్గరగా వెళ్ళింది.

దూతలు శివశర్మతో మహాభాగా! ఈ కనిపించేది మహోదయ మనే పట్టణం. ఇది ఈశాన లోకంలో ఉంది. ఇక్కడ అజుడు, ఏక పాదుడు, అహిర్బుధ్న్యుడు, త్వష్ట, రుద్రుడు, శంభుడు, హరుడు, త్ర్యంబ కుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభువనుడు అనే పేర్లుగల ఏకాదశ రుద్రపారిషదులు నివసిస్తుంటారు. వీరంతా మహేశ్వరుని వలె ఆకారం కలిగిఉంటారు. అందరికీ లలాటాన మూడవ నేత్రం ఉంటుంది. అందరు హస్తి చర్మం ధరిస్తారు. అందరూ నీలకంఠులే. అందరికి వృషభ వాహనాలున్నాయి అందరూ పన్నగాభరణులే. ఎల్లరును భసితములల దిన పాండురదేహములు కలవారే. జటాజూటములు తామ్రవర్ణ విరాజి తములే. వీరంతా ఆనందకాననవనంలో పరమేశ్వరుని దివ్యలింగము లను ప్రతిష్ఠించి ఆరాధించి ఆ మహాత్ముని కరుణవలన ఈ శానలోకాన నివసిస్తున్నారు. ఈశానదేవుని కొలిచినవారికి వాంఛలన్నీ తీరగలవు సుమా! అని ఈశానలోక వృత్తాంతం తెల్పుతుండగానే విమానం అక్కడి నుంచి కదలి ముందుకుపోయింది.

అనతిదూరంలోనే కాంతులు వెదజల్లుతూ మహాక లోకం కన్పిం చింది. దానిని చూచిన శివశర్మ దూతలతో పరమభాగవతులారా! ఆ కనవడేదే లోకం? వెన్నెలకాంతులు విరజిమ్ముతూ ఎంతో మనోహరంగా

ఉంది. నా కాలోక వృత్తాంతం వినిపింపవలసిందని ప్రార్థించాను. దూత లిలా చెప్పసాగినారు.

విప్రవరేణ్యా! శివశర్మా! అది చంద్రలోకం. పగలు తీక్షకరు డయిన సూర్యునిచే సంత ప్తమయిన లోకాన్ని తన సుధామయ కాంతులచే చల్లబరచే ఓషధీ నాథుడయిన చంద్రుని దీని కధిపతి.

సృష్ట్యాదిని బ్రహ్మ నేత్రములనుంచి మరీచి, హృదయంనుంచి భృగువు శిరస్సునుంచి అంగిరసుడు, ఉదానమున పులస్త్యుడు, వ్యానము నుండి పులహుడు, అపానమునుంచి క్రతువు, ప్రాణమునుంచి దక్షుడు, శ్రోత్రమునుంచి అత్రి, సమానమునుంచి వసిష్ఠుడు, సంకల్పమున ధర్ముడు జనించారు.

వీరిలో అత్రిమహర్షి మూడువేల సంవత్సరములు తపస్సుచేశాడు. ఆతని దీక్షకు ఎల్లరు ఆశ్చర్యపడిన వారే. యోగసమాధిలో ఉన్న అత్రి ఊర్ధ్వరేతస్కుడయి నిలచిఉన్నాడు. మూలాధార చక్రంనుంచి ఊర్ధ్వగత మయిన ఆతని తేజస్సు బ్రహ్మరంధ్రాన్ని భేదించుకొని బయటకు వచ్చింది. కనుకొలకులనుంచి ఒడలంతయు పారి దశదిశలు వ్యాపించింది. తేజస్సు భరింపలేక దిక్కులు క్రిందకు వ్రాలినాయి. దిగ్దేవతలనుంచి జనించిన తేజం ఏకంకాసాగింది. విరించి దానికొక రూపం కల్పించాడు. లోకహితం కొరకు ఆ రూపం తనకుతానే అభివృద్ధి పొందింది. ఆతడే చంద్రుడు.

చంద్రుడు పరమేష్ఠి అనుజ్ఞపొంది కాశీ పట్టణంలోనే అవిముక్త స్థానంలో అమృత లింగరూపముతో చంద్రమౌళీశ్వరుని ప్రతిష్ఠించాడు. వేలసంవత్సరాలు పరమశివుని గురించి తపస్సుచేశాడు. ఈశ్వరుడు ప్రత్యక్షమై ఓషధీ లోకానికి రాజువు కమ్మని వరమిచ్చాడు.

పిమ్మట చంద్రుడు తన బలంతో లోకాన్ని జయించాడు. హిరణ్య గర్భుడు, అత్రి, భృగువులు ఋత్విజులుగా, శ్రీహరి సదస్యుడుగా రాజ సూయ యాగం నిర్వర్తించాడు. యజ్ఞాంతంలో జయించిన మూడు లోకాలను దక్షిణగా ఇచ్చివేశాడు. అనంతరం మళ్ళీ అవిముక్తక్షేత్రంలో ఇంద్రకుండానికి ప్రక్క చంద్రేశ్వరు డనే పేరున మరో లింగాన్ని ప్రతి ష్ఠించి మరల తపస్సు చేశాడు. పరమేశ్వరుడు ప్రీతిచెంది ప్రత్యక్ష మయినాడు. సుధాకరునితో చంద్రా! నీవు నా మూర్తిభేదాలలో ఒకడవు. నీ కాంతి లోకాలకు ఆహ్లాదకరంగా ఉంటుంది. బ్రహ్మదత్తమైన పదాన్ని అధిరోహించి అష్టాదశ ద్వీపాలు జయించావు. నిష్కామంగా మరల వాటిని దక్షిణక్రింద దానమిచ్చిన త్యాగివి. కాశిలో చంద్రేశ్వర లింగాన్ని ప్రతిష్ఠించి ధన్యుడ వయినావు. ప్రతి మాసంలో పూర్ణిమాతిథి నాడు చంద్రేశ్వరుని సన్నిధిని అర్చనజపహోమాదులు నిర్వర్తించేవారికి అనంతకోటిఫలాలు కలుగగలవు. అని చెప్పి అదృశ్యమైనాడు.

విప్రవర్యా! ఇక్కడ మరొక విశేషం ఉంది. ఈ ప్రక్కన చంద్రకుండ మనే తీర్థం ఉంది. అష్టమినాడుగాని, చతుర్దశినాడుగాని చంద్రకుండంలో స్నానంచేసి ఈశ్వరుని అర్చించాలి. ఇచ్చటనే పింగళ అనే పేరుతో వెలసిఉన్న యోగీశ్వరీదేవిని యోగపీఠ నివాసిని కాశిని గంధ పుష్పాదులతో అర్చించిన వారికి ఏ విఘ్నాలు కలుగవు. చంద్రోదయ సమయంలో ఈ కుండంలో మునిగి, చంద్రేశ్వరుని అర్చించి వసు, రుద్ర ఆదిత్య తర్పణములు చేసిన మానవుడి పితృదేవతలు వంతో షిస్తారు వారి దయకు అతడు పాత్రుడవుతాడు.

దూతల మాటలు పులకిత శరీరుడై వింటున్న శివశర్మ ఎదుట ముత్యముల జల్లివలె ప్రకాశిస్తున్న నక్షత్ర లోకాన్ని చూచి మిక్కిలి

ఆశ్చర్యంతో మహాత్ములారా! ఇది ఏ లోకం, దీని వృత్తాంతంకూడ సాకల్యంగా చెప్పవలసిందని ప్రార్థించారు. అందుకు సుశీలపుణ్యశీలురు సంతోషించి ఆ లోక వృత్తాంతం వినిపించసాగారు.

మహాపురుషా! సృష్ట్యాదిని బ్రహ్మదేవుని ప్రాణంనుండి దక్షుడు జనించాడని విన్నావు గదా! ఆ దక్షుడికి అరవైమంది కుమార్తెలు. అందరూ రూపవిలాస లావణ్యవతులే. వీరిలో రోహిణి మొదలయిన ఇరవైఏడుగురు కాశీవెళ్ళి నక్షత్రేశ్వరం అనే ప్రదేశాన్ని తమ తపస్సుకు అనువుగా ఎన్నుకొన్నారు. ఆ స్థలం వరుణ అనే నది ప్రక్కన ఉంది. అచ్చట సంగమేశ్వరుడనే రూపంతో పరమేశ్వరుడు వెలసిఉన్నాడు. ఈ కన్యలంతా వేయి సంవత్సరాలు కఠోరమయిన తపస్సు చేశారు. వారి నిష్ఠకు పరమేశ్వరుడు సంతసించి ప్రత్యక్షమయినాడు. దక్ష పుత్రికలారా! మీ నియమనిష్ఠలు నా కెంతో ఆనందం కలిగించాయి. మీరు కోరిన వరాలు ఇస్తాను. కోరుకోండి అన్నారు. ఆ కన్యకామణులంతా మనస్సున పొంగి నీలకంఠుని స్తోత్రించేసి, మహానుభావా! నీ దర్శనంచేతనే ధన్యులమైనాము. కన్యలేమి కోరుతారో మీకు తెలియదా! నీ అంతటి వాడు మాకు భర్తకావలె. అనుగ్రహింపవలసిందని ప్రార్థించారు. గోపీపతి వారి కోరికను మన్నించాడు. దాక్షాయణులారా! మీ కోరిక నెరవేరుతుంది. నా అంశతో ఉండి ఓషధులకు ఈశ్వరు డయిన చంద్రుడు మీకు భర్తకాగలడు. అదీ గాకుండా జ్యోతిశ్చక్రంలో ఎక్కువ ప్రాధాన్యం కలిగి మేషం వృషభం మొదలయిన రాసులకు మీరు కారణభూతులు కాగలరు. తారకలతో కలసి విరాజిల్లుతారు అని వరాలిచ్చి అదృశ్య మయినాడు. వరప్రభావంవల్ల వారు తారకాధిపతికి సతులయినారు. ఇది నక్షత్ర లోకం.

14)

దూతలు పై విధంగా చెప్పినారు. ఇంతలో రథం మరొక లోకా నికి దాపుకువచ్చింది. చంద్రలోకపు వెన్నెలను పోలిన కాంతులతో విరా జిల్లుతున్న ఆ లోకాన్ని చూచిన శివశర్మకు ఎంతో ఆశ్చర్యం కలిగింది. దానిని గమనించారు దూతలు. విప్రముఖ్యా! మన్మధుడికి జన్మాంతరం, యౌవనానికి సామ్రాజ్యం కల్పించే బుధుడు ఈ లోకానికి అధిపతి. ఇది బుధలోకం. బుధుని జన్మ గాథ చాల వింతయినది. మిక్కిలి అరు దయినది. ఇతడు చంద్రుని కుమారుడు.

అత్రి కుమారు డయిన శీతకరుని బృహస్పతివద్ద విద్యాభ్యాసం చేయించాడు. చంద్రుడు మిగుల చక్కనివాడు గదా! బృహస్పతి భార్య తార అత్యంత విలాసవతి. యౌవన ప్రారంభదశలో అడుగిడిన సుధా కరుడి అందం ఆమె మనస్సుకు బంధం వేసింది. అతనిపై ఆమెకు కలుగరాని కోర్కె జనించింది. ఎంతగనో విగ్రహించుకొనటానికి ప్రయత్నించి విఫలు రాలయింది. ఆమెలోని కామవాంఛ నానాటికి గాఢ తరమయింది. చివరకు పడగవిప్పి బుసలు కొట్టింది. దానితో సచ్ఛీలనా భావన పాపశంక ఆమెనుండి పరుపెత్తిపోయినాయి. తానే చంద్రుని ప్రేరేపించసాగింది. అతడు యౌవనవంతుడు గదా! వంయ మనం కోలుపోయినాడు. దానికన్నా ముందే వివేచనాశక్తి దూరమైంది. నిజమే, ఆ వయ సటువంటిది. దానిని గ్రహించి మనస్సునకు కళ్ళెం వేయగల సామర్థ్యం ఎవరికుంది? పరమ మహర్షులు ఐనవారే ఎంతమంది కామానికి వశులై తపోభంగం చేసుకొనలేదు? అంతటి వారిగతి అట్ల యితే వీరిదొక లెక్క! 'కామాతురాణాం నభయం నలజ్జా' అనిగదా పెద్దల మాట. చివరకు ఇద్దరూ మన్మధుని చేతిలో చిక్కినారు. అతడు వీరిద్దరిని బొమ్మలవలె ఆడించాడు. సత్పురుషులను, శీలవతులను చేడ

గొట్టటం అనంగుడికి సరదా. తారాశశాంక నాటకం పరిసమాప్తి కావచ్చింది. తారచూలు దాల్చింది. కొన్నాళ్ళకొక కుమారుని కన్నది. అత డచ్చంగా చంద్రు డున్నటులే ఉన్నాడు. విధాత ఆబాలుని చంద్రునికి ఇప్పించాడు. ఆత్రేయుడు సుధానిధి కావటంవల్ల చంద్ర సంగమం దోష రహితమని శాసించాడు. చంద్రు డతనికి బుధుడని నామకరణం చేశాడు. తండ్రి అనుమతితో బుధుడు కాశీ పట్టణాని కేగినాడు. బుధేశ్వరు డనే పేర మహేశ్వర లింగాన్ని ప్రతిష్ఠించాడు. ఎన్నో సంవత్సరాలు తపస్సు చేయగా శంకరుడు బుధేశ్వరలింగం నుండి ప్రత్యక్షమయి, ఈ లోకానికి ఆధిపత్యం ప్రసాదించాడు. నక్షత్ర లోకానికి ఇది పై భాగంలో ఉంది.

అనంతరం దివ్యవిమానం శుక్రలోకానికి చేరువగా వచ్చింది. దేవదూతలు పుణ్యాత్మా! శివశర్మా! ఇదుగో ఈ కనిపించేదే శుక్రలోకం. దీని కధీశ్వరుడు రాక్షస గురువు అయిన శుక్రుడు ఇతడు మహోగ్ర తపస్వి. కణధూమమే ఆహారంగా వేయి సంవత్సరాలు దుస్సహమైన తపస్సుచేశాడు. పరమేశ్వరుని కృపవలన మృతసంజీవనీ విద్యారహస్యము తెలిసికొన్నాడు. బ్రహ్మ, కుమారస్వామి, విఘ్నేశ్వరుడు, పార్వతీపరమేశ్వరులు తప్ప ఈ విద్య తెలిసినవారులేరు.

పూర్వం అంధకాసురు డనే రక్కసు డుండేవాడు. అతడు తపస్సుచేసి వరాలుపొందిన గర్వంతో సాధువులను పీడించసాగాడు. అతని బాధలు పడలేక దేవతలు, మహర్షులు పరమేశ్వరుని ప్రార్థించారు. మహాదేవుడు వారి కభయమిచ్చి అంధకాసుర సంహారానికి పూనుకొన్నాడు. అంధకుడుకూడ సైన్యంతో పరమేశ్వరుని ఎదుర్కొన్నాడు. ప్రతిదినం యుద్ధంలో వేలకొలది రాక్షసులు సంహరింపబడుతున్నారు. అయినా రాత్రివేళ శుక్రుడు తన మృతసంజీవనీ విద్యామహిమతో చచ్చిన రక్కసుల

వందరిని బ్రతికిస్తున్నాడు. దానితో ఎన్నాళ్ళకు రాత్రించరుల బలం క్షీణించలేదు. చనిపోయిన అసురులు మరునాడు యుద్ధభూమిలో అగు పిస్తున్నారు. ప్రమథగణాలు ఆశ్చర్యపడి చివరకు ఈ రహస్యం భేదిం చారు. పరమశివునితో శుక్రుని మృతసంజీవనీ విద్యా రహస్యం నివే దించారు. రుద్రుడు కోపించాడు. నందీశ్వరుని పంపి శుక్రుని పిలి పించాడు. అతనిని చద్దిముద్దను మ్రింగినట్లు మ్రింగివేశాడు. గురువును కోల్పోయిన అంధకుడు క్రమక్రమంగా బలాన్ని కోల్పోయినాడు. చివర కతడు మహాకాలుని చేతిలో మరణించాడు.

శుక్రుడు పరమేశ్వరుని గర్భంలోనుండి వెలికివచ్చి స్వస్వరూపం పొందాడు. అనంతరం భార్గవుడు వారణాసి పురానికి పోయి అచట అతవుని లింగరూపాన ప్రతిష్ఠించి, నానావిధపత్ర పుష్పాలచే అర్చించాడు. మహేశ్వరుని మెప్పించి యీ లోకానికధిపతి అయినాడు. ఈ విధంగా దూతలు ఎంతో ఉత్సాహంగా శుక్రలోక వృత్తాంతం వినిపించారు. ఇంత లోనే విమానం అంగారక లోక పరిసరాలకు వచ్చింది.

దూతలు పుణ్యాత్మా! ఆ కనబడేచే అంగారక లోకం. దాని కధి పతి భూమి పుత్రుడయిన కుజుడు. ఒకప్పుడు పరమేశ్వరుని ఫాలభాగం నుంచి ఒక స్వేదబిందువు జారి భూమిపై పడింది. దానిలోనుండి ఎర్రని శరీరకాంతితో ఒక బిడ్డ జనించాడు. భూదేవి ఆ బిడ్డని తన కుమారునిగా భావించింది. ఆబాలుడు దినదిన ప్రవర్ధమానుడైనాడు. కొంత వయసు రాగానే అతడు తపస్సు చేయవలెనని సంకల్పించాడు. పావన భాగీరథీజల పరిపూతమైన కాశికి వచ్చి మిక్కిలి తీవ్రంగా పర మేశ్వరుని గురించి తపస్సు చేశాడు. నీలకంఠుడు ప్రత్యక్షమై అతనికి వరాలొసగి అంగారక లోకానికి అధిపతిని చేశాడు. భూమి కుమారునిచే

ప్రతిష్ఠింపబడిన లింగమునకు అంగారకేశ్వరు డని పేరు వచ్చింది అని ఆ లోకాధిపతి వృత్తాంతం వివరించారు. అప్పటికే విమానం బృహస్పతి లోకానికి సమీపంగా వచ్చింది. శివశర్మ దూతలతో పుణ్యపురుషులారా! ఈ లోకం పేరేమి? దీని కధిపతి ఎవరు? ఇది మిక్కిలి కాంతివంతంగా కనబడుతున్నది. అన్నాడు.

దూతలు అతని ఉత్సాహానికి సంతోషించి ఇలాచెప్పారు. విప్ర వర్యా! ఇది బృహస్పతి లోకం. దీని కధిపతి దేవగురువు అయిన బృహస్పతి. ఇతడు అంగిరసుని పుత్రుడు. చిన్నవయసులో ఉన్నప్పుడే బృహస్పతి సమస్తశాస్త్రాలు అధ్యయనం చేశాడు. అనంతరం పుణ్య గుణధామమైన కాశీ క్షేత్రానికి వెళ్ళి తపస్సు ప్రారంభించాడు. అత్యంత నిష్ఠతో కఠోరమయిన తపస్సు చేస్తున్న అంగిరసునికి పరమేశ్వరుడు ప్రత్యక్షమయినాడు విరూపాక్షుని దర్శించగానే బృహస్పతి శంకరా! అర్ధేందుధరా! శయనాశా! భవవినాశా! పన్నగభూషణా! త్రిజగత్పోషణా! భవభంగా! అంబుధినిషంగా! శాంతిదయామధుర హృదయా! పాహిమాం! పాహిమాం! అని స్తోత్రం చేశాడు.

అతని భక్తికి వినయానికి ఈశ్వరుడు సంప్రీతు డయినాడు. అత నితో కుమారా! నిష్ఠతో బృహదుగ్ర తపస్సు చేసినావు. కనుక బృహ స్పతి అనే పేరుతో పిలువబడగలవు. ప్రాణమునకు ప్రాణమైన భక్తితో త ప స్సు ఆ చ రిం చి ప్రా ణ వా యు వు ను మాత్రమే ప్రాణాధారంగా తీసుకొని నన్ను సేవించావు గనుక జీవుడనే పేరు పొందుతావు. వాగాడంబరంతో స్తోత్రం చేశావు కనుక వాచస్పతి అనే నామంతో విరాజిల్లుతావు. అంగారక లోకానికి పైనున్న లోకానిక నీ వధిపతివి కాగలవు. అని వరాలిచ్చి మనస్సుచే చతుర్ముఖుని

స్మరించాడు. సంస్మరణ మాత్రం చేతనే పరమేష్ఠి నిఖిలదేవతా బృందంతో అక్కడికి వేంచేశాడు. నీలకంఠుని ఆజ్ఞచొప్పున విరించి బృహస్పతిని దేవతాచార్య పదవికి అభిషిక్తుని చేశాడు.

బృహస్పతి కాశిలో ప్రతిష్ఠించిన ధిషణేశ్వరుని నిష్ఠతో అర్చించిన వారికి సుజ్ఞానం లభిస్తుంది. పరమేశ్వర తత్వం విదితమౌతుంది. అంటూ విష్ణుదూతలు బృహస్పతి లోకాధిపత్య కథను వివరించారు. అంతలోనే విమానం మరికొంత దూరం పయనించింది. అల్లంత దూరంలో దీప్తివంతమయిన మరో లోకం గోచరించింది. శివశర్మ ఆలోకాలు, వాటి అందాలు చూచి ఆశ్చర్యాంబుధిలో తేలియాడుతున్నాడు. ఆయా లోకాలకు సంబంధించిన గాధలు వింటూ అతడు మహానందపడుతూ తనవంటి అదృష్టవంతుడు మరొకడు లేడని భావిస్తున్నాడు.

పుణ్యశీలుడు ఆ లోకాన్ని చూపుతూ మహాత్మా! ఇది శనైశ్చర లోకం. దీనికి సూర్యపుత్రు డయిన శనైశ్చరుడు అధిపతి. గ్రహములలో ఇతడు మిక్కలి బలిష్ఠుడు. ఈతని జన్మవృత్తాంతం వినటం ఎంతో ఉత్కంఠదాయకం.

శ్రీమన్నారాయణుని నాభికమలంనుండి విధాత జనించాడు. విధాత మానసపుత్రులై అత్రి, మరీచి, దక్షుడు మొదలయిన ప్రజాపతులు జనించారు. మరీచి కుమారుడు కశ్యపుడు. కశ్యపునకు అదితి యందు మార్తాండుడు జనించాడు. ఆదిత్యుడు త్వష్టప్రజాపతి కుమార్తె సంజ్ఞాదేవిని వివాహం చేసుకొన్నాడు. ఆ దంపతులకు మనువు, యముడు అనే కుమారులు యమున అనే కుమార్తె కలిగినారు.

కొంతకాలం గడిచింది. సంజ్ఞ పాపం బాల సుకుమారి. ఉగ్రకరుడయిన దివాకరుని కిరణ తీవ్రత ఆమెకు భరింపరానిదయింది. కొంత

కాలం పుట్టింటి కేగవలెనని అనుకొన్నది. భర్త అంగీకరింపడేమోనని శంకించింది. తనతో సమానముగ, అచ్చుగుద్దినట్లుగ రూపురేఖలు కలిగిఉండే ఒక స్త్రీని ఆత్మశక్తితో సృష్టించింది. ఆమెకు ఛాయ అనే పేరు పెట్టింది. ఆమెను సోదరిగా భావించి ఆమెతో ఛాయా! నేను పుట్టింటికి వెళ్ళి కొన్ని దినాలుండి రాగలను. అంతవరకు నీవు నా భర్త యైన సూర్యునకు పత్నిగా వర్తింపు. ఈ ముగ్గురు బిడ్డలను నీకు అప్పగించి వెళ్ళుతున్నాను. నీ బిడ్డలుగా చూసుకో. నీవు అచ్చముగా నా వలె ఉండటంవల్ల అశ్వినులుగాని ఇతరులుగాని నిన్ను గుర్తింపరు. నేవనే భ్రమతోనే ఉంటారు. ఈ రహస్యం ఎంత ప్రాణంమీదకు వచ్చినా చెప్పవద్దుఅనిచెప్పింది.ఛాయాదేవి సరే అన్నది. సంజ్ఞ పుట్టింటికివెళ్ళింది.

సూర్యుడు ఛాయను సంజ్ఞ అనే భావించి యథాపూర్వముగా గృహస్థాశ్రమ ధర్మాలు నిర్వర్తిస్తున్నారు. ఛాయకు సావర్ణి, శనైశ్చరుడు అను పుత్రులు భద్ర అనే కుమార్తె కలిగారు. తనకు బిడ్డలు కలిగిన తర్వాత ఛాయలో స్త్రీసహజమయిన సపత్నీమాత్సర్యం అంకురించింది. తన సంతానంపై చూపించే ప్రేమ, అనురాగం సవతి పిల్లలపై చూపలేకపోయింది. భోజన లాలనలలోను, అలంకారాలలోను భేదం చూపసాగింది. చిన్నవాడు కావటంవల్ల యముడు తల్లి ప్రవర్తనను సహింపలేకపోయాడు. ఒకనాడు కోపంపట్టలేక ఛాయను కాలితో తన్నడానికి ప్రయత్నించాడు. అతని దుడుకు తనానికి ఛాయాదేవి ఓర్చుకొనలేకపోయింది. ఆమెలో సహనం నశించింది. సంజ్ఞ కిచ్చినమాట విస్మరించింది. పసివాడన్న కరుణ ఆమెలో లేకుండాపోయింది. చిన్న తప్పుకు తాను విధింపబోయేది మిక్కిలి కఠినమయిన శిక్ష యన్న విచక్షణ ఆమెలో శూన్యమయింది. యముని పాదం తెగి పడుగాక అని శాపం

ఇచ్చింది. ఆమెకూడా స్త్రీయే గదా! బిడ్డలను కనలేదా? తనబిడ్డే ఆ తప్పుచేసిఉంటే ఆమె ఆ శాపం ఇచ్చి ఉండేదా? ఈర్ష్యాద్వేష క్రోధాలు జ్ఞానాన్ని నశింపచేస్తాయని పెద్దలంటారు. దేవతలుసైతం ఒక్కొక్క సమయంలో ఈశక్రుషట్కానికి అధీనమై ఒదలు తెలియని స్థితిలో పుణ్య పాపాలు, న్యాయాన్యాయాల, వివేచనాలేకుండా ప్రవర్తిస్తారు. అలాం టప్పుడు ఇక మానవుల విషయం చెప్పేదేముంది!

యముడు శాపగ్రస్తు డయినాడని సూర్యునకు తెలిసింది. ఛాయా దేవిని నిశితంగా పరిశీలించాడు. ఆమె నిజంగా సంజ్ఞాదేవేనా? సంజ్ఞే అయితే కుమారుడు తప్పుచేస్తే తల్లి ఇంతటి శాపం ఇస్తుందా? అన్న సందేహం కలిగింది. వెంటనే ఛాయతో తన మనస్సులోని సంశయాన్ని గూర్చి ప్రశ్నించాడు. నీవు సంజ్ఞవు కావు. ఎవ్వరివో యదార్థం చెప్ప వలసిందని అడిగాడు. ఛాయ ఇప్పుడు సంకటంలో పడింది. సత్యాన్ని చెప్పకపోతే భర్త శపిస్తాడేమో! లేక తనకు మరొక దండన విధిస్తాడో! అన్న భయంతో జరిగిన విషయాలు అన్నీ దాచకుండా వివరించింది. జరిగిన గాథను తెలుసుకొన్న దినకరుడికి ఛాయయందు ఎక్కువ దోషం కన్పించలేదు. ఆమె ఇచ్చిన శాపాన్ని మరలించలేక తరణి, యముని ఓదార్చి నాయనా! నీ పాదాన్ని క్రిమికీటకాదులు తొలిచి తినగా ఊడిపడు తుంది. చింతించకు అని చెప్పి సంజ్ఞాదేవి కొరకై మామయైన త్వష్ట ప్రజాపతి గృహానికి వచ్చాడు. ఇంటికి వచ్చిన అల్లుడికి ప్రజాపతి తగినట్లు మర్యాదలుచేశాడు. సూర్యుడు సంతుష్టివడి సంజ్ఞను గురించి ప్రశ్నిం చాడు. త్వష్టప్రజాపతి అల్లునితో సహస్రకరా! నీ కిరణముల తీవ్రతను భరింపలేక సంజ్ఞ ఇక్కడికి వచ్చింది. ప్రస్తుతం కురుక్షేత్రంలో తపస్సు చేస్తున్నదని వివరించాడు.

సూర్యుడు వెంటనే బయలుదేరి కురుక్షేత్రం చేరాడు. అక్కడ సంధ్యాదేవి బడబారూపం ధరించింది. ఆ అశ్వం కాలిగిట్టల ధ్వనులు దశదిశలు ప్రతిధ్వనిస్తున్నాయి, తెల్లనితోక వెన్నెలకాంతులు విరజిమ్ము తున్నది. విశాలములయి తెల్లగా ప్రకాశిస్తున్న కానలు నల్లగా తుమ్మెదల వలె ప్రకాశిస్తున్నాయి. కొదమగోడిగ రూపంలో ధ్యానవిమగ్నమయిన ఆమెను చూడగానే తొగనూరంతకానికి కూడి మనస్సు చలించింది. చిర కాలవిప్రయోగం అనుభవించినారుగదా ఆ దంపతులు. సూర్యునకు మన్మధ వికారం జనించింది. కామానక్తుడయినాడు. తానుకూడ అశ్వ రూపం ధరించి ఆమెవద్ద కేగినాడు. సంజ్ఞాదేవి వచ్చినవాడు భర్త అని తెలుసుకొంది. ఆమెకూడ విరహానంతప్తయే. అందువలన భర్త కోరి కకు అనుగుణంగా ప్రవర్తించింది. అశ్వ రూపాలలో విహరించిన ఆ దంపతులకు ఇద్దరు కుమారులు జనించారు. వారే అశ్వనీ దేవతలనే పేరుతో దేవవైద్యు లయినారు. అనంతరం సంజ్ఞా సూర్యులు అశ్వ రూపాలు వదలి నిజ రూపాలతో స్వగృహం చేరినారు.

శనైశ్చరుడు వారణాసికేగి లింగరూపుడయిన మహేశ్వరుని అర్చిస్తూ ఘోరమైన తపస్సుచేసి ఆరాధించాడు. శంభుని కరుణా విశేష కారణంగా అతడు శనైశ్చర లోకానికి అధిపతి అయినాడు. అతడు ప్రతిష్ఠించిన లింగము శనైశ్చరేశ్వరుడని పేరుతో ప్రసిద్ధికెక్కింది. శుక్రేశ్వర లింగానికి ఉత్తరభాగంలో ఇది ఉంటుంది. శనైశ్చర లింగాన్ని అర్చించిన వారికి భోగమోక్షాలు కరతలామలకములు.

ఇంతలో విమానం మరికొంత పైభాగానికి పయనించి సప్తర్షి మండలానికి దాపుగా వచ్చింది.

# సప్తర్షిలోక వృత్తాంతం

ఈ లోకాన్ని చూపుతూ దూతలు మహాభాగా! ఇది సప్తమహర్షుల లోకం. సమస్త ఐశ్వర్యాలను ప్రసాదించగలదు సుమా! బ్రహ్మమానస పుత్రులయిన మరీచి, సంభూతి యనే కన్యను, అత్రిమహర్షి అనసూయను పులస్త్యుడు క్షమను, పులహుడు ప్రీతియనే కన్యను, అంగిరసుడు స్మృతిని, క్రతువు సన్నతి అనే లతాంగిని, వసిష్ఠుడు ఊర్జ (అరుంధతి) అనే భామినిని వివాహం చేసుకొన్నారు. వీరు బ్రహ్మ ఆదేశానుసారం ప్రజాపతులను సృజియించి సృష్టి విస్తరణకు సహకరించారు. అనంతరం వీ రేడుగురు కాశీ పట్టణంలోని అవిముక్త క్షేత్రంలో తమతమ నామాంకితాలయిన లింగేశ్వరులను ప్రతిష్ఠించి ఉగ్రమయిన తపస్సు చేశారు. సప్తమహర్షుల సతులుకూడ తాము ప్రత్యేకంగా మహేశ్వరుని ప్రతిష్ఠించి ఆరాధించారు. అవన్నీ వారివారి పేర్లతోనే పిలువబడుతున్నాయి. వారి నిష్ఠకు, భక్తికి మెచ్చిన నీలకంఠుడు ఈ లోకాన్ని సృజించి దాని ఆధిపత్యాన్ని సప్తర్షుల కొసంగినాడు. సప్తమహర్షులు వారి భార్యలతో ఈ లోకంలో సుఖంగా నివసిస్తుంటారు.

# ధ్రువపదం

అనంతరం విమానం ధ్రువలోక సమీపానికి వచ్చింది. ఆ లోకాన్ని చూపి దూతలు దాని వృత్తాంతం వివరించారు.

మహాభాగా! శివశర్మా! ఇది ధ్రువలోకం. ఆకాశలక్ష్మికి కంఠహారమై, శ్రీమన్నారాయణుని అంఘ్రిసదనంగా ప్రసిద్ధికెక్కింది. ఇది తారక సమూహానికి తులాదండయష్టి. గ్రహ సమూహాన్ని తనచుట్టు

త్రిపుర్వానే అయపాంతం. మహామత్స్యముయొక్క లోక చివరిభాగం. ఈ లోకానికి అధిపతి ధ్రువుడు. ఇతని వృత్తాంతం సకలకల్మషహరం.

స్వాయంభువ మనువునకు ఉత్తానపాదుడనే కుమారు డున్నాడు. ఇతడు చక్రవర్తియై భూమిని పాలిస్తున్నాడు. ఈయనకు సునీతి సురుచి అనే ఇద్దరు భార్య లున్నారు. సునీతికి ధ్రువుడనే కుమారుడు, సురుచికి ఉత్తముడనే పుత్రుడు జనించాడు. ద్వితీయ భార్య సురుచిమీద రాజుకు ప్రేమాభిమానాలు ఎక్కువ. పట్టమహిషియైన సునీతికి ఇది కొంచెం కష్టముగా ఉండేది. అయినా ఆమె మిక్కిలి ఓర్పుతో సవతి తనను అవమానించినా సహించేది కాని, పరుషంగా మాట్లాడేది కాదు. సురుచికి తాను అందగత్తెనని గర్వం. భర్త తనను ఎక్కువగా ఆదరిస్తాడని ఆమె నిక్కు. పిల్లలిద్దరు పంచవర్ష ప్రాయులయినారు.

ఒకనాడు ఉత్తానపాదుడు సురుచి అంతఃపురంలో భార్యతో వినోద గోష్ఠిలో ఉన్నాడు. చిన్న కుమారుడయిన ఉత్తముడు ఎక్కడనుంచో వచ్చి తండ్రి తొడపై ఎక్కి కూర్చున్నాడు. ఇంతలో ధ్రువుడుకూడ అక్కడికి వచ్చాడు. తండ్రి ఒడిలో తమ్ముడు ఉండటంచూచి తానుగూడ రెండవ తొడపై కూర్చొనవలెనని తండ్రికి సమీపంగా వెళ్ళాడు. పాపం ఉత్తానపాదుడు చేయి చాపాడు. ధ్రువుడు ఉత్సాహంగా ముందుకు అడుగులు వేశాడు. ధ్రువుడు తండ్రి తొడపై అధివసించటం సురుచికి అయిష్టం. సవతి కొడుకు తన అంతఃపురంలో తన యెదుట తండ్రి ఉత్సంగంమీద కూర్చొనడమా ? తనకెంత అవమానకరం. అసహనాగ్ని చేతప్తమయిన సురుచి వెంటనే ముందుకువచ్చి ధ్రువుని చెయిపట్టి వారించింది. అంతటితో ఊరుకొనక నీ తండ్రి తొడపై అధివసించే భాగ్యం నీ కుంటే నిర్భాగ్యురాలయిన సునీతి గర్భవాసాన ఎందుకు జనించి

ఉంటావు ? అని కఠినంగా మాట్లాడింది. ఏ పాపమెరుగని ఆ పసి వానికి ఆ మాటలు వినగానే దుఃఖం ముంచుకొని వచ్చింది. కండ్లవెంట జలజల నీరు రాసాగింది. ఉత్తమస్థితి పొందాలనే కోరిక జనించింది. దానికి తపస్సే మార్గమను కొన్నాడు. ఏకాయెకిని గృహానికి వెళ్ళి తల్లికి జరిగినదంతా చెప్పుకొని బావురుమన్నాడు. అమ్మా! నేను అరణ్యానికి పోయి తపస్సుచేసి ఉత్తమస్థితిని పొందుతాను ఆశీర్వదింపవలసినదన్నాడు.

కొడుకు మాటలు విన్న సునీతికి కడుపుచెరువైంది. భోరున దుఃఖించింది. సవతి తనను అవమానిస్తున్నది సరే. ఇప్పుడు అకంళంకం తెలియని తన కుమారునికూడ అవమానించటమా! అందునా తండ్రిఎదుట. ఆ తండ్రి నిస్సహాయుడివలె ఊరుకొని ఆమె అకృత్యాన్ని ఆమోదించ టమా! కడుపు భగ్గుమన్నది. కాని ఆమె అభాగ్యురాలు, ఏమిచేయలేని దుస్థితిలో ఉంది. కొడుకును కౌగిలించుకొని ఏడ్చినది. నాయనా! ఎంత నిర్భాగ్యురాలనురా ! యువరాజువు కావలసిన వాడవు. పట్టమహిషి సుతుడవు. కాలు క్రిందఉంచితే కసుగంది పోతుందని సేవకులచే సేవ చేయించుకొనవలసినవాడవు. మహాభయంకర మృగాలతో కూడిన అడవికి పోయి కఠినమైన తపస్సు చేయుటమా ! నిండుగా ఐదేండ్లు లేవు నీకు. నామాట విను. అడవికి పోవలదు. ఒకవైపున భర్తయొక్క అనాదరణ. మరొకవంక సవతి అవమానములచే సంతప్తమౌతున్న నాకు నీ దర్శన లాలనాలు హిమాంబువర్షములు. అట్లాంటి నీవుకూడ దూరమైతే నే నెలా జీవించేది? అని ఎన్నోవిధాల బ్రతిమాలుకొన్నది. ఆ బాలుడి హృదయం ఎంత గాయపడిందోగాని అతడు తనపట్టు వీడలేదు. తల్లి అనుమతి తీసుకొని వనానికి బయలుదేరినాడు.

త్రోవలో ధ్రువునికి సప్తమహర్షులు ఎదురైనారు. బాలధ్రువుని

చూచి సప్తమహర్షులు భవిష్యత్తును అవగతం చేసుకొన్నారో ఏమో ఆదరంగా పిలిచి అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశించారు. ఆశీర్వదించి వెడలి పోయినారు. సప్తర్షుల దర్శన భాగ్యంతో అతనిలో నూతనోత్సాహం పెల్లుబికింది. తిన్నగా నడచిపోయి యమునాతీరాన సమతల ప్రదేశం ఎన్నుకొని తపస్సున కుపక్రమించాడు. ప్రకృతి పై పరీక్షలను సయితం లెక్కచేయకుండా ఏకాగ్రబుద్ధితో ఉగ్రతపం చేయ నారంభించాడు. ధ్రువు డిపై నారాయణునకు అపారమైన దయ కలిగింది. వెంటనే ప్రత్యక్షమై ఆ బాలుని తన అమృతహస్తాలతో స్పృశించాడు. ధ్రువుడు కండ్లు తెరచి ఎట్టఎదుట ఉన్న పురుషోత్తముని చూచి ఆనందంతో నమస్కరించాడు. అతనిని లేవదీసి పరమాత్మ నాయనా! ధ్రువా! పరమమహర్షులకు అలవి గాని ఏకాగ్రతను సాధించి తపస్సు చేసినావు. నాకెంత ఆనందం కలిగిం చిన నీకు లోకోన్నతము ఉత్కృష్టమైన స్థానాన్ని ప్రసాదిస్తున్నాను అని వరమిచ్చి తనతో బాటు గరుత్మంతునిపైన ఆసీనునిచేసి కైలాసంలో పరమేశ్వ రుని దర్శించాడు. పార్వతీనాథుడు ధ్రువుని ఆలింగనం చేసుకొన్నాడు. చక్రి ధరు డిచ్చిన వరాలు మనసున తలచి ఈశ్వరుడు ఆ బాలుని గ్రహచక్ర వాళమునకు పై భాగమునఉన్న లోకానికి అధిపతిగ చేసి ధ్రువకుమారా! చిరకాలం భూలోకంలో రాజ్యంచేసి జన్మాంతరంలో ఈ లోకంలో నివసింప గలవు అని ఆదరంతో వరాలిచ్చారు.

పిమ్మట వైనతేయుడు ధ్రువునివారణాసికి తీసుకొనివచ్చాడు. ధ్రువుడు మణికర్ణికాఘట్టంలో స్నానంచేసి అవిముక్తక్షేత్రంలో మహేశ్వరలింగ మును ప్రతిష్ఠించి ఆరాధించాడు. పంచాక్షరీమంత్రప్రభావితుడయిన ధ్రువుడు గృహానికి మరలివచ్చాడు. కుమారుని వృత్తాంతం విన్న ఉత్తానపాదుడు భార్య లిద్దరితోససైన్యంగా ఎదురువచ్చి స్వాగతమిచ్చాడు. పశ్చాత్తాప

పడిన సురుచి తనను క్షమించమని వేడుకొనుటమేగాక ఎంతో ఆదరంగా ధ్రువుని కౌగలించుకొంది. సునీతి ఆనందానికి మేరలేదు.

తండ్రి అనంతరం ధ్రువుడు సింహాసనాధిష్ఠితుడై పెక్కువత్సరాలు ప్రజానురంజకంగా రాజ్యాన్ని పాలించాడు. విశ్వనాథుని కృపవలన జన్మాంతరంలో ఉత్తమ ధ్రువపదాన్ని పొందినాడు. కాశీలో ధ్రువేశ్వరుని అర్చించినవారికి స్థిరమైన బుద్ధి కలగడమేగాక ధ్రువమైన పదంకూడ లభిస్తుంది.

ఈ విధంగా ధ్రువలోక వృత్తాంతం వివరిస్తుండగనే విమానం ధ్రువలోకాన్ని గడచి క్రమక్రమంగా మహాలోక, జనలోక, తపోలోకాలను దాటి సత్యలోకానికి సమీపానికి వచ్చింది. ఈశ్వరభటులు, శివశర్మను చూచి మహాత్మా! ఈ రాపేయేది సత్యలోకం. పరమానందదాయకమయింది. ఇదే చతుర్ముఖునికి ఆవాసమున్న పుణ్యలోకం అని తెల్పి పద్మగర్భుని సముఖానికి కొనిపోయినారు.

వాణీపతి శివశర్మను సాదరంగా పల్కరించి ప్రసంగవశాన కాశీలో మరణించినవారికిగాని ముక్తి లభించదని తెలిపి సముచిత మర్యాదలతో సాగనంపాడు. పరమేష్ఠి అన్న మాటలకు శివశర్మ సందేహపూరిత మనస్కుడయినాడు. ఆందోళనతో కింకరులతో మహాభాగులారా! మనమింకా ఎంతదూరం ప్రయాణం చెయ్యవలసి ఉంటుంది. పితామహుని మాటలు మీరుకూడా విన్నారుగదా! వారణాసిలో శరీరం త్యజింపకుంటే మోక్షం లేదనినాడు. మరి నాకు విశ్వేశ్వరసాయుజ్యం సంప్రాప్తించే విధం తెలియజేసి కృతార్థుని గావింపవలసిందని అన్నారు.

దానికి కింకరులు మహాత్మా! భూమికి ఎనిమిది కోట్ల యోజనముల ఎత్తున ఈ సత్యలోక ముంది. సత్యలోకానికి ఎనిమిది కోట్ల యోజనా

లకు పైభాగంలో విష్ణులోకమయిన వైకుంఠం ఉంది. దానికి పదహారు కోట్ల యోజనాలు ఊర్ధ్వంగా శివలోకం ఉంది. ఆ లోకమే కైలాసం. దానిని వర్ణించటానికిగాని, ప్రస్తుతించటానికిగాని బృహస్పతి, బ్రహ్మలకు కూడ శక్యంగాదు. ఆ లోకంలో గిరిరాజకుమారీ సహితుడయిన పరమేశ్వరుడు నివసిస్తూ ఉంటాడు. నందీశ్వర, భృంగీశ్వర చండీశ్వరాది గణాధిపతులు ఆ దంపతులను సేవిస్తూ అక్కడే ఉంటారు. ఆ విశ్వేశ్వరుడే భువనసంరక్షణార్థం శ్రీమన్నారాయణునకు చతుర్దశభువనాధిపత్యానికి పట్టాభిషేక మొనర్చినాడు.

ఆ పట్టాభిషేక వైభవం ఇంతింత అనరాదు. పదారువన్నె బంగారపు గుబ్బ క్రొమ్మెరుగుల తళతళలతో ప్రకాశిస్తున్న రత్నదండం, శరత్కాలపు వెన్నెల కాంతులను తిరస్కరించే మేలిపట్టుఛత్రం, చుట్టు పగడాల జాలరులతో ప్రకాశిస్తున్న వెల్లగొడుగును వినాయకుడు విష్ణువునకు పట్టినాడు. పార్వతీదేవి స్వయంగా ఆ పుండరీకాక్షుని అలంకరించింది. సరస్వతీదేవి రత్నదర్పణం చూపింది. శచీదేవి మాణిక్య దీపములతో నివాళించింది. చాముండి తాళంవేస్తుంటే భృంగీశ్వరుడు నృత్యం చేశాడు. సూర్యచంద్రులు ఇరుపయిపుల నిలుచుండి వింజామరలు వీచారు. యముడు వేత్రదండం ధరించాడు. వాణీదేవి మృదు మధుర కలస్వనముతో గద్య పద్య మాలికల స్తోత్రాలు చదివింది. గణాధిపతులు, సప్తర్షులు, దిక్పాలకులు, మరుద్గణము, యక్షులు, కిన్నరులు, కింపురుషులు, రక్షోనివహం అందరూ రమాధవునకు నమస్కరించారు.

పట్టాభిషేక మహోత్సవం ఎంతో వైభవంగా జరిగింది. అనంతరం నీలకంఠుడు మేఘగంభీరస్వరంతో మరలారా। పరమేష్ఠి! విష్ణువే

నేను. నేనే కేశవుడు. మా ఇరువురికి భేదంలేదు. శ్రీహరి కళ్యాణ ప్రదుడు. జగద్రక్షపరాయణుడు. అనాదినిధనుడు. సమస్త కల్మషము లను హరింపగలడు. మీ రతనిని సేవించండి అని పలికి తన లోకమున కేగినాడు. దేవత లంతా ఎవరి లోకాలకు వారు వెళ్ళినారు.

కావున శివశర్మాభిధానా! ఈ కథను చతుర్భుజ పట్టాభిషేకం అంటారు. దీనిని చదివినా, విన్నా, వ్రాసినా సమస్త ఐశ్వర్యాలు లభి స్తాయి. నీవు విష్ణులోకంలో బ్రహ్మవత్సరపర్యంతం నివసింపగలవు. అనంతరం నీ పుణ్యపరిపాకంవలన భూలోకంలో వృద్ధకాలుడనే పేర జనించి నందివర్ధన నగరానికి రాజు వాగలవు. అనేక సంవత్సరాలు రాజ్యం చేసి సుతులకు రాజ్యాన్ని అప్పగించి నీవు కాశీ కేగి విశ్వనాధుని సేవించి మోక్షాన్ని పొందగలవు అని అతని సందేహం నివృత్తి చేశారు. అంతలోనే విమానం వైకుంఠం చేరింది. కింకరులు సగౌరవంగా శివ శర్మను తోడ్కొనిపోతున్నారు. ఆ వైకుంఠనగర రామణీయకతకు ఆశ్చర్య పడుతూ అతడు మాతలవెంట పోయి త్రిభువనమోహనరూపుడయిన శ్రీ మహావిష్ణువును సందర్శించాడు. పుండరీకనయనుడు శివశర్మను సాదరంగా ఆహ్వానించాడు. మాతలు చెప్పినట్లు శివశర్మ వైకుంఠంలో విశ్రా నందుడై కొన్నివేల వత్సరాలు గడిపాడు. అనేక భోగాలు, సుఖాలు అనుభవించాడు. పిమ్మట భూమిమీద జనించి కాశీవిశ్వనాధుని సేవించి మోక్షం పొందాడు.

అగస్త్యుడు లోపాముద్రకు ఈ శివశర్మ కథ సవిస్తరంగా చెప్పి, ప్రియా! శ్రీశైలాది ఇతర క్షేత్రాలు మోక్షాన్ని ఇయ్యగలవు. కాని కాలవ్యవధానం కల్గుతుంది. కాని కాశీపట్టణం వెంటనే ముక్తిని ప్రసాదింపగలదు అని చెప్పి ఆమె సందేహాన్ని తీర్చారు.

పిమ్మట అగస్త్యుడు భార్యాసహితు డయి మల్లికార్జున స్వామికి ప్రదక్షిణం చేశాడు. నిశ్చలభక్తితో ఆ దంపతులు ఆదిదంపతులను ఆరాధించారు. అక్కడ కొన్నాళ్ళుండి మునీశ్వరుడు లోపాముద్రతో రాజపుత్రి ఇచ్చటికి అనతిదూరంలోనే స్వామిమల ఉంది. అది కుమారస్వామికి నివాస స్థానం. అతడు నిఖిలదేవతా సేనానికి శరణ్యుడు. శక్తి తనయుడు మిగులశక్తి సంపన్నుడు. ఆ స్వామిని దర్శించి తరింపగలం అని సామిమలకు ప్రయాణం కొనసాగించాడు.



# పంచమాశ్వాసం

లోపాముద్ర అగస్త్యుడు స్వామిమలకు చేరారు. కుంభజుని రాకను అల్లంతదూరాన గమనించిన కుమారస్వామి అగస్త్య దంపతులకు ఎదురేగి అర్ఘ్యపాద్యాదులొసగి ఆహ్వానించాడు. కుశలప్రశ్నల అనంతరం షణ్ముఖుడు అగస్త్యునిచూచి పరమ మహేశ్వరుడ మయినమీరాక నాకెంతో సంతోషం కలిగించింది. మీ రాకకు గల ప్రధాన కారణం వివరించమని ప్రశ్నించాడు. అతని సత్కారానికి ఆదరానికి మనస్సున ఆనందపడిన అగస్త్యుడు కుమారా! కొల్లాపురిలో లక్ష్మీదేవి ప్రత్యక్షమై నీ వలన కాశీ మాహాత్మ్యం తెలుసుకొనవలసిందని ఆదేశించింది. ఆమె ఆదేశానుసారం ఇలా వచ్చి నీ దర్శనం చేసుకొన్నాను అని జరిగిన విషయమంతా వివరించి కాశీమాహాత్మ్యం తెలుపవలసిందని ప్రార్థించాడు. కుమారుడు అగస్త్యునితో కలశజమౌనీ! నేను ఆరుముఖములు కలవాడినే. వేద శాస్త్రార్థములు ఎరిగినవాడనే. అయినప్పటికి కాశీమాహాత్మ్యం వర్ణించటానికి సమర్థుడను కాను సుమా! నీ యంతటివాడు అడిగినప్పుడు తెలిసిన విషయం వివరింపకుండ ఉండటం సమంజసం కాదు. కాషున నేను ఎరిగినంతవరకు వర్ణిస్తాను. కొల్లాపురి శ్రీమహాలక్ష్మి విన్నిచ్చుటకు పంపటం నాకు ఆనగతిమే. అనగానే వింధ్యగర్వాపహారి పార్వతీ తనయునకు నమస్కారం చేసి మహాత్మా! కాశీలోని అవిముక్తక్షేత్రం మోక్షసాధనమని, మణికర్ణిక తీర్థరాజములకెల్ల ప్రశస్తమయినదని, వారణాసి క్షేత్రమే అవిముక్తమని, ఆనందకాననమని, మహాశ్మశానమని, రుద్రావాసమని వివిధనామములతో ప్రసిద్ధికెక్కిన కారణంతెలుపవలసిందని అర్థించాడు.

శరవణభవుడు అతని ప్రశ్నకు సంతసించాడు. కాశీపై శాస్త్రాన్ని

పఠించటానికి ఏ వారికి ఉత్సుకత ఉంటుడు. వారాపిదమనా! వారణాసి గొప్పతనాన్ని ఒకప్పుడు మా తండ్రి పరమేశ్వరుడు మా తల్లియైన శివాని దేవికి చెప్పినాడు. నాకు దానిని వినేభాగ్యం కలిగింది. నాడు పితృ దేవుడు చెప్పిన విధం వివరిస్తాను.

పరమేశ్వరుడు కాత్యాయనితో ఇలా అన్నాడు. పార్వతీ! బ్రహ్మ కల్పం పూర్తయినపుడు సమస్తలోకాలను మాయ ఆవరించింది. పర మాత్మనకూడ మహామాయ ఆచ్ఛాదించింది. లోకమంతా జలాప్లవము అయింది. సముద్రాలన్నీ తరంగరహితాలయి స్తబ్దంగా ఉన్నాయి. ఆకాశ మొక్కటే మిగిలింది. తక్కిన భూతాలన్నీ జన్మకారణములయిన వాటిలో విలీనమౌతున్నాయి. అంధకారం దట్టంగా వ్యాప్తిచెందింది. సత్తుగాని అసత్తుగాని తెలియబడటంలేదు. నభోపీఠిన సూర్య చంద్రాది గ్రహాలు తారకలు లేవు. భూతములతోనే శబ్దస్పర్శరూపరస గంధాది పంచతన్మాత్రలు లయించాయి. బ్రహ్మాండమే నిష్ప్రచ్ఛరమయింది. పర బ్రహ్మం రూపవర్ణాదులు లేక అవాఙ్మానసగోచరమయింది. అప్ర మేయం, అనాధారం, అవికారం, నిర్గుణం, నిర్వికల్పం, నిరాలంబం, నిర్మ యం, నిరుపద్రవమైన పరబ్రహ్మం తూష్ణీంభావాన్ని గైకొని ఉండికూడ లీలార్థం తననుంచి ఒక శక్తిని కల్పించాడు. ఆ స్వరూపం నీవే! పురుషాకృతిలో గోచరిస్తున్న ఆ పరబ్రహ్మ రూపాన్ని నేనే. కల్యాణీ! ఆ అనాదికాలంలో ఉనికికి ఎక్కడా చోటులేక మనం అవిముక్త మంట పానికి చేరాము. నాటినుండి నేటివరకు మనం ఈ కాశీపట్టణంలోనే నివసిస్తున్నాము.

ఎల్లప్పుడు మనం వదలకుండా ఈ క్షేత్రంలో ఉండటంవలన దీనికి అవిముక్తక్షేత్రం అనే పేరు కలిగింది. ఈ ప్రదేశం మనకెంతో

ఆనందం చూర్చినది కావటంవల్ల ఆనందవనం అని పిలువబడుతున్నది. నా నివాసస్థాన మెప్పుడూ శ్మశానం కావటంచేత ఇది మహాశ్మశానమని పిలువబడింది. నేనే రుద్రుడను. నాకు నివాసభూమి కావటంవల్ల రుద్రావాసమని, రుద్రాగేహమని పేరు కలిగింది. ఇక్కడ వరణ, అసి అనే రెండునదులు ప్రవహించటంచేత ఆ రెండు పదాలకలయికతో ఇది వారణాసి అనే ఖ్యాతి కలిగింది. కాశృదీప్తి - అంటే ప్రకాశించేది అని అర్థం. దానివలన కాశి అనే నామంతో విరాజిల్లుతున్నది. ప్రళయం సంభవించినపుడు నక్షత్రములు గ్రహములతో సహా యావద్బ్రహ్మాండం కాల గతిలో ప్రక్షీణమైనపుడు సయితం కాశీక్షేత్రం ఉనికిగలిగి నివాసయోగ్యం గానే విలసిల్లుతుంది అని కాశికి కల వివిధనామములు ఎలా వచ్చినవి వివరించి శంభుడు శాంభవికి మణికర్ణికా మాహాత్మ్యం వివరించాడు. నే విన్నదంతా తెల్పుతాను. సావధానంగా వినవలసిందని కుమారు డిలా చెప్పారు.

## మణికర్ణికా మాహాత్మ్యం

కాశీనగరంలో నివసిస్తున్న పరమేశ్వరుడు ఒకనాడు భవానితో కుటుంబ రక్షణార్థం ఒకరిని సృష్టించాలని ఆలోచన చేశాడు. సంకల్ప మాత్రాన సృష్టి ఒనర్చగల మహేశ్వరుడు పార్వతీదేవి ముఖాన్ని అర కంట వీక్షించాడు. ఆ చూపులోనె పీతవస్త్రంగల ఒక మహాపురుషుడు జనించాడు. చతుర్భుజములలో శంఖ, చక్ర, గద, అసి శార్ఙాది దివ్యా యుధాల ధరించి ఉన్నాడు. అతని నాభిన ఒక కమలం జనించి ఉంది. అజానుబాహువులతో, ఎగుభుజములతో ఒప్పారుతున్నాడు. నిండు చంద్రుని గేలిచేసే ముఖం, పద్మదళములతో సమానమైన నేత్రాల లోక సమ్మోహనమైన రూపం కలిగిన ఆ పుండరీకాక్షుని చూచి ఈశ్వరుడు

నీలమేఘవర్ణంతో ఉన్న నీవు కృష్ణనామంతో పిలువబడుతూ కాశీపుర ప్రాంతం అయిదుక్రోసుల దూరం ఈ రాజ్యభారాన్ని నీవు వహించవల సింది అని సామ్రాజ్యభారం వహించటానికి ఆతనిని నియోగించారు.

జనార్దనుడు ఈశాసుని ఆదేశానుసారం చక్రంతో పుష్కరిణి త్రవ్వినాడు. ఆనన సమయంలో మహావిష్ణువు శరీరంనుంచి జనించిన ఘర్మజలంతో పుష్కరిణి నిండింది. ఆ సరస్తీరంలో నారాయణుడు వేయి ఎనిమిది సంవత్సరాలు శివునిగూర్చి దుస్సహమైన తపస్సు చేశాడు. పర మేశ్వరుడు ప్రత్యక్షమై పుష్కరిణిని చూచి మిక్కిలి ఆనందపడినాడు. ఉత్సుకతతో పుష్కరిణిని చూస్తుండగా ఈశుని మణివిరాజిత కర్ణావతంసం జారి పడిపోయింది. మణికర్ణిక పడిన ఆ చక్రపుష్కరిణి నాటినుంచి మణికర్ణిక అనే పేరుతో ప్రసిద్ధమైంది.

పిమ్మట నారాయణుని కోరికపై నీలకంఠుడు మణికర్ణికా ప్రాశ స్త్యం వివరించాడు. ఈ తీర్థంలో స్నానమాడి, తటమున జప హోమ వేదాధ్యయనాదులు, వ్రతములు, లింగ ప్రతిష్ఠ చేసినవారికి అక్షయమైన మోక్షం లభిస్తుంది. సమస్త లోకాలలో ఇప్పుడున్న తీర్థాలు మణికర్ణికతో సమానం గావు.

సాంఖ్య యోగం, ఆత్మావలోకనం, అశేష వ్రతాలు మణికర్ణికా తీర్థంలో స్నానమొనర్చినదానికి సమానంగావు. కాశీపట్టణ పంచక్రోశ ప్రాంతంలో క్రిమికీటకాదులు, జంతుసంతానాలు మరణిస్తే నిర్వాణలక్ష్మి కరతలామలకం అవుతుంది. కాశీక్షేత్రంలో ఎప్పుడూ కృతయుగమే. ఎప్పుడు ఉత్తరాయణ పుణ్యఫలమే లభిస్తుంది. కాశిలో అయిదు దినాలు నివసించినంత మాత్రాన చతుర్వేద అధ్యయనంవల్ల కలిగే పుణ్యం లభి స్తుంది. ఈ పుణ్యక్షేత్రంలో మూడహోరాత్రాలున్నవారికి అశ్వమేధ

రాజసూయాది మహాధ్వరాలు చేసిన ఫలితం లభిస్తుంది. వారణాసిని దర్శించినంత మాత్రంచేతనే తులాపురుష దానంచేసిన ఫలం లభ్యం కాగలదు. కాశిని గురించి మనస్సున సంస్మరణ చేసినందువల్లనే వందల మైళ్ళ దూరంలోఉన్న నరుని పాపాలుకూడ నశింపగలవు. కాశీ నగర పంచక్రోశ సమీపానికి అడుగుపెట్టిన మాత్రంచేత పంచమహా పాతకాలయినా నశింపగలవు. బహుకాలం కాశిలో వసించి కారణాంతరంవలన మరో ప్రదేశానికేగి దైవవశాత్తు మరణించిన వారికి కాశియందు మరణిస్తే కలిగే ఫలమే కలుగుతుంది. అవిముక్త క్షేత్రంలో నివసించినవారి కర్మ బంధనాలన్నీ వాటంతట తెగిపోగలవు. మణికర్ణికా ఘట్టంలో స్నానం చేసి పితరులకు తిలతర్పణం చేసినవారికి యజ్ఞం చేసిన ఫలితం కలుగు[illegible] చక్రధర తీర్థంలో స్నానమాడి మౌనవ్రతుడై విశ్వేశ్వర దర్శనంచేసికొన్న మహాత్ముడు సమస్త వ్రతాలుచేసినఫలంపొందు[illegible] కాశీ క్షేత్రంలో ఒక్క దినముండి శాస్త్రోక్తవిధిని నిత్య నైమిత్తిక [illegible]ర్మలాచరించి విశ్వనాథుని అర్చించిన మనుజుడికి యావజ్జీవితం శివార్చన [illegible]రించినంత పుణ్యం లభిస్తుంది. వారణాసియందు త్యాగం చేసిన [illegible]నుడు అనేక జన్మలలో నిర్విఘ్నంగా యోగసాధన మొనర్చినంత ఫలితం దక్కుతుంది. కనుక మానవుడు శరీరమస్థిరమని భావించి ఆమరణ పర్యంతం కాశిలో నివాసం చేయవలెను. చతుస్సముద్ర వలయితమైన ఈ భూమియందు కాశీ స్వర్గ ప్రదేశం. సమస్త ఐశ్వర్యాలకు కాణాచి. నరుడెంతటి పాపిష్ఠుడైనా వారణాసికి చుట్టూ అయిదు క్రోసుల మేరలోని స్థలంలో మరణించినవాడు కృతాంతుని మహిషభూషణ ఘంటా వినాదం వినడు.

అదిగాక మరొక్క విశేషం విను. పూర్వం భగీరథు డనే

చక్రవర్తి భూమిని పాలించాడు. ఆతడు సగర చక్రవర్తికి మునిమను
మడు. సగరుని కుమారులు యాగాశ్వం తీసుకురావటానికి పాతాళానికి
వెళ్ళి అక్కడ తపస్సు చేసుకుంటున్న కపిల మహాముని దుర్వారదృగగ్ని
జ్వాలలలో భస్మమయినారు. తన పితరులకు పుణ్యలోకాలు కల్పించటానికి
భగీరథుడు ఉగ్రమైన తపస్సు చేశాడు. ఆ తపః ప్రభావంవల్ల మందాకిని
స్వర్గలోకం నుండి భూమికివచ్చి ఈ మణికర్ణికా ఘట్టంమీదుగా ప్రవహిం
చింది. అది మొదలు తీర్థంయొక్క మాహాత్మ్యం వేయి మడుగులు
పెరిగింది. మరలకైనా దాని గొప్పతనాన్ని వర్ణించటానికి అలవిగాదు.

సాంగ చతుర్వేద అధ్యయనంకూడ భాగిరథీ స్నానంతో సరిగాదు.
మనోవాక్కాయ కర్మల పాపం గంగాస్నానం హరించగలదు. జాహ్న
వీస్నానం బ్రహ్మజ్ఞాన సంసిద్ధికి కారణం. కలియుగంలోని కలుష
మానసులకు, నియమరహితులకు పరద్రవ్య అపహర్తలకు గంగాస్నానమే
ప్రాయశ్చిత్తం. నీలకంఠుని కృపలేకుండా గంగాస్నానం సిద్ధించదు.
కృతయుగంలో అన్ని తీర్థాలు పుణ్యప్రదాలే. త్రేతా ద్వాపరములలో
కురుక్షేత్రం, గంగానది తీర్థములుగా బ్రహ్మచే ఏర్పాటు చేయబడినాయి.
కృతయుగంలో ధ్యానం, త్రేతాయుగంలో తపస్సు, ద్వాపర యుగంలో
యజ్ఞం కలియుగంలో గంగా స్నానం ఇష్టార్థికి సాధనాలు. పూర్వజన్మ
సంస్కారం పరమేశ్వరుని అనుగ్రహం లేకపోతే కాశీపురోప్రాంత
ప్రవాహమై పాప విధ్వంసినిగా వినుతికెక్కిన గంగానదిలో స్నానం
చేసే భాగ్యం కలగదు. ఈ మహాశ్మశానం ఎట్టఎదుట ప్రవహించే
జాహ్నవీ తోయాలలో స్నానమాడినవారికి ఆటంకాలు ఎన్నటికీ కలుగవు.
దుర్నిమిత్తములు తోచవు. దుష్కీర్తి కలుగదు. వారి మహాపాపాలు
నశించి అభీష్టార్థాలు సమకూరగలవు. గంగానదిలో దీక్షమాడి మహా

భాగ్యం లభిస్తే తీవవాసాలు, ఏకభుక్తాలు, అష్టాంగయోగాలతో నిమిత్తం లేదు. యజ్ఞములతో పనిలేదు. ఎట్టి వాడయినా భాగీరథీ తల్లిని స్మరించినంత మాత్రాన పవిత్రుడు కాగలడు. ఈ మందాకినిలో స్నానం చేయదలచుకొన్నవారికి పిశాచభూతసంఘాలు, ప్రేతాలు విఘ్నాలు కలుగజేయ గలవు. కాని గంగను చేరిన అనంతరం దేవేంద్రుడయినా విఘ్నం కలుగజేయలేడు.

ప్రీతితోగాని, విహారకోరికతోగాని, మర్మజలం పోగొట్టుకొనడానికి గాని ఇతరుల ప్రేరేపణతోగాని, భయాన్ని పోగొట్టుకొనదలచినగాని భాగీరథీ జలములలో మునిగిన వారి అఘములు నశించిపోగలవు. ఇష్టమున్నా లేకున్నా అగ్ని శరీరానికి అంటితే కాల్చివేయగలదు. అదేవిధంగా ఆయి చ్ఛతోఐనా గంగాస్నానంచేస్తే పాతకాలు నశించిపోతాయి. సంసారదుఃఖం మంచిదూరంకాగలదు. అవిముక్తక్షేత్రప్రాంతంలో జాహ్నవీజలములందు మునుగదలచినవారు గమ్యం చేరకమునుపే మార్గమధ్యంలో మరణించినా వారికి తీర్థసేవాఫలం లభిస్తుంది. జీవితకాలంఅంతా గంగాస్నానం చేసిన మానవుడు జీవన్ముక్తుడౌతాడు. అట్టివాడు ముడులోకాలను పావనం చేయ గలడు. మరొక విశేషం. గంగాతీర్థసేవనమునకు తిధివారనక్షత్రాలతో పని లేదు. అదిసంకుచితములైన పాపాలు నశింపచేస్తుంది. గంగామాహాత్మ్యం ఇంతఅని వర్ణింపలేము.

కాశీలోని జనులకు మోక్షంపలనమాత్రమే తృప్తి కలుగుతుంది. అక్కడి జనులకు దేహత్యాగమే దానము. దేహవిపాతమే తపస్సు. శరీర వియోగమే యోగం. విశ్వనాధుడు కాశీపట్టణపు మొగసాల ఢుంఠివిఘ్నే శ్వరుని అధికారిగా చేసినాడు. అతడు తన ముద్రపడనివారిని పురములోనికి పోనీయడు. వరుణను ఒకప్రక్క, అసిని ఒకప్రక్క ఈతడు తలపడులుగా

నిలిచినాడు. వారికి తెలియకుండా లోపలికి పోవటానికి ఎవ్వరికీ శక్తి లేదు. ఈశ్వరుని ఆజ్ఞ లేకపోతే కాశీ పట్టణంలోనికి పోవటానికి ఎవ్వరికీ వీలుగాదు. ఈవిషయం తెలిపే ఒక చక్కని కథ చెబుతాను విను.

పూర్వం ధనంజయు డనే పేరుగల వైశ్యు డుండేవాడు. అతడు మాతృ సేవాపరాయణుడు. తల్లినే దైవంగా భావించి పూజించేవాడు. కొంతకాలానికి అతని తల్లి మరణించింది. జననికి అపరక్రియలు నిర్వర్తించిన తరువాత ధనంజయుడు కాశీయందలి గంగాప్రవాహంలో తల్లి అస్థికలు నిమజ్జనం చేయాలని సంకల్పించాడు. అస్థికలను భద్రంగా తీసినాడు. వాటిని పంచగవ్యంతో తడిపి పంచామృతములతో పవిత్ర మొనర్చాడు. పుష్పాలతో పూజించాడు. అస్థికలను పట్టువస్త్రంలో చుట్టి ఆ మూటనొక తిత్తిలోపెట్టి దానిపై కంబళమును చుట్టినాడు. పైన ముద్దగా మన్ను అద్దినాడు. దానిని భద్రంగా ఒక రాగి పెట్టెలోనుంచి తాళంవేశాడు. అస్థికల పేటికను తీసుకొని కాశీకి పయనమయినాడు. మార్గంలో నియమంగా హవిష్యాశనం చేసేవాడు. నేలమీదనే పడుకొనే వాడు. నిష్ఠగా ఉంటూ ప్రయాణం చేస్తున్న ధనంజయునికి ఒకనాడు జ్వరం సోకింది. రుగ్మతను సైతం లెక్కచేయకుండా ఒక అటవికుని కూలికి మాట్లాడుకొని తిన్నగా కాశీ పట్టణం చేరుకొన్నాడు. వారణాసిలో ఒక వర్తకుని ఇంటిలో విడిదిగా దిగినాడు. చెంచు వానినక్కడ కాపలా ఉంచి తిలలు మొదలయినవి తీసుకొనిరావటానికి బజారుకు వెళ్ళాడు.

వెంటవచ్చిన అటవికుడు రాగిపెట్టెలో ధనమున్నదని భావించి దురాలోచన పరుడయి వర్తకుడుతిరిగి వచ్చేలోపల ఆ పెట్టెను తీసుకొని వెళ్ళిపోయినాడు. ధనంజయుడు తిలలు బియ్యం మొదలయిన కావలసిన పదార్థాలు సమకూర్చుకొని ఇంటికి వచ్చి మార్గాయాసంచేత విశ్రాం

వారు. కొంత ప్రొద్దుకు నిద్రలేచి చెంబును కేకవేశారు. ఎంతకూ బదులు సమాధానం రాకపోవటంతో తత్తరపడి గృహప్రాంగణం అంతా వెదకినారు. చెంబు కనబడలేదు. వర్తకునికి ఆరాటం ఎక్కువయింది. భీతి కలిగింది. అతనికేమీ తోచలేదు. రాగిపెట్టె కనపడక పోవటంతో అతనికి దుఃఖం ముంచుకువచ్చింది. తల్లిని, తమపడ్డ ప్రయాసను తలచుకొని దుఃఖించారు. హృదయం వికలమయింది. ఆందోళనతో సతమతమవుతున్న ధనంజయుడికి గంగానదిలో స్నానం చెయ్యటానికి గాని, పావన భాగీరథీ జలంతో విశ్వేశ్వరుని అభిషేకించాలనిగాని ఆలోచనే రాలేదు. ఢుంఠివిఘ్నేశ్వరుని చూడవలెననే తలంపు రాలేదు. కాలభైరవుని కొల్వవలెననే భావనలేదు. విశాలాక్షీదేవికి నమస్కరించాలని ఊహ కలుగలేదు. తెచ్చిన సంభారాలను పారవైచినాడు. అయ్యో! ఎంత కష్టం భరించి కాశికి వచ్చాను. అస్థికలు నిమజ్జనం చేయలేక పోతినే! అని వాపోయాడు. దుఃఖంతోనే చెంబుకొరకు బయలుదేరాడు. ఆకలి దహించివేస్తున్నా లెక్కచేయలేదు. మార్గమధ్యంలో దప్పిక కలిగింది. నీరు దొరకలేదు. నీరసం కలిగి తూలుతున్నాడు, ఎలాగో కాళ్ళీడ్చుకొంటూ, అటవికుని పల్లెకు చేరాడు. చెంబు గృహానికి వెళ్ళి వానిని, వాని భార్యను బ్రతిమలాడాడు పెట్టె తెచ్చి ఇమ్మని. ఈ విషయమై ఏ విధమయిన ప్రతిక్రియ చేయబోనని చెప్పి ప్రార్థించాడు.

నిజానికి చెంబు స్వార్థంతో ఆ పెట్టెలో ధనముందని అపోహపడి తీసుకువచ్చాడు. అరణ్యంలో ఒక చెట్టుక్రింద పెట్టెను పగులగొట్టి చూచాడు. అందులో ధనం కనిపించలేదు. ఎముకలను చూచి అసహ్యించుకొని వాటి నక్కడే పారవేసి ఇంటికి వచ్చాడు. ఈ విషయమే ధనంజయుడికి చెప్పాడు. వర్తకుడు అతనిని బ్రతిమలాడి

తనకా ప్రదేశం చూపుతున్నాడు. వాని కాళ్ళంటి ప్రాధేయపడ్డాడు. ఆటవికునికికూడ వ్యక్తుని మీద జాలికలిగింది. ధనంజయుని తీసుకొని ఎముకలు పారవేసిన స్థలానికి తీసుకువెళ్ళినాడు. అదేమి మాయోగాని అరణ్యంలో అస్థికలు పడవైచిన చోటు కనిపించలేదు. వెంటవచ్చే ఆ ప్రదేశం గుర్తు తెలియలేదు. శ్రమచెంది అక్కడనే తిరిగినాడు. కాని ఎముకలు కనబడలేదు. హతాశుడయిన ధనంజయుడు దుఃఖించి, దుఃఖించి మరల కాశికి చేరాడు. ఎలాగో గంగాస్నానం చేసి ఇంటికి వెళ్ళాడు తనకు విశ్వేశ్వరుని ఆజ్ఞ లేక కాశిలో ఏకార్యమూ సాగదు.

ఈ విధంగా కుమారస్వామి కాశి, గంగా మాహాత్మ్యములను వర్ణించి మైత్రావరుణీ! ఇంక కాలభైరవుని చరిత్రను వినిపిస్తాను శ్రద్ధగా వినవలసిందన్నాడు.

## కాలభైరవజననం

ప్రళయ కాలంలో సముద్రాలలోని నీటిని, నదీనదాలలోని నీటిని ఆస్వాదిస్తూ కాళరాత్రి రెండు హస్తాలతో వేస్తున్న తాళగతి ప్రకారం మహా భయంకరంగా భైరవుడు తాండవం చేస్తుంటాడు. ఇది మహాద్భుతమైన కథ.

ఒకప్పుడు బ్రహ్మ మేరు పర్వతంమీద కొలువు తీర్చాడు. ఆ సభలో సమస్త దేవతా సమూహం తమతమ ఆసనాలు అలంకరించింది. అనేక విషయాలపై చర్చలు వాదోపవాదాలు జరిగాయి. అనంతరం సభ నలంకరించిన మునీశ్వరులలో కొందరు విధాతతో పరమేష్ఠీ! వాగ్వధూ వల్లభా! మాకొక సంశయం ఉంది. ముల్లోకాలలోని మహాత్ము లందరూ చేరిన సభయిది. అవ్యయమైన తత్వమేదో వివరించవలసింది.

అని ప్రశ్నించారు.

ఆ మాటలకు ధాత మునీశ్వరులారా! మహామాయ ప్రభావంవల్ల మీకీ సందేహం కలిగింది. ఈ చరాచర సృష్టికంతటికీ నేనే అధీశుడను. నా కధీశ్వరుడు మరొకడు లేడు. కనుక నన్నే అవ్యయమైన పరతత్వమని సేవించండి అన్నాడు.

ఆ మాటలకు యజ్ఞ పురుషుడయిన పుండరీకాక్షుడు క్రోధ తామ్రాక్షుడయినాడు. ఓయీ చతుర్ముఖా! పరతత్వమేదో తెలియక సురలకు మునులకు నీవే పరతత్వాన్నని పలికావు. నేను శ్రీమన్నారాయణుడను జగత్తుకు ప్రభువును అవ్యయ శబ్దానికి అర్హుడనుగాని నీవుగాదు. దురహంకారంతో ఇష్టం వచ్చినట్లు పలుకకు మని విష్ణువన్నాడు. కమలగర్భుడు రెచ్చిపోయినాడు. ఇద్దరూ వాగ్యుద్ధానికి తలపడ్డారు. తమలో తాము తేల్చలేక పరతత్వాన్నిగూర్చి నిర్ధారణ చేయవలసిందని వేదాలను ప్రశ్నించారు.

ఋగ్వేదం మీ ఇద్దరిలో ఎవ్వరూ పరతత్వం కాదు. ఆది దేవుడు అనామయుడైన రుద్రుడే పరతత్వం. భూత గణాలన్నిటిని ఆతడే సంహరిస్తాడు. సనాతనమైన మాయను ప్రపంచం అంతా నింపింప చేసినవాడు కూడ ఆతడే. వేద ఉపనిషత్తులనే హర్మ్య వీధులలో విహరించేవాడు సదాశివుడే. శంకరుడే చింతన కందనివాడు. ఆతడే ఆద్యుడు, అరూపుడు అని నిర్ద్వంద్వముగ పలికింది.

యజుర్వేదం ఈ విధంగా చెప్పింది. సకల యాగక్రియల వలన పరమేశ్వరుడు పూజనీయుడైనాడు. ఆధ్యాత్మిక రహస్యమార్గాన తప్ప ఆయనను దర్శించటానికి వీలులేదు. చతుర్వేదముల ప్రామాణ్యమున కాధారమైనవాడు చంద్రమౌళీశ్వరుడే. కూటస్థుడయి తాను కదలక సమస్త విశ్వాంతరాళంలో జరిగేది చూడగల్గినవాడు విశ్వేశుడే. అట్టి

మహేశ్వరుడు తప్ప పరతత్త్వ మింకొకరని చెప్పటానికి ఎలా వీలుకలుగుతుంది.

సామవేదం ఇలా చెప్పింది. ఈ విశ్వమంతా శివుని క్రియాశక్తిచేతనే కలుగుతున్నది. పరమార్థం తెలిసినవాళ్ళు మహేశ్వరుని చిత్ప్రకాశుడని కీర్తిస్తారు. సూర్యుడు చంద్రుడు అగ్ని మొదలయిన గ్రహాలు అతని దీప్తిచేతనే భాసిస్తున్నాయి. ఈశ్వర శబ్దం అతన్ని వీడిపోదు. శివుడే జనన మరణములు లేనివాడు. కనుక ఇందుధరుడే పరతత్త్వం.

పిమ్మట అథర్వణవేదం నీలగళుని స్తోత్రం చేస్తూ సమస్తజీవులలో అతడే పూనంలో దొందువలె ఉన్నాడు. ధిషణులయినవారు భక్త్యావేశంతో ఆ మహామహుని హృదయాంబుజాలలో నిలిపి ఆరాధిస్తారు. సమస్తం తానే అయినకూడ ఏమీకానట్లు విలసిల్లుతుంటాడు. అతని తత్త్వం ఇది అని నిర్ధారించటానికి ఏ శాస్త్రం చాలదు. సమస్త మంగళములకు అతడే నెలవు. శంకరుడు అప్రతర్క్యుడు, అప్రమేయుడు. అతడే పరతత్త్వమని స్థిరంగా చెప్పింది.

చతుర్వేదములు ఈవిధంగా ఉపన్యసించి పరమేశ్వరుడే పరతత్త్వమని నిర్ధారించినా విష్ణువు, బ్రహ్మ ఆ మాటలను అపహాసం చేశారు. కాంతాపరవశుడై పితృవనంలో కాపురముండే ఈతడెక్కడ! అవ్యయతత్త్వ మెక్కడ! పరబ్రహ్మ అతడే అనటం పొసగదుసుమా! అని వ్యాఖ్యానించారు. అంతలో ఓంకారం మూర్తివంతమయి వాళ్ళ ఎదుట నిలిచింది. గంభీర స్వరంతో శితికంఠుడు, మంగళవిగ్రహుడు, లీలాప్తం రూపం ధరిస్తాడు. అతడు స్వయం ప్రభుడు. నిత్యానంద రూపిణి పరాశక్తి నిత్యజనయిత్రి. వారిద్దరికీ భేదంలేదు అని దాని పరపించ.

అయినా సరోజనేత్రుణ్ణూ సరసిజగర్భుడూ అజ్ఞాన తిమిరావృతులై ఆ పలుకులను లెక్క చేయలేదు, తమ గర్వాన్ని వీడలేదు.

అదే సమయంలో వారి నడుమ అఖండమైన దివ్యతేజం ఒకటి ఉద్భవించింది. కోటి సూర్యప్రభాభాసమానమైన ఆ తేజస్సునుంచి ప్రళయ సమయ ప్రస్ఫుటఘోషా భయంకరమైన డమరుకా వినాదం భూనభోంతరాళం ప్రతిధ్వనులిస్తుండగా, వికటపాటల జటావిరాజితుడైన హరుడు ప్రాదుర్భవించాడు. ఆహా! ఏమి ఆ రూపం. కటి ప్రదేశంలో గంధేభ చర్మం. చిమ్మచీకట్లు నశింపచేస్తూ మెడలో తారహారంవలె ఫణిరాజు ప్రకాశిస్తున్నాడు. వలపటి హస్తంలో జ్వాలాజ్వలన కీలలు ఎగజిమ్ముతూ త్రిశూలం వెలుగుతున్నది. తామ్ర జటాజూటంలో లేచందురుడు సాంద్ర చంద్రికలు కురుస్తున్నాడు. అనిర్వచనీయమైన ఆ స్వరూపంనుంచి వెలువడుతున్న శ్వేతకాంతులను దర్శింపలేక దేవతలు కన్నులు మూసుకొన్నారు. ప్రరుష్టుడైన విరూపాక్షుని చూచికూడ విరించి అహంకారంతో డమరుకధరా! నీవు ఒకప్పుడు నా లలాటంనుంచి జనించావు. ఆ సమయంలో నీవు ఉచ్చైస్స్వరంతో రోదించావు. ఆ కారణంచేత నీకు రుద్రుడనే పేరు నేనే కల్పించాను. ఈ సంబంధంవల్ల నీవు నాకు పుత్రుడవు. ఇప్పుడయినా నన్ను శరణుచొచ్చి రక్షణ పొందు అని తన అయిదవ ముఖంద్వారా పలికాడు, విధాత్ర గర్వానికి పరాశివుడు నిజంగా రుద్రుడయినాడు. రోష సంరంభంతో విజృంభించాడు.

భూమి కంపించింది. దిక్కరులు వణికినాయి. గ్రహతారకలు గతులు తప్పసాగాయి. శతకోటి అశనిపాత ధ్వానం భయంకరంగా వినవచ్చింది. కాలకంఠకంఠకాలకూటచ్ఛవి సూర్యబింబాన్ని కప్పివైచింది. విషమేక్షణుడు ఫాలలోచనం తెరిచాడు. విస్ఫులింగాలు వెల్లగక్కుతూ హరుని నేత్రాగ్ని

జ్వాలలు సప్తసముద్రంలో పిటిని ఉడికిస్తున్నాయి. పురసంహారుని [illegible]
రోషవిస్ఫురణతో నిమిష మాత్రాన విశ్వసంహారం చేయసమకట్టినాడని
నిలింపులు పారిపోవ సమకట్టారు. ఆ సమయంలో భయంకరాకార
సముదగ్రతేజుడు దర్శనీయుడయిన కాలభైరవుడు జనించాడు. కాలభైర
వుడు త్రినేత్రునకు నమస్కరించి ఏమి యాజ్ఞ అనినాడు. దురహంకారంతో
దురాలాపాలాడిన బ్రహ్మ పంచమ శిరమును ఖండింపు మనినాడు విరూ
పాక్షుడు. దిక్కులు దద్దరిల్లేటట్లు హుంకారరావం చేస్తూ కాలభైరవుడు
కాలునివలె గోచరించాడు. అడుగు ముందుకువేసి మదపుటేనుగు కమ
లాన్ని పెరికివేసినట్లు గోటితో పరమేష్ఠి పంచమ శిరస్సును త్రుంచి
వేశాడు. శరీరంలోని అంగమొకటి చెడినపుడు దాన్ని ఖండించివేసి
శరీరాన్ని కాపాడవలె. అది న్యాయం. ఈ ధర్మాన్ని పాటించి కాల
భైరవుడు శాంతించాడు.

ఈ ఆకాల వైపరీత్యానికి దేవతలంతా కంపించిపోయారు. కమల
గర్భుడు కొంతసేపు విశ్చేష్టుడయినాడు. కాలభైరవుని దర్శనంతో అతని
శరీరం వణకసాగింది. దిక్కుతెలియక నాలుగు ముఖాలతో శతరుద్రీయం
పారాయణం చేయనారంభించాడు. అంతకుముందే నారాయణుడు మహే
శ్వర స్తోత్రం శ్వేతాశ్వతరోపనిషత్తు పఠనం చేయసాగాడు. వారి
స్తోత్రాలు విన్న రుద్రుడు మరల శివస్వరూపంతో గోచరించాడు. అతడు
లోకశంకరుడు, శరణాగత వత్సలుడు గదా! బ్రహ్మ, విష్ణువులను కృపా
దృష్టితో మన్నించాడు. నిజరూపాంతరమయిన భైరవుని పిలిచి కుమారా!
ఈ యజ్ఞపురుష విధాతలు నీకు పూజనీయులు. వీరిపై క్రోధం ఉపసంహ
రించు. ఈ పంచమశిరం నీ చేతికంటి ఉంది. దానితో భిక్షాటన
కావించు. కాపాలికా వ్రతంతో లోకంలో సంచరించు అని చెప్పి బ్రహ్మ

హత్యను సృజింప సంకల్పించాడు, మరుక్షణంలో వికృతాకారంతో బ్రహ్మ
హత్య జనించింది.

మోకాళ్ళు దిగని ఎఱ్ఱని వస్త్రం. రక్తచందనమద్దిన వికృత
దేహం. పింగళవర్ణంతో కూడిన తారకలతో కూడిన మిడిగ్రుడ్లు. ఎఱ్ఱని
కేశాలు. వానిలో తురిమిన జపాకుసుమాలు. కుటిలమైన కోరలు
భయంకరంగా ఉన్న నోటిలో ఇముడక బయటకు తొంగిచూస్తూ భీతిని
కలిగిస్తున్నాయి. కరాళజిహ్వ ఒడలు గగుర్పాటు కలిగిస్తున్నది. మహోగ్ర
రూపంతున్న బ్రహ్మహత్యను చూచి మృత్యుంజయుడు కాశీ పట్టణంతప్ప
త్రిలోకాలలో అన్ని ప్రదేశాలు నీకు ప్రవేశానికి అర్హాలే. నీవి భైరవుని
వెంట తిరుగుతుండ వలసిందని ఆజ్ఞాపించి దేవతల నమస్కారాలు స్వీక
రించి అదృశ్యమైనాడు. దేవతలు తమతమ లోకాలకు చేరినారు.

తదనంతరం కాలభైరవుడు తన వెంట బ్రహ్మహత్యరాగా ముల్లో
కాలు తిరుగుతూ ఒకనాడు వైకుంఠం చేరాడు. ఆ సమయంలో పద్మా
క్షుడు పద్మాలయతో సరససల్లాపాలు ఆడుతున్నాడు. నారాయణుడు
భైరవుని రాకవిని సతీసమేతుడయి వచ్చి స్వాగతం పలికాడు. అగ్నిజ్వాల
లు వెలిగ్రక్కుతూ ఫాలనేత్రవిరాజితుడై బ్రహ్మకపాలహస్తుడై భీకరాకా
రంతో ఉన్న కాలభైరవునిచూచి వెన్నుడు నమస్కరించాడు. సతియైన
లక్ష్మితో ఇందిరా! చూచావా ఈ మహాపురుషుని. సకలయోగీశ్వరులు
మహాతత్వమని పొగడే మహనీయుడు ఇతడే. సమస్త భూతకోటికి
ఆధారమయిన పరమశివునకు ఇతనికి భేదంలేదు. హాలాహలమును
కంఠబిలాన నిలిపి లోకాలను కాచిన సదాశివు డితడే సుమా! అని వివరించి
అనేక విధాల స్తోత్రం చేశాడు. అతని భీషణ వృత్తాంతం తెలిపి లక్ష్మికి
సంజ్ఞ చేశాడు. ఆ తల్లి ప్రఫుల్ల వదనంతో లోనికివెళ్ళి భిక్షమతిమక్కాని

భక్తి తాత్పర్యాలతో అమృతమయమైన పదార్థాలను భిక్షగా ఒసగింది. ఆ దంపతుల సపర్యలకు ఆనందించి భైరవుడు మరల సంచారానికి బయలుదేరాడు. తిరిగి తిరిగి ఒకనాడు కాశీ పరిసర ప్రాంతానికి వచ్చాడు. అక్కడికి రాగానే అతని మనస్సు హర్షపులకితమైంది. అది సకల పాపాలను హరించే పుణ్యభూమి. కాశీవిశాలాక్షితోకూడి పరమశివుడు నివసించే చోటుగదా అది. భాగీరథీ పరీవాహవారి పరిపూతమైన కాశీలో భైరవుడు అడుగిడినాడు.

కాలభైరవుడు ఆ మహా శ్మశానంలో కాలు పెట్టటంతోనే బ్రహ్మాండం బ్రద్దలుచేసే అంతటిధ్వని కలిగింది. భైరవుడు వెనుదిరిగి చూచాడు కాశీ బహిర్భాగాన హాహాకారం చేస్తూ మొరపెట్టుతూ బ్రహ్మహత్య పాతాళంలో పడింది. మరుక్షణంలో అతని చేతనున్న కపాలం భూమిపై పడింది. మహోత్సాహంలో ఆ వటుకనాథుడు గంగలో స్నానమొనర్చి ఆనందవనంలో స్థిరంగా ఉండిపోయినాడు. కపాలం భూమిపై పడిన చోటుకు కపాలమోచన తీర్థమనేపేరు కల్గింది. సర్వజనుల పాపాల నశింపచేసే వాడుకనుకనే పాపభక్షకుడని, కలుషమర్దనుడని నామములు కలిగాయి. కాలరూపుడు కావటంవల్ల కాలభైరవుడైనాడు, కాలనాథుడని పిలువబడినాడు. వృజిన భైరవుడు కావటంచేత భైరవుడని పేరు కల్గింది. సేవచేసేవారికి అతడు షాణ్మాస్య సిద్ధికరుడు. క్రోధభైరవుడు కాశీపురి పెద్దతలారి. వారణాసికి అయిదు క్రోసులమేర భూమిని కాచియుంటాడు. కాలభైరవ జననాది గాథను విన్నవారి మహాపాపాలు నశించటమేగాక సకల కోరికలు తీరుతాయి.

కాలభైరవుని కథవిన్న అగస్త్య దంపతులు సంతోషంతో పులకించారు. అగస్త్యుడు షణ్ముఖస్వామీ ! ఇంతటి అద్భుతగాథను విన

రించినందుకు నా ప్రణామములు, హరికేశుడనే యక్షుడు మహాదేవునకు అత్యంత సన్నిహితుడని, ప్రమథగణాలకు దండనాయకుడని విన్నాను. అతని చరిత్ర వినటానికి నాకెంతో కుతూహలంగా ఉంది. అనగానే కుమారస్వామి హరికేశుని కథ ఇలా వివరించాడు.

## హరికేశుని వృత్తాంతం

గంధమాదన పర్వత ప్రాంతంలో రత్నభద్రుడని యక్షుడొక డున్నాడు. అతని కుమారుడు పూర్ణభద్రుడు. పూర్ణభద్రుడు కనక కుండల అనే కాంతను వివాహం చేసుకొన్నాడు. ఆ దంపతులకు హరి కేశుడని పుత్రుడు జన్మించాడు. దినదిన ప్రవర్ధమానుడగుతున్న హరి కేశుని హృదయంలో మహేశ్వరునిపై భక్తి నానాటికి గాఢంగా మొగ తొచ్చింది. వారణాసి మాహాత్మ్యం విన్న హరికేశుడు అచట తపస్సు చేయవలెనని సంకల్పించాడు. తల్లిదండ్రుల అనుజ్ఞపొంది ఆనంద కాననమున కేగినాడు. నిశ్చలమైన భక్తితో తపస్సు ప్రారంభించాడు. అతనిచుట్టూ పుట్టలు పెరిగినాయి. ఒకనాడు పరమేశ్వరుడు లీలావిలాసంగా అచ్చటికొచ్చాడు. వెంట పార్వతీదేవికూడ ఉన్నది, నిశ్చల తపోనిష్ఠలో ఉన్న హరికేశునిచూచి పరమశివుడు ఆనందభరితుడయినాడు. అతడు కోరిన వరాలు దయచేశాడు. అంతటితోపోక అతనికి దండనాథ పదవి ఒసంగాడు. నాటినుంచి హరికేశుడు కాశియందు చక్రరక్షకుడుగా ఉన్నాడు.

వెండికట్లు కలిగిన దండంతో హరికేశుడు కాశీపట్టణ ప్రాకార గోపుర ప్రాంత ప్రదేశాలలో విహరిస్తుంటాడు. తప్తమైన అరకూట ఛాయలతో విలసిల్లే జడలు, కంఠమునకా రుద్రాక్షమాలికాభరణములు ఫాలమున విభూతి పుండ్రములతో ఒప్పారుతూ మునులకు సౌమ్యరూపంతో

కలిపిస్తాడు. పాపమతులకు పింగళాక్షుడై వికృతమైన ఆకారంతో గంభీరంగా దండపాణివలె దర్శన మిస్తాడు. ఔర్వశేయా! ఇంక జ్ఞానవాపికా తీర్థ మాహాత్మ్యం విను.

## జ్ఞానవాపికా తీర్థ మాహాత్మ్యం

కల్పాంతంలో ప్రళయం వస్తుందని నీకుకూడ తెలుసు. ఒకప్పటి ప్రళయంలో మహాకాల భైరవుడు తాండవం చేయసాగాడు. భయంకరంగా తాండవంచేసే ఆ స్వామి పాదముల తాకిడులకు సప్తపాతాళాలతో భూమి కంపించింది. సంకీర్ణమైన జటల తాకిడులు బ్రహ్మాండమునకు చెంపపెట్లయినవి. బాహావుల పరివర్తనల ధాటికి దిక్చక్రము త్రుళ్ళిపడు తున్నవి. నిశ్వాసమారుతము తాకిడికి పర్వతాలు పెళ్ళగిలి విరిగిపడు తున్నాయి. డమరుకానినాదానికి సప్తసముద్రాలు సంక్షోభించాయి.

లోకాంత సమయంలో కాలకంఠుడు చిరకాలం తాండవమాడిన కారణంగా దప్పిపోయి దప్పిగొన్నాడు. అంతటి ప్రళయ సమయంలోను చెక్కు చెదరకుండా ఉండేది ఒక్క వారణాసి కనుక ఈశానుడు అక్కడి కేగినాడు. కాశియందలి విశ్వేశ్వర లింగమునకు సహస్ర కలశాభిషేకం చేయవలెనని సంకల్పించాడు. కాశీక్షేత్రం ముందుభాగంలో భూమిని భేదించి త్రిశూలాన్ని పాతాళంవరకు గ్రుచ్చాడు. శూలం తీయగానే పాతాళ లోకమునుండి మహావేగంతో నీటిధారలు పైకెగ చిమ్మాయి. శరత్కాలంలోని వెన్నెలవలె తెల్లనై స్ఫటికమువలె నిర్మలమైన అత్యంత మధుర మయిన నీరువెలికివచ్చింది. ఆ నీటిని సహస్ర కలశములతో నింపి నాడు. వేయి దివసములు అభిషేకించాడు. అదే వరణధార. ఆ నీటి స్పర్శతో ఈశానునకు కలిగిన నీర్వట్టు శమించింది. ఈ తీర్థమే

జ్ఞానోదము, శివజ్ఞానము, శివతీర్థము, జ్ఞానతీర్థము, జ్ఞానవాపిక అనేపేర్లతో పిలువబడుతున్నది. ఈ తీర్థంలోని జలాన్ని పానం చేసినా, తాకినా, సంకీర్తనం చేసినా, చూసినా, సప్త మహాయజ్ఞాలు చేసిన ఫలం సిద్ధిస్తుంది. ఈ తీర్థం కైవల్యం ప్రసాదిస్తుంది. బ్రహ్మరాక్షస, పిశాచ, శాకినీ గ్రహ కూశ్మాండవిధి ఈ ఈశానకుండికకు ఏర్పరచి మహేశ్వరుడంత ర్హితుడైనాడు. ఈ శివతీర్థ మహిమ ఇంత అని చెప్పరాదు.

పూర్వంకాశీనగరంలో హరిస్వామి అనే బ్రాహ్మణుడు నివసిస్తుండేవాడు. అతనికి సుశీల అనే కుమార్తె ఉండేది. ఆమె చాల అందగత్తె. ముల్లోకాలలో అంతటి సౌందర్యవతి లేదని పొగడబడుతూ ఉండేది. చిన్న వయస్సునుండి ఆమె పరమశివుని దైవంగా కొలిచేది. నిత్యం పెందలకడ నిద్రలేచి పంకజదీర్ఘికలో స్నానం చేసేది. నిత్యకృత్యంగా ఆమె శివాగారానికి వెళ్ళి స్వామిని అర్చించి తిరిగి యింటికి వచ్చేదిది. వెంట చెలికత్తెలు ఉండేవారు. ఆలయానికి వెళ్ళి వచ్చేటప్పుడు పౌరులు ఆమెనుచూచి ఆయారె! ఈమె అందం. ఈ వటితమపొందని వాని జన్మ ఎందుకు అని ఉవ్విళ్ళూరుతుండేవారు. ఆమె విశ్వనాథుని కల్యాణవేదియందు రంగవల్లులు తీరుస్తుంటే భూలోకానికి దిగి వచ్చిన లక్ష్మీదేవి యేమో అన్నట్లు కనుపించేది. ఆమె కంఠంమీది మూడు రేఖలు చూడగానే మూడులోకాలలో ఆమెసాటి అవదగిన అందగత్తె లేదని విధాత లిఖించిన గీతలా అన్నట్లుండేవి! అగస్త్యమౌనీ! జ్ఞానవాపిక తీర్థసేవ చేసిన ఫలితంగా ఆమె గర్భంలో మూడు దివ్యలింగములు విరాజిల్లినవి. కేదార క్షేత్రం కాశీలోని శివక్షేత్రంలోని జలం లింగరూపం తాల్చగలవని పెద్దలంటారు.

ఇలా ఉండగా ఒకనాడొక విద్యాధరుడు సుశీల రూపలావణ్యాలుచూచి

మోహితు డయినాడు. ఒకనాటి రాత్రి సుశీల పిండి ఆరబోసినట్లున్న వెన్నెలలో విహరించింది. విద్యాధరుడు తన మాయా ప్రభావంతో నిద్రిస్తున్న ఆ బాలికను నిద్రాభంగం గాకుండా అతి సుకుమారంగా ఎత్తుకొని ఆకాశమార్గాన మలయపర్వత ప్రాంతానికి ప్రయాణం సాగించాడు. త్రోవలో ఆమె కన్నులుతెరచి చూచి భయకంపితురాలయింది. కాని విద్యాధరుని అందచందాలకు ఆమెకూడా మన్మథబాణాలకు గురయింది. మలయ పర్వత సమీపంలో విద్యున్మాలి అనే రాక్షసుడు నివసిస్తున్నాడు. ఆ నిశాచరుడు ఆమె సౌందర్యానికి వివశు డయినాడు. మదనావేశంతో ఆమెను బలవంతంగా లాగుకొని పోవటానికి ప్రయత్నించాడు. విద్యాధరుడు రాక్షసుని ప్రయత్నం చూచి ఆమెను ఒక సురక్షిత ప్రదేశంలో దించి రోషావేశంతో రక్కసునితో తలపడినాడు. వా రిరువురు ఒకరికొకరు తీసిపోక పోరాడుతున్నారు. చివరకు ఒకరి ఆయుధము మరొకరికి తగిలి ఇద్దరూ ఒకే సమయంలో మరణించారు.

ప్రాణంపోయే సమయంలో విద్యాధరుడు సుశీలనుచూచి అయ్యో! నిన్ను.... అని ఏమో పలుకబోయి పై మాటలు రాకుండానే మరణించాడు. సుశీల దుఃఖానికి అంతులేదు. ఏమిచేయవలెనో తోచలేదు. మనసులో ఎన్నో భావనలు రేగాయి. ఈతడు నన్ను ఆలింగనం చేసుకొన్నాడు. అధరముచుంబించినాడు. శరీరము ఇతనిచే స్పృశింపబడింది. ఇంక భర్త అనగా ఎవరు? కావున ఇతడే నా భర్త. నే నతని భార్యనయినాను. భర్తతో సహగమనం చేసిన వనిత స్వర్గసౌఖ్య మనుభవిస్తుందని శాస్త్రములు చాటుతున్నాయి కనుక నే నతనితో సహగమనం చేసి మరణిస్తాను అని సుశీల ఆలోచనచేసి చుట్టుపట్లగల గంధపు కర్రలను ప్రోగుచేసింది. అగ్ని రగుల్కొలిపి, మనస్సున కాశీవిశ్వనాథుని స్మరించి

మనములో ఇలా విచారించింది.

విశ్వనాథస్వామికి నేనేమి అపచారం చేశానో. వారణాసిలో తల్లి దండ్రుల ఇంట క్షేమంగా ఉండవలసిన నాకు ఈ దుస్థితి సంభవించింది. జ్ఞానవాపికలో స్నానమాడే టప్పుడయినా నా చెలికత్తెలు నన్ను తలచు కుంటారా? నే నేమయినది తెలియక తల్లిదండ్రులు నా కోసం ఎంతగా దుఃఖిస్తుంటారో! జింకపిల్లలను పెంచుతున్నానుగదా రేపటినుండి వాటి నెవరు ఆదరంతో చూస్తారు. నా సేవ కాశీశ్వరుడికి రుచించలేదో. లోలార్కా! కేశవా! ఢుంఢివిఘ్నేశ్వరా! మరల జన్మగలిగితే మిమ్ము దర్శి స్తాను. విధవరాలనై జీవితం గడపలేను సుమా! మరొకరిని వివాహం ఆడలేను. ఇతడే నా భర్త. ఇతనితోడే స్వర్గానికి పోతాను. ఇంక ఆలస్యం చేసితినా ఈ కీకారణ్య మధ్యంలో ఎవరయినా నాకు ఆపద కలి గించవచ్చు. లేకపోతే సింహశరభశార్దూలాది క్రూరమృగాలు నన్ను హింసిస్తాయేమో. ఈ విద్యాధరుడు నన్నెంతగానో ప్రేమించి ఇచ్చటికి తెచ్చి నాకుగా మృతుడయినాడు. ఈ వార్తవిని ఇతని తల్లిదండ్రు లెంత దుఃఖిస్తారో అని వసంతకాలంలో కొదమకోయిల క్రోల్పవిధంగా పెద్ద పెట్టున ఏడవసాగింది. చివరకు వీతిహోత్రుడికి ప్రదక్షిణంచేసి నమస్క రించి మనస్సులో ఆనందకాననంలోని నా పుట్టినిల్లు అభివృద్ధి చెందుగాక. నా జనయిత్రి ప్రియంవద చిరకాలం ఐదువతనాన వర్ధిల్లుగాక. నా బంధు వర్గం ప్రవృద్ధి పొందుగాక. నిత్య ప్రభాతసమయంలో జ్ఞానవాపికలో స్నానమొనర్చిన ఫలం, విశ్వేశ్వరస్వామి ముక్తిమంటపం ముంగిట నే తీర్చిన రంగవల్లుల ఫలం, ప్రతి చతుర్థిని విఘ్నేశ్వరుని అర్చించిన ఫలం సర్వంకూడి ముందటి జన్మలో నాకు ఈ విద్యాధరుడే భర్త యగునట్లు చేయుగాక అని తలంచుకొని సుశీల అగ్నిప్రవేశం చేసింది.

లింగత్రయం గర్భంలోగల ఆ పతివసిపాప మరణించటంవల్ల విద్యాధరుడికీ, రాక్షసుడికికూడ స్వర్గం లభించింది. అనంతరం కొంత కాలానికి విద్యాధరుడు మలయకేతువుగా, సుశీల కళావతిగా మరల ఈ లోకంలో జనించారు. వారిద్దరు దంపతు లయినారు. ఆ దంపతులకు ముగ్గురు పుత్రు లుదయించారు.

పిమ్మట కొన్నాళ్ళకు ఒక చిత్రకారుడువారణాసి చిత్రపటాన్ని కొని వచ్చి మలయకేతువుకు చూపించాడు. కళావతికి పూర్వజన్మ స్మృతి ఉంది. ఆమె చిత్రపటాన్ని చూచి అందలి విశేషాలను పూసగ్రుచ్చి నట్లుగా వివరించి భర్తకు చూపసాగింది. కాశీపట్టణం ధనుస్సు. గంగా నది వింటినారి. లోలార్కుడు కేశవుడు వింటి కొప్పులు. వృషము బాణము. లక్ష్యము కృత్తివాసి. విశ్వనాథుడు ధన్వి.

ఇది గంగానది. ఇదే మణికర్ణికా ఘట్టం. ఇక్కడనే శివుని చేతినుంచి బ్రహ్మకపాలం ఊడిపడింది. అది పంచతీర్థం. మత్స్యో దరీస్నాన ప్రదేశం అదే. అతడే నందీశ్వరుడు. ఆ ప్రక్క నున్నతడు భృంగీశ్వరుడు. ఆ ప్రక్కనే మంగళకాత్యాయనీ ఆలయం అని వారణాసిన గల సమస్తప్రదేశాలనుగూర్చి వివరించింది. ఆమె ఇలా చెప్పుతుండగానే స్తంభరోమాంచాది సాత్త్వికభావాలు ఆమెలో కలిగి వెంటనే మూర్ఛిల్లినది. మలయకేతు మహారాజు ఆమెకుశీతలోపచారాలు చేస్తున్నాడు. ఒడలు తెలియని స్థితిలోనే ఆమె జ్ఞానోదయం, జ్ఞానవాపి, శివతీర్థమని ముమ్మారు పలికి మరణించింది. మలయకేతువు పుత్రులకు రాజ్యం అప్పగించి జ్ఞానవాపికా తీర్థానికేగి తపస్సుచేసి ముక్తి పొందాడు. కుంభసంభవా! సదాచార ఆచరణంవలన తప్ప ఆత్మశుద్ధి కలుగదు. ఆత్మ శుద్ధిలేక స్నానసౌభాగ్యం లభించదు సుమా।

కళావతీ వృత్తాంతం విని అగస్త్యుడు ఆనందపరవశు డయివాడు. కుమారునితో స్వామీ! సదాచారమంటేవి అది విశదీకరింప వలసిందవి ప్రార్థించాడు,

అందుకు కుమారస్వామి కలశసంభవా! మనువు పరాశరుడు మొద లయిన మహాత్ములు వివరించిన మతాలు అపారమయినవి. కనుక వాటి అన్నిటి సారం చెబుతానువిను అని ఇలా చెప్పాడు,

మానవుడు ఒక్క రాత్రికూడ ప్రమత్తుడుగాక సదాచారం నిర్వ ర్తించలేడు. మానవుడు ప్రమాదవశుడు కావటం లోక సహజం. ప్రమా దాలవల్ల కలిగే అనాచారాలను శివధ్యానం చేయటంతప్ప మరో మార్గం లేదు. నాలుగు ఆశ్రమాలు నాలుగు స్కంధాలు. ఇందులో మొదటి మూడు ధర్మాలను వహిస్తాయి. నాలుగవది జ్ఞానానికి ఆలవాలం.

బ్రాహ్మణు డయినవాడు బ్రహ్మముహూర్తంలో నిద్రలేచి ఆచ మనం చేయవలె. విభూతి రుద్రాక్షమాలికలు ధరించి పద్మాసనస్థుడై ముందుగా గణపతిని ధ్యానించవలె. పిమ్మట పార్వతీ పరమేశ్వరులను. లక్ష్మీనారాయణులను, సరస్వతీ బ్రహ్మాదిదేవతలను ధ్యానం చేయవలె. అనంతరం దిక్పాలకులను, గంగాది పుణ్యతీర్థాలను, కాశీ మొదలయిన పుణ్యక్షేత్రాలను, వేదాది విద్యలను, మహా పురుషులను మనసులో స్మరించవలె. వీరివింతా ఆయురారోగ్య ఐశ్వర్యాలు ప్రసాదించవలెనవి ప్రార్థన చేయవలె. అనంతరం నిత్యనైమిత్తికములయిన అనుష్ఠాన ములు తీర్చాలి.

ఈ విధంగా శౌచప్రకారం వివరించి షణ్ముఖుడు ఇలా అన్నాడు. కొండంత మృత్తికతోను, సప్తసముద్రముల నీటితోను శుద్ధిచేసుకొన్నప్పటి కివి, భావశౌచానికి బాహ్యశౌచం సాటికాదు. బయట శరీరానికి ఒనరించే

శౌచాలన్నీ అంతఃశుద్ధి కొరకేనమ్మా! ద్విజాతైల్లప్పుడు తన మనస్సును ఎంతో నిర్మలంగా ఉంచుకొనవలె. మానసిక శుద్ధికి గాయత్రీజపం ముఖ్యమైన సాధనం. గాయత్రిని మూడుకాలాలలో జపిస్తే మనస్సు ధర్మం తప్పకుండా నిలుస్తుంది. పగలు నిలుచుండి రాత్రి కూర్చుండి గాయత్రీజపం చెయ్యవలె.

సంధ్యావందనం చేసినతర్వాత బ్రాహ్మణుడు దేవతర్పణంచేసి, ఋషి తర్పణం, పితృ తర్పణం చేసి వైశ్వదేవం చేయాలి. దానివల్ల దేవతలు తృప్తి చెందుతారు. శ్రద్ధతో బలిహరణం చేయాలి. తూర్పు దిశగాగాని, ఉత్తరపు దిశగాగాని కూర్చుండి భోజన మాచరింపవలె. గంధాక్షతలతో అలంకృతుడై అభ్యాభిఘారం నిమ్మళ ఆపోశనం పట్టి పంచ వాయువుల నామాలు ఉచ్చరిస్తూ ప్రాణాహుతులు పుచ్చుకొనాలి. దర్భముడిగల చేతితోడనే భోజనం చేయవలె. కడుపులో గాలికి కొంచెం ఎడముంచి తినవలెగాని వ్రేలుపెడితే అందేటట్లు గొంతునిండుగ మెక్క రాదు. భోజనానంతరం మంచినీరుగాని, మజ్జిగగాని త్రాగవలె. 'అమృతాభిధాన' మంత్రంతో ఉత్తరాపోశనం పట్టిలేచి చేయి, మూతి శుభ్రం చేసుకోవాలి. తిరిగి కేశవ నామములతో ఆచమనం చెయ్యాలి. అనంతరం తాంబూల చర్వణం చేయవలె. అగస్త్యమహర్షీ ఇలా సదాచారం పాటించే గృహస్థాశ్రమం తక్కినవాటికంటే అధికమైనది. సక్రమంగా గార్హస్థ్య ధర్మం నిర్వర్తించటానికి తగిన ఇల్లాలు లభ్యం కావలెనమ్మా! మహర్షీ! ఉత్తమ స్త్రీ లక్షణములు వినుమని శరవణభవుడు కలశజానితో ఇలా అన్నారు.

పాదములు, రేఖలు, అంగుష్ఠములు, అంగుళి, నఖములు, మీగాళ్ళు గుల్ఫములు, పిక్కలు, జంఘలు, జానువులు, ఊరువులు, కటి నితంబ

ములు, నాభి, కుక్షి, పార్శ్వము, నడుము, ముడుతలు, (వళులు) వక్షోజ
ములు, చూచుకములు, జత్రువు, స్కంధము, మణిబంధములు, మీచేతులు,
అరచేతులు, కంఠము, చిబుకము, హనువులు, కపోలము, వక్త్రము, ఉత్త
రోష్ఠము జిహ్వ, తాలువులు, కన్నులు, కనురెప్పలు, భ్రుకుటి, లలాటం,
శిరస్సు శాస్త్ర పద్ధతి ననుసరించిన ప్రమాణము కలిగిఉండవలె. అన్నింటిని
మించి మంచి హృదయముతో విలసిల్లవలె. శారీరక లక్షణలోపం
కల్గినా హృదయ లక్షణం తొలగరాదు. ఇన్ని లక్షణములు గల స్త్రీ
భార్యఐతే గృహలక్ష్మి అని పిలువబడి గృహమేకాక వంశాన్నికూడా
పావనం చేస్తుంది. ఇలాంటి గృహిణివల్ల పురుషుడు గార్హస్థ్యం సక్ర
మంగా నిర్వర్తించి కృతార్థుడు కాగలడు. ఇన్నిపాట్లు పడేకంటే
అగస్త్యమౌనీ కాశియందు మరణిస్తేచాలు ముక్తి లభిస్తుంది.

శ్రద్ధగావిన్న అగస్త్యుడు మయూరవాహనా! జ్ఞాన కారణములయిన
వాటిని వివరింప వలసిందని ప్రార్థింపగానే షణ్ముఖుడు సంతోషంతో
వివరించాడు.

కలశజా! వేదములలో చెప్పబడిన దానిని ఆచరించటమే యజ్ఞం
చేయటం. బ్రహ్మచర్యాశ్రమం నిర్వర్తించితే తపస్సు చేసినట్లు అవు
తుంది. దానివల్ల బాహ్యేంద్రియ జయం సిద్ధిస్తుంది. శ్రద్ధ ఉపవాసాలవల్ల
అంతరింద్రియ నిగ్రహం కలుగుతుంది. ఇవన్నీ విజ్ఞాన కారణములే.
వినునది, ఆలోచించునది, చూచునది, అన్నియు కూడ ఆత్మయేసుమా!
ఆత్మావలోకనం చెయ్యటానికి యోగాభ్యాసమే ఉత్తమమైన సాధనం.
సాంద్రమైన అరణ్యాలలో, పర్వత గుహలలో నివసించటంవల్ల ఆత్మను
తెలుసుకోలేడు. గ్రంథాలు పఠించినంతమాత్రాన సిద్ధించదు. దానములు,
వ్రతములు, యజ్ఞములు, యాగములు చేసినందున ఆత్మజ్ఞానం లభించదు.

ముక్కు చివరను దృష్టి కేంద్రీకరించిన మాత్రాన యోగసిద్ధి కలుగదు. ఇతరమును వదలి నిత్యము ఆత్మ సంతుష్టుడయి ఆత్మచేతనే ఆత్మ నెరుంగవలె. అట్లు తెలుసుకొన్నవాడే యోగసిద్ధిని పొందినవాడు.

కొంతమంది ఆత్మ మనస్సుల సంయోగమే యోగమంటారు. ప్రాణ అపానముల సమాగమమే యోగమని మరికొందరు వివరిస్తారు. కొందరు విషయేంద్రియాల కలయికనే యోగమని నిర్వచిస్తారు. పర మాత్మ క్షేత్రజ్ఞుల సంయోగమమే యోగని కొందరంటారు. యమ నియమ, ఆసన, ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన, ధారణ, సమాధులు యోగానికి అంగాలని బోధిస్తారు. నా మతంలో మాత్రం ఆసన, ప్రాణా యామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు ఆరే అంగములు.

ఇందులో ప్రథమంగా చెప్పిన ఆసనములు అనేక విధములు. స్వస్తికాసనము, గోముఖాసనము, పద్మాసనము, వీరాసనము, భద్రా సనము, ముక్తాసనము, మయూరాసనము, సుఖాసనము మొదలయినవి. ఇందులో ఏదయినా ఒక ఆసనస్థుడై కూర్చుండి యోగి అయినవాడు యోగా భ్యాసము చేయాలి. దోమలు, ఈగలు మొదలయిన కీటకాలు లేని ప్రదేశం ఎన్నుకోవాలి. కేశములు, భస్మం మొదలయినవి లేకుండ ఉండవలె. జీవ సంతులం కాకుండా ఏ బాధలు లేకుండా సుఖావహ మైన ప్రదేశం ఎన్నుకోవాలి. అసంతుష్టుడు, క్షుధార్తుడు, విణ్మూత్ర బాధితుడు కానపుడే యోగ సాధనమున కుపక్రమించాలి. పై పంక్తి క్రిందివన్నీ ఒకచోట చేర్చరాదు.

గాలిని కుంభించి మెల్లమెల్లగా మరగించి ఉంచవలె. ఒకేసారి బలవంతంగా గాలిని విడిచితే అది రోమకూపాలనుంచి బయటకు రావ టానికి ప్రయత్నిస్తుంది. దానివలన కుష్ఠు మొదలయిన రోగములు కలిగే

ప్రమాద ముంది. మదించిన ఏనుగును మావటీడు మెల్లగా మత్తరించి కంఠ పీఠమున గుదెప్పైచి ఎక్కినట్లు యోగసాధకుడు వాయువును క్రమంగా స్వాధీన పరచుకొని విజయం సాధించాలి. సర్వాన సర్వాల ప్రయాణిస్తుంది కనుక గాలికి ప్రాణవాయువనే పేరు కల్గించి. సాధకుడు చంద్రనాడిద్వారా గాలిని పూరించి సూర్యనాడి నుండి విడుదల చేస్తాడు.

---

సృష్టి అనంతమైనది. ఇందు గల జీవకోటిలో మానవునికి విశిష్టత ఉంది. ఆదికాలంలో మానవుడు ఆహారం కొరకు ముందు తాపత్రయపడినాడు. వ్యవసాయం, గృహ నిర్మాణం మొదలైనవి చేసే స్థాయికి వచ్చింతర్వాత అతడి దృష్టి సృష్టివైపుకు మళ్ళింది. ప్రకృతి అందానికి మురిసిపోయినాడు. ఒక్కొక్కప్పుడు తుఫానులవంటి సృష్టివైపరీత్యాలకు భయపడినాడు. చిగురాకు పుటకనుండి సమస్త సృష్టి చూచి ఆశ్చర్యపడినాడు. ఈ ప్రకృతి దానంతట అదే కలుగుతున్నదా? లేక దీనికి మూలమేమైనా ఉందా? అన్న ప్రశ్నలు ఉదయించాయి.

నాగరికత పెరగడం ఎలా జరిగింది? మానవుడు ప్రతి వస్తువును పరిశీలించి, దాని తత్వాన్ని తెలుసుకొని, వస్తువుల జన్యజనక సంబంధం కార్యకారణ సంబంధం సమన్వయపరచుకొంటూ వచ్చిందే నేటి విజ్ఞానం. ప్రకృతిలోని వస్తుతత్వం తెలుసుకొని, అవి తమకు ఎలా ఉపకరిస్తాయో చూచి, అవసరమైతే వాటిని ఆ విధంగా మలచుకొని మానవుడు సుఖం చేకూర్చుకొంటున్నారు. కనుకనే పై ప్రశ్నలను ప్రాక్పశ్చిమ ఖండాల లోని మేధావులుకూడ పలువురు ఆలోచించి సృష్టికి మూలమైన పదార్థం ఒకటున్నదనే నిర్వచించారు. కొందరు దానినే భగవాను డన్నారు. కొందరు ప్రకృతిపరిణామ మన్నారు.

పద్మాసనం మొదలయిన ఆసనములవల్ల శరీరానికి దార్ఢ్యం కలుగుతుంది. ప్రాణాయామంవల్ల కలుష సంహతులు నశిస్తాయి. ప్రత్యాహార క్రియవలన శరీరం పావన మౌతుంది, ధారణాభిధానంవలన చిత్తస్థైర్యం కలుగుతుంది ధ్యానంచేత ఈశ్వరుని దర్శింపగలుగుతాడు. సమాధి వలన కర్మ నిర్మూలనం జరిగి మోక్షం సిద్ధిస్తుంది. ఈ విధంగా యోగాంగ

---

ఇది ప్రకృతి సహజ పరిణామమా లేక భగవానుని లీలయా అన్న దొక జటిల సమస్య. దానిని చర్చించటాని కిది అనువుగాదు. కనుక భగవంతుని అస్తిత్వమే తీసుకొని చర్చించటం జరుగుతుంది.

అయితే ఇక్కడ కొన్ని ప్రశ్నలు మొదలయినవి. భగవంతుడు ఎక్కడ ఉన్నాడు ? అతని రూపం ఎలా ఉంటుంది ? అతడు చేసే పని ఏమిటి ? మనం చూడవలెనంటె ఎలా ? ఈ జిజ్ఞాసతోనే వేదాపుల మేధస్సు తర్కించింది. ఎవరి బుద్ధికి తోచింది, ఎవరెవరి అనుభవాలు, ఎవరెవరు ఏ యే విధానాలు అవలంబించింది వివరించి చెప్పారు. దీనికి ఆధ్యాత్మిక చింతన అంటారు. ఈ పరిశోధన లేక చింతన భారత దేశంలో జరిగినంతగా మరే దేశంలో జరుగలేదని యావత్ప్రపంచం అంగీకరించిన సత్యమే.

సహజంగా విజ్ఞానశాస్త్ర పరిశోధనలు దినదినాభివృద్ధి చెందటం. ఒక కాలంలో శాస్త్రజ్ఞుల పరిశోధనా ఫలితాలను ఆధారంచేసుకొని తరువాతి కాలంలో వారు ఇంకా ముందుకు పోవటం జరుగుతుంది. కాని దురదృష్టవశాత్తూ ఆధ్యాత్మిక విజ్ఞాన పరిశోధనలు వందల సంవత్సరాల నాడే ఆగిపోయి ముందుకు కదలకపోవటం అలాఉంచి, అనాటి పరిశోధన లన్నీ తప్పులని, అవి వట్టి కట్టుకథలని, కేవలం కొంతమంది జీవనోపాధికి

షట్చక్రఫలాన్ని సాధకుడు పొందగల్గుతాడు.

ప్రాణవాయువు ధారణలో దహని, భ్రామణి, స్తంభని, శమని, ప్లావని, అనే అయిదు భాగాలున్నవని పెద్దలు వివరిస్తారు. యోగ ముద్రలుకూడ ఉడ్డీయానముద్ర, మహాముద్ర, గగనముద్ర, జాలంధర ముద్ర అని అయిదు విధాలు.

---

ఏర్పరచబడినవన్న భావం ప్రచారంచేయబడుతూ వచ్చింది. ఇటీవలి కాలంలో అది మరీ పెరుగుతూవచ్చింది. చివరకు 'తాతస్య కూపోయ మితి బ్రువాణాః క్షారంజలంకాపురుషాః పిబంతి' అని శాస్త్రవిధించిన దాని కనుక ఇంటిలోని ఉప్పునీళ్ళయినా సరే త్రాగవలసిందని ఈ మూర్ఖులు చెబుతున్నారు అని నిందించేదాక వచ్చింది. కారణ మేమంటే పూర్వగ్రంథాలలో చెప్పబడినవి అద్భుత విషయాలుగా కనబడటమే గాక అవి ఋజువుపరచగలిగే స్థితిలో ఆధ్యాత్మిక జ్ఞానసంపన్నులుగూడ లేరు. ఇవి హేతువాదానికి నిలవవని, ప్రచారకుల భావన, వాదన. ఆర్షసంస్కృతిని ఆదరించేవాళ్ళుకుగూడ నేటి విజ్ఞానశాస్త్రపరిశోధనలు, ఆధునికుల వాదనలు విన్న తరువాత ఏం చెయ్యాలోతోచని అయోమయ స్థితిలో పడుతున్నారు.

నిజానికి హేతువాదానికి నిలువనిది లేదు. అసలు మానవుని నాగరికత అభివృద్ధి హేతువాదనతో కలిగినదేగదా! చివరకు అన్ని పురాణములు శాస్త్రములు వ్రాసిన బాదరాయణుడు బ్రహ్మసూత్రములు ప్రారంభిస్తూ "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" అన్నాడు. ఆ తరువాత, ఇందువలన బ్రహ్మ పదార్థమును గురించిన ఆలోచన చేయవలె అని గదా భావం. ఇందులో 'అథః', 'అతః' అనుమాటలు ఎందుకు ప్రయోగింపబడినాయి. ఇందువలన అనటంలోనే ఫలానా కారణంవలన అని చెప్పబడినట్లు గదా! ఆ తరు

ఇడా పింగళనాడులు సంయోగం చెంది సుషుమ్నను చేరకటం మహాముద్ర. గొంతులోని కొండనాలుక వద్దకు జిహ్వను ప్రవేశింపజేసి బ్రహ్మరంధ్ర, ధ్రువ, చంద్రమండల విగ్గళమైన అమృతపానం చేయటమే వభోముద్ర. దీనినే ఖేచరీముద్ర అంటారు. ఉడ్డీనమైన మహాభుగముచ అహోరాత్రాలు విల్పటానికి ఉడ్డీయానముద్ర సాధనం. వారీజాలాన్ని

---

వాత అర్థః అన్న పదం ప్రాథమిక జ్ఞానమును సంపాదించిన తరువాత బ్రహ్మపదార్థ చర్చకు తగిన స్థాయి పొందగలరని సూచిస్తుంది. కనుక హేతువాదప్రాతిపదిక మీదనే ఆధ్యాత్మిక చర్చకూడ జరిగిందని రూఢి అవుతున్నది.

అయితే పూర్వ గ్రంథాలలో చెప్పబడిన అపూర్వశక్తులు మానవునికి లభిస్తాయా? మానవు డంత శక్తిసంపన్ను డవుతాడా? అన్నది ప్రశ్న. విజానికి సూక్ష్మంగా పరిశీలిస్తే మానవుని (ప్రాణి) వంటి విచిత్రమైన యంత్రం మరొకటి లేదు. ఈ దేహంలో ఉన్న చైతన్య పదార్థమేది? ఈ శరీరం ఎలా అన్ని సందర్భాలకు అనుకూలంగా మారుతున్నది? వైద్యశాస్త్రం ఇంత అభివృద్ధిచెందిన రోజులలోగూడ మృత్యువును ఆపలేకపోతున్నారు అని ఆలోచించినపుడు ఎంతటి విజ్ఞానశాస్త్రవేత్త అయినా ఏదో ఒక అతీతమైన శక్తి ఉంది, అదేమిటో అర్థంకాని స్థితిలో ఉన్నట్లు అంగీకరించక తప్పటంలేదు.

వరే భగవంతుని గురించిన చర్చ చూదాము. అతడు వాదామగోచరుడు. అంటే పలుకులకు అందనివాడు. గుణరహితుడు, ఆకార రహితుడు. మరి ఇలాంటి స్వరూపాన్ని ఎలా దర్శించాలి? పూర్వం మహర్షులు జ్ఞానమార్గంచేత, అనుమానాది ప్రమాణములచేత ఆ పరబ్రహ్మ

ధరించేది జాలంధర ముద్ర. అపానమును బంధించటమే మూలబంధ ముద్ర. ఈ అయిదు ముద్రలు సమాధినిష్ఠకు కారణాలు. బిందుస్థితికి వాయుస్తంభనం కారణం. జీవుని ప్రాణవాయువు పైకి, అపానవాయువు క్రిందికి లాగుతుంటాయి. ఈ విధంగా జీవుడు ప్రాణ అపానములతో సతమత మయ్యేటప్పుడు వాయువును స్తంభింపచేసేటప్పుడు హం అనే

---

స్థితిని రూపించారు. మరొకటి యోగ మార్గం. ఈ విధానంద్వారా పరతత్వాన్ని దర్శింప వీలవుతుందని తత్వంతెలిసిన మహర్షియులు అన్నారు. దీనికికూడా ఇంద్రియాలను అదుపులో ఉంచటం ప్రధానం. మానసిక ఏకాగ్రతకు సాధనయే మూలం. 'యోగశ్చిత్తవృత్తినిరోధః' అని అని యోగశాస్త్రాచార్యుడయిన పతంజలి సూత్రం. యోగం సాధనవల్లగాని సిద్ధించదు. అది అభ్యాసవశమైనది. సంపూర్ణంగా విజ్ఞానశాస్త్ర బద్ధమైనదే. మూలాధార, స్వాధిష్ఠ, మణిపూర, అనాహత, విశుద్ధ ఆజ్ఞాచక్రము లన్నవి ఇందులోని మెట్లు ఒకదానికొకటి ఊర్ధ్వం. మూలాధార చక్రంనుంచి తేజోరసం (కుండలిని) వెన్నెముకలోని రంధ్రం ద్వారా ఊర్ధ్వగతం చేయటమే యోగసాధన.

కుండలినిని ఊర్ధ్వగతం చేయటం వాయువుచేత మాత్రమే సాధ్య మవుతుంది. వాయువును పూరించి, కుంభించి, రేచకము చేయవలె. అంటే గాలిని పీల్చుట, కొంతసేపు నిల్వయుంచుట, అనంతరం విడచుట. దీనికే ప్రాణాయామం అని పేరు. దీనికొక క్రమ విధానం చెప్పబడింది. అభ్యాసం చేత వాయువును కుంభించి ఉంచటానికి వీలుకలుగుతుంది. కుండలిని ఊర్ధ్వగత మవుతున్నపుడు పైన చెప్పబడిన స్వాధిష్ఠాది చక్ర ముల స్థానముల వద్దకు చేరగానే కొన్ని అద్భుతశక్తులు కలుగుతాయి అవి,

శబ్దం, విడిచేటప్పుడు ' స ' అనే శబ్దం తిరిగితిరిగి కలుగుతుంటుంది. వ్యవధి లేకుండా కలిగే ఈ శబ్దాలు సోహం అజపా మంత్రమై జీవునిచేత దినమునకు 21600 మార్లు ఉచ్ఛ్వాస నిశ్వాసం రూపంగా జపింపబడు తుంటుంది.

అజపామంత్ర మాహాత్మ్యం వలన జీవుడు దూరాన జరుగుతున్న

---

అది షట్చక్రములను దాటి సహస్రారకమలం వద్దకు చేరగానే పరమాత్మ దర్శనం కావటమేగాక మహత్తరమైన శక్తివంతుడు కాగలడని యోగ శాస్త్రం, దానిని సాధనచేసినవారు అన్నారు.

అయితే యోగశాస్త్రం ప్రమాదభరితమైనది కూడ. కనుకనే యోగాభ్యాసం చేయదలచినవారు సాధనలో సిద్ధిపొందిన గురువును దగ్గర ఉంచుకొని యోగవిద్యను పూనవలెనని పెద్దలంటారు. లేకుంటే ప్రాణాయామం సాధనలో ఒక్కొక్కప్పుడు మరణంకూడ సంభవిస్తుంది. పౌరాణిక పురుషులయిన ఋషులను వదలివేద్దాం. చారిత్రక పురుషులయిన పోతులూరి వీరబ్రహ్మం, రామకృష్ణ పరమహంస యోగసాధనచేసి సిద్ధి పొందినట్లు వారి జీవితాలలో కనబడుతుంది.

ఇదంతా మాయ. కనికట్టు విద్య. ధన సంపాదనకొరకు కొంద రిది గొప్పగా చెబుతారు. ఇది యదార్థం కాదని చెవిక్రింద ఇల్లుకట్టుకొని ప్రచారంచేసే వారున్నారు. పై ఇద్దరు ఏ ధనానికీ ఆశించలేదు సరిగదా లోక శ్రేయస్సుకు తమ జీవితాలను అర్పించిన వారేగదా. మనకు చేతగాకనో, ఆ స్థాయిని అందుకొనలేక పోయినంత మాత్రాననో దాన్ని నిందించటం అది బూటకమని ప్రచారం చేయటం తగనిపని. పోనీండు ఇటీవల పాశ్చాత్యదేశాలలో దీనిని గురించి పరిశోధనలు జరుగుతున్నట్లు,

విషయాలను చూడగలుగుతాడు. ఎంత దూరమయినా శ్రమ లేకుండా ప్రయాణం చేయగలడు. తానంతకు ముందు చదువని, వినని శాస్త్రమయినా వివరిస్తాడు. భౌతిక శరీరాన్ని చిన్నదిగ చేసుకొనగలడు. పరకాయప్రవేశ శక్తి కలుగుతుంది. మృగ, పక్షి, కీటకాదుల భాషలను తెలుసుకొనగలుగుతాడు. శరీరాన దివ్యమైన తేజస్సు కలుగుతుంది.

---

అందునా రష్యా చాలా ముందడుగు వేసినట్లు తెలియవస్తున్నది. వారు ఋజువు పరచిన రోజునయినా వీటిపై నమక్మం కలుగుతుంది.

అది అలా ఉండనివ్వండి. యోగానికి అంగాలు ఎనిమిది. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులు.

ఇందులో యమమంటే ఆత్మనిగ్రహం. అనగా అంతరింద్రియమైన మనస్సును స్వాధీనం చేసుకొనటం. మనస్సు కోతివలె మిక్కిలి చంచలమైంది. చూచిన వస్తువుల నెల్ల కోరుకొంటుంది. కోరినదానిని పొందటానికి సక్రమ మార్గాన వీలుగాకపోతే అక్రమవిధానమైనా అవలంబించాలని ఆరాటపడి మానవుని దుర్మార్గ ప్రవృత్తికి మళ్ళించే మనస్సును స్వాధీనపరచుకొనటం. యమానికి అహింస, సత్యం, బ్రహ్మచర్యం కఠిన నియమాలు.

నియమం మళ్ళీ అయిదు విధాలు (1) శౌచం:బాహ్యశుద్ధి, అంతశ్శుద్ధి: (2) సంతోషం – తుష్టి: (3) తపస్సు : స్థిరమైన మనస్సుతో క్రమబద్ధంగా నడపటం. (4) స్వాధ్యాయం:సద్గ్రంథ పఠనము, మంత్ర జపం: (5) ఈశ్వర ప్రణిధానం : సర్వమును ఈశ్వరుని కర్పించి ఆరు బంధములను త్రుంచివైచుట: ఆసనం : స్థిరమైన విధంగా శరీరాన్ని ఉంచటం.

శరీరమంటి సుగంధం వెలువడుతుంది. షడంగ సాధకులయి మోక్ష నగరం ప్రవేశింపబోయే యోగికి దివ్యశక్తులు సంభవిస్తాయి. ఇది శరీ రానికి సంబంధించిన షడంగయోగం. మనస్సుకు బాహ్యమైన షడంగ యోగం వివరిస్తాను విను. కాశీవిశ్వనాథుడు, విశాలాక్షిదేవి, జాహ్నవి. యముడు, కాలభైరవుడు, డుంఠివిఘ్నేశ్వరుడు, కేదారేశ్వరుడు. మహేం

---

కనుక యోగ సాధనమున చెప్పబడిన అంగముల ఉపయోగం మానవుడిని నైతికపాశబద్ధునిగా చేయటం, సన్మార్గునిగా మలచటం, దుష్టతలంపులు నశింపచేయటం, మొదలయినవిగా కనిపిస్తాయి. మహత్తర శక్తులు కలుగుతాయో లేదో తరువాత సంగతి. మానవుడు మానవతా భావంతో జీవించాలని యోగం శాసిస్తుంది. అతడిని దానవుడుగా మార నీయదు. సమాజశ్రేయస్సుకు ఇది పరోక్షంగా ఉపకరిస్తున్నది గదా!

యోగసాధన వలన ఆరోగ్యం ఆయుష్షు పెంపుచేసుకొనటానికి వీలవుతుందని ఆధునిక శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. ప్రాణాయామంవల్ల (కొలదిగా సాధనచేసినా) నాళములనిండ రక్తం ధారాళంగా ప్రవహించ టానికి వీలవుతుందని, ముఖ్యంగా గుండెజబ్బులవారికి అన్నిమందులకంటె ప్రాణాయామమే ప్రయోజనకారి అని వైద్య నిపుణులు నిర్ధారణగా తెలియ జేశారు. కొన్ని విశ్వవిద్యాలయాలలో యోగసాధన అధ్యయన విష యంగా ప్రవేశపెట్టడంకూడ జరిగింది.

ప్రాచీన గ్రంథాలలో ఇదివరకే నేటి విజ్ఞానశాస్త్ర పరిశోధనలన్నీ ఉన్నాయి అనటం సాహసం. ఎవ్వరూ అనరు. కాని ప్రాచ్యగ్రంథా లలో నిక్షిప్తమైయున్న విజ్ఞానాన్ని, ఏదో పాతదనో లేక ఎవరికో ప్రాధా న్యం కలుగుతుందనో వదిలివేయటం లేక తిరస్కరించటం దేశ సౌభా గ్యానికి, సంస్కృతికి క్షేమకరమైనది కాదు.

ద్రుడు ఓంకారేశ్వరుడు కాశీనగరషడంగయోగం తెలిపినవారు.

వారణాసీపుర సంచారమే ఖేచరీముద్ర. ఆనందకాననవనములో ఉండటమే ఉడ్డీయానముద్ర. కాశీయందు ప్రవహిస్తున్న గంగానదిలో స్నానమొనర్చటమే జాలంధరముద్ర. పరమేశుని రాజరాజధానియందు చేసిన వ్రతాలే మూలబంధముద్ర. ఇవి బాహ్యముద్రలు అని యోగం వివరించాడు. కలశజుడు అంతతో తృప్తిపడక మహావిగూఢమయిన అయురవసానకాలం గుర్తించే విధం తెలియజెప్పవలసిందని ప్రార్థించాడు. దానికి షాణ్మాతురుడు నవ్వి ఇలా అన్నాడు.

# అయురవసానకాలం

కుంభసంభవా ఇది అత్యంత రహస్యమయినది. అయినా నీ వంటివాడు ప్రశ్నించినపుడు తెల్పకుండటం ధర్మంకాదు.

పింగళానాడి ఎక్కువగ పనిచేయక ఇడానాడిమూలంగా ఉచ్ఛ్వాస నిశ్వాసములు రెండు చరించే టట్లయితే నరుడు మూడు సంవత్సరాలకు మరణిస్తాడు. మూడహోరాత్రులు గాని, రెండహోరాత్రులుగాని పింగళా నాడియందు మాత్రమే ఉచ్ఛ్వాస నిశ్వాసాలు సాగితే వా డొక్క సంవత్స రంకంటె బ్రతుకడు.

పదిరోజులు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు రెండు నాడులనుంచి రాత్రింబవళ్ళు సమానంగా నడుస్తుంటే మూడు నెలలకే వాడు చనిపోతాడు.

ముక్కుతోగాక, నోటితోనే వాయువు వెలువడేవాడు మూడు రోజులలో మృతుడౌతాడు.

ఎవరికయినా హఠాత్తుగా ఆకాశంలో నలుపు పసుపు రంగులుగల పురుషుడు కనిపిస్తే వాడు రెండు వత్సరాలే జీవిస్తాడు.

తుమ్ము వెంట వీర్యము, మలమూత్రములు ఒకసారే విడచేవాడు ఒక సంవత్సరం మాత్రం బ్రతుకుతాడు. అరుంధతి, ధ్రువుడు, సూర్యమండలము కనిపించనివాడు ఆరు నెలలకే మరణిస్తాడు. నలుపు మొదలయిన రంగు మరొక విధంగా కనిపించినా, పులుపు మొదలయిన రుచులు ఇంకొక విధంగా రుచించినా, కనుకొలుకులు పొగరంగు కలిగియున్నా, రాత్రులు ఇంద్రధనుస్సు చూచినా వారికి ఆయుర్దాయం ఆరునెలలని గుర్తించాలి. తొందగాని, ఊసరవెల్లిగాని వేగంగా వచ్చి పాదాలనుండి తలవరకు ప్రాకినా, స్నానంచేసిన వెంటనే పాదములయందు హృదయ భాగంలోను తడి వెంటనే ఆరిపోయినా, అద్దపు బింబంలో ఎర్రనికాంతులు చూచినా వారి ఆయుస్సుగూడ ఆరు నెలలని గుర్తించాలి. పీత కదలి వస్తు, ఇద్దరు సూర్యులు లేక చంద్రులు కనిపించినపుడు, పగలు నక్షత్రాలు కన్పించి రాత్రులు కనిపించకుండా ఉన్నపుడు, కండ్లు మూయగానే గంధర్వనగర దర్శనం, లేక పిశాచాలు నృత్యంచేసినట్లు కన్పించటం స్వప్నంలో శరీరానికి నూనె పట్టించుకొన్నట్లు, తలగొరిగించుకొన్నట్లు, పిశాచాలు, గాడిదలు, కాకులు, కుక్కలు, గ్రద్దలు, నక్కలు కలలో కనిపించినవారికి మరణం దగ్గరలో ఉన్నట్లు తెలుసుకోవలె.

ఈ నిమిత్తాలు కనిపిస్తే వెంటనే కాశీ నగరంచేరి, నిరాకారవిశ్వ కల్ప, నిరస్తసమస్త ఉపాధికుడు విశ్వేశ్వరుడయిన లింగరూపియైన పరమాత్మ సాన్నిధ్యంలో మరణిస్తే ముక్తి కలుగుతుంది అని ఆయుష్య రహస్యాన్ని కుమారుడు వివరించాడు. ఇదంతా శ్రద్ధగా విన్న అగస్త్యుడు శరవణభవా! వియద్గంగ ప్రవహిస్తున్న మహాక్షేత్రం లెక్కకు

మిక్కిలిగా లింగముల రూపం ధరించి పరమేశ్వరుడు విలసిల్లుతున్న అవిముక్తక్షేత్ర మాహాత్మ్యం ఇంకా వినవలెనని కుతూహలముగా ఉంది అన్నాడు. దానికా శక్తిపుత్రుడు ఎంతో ఉత్సాహంతో ఇలా వివరించాడు.

## దివోదాసు చరిత్రము

పద్మకల్పంలో స్వాయంభువ మనువు కాలంలో ఒకప్పుడు అరవై సంవత్సరాలు అనావృష్టి ఏర్పడి గొప్ప కరువు సంభవించింది. ప్రజలంతా అవస్థల పాలయినారు. కొందరు సముద్రతీరాలకు నివాసం మార్చారు. జనులు లేక గ్రామాలు పాడుపడిపోయినాయి. నీరు లేక వృక్షాలు మలమలమాడి ఎండాయి. ఆకలి బాధలను తట్టుకొనలేక మనుష్యులు క్రూరమృగాలకన్న క్రూరులయి జంతువులను, మనుష్యులనుగూడ చంపితినసాగారు. అదీ ఎన్నాళ్ళు సాగుతుంది. క్రమంగా జంతువులు నశించాయి. ప్రజలు బక్కచిక్కినారు. ఎముకల గూళ్ళయినారు. కొందరు మరణించారు. ఈ విపత్యం చూడలేక బ్రహ్మ ఎంతో కలవర పడినాడు. ఆయనకు ఆశ్చర్యం వేసింది. వర్షాలు ఎందుకు కురవటం లేదో ఆయనకు గోచరం కాలేదు.

ఆలోచించగా, ఆలోచించగా విధాతకు ఒక్క కారణం కనిపించింది భూలోకంలో చక్రవర్తి లేడు. రాజులేని రాజ్యంలో ప్రజలు విశృంఖలంగా సంచరించసాగారు. యజ్ఞయాగాదులు మానివేశారు. హవిర్భాగం లేక పోవటంవలన దేవతలు క్షుధాపీడితులయినారు. దానితో పర్జన్యుడు వర్షించ సమర్థుడు కాలేదు. కనుక సమర్థుడయిన వానిని ఒక్కడిని చూచి భూమండలానికి అధిపతిని చేయాల అని ఆలోచించాడు.

చూడగా మనువంశంలో జనించిన రిపుంజయుడు అతని మనస్సులో మెది లాడు. చతుర్ముఖుడు ఆయన వద్దకు వెళ్ళాడు. మనువంశతిలకా! ఈ ధరణీచక్రాన్ని పాలించటానికి నీవే సమర్థుడవు. రాజు లేక ప్రపం చము కల్లోలమయింది. చతుస్సముద్ర పర్యంత ధరణీచక్రాన్ని పరిపా లించి ఉద్ధరించు. దేవతలతో స్నేహం కలిగి ఉండటంవల్ల నీవు దివో దాసుడనే నామం ధరిస్తావు. వాసుకి కుమార్తె మోహిని నీకు ధర్మపత్ని కాగలదు అని సామువయంగా పల్కినాడు.

ఆ మాటలు విన్న రిపుంజయుడు ధాతతో తాతా! నీవంటివాడు చెప్పినదానిని అంగీకరించకుండా ఉండటం ధర్మంగాదు. కనుక అంగీక రిస్తాను. కాశీ పట్టణంలో నివసించే మునులతో దేవతలు భూమిపై తిరు గాడుతున్నారు. వారాణసీదర్శనోత్సుకతతో పాతాళవాసులుగూడ ధరా తలంమీద విహరిస్తున్నారు. వీరంతా ఇక్కడ ఉంటే నా పరిపాలన సక్రమంగా సాగదు. నీవు నా పలుకులను అన్యథాభావింపవద్దు. దేవ తలు అహోలోకవాసులు భూమిపై సంచరిస్తుంటే నే పరిపాలనా భారం వహించను అన్నాడు. దానికి పితామహుడు వారిని భూలోకంనుండి పంపివేయటానికి అంగీకరించాడు. ఏకాయెకిన కాశీవిశ్వనాథుని కదలే గాడు. దివోదాసుడు తెలిపిన ఒడంబడిక వివరించాడు. దేవతలంతా భూమిని వదలిపోయే విషయం అంగీకరించటేని తాము స్వర్గలోకాని కేగినారు.

దివోదాసుడు చక్రవర్తి పదవి వహిస్తుండాడు. వెంటనే నాకలోక వాసులను, నాగులను ఈ లోకంవిడి పోవలసిందనీ అలా పోకుంటే అది దోషం కాగలదని చాటించవలసిందని భటులకు ఆదేశించాడు. రాజాజ్ఞను శిరసావహించినవారై తమతమ శాశ్వత శ్రీశైలం, కోదార్కం, పండరి, కాశీ

హస్తి, కాంచి, వెంకటాచలం, శ్రీరంగం, రామేశ్వరం, మొదలయిన దివ్యస్థలాలలో తమ ప్రభువు అంశను చాటారు. నానావిధ పుణ్యక్షేత్రాల లోని దేవతలు, యక్షులు, నాగులు దివోదాసుని ఆజ్ఞవిని ఏమిచేయటానికి తోచక కాశీక్షేత్రం చేరారు. గంగానది ఒడ్డున విడిసిన దేవతాలోకాన్ని చూచి పరమేశ్వరుడు, దేవతలారా! కాలగతిని ఎవ్వరూ మార్చలేరు. నేను కూడా కాశీక్షేత్రం విడిపోతున్నాను. కమలభవుడు లోకహితార్థం సర్వ సర్వం సహా చక్రాన్ని దివోదాసునకు ఇచ్చివేశాడు. యక్ష, సురాసుర, కిన్నర, పన్నగ, గరుడాది దివ్యులు ఈలోకాన్ని విడిపోనిదే తాను రాజ్యం చేయనన్నాడట ఆ రాజు. విధాత ఆతనికి అవరం ఇచ్చాడు. పితామహుని మాట మనం గౌరవించవలె. నేను మందరాచలంమీద నివసిస్తాము. దేవతలంతా స్వర్గంచేరండి. పన్నగులు పాతాళం చేరండి అన్నాడు. ఈశ్వరుని వచనం పాటించి వారంతా తమతమ లోకాలకు వెళ్ళినారు. పరేతవిలయుని అంతరంగ భక్తులు మాత్రం త్రిపుండ్రములతో రుద్రాక్ష మాలికలలో శార్దూలచర్మములతో పాటలజటాధారులయి పంచాక్షరీ మంత్రపఠనం చేస్తూ పరమేశ్వరుని అనుగమించారు. జగదధీశ్వరుడయిన ఈశుడు మందరాద్రిని పావనంచేయదలచి ప్రయాణం సాగించాడు. మంద రుడు ఒకప్పుడు ఈశ్వరుని తనపై అధివసించమని వరంకోరుకొన్నాడు.

పారస్వతేశ్వరుడు, రత్నజాతేశ్వరుడు, వసునాగరేశ్వరుడు శైలే శ్వరుడు, భృంగీశ్వరుడు మొదలయిన మాహేశ్వరులు, జ్యోతిర్లింగ మూర్తులు, లోలార్క కేశవులు, విశాలాక్షి, ఢుంఠివిఘ్నేశ్వరుడు, దండ పాణి ఈశ్వరుని వెంట కదిలారు.

వారంతా లవణసముద్రపరివృతమైన జంబూద్వీపాన్ని దాటి, ఇక్షుసముద్ర పరీతమయిన ప్లక్షద్వీపము నధిగమించారు. సురసముద్ర

పరివేష్టితమయిన శాల్మలీ ద్వీపం గడిచారు. ఘృతసముద్రముద్రితమైన
కలశ ద్వీపం చేరారు. ఆ ద్వీపానికి రత్నమకుటాయమానముగనున్న
మందర పర్వతంమీద కనక కలధౌత మాణిక్య విరాజితమయిన ఒక
గుహా నిలయంలో పార్వతీ పరమేశ్వరులు అధివసించారు. తక్కినవాళ్ళు
అనువైన ప్రదేశాలలో ఆవాసం ఏర్పరచుకొన్నారు.

పవిత్ర గంగా తీరాన నివసించిన దేవతలంతా స్వర్గంచేరారు.
దివోదాసుడు భూమిపై ఎక్కడా ఒక చిన్న దేవతనుగూడ నిల్వనీయరాదని
కట్టుదిట్టాలు ప్రారంభించాడు. అక్కడక్కడ గల పుణ్యక్షేత్రాలలో
దేవతా విగ్రహాలు మాత్రం మిగిలాయి. మూసానమ్మ మొదలయినవారు
నదిచప్పుడు గాకుండా పాతాళమార్గం పట్టినారు.

వసుంధర దేవతారహిత ప్రదేశమైంది. విశ్వేశ్వర ఆలయాలలో
స్తోత్రపాఠాలు లేవు. కాశికా పట్టణపు కోష్ఠములలో హృద్యమంత్రజపాలు
శూన్యమైనాయి. శివాగారములలో పంచాక్షరీమంత్ర పాఠపఠనాలు లేవు.
విష్ణుఆలయాలలో ద్వాదశాక్షర జపాలుగాని పురుషసూక్తగీతములుగాని లేవు
ఎక్కడా బలులుగాని, లేక నినాదాలుగాని లేవు. శంకరమూర్తీ! ఈ
ప్రదేశం చూడావుగదా. పంపా నిటలాక్షదేవుని నెత్తిని జటాజూటంలో
ప్రకాశిస్తున్న చంద్రరేఖనుండి జాలువారే అమృత సేచనంతో ఏపుగా
పెరిగిన పూరేడు, నిమ్మ, నారికేళాది వృక్షాలతో ఎంతోహాయి నిచ్చే
సుందర ప్రదేశం. నిరంతరం యోగులకు ఆహ్లాదకరమైన ఈ సాను
మలయందున్న నేనుగూడ దివోదాసుని వలనకలిగిన ఈ వైపరీత్యానికి
ఆశ్చర్యపడినాను. తల్లిదండ్రులను చూడవలెనని కోరిక కలిగి నేనుకూడ
మందరాద్రికి వెళ్ళాను.

దేవతలను పంపివేసిన తరువాత దివోదాసుడు వారణాసిని ముఖ్య

పట్టణంగా చేసుకొని ఎనిమిదివేల వత్సరాలు రాజ్యం చేశాడు. భూమిని వదలిపోలేని కొందరు అల్పదేవతలు దివోదాసుని ప్రార్థించి సేవకులయి నారు. దైత్య దానవులకు చక్కని అవకాశం కలిగింది. పగవారి శత్రువులు తమకు చుట్టాలుగదా!

భూమిలో నిరాటంకంగా, నిరాతంకంగా దివోదాసుడు రాజ్యం చేస్తున్నాడు. ఉత్సాహ ప్రభుమంత్ర శక్తియుతుడైనాడు. సమయా సమయములు చూచి చతురుపాయాలు ప్రయోగిస్తూ పరిపాలన కొనసాగి స్తున్నాడు. తన రాజ్యంలో చాతుర్వర్ణములవారు ఆశ్రమ ధర్మాలు నిర్వ ర్తించేటట్లు చేశాడు.

సంవత్సరాలు గడిచినకొద్దీ దేవతలకు వారణాసీ విరహార్తి కలి గింది. తమకు కాశీ దర్శనం కావాలంటే ఎలా లభిస్తుంది. దివోదాసుడు వున్నంత కాలం అది అలభ్యవరము. కనుక ఆతనిని రాజ్యంనుంచి తొల గించాలి. దాని మార్గమేమిటి? ఎంత ఆలోచన చేసినా వారిబుద్ధికేమీ తోచలేదు. బృహస్పతి వద్ద కేగారు. ఆయనతో తమబాధను చెప్పుకొన్నారు.

అంగీరసుడు ఇంద్రాది దేవతలనుచూచి గీర్వాణులారా ! ఎందుకు మీకీ విచారం? మీ కార్యం నెరవేరటానికొక మార్గమున్నది. ప్రాణా పాన, వ్యాన, ఉదాన, సమానములను తృప్తిపరచేది అన్నం. దానికి ప్రాణమనే పేరుగూడా ఉంది. అన్నం సిద్ధం కావటానికి అగ్ని అవశ్యకం. అగ్ని మనలోని వాడేగదా! వాయువు మనం చెప్పినట్లు వినగలడు. వరుణుడు మాత్రం దిక్కతిగాదా! ఈ ముగ్గురు దివోదాసుని రాజ్యంలో తమతమ తేజస్సులను ఉపసంహరిస్తే ఆతడు మనం చెప్పినట్లు వింటాడు. వరుణ వాయువుల సాయంతో అగ్ని తేజంలేనిదే అన్నం సృష్టికాదు.

ఓగిరం లేకుంటే బలిహరణం వైశ్వదేవాదులు లేకుండా పోగలవు. హవ్య కవ్య క్రియలు శూన్యం అయితే ప్రజలకు రాజంటే విరక్తి కల్గుతుంది. ప్రజా విప్లవంతో కోటలు, దుర్గాలు బలహీనం కాగలవు. సప్తాంగ రహితం అవుతుంది. దానితో త్రివర్గం నశిస్తుంది. త్రివర్గ ధ్వంసంతో రాజా ఉభయలోకాలకు దూరస్థుడవుతాడు. కనుక ఈ ముగ్గురు తమతమ తేజస్సులను తక్షణమే ఉపసంహరించాలి అని బోధించాడు. బృహస్పతి ఆలోచనే సరియైన దన్నారు దేవతలు. వెంటనే అగ్ని తన తేజస్సును ఉపసంహరించాడు.

కాశీ పట్టణంలో ఎక్కడా అగ్నిజ్వాల కనిపించలేదు. కాష్ఠముల యందు ఎంత ప్రయత్నించినా జ్వాల రగుల్కొనలేదు. గృహిణులు సంభ్రమాశ్చర్యాలలో మునిగిపోయారు. వంటవార్పులు లేకుండా పోయినాయి. బ్రాహ్మణులు హోమములు మానివేశారు. బ్రహ్మయజ్ఞాలకంతరాయం కలిగింది. రాజగృహంలో కూడా ఇదే దురవస్థ సంభవించింది. మహానసంలో పోయి రాజలేని వంటవారు పదార్థాలు సూర్య కిరణాలతో పాకంచేసి రెండు జాములకు భోజనం పెట్టారు. దివోదాసుడు ఇదంతా దేవతలు చేసిన మిస్త్రియం అని గ్రహించాడు. అనాటి వెలుగులో ఆ పదార్థాలు భుజించాడు. పట్టణంలో ప్రజలు గగ్గోలు పడినారు. ప్రజలు గుంపులు గుంపులుగా రాజ సన్నిధికి వెళ్ళారు.

మహారాజా! ఏమి కారణమోగాని, అగ్ని మన రాజ్యంలో జ్వలించటంలేదు. దేవతలంతా మన మీద మత్సరించారో ఏమో! మా కేది దిక్కు అని వాపోయారు. దివోదాసున కేమి చేయటానికి తోచలేదు. దేవతలు కన్నెగట్టినారు. రాజ పాలకుడు గదా ప్రజలను కాపాడవలసిన బాధ్యత వానియందున్నది. కానేం చేయాలి! తీవ్రంగా

ఆలోచించారు. సరలే ఇట్టి పాపకార్యానికి పూనుకోవటం ఎంతో హేయ మయిన పని. వీరి పంతానికి లోబడి దేవతలకు దాసోహ మనటమా ? ఎంత అవమానకరం? తానెంతటి శక్తివంతుడు. గీర్వాణులకు మాత్రం తెలియదా ? ఇంత మాత్రానికే దివోదాసుడు వీరి కాళ్ళపైబడి ప్రార్థిస్తాడా? ఒక అగ్ని ఏమిటి? దేవతలందరి శక్తి తానే ధరించి ప్రజ లకు ఏ లోటు రానీయకుండా చేయటానికి సామర్థ్యం లేదా ? ఈ విధంగా ఆలోచించి చక్రవర్తి ప్రజలతో ఇలా అన్నారు. ప్రజలారా!మీరు భయపడకండి. ఇదంతా దేవతల కుతంత్రం. యోగసంపదతో నేనే అగ్ని దహనశక్తి కలిగిస్తాను. నన్నికల్లు దాస్తే పెండ్లి ఆగిపోతుందిలే అన్నట్లుంది దేవతల ఆలోచన.

నేనే అగ్నిరూపం ధరించి యజ్ఞాలలో హవ్యములు స్వీకరిస్తాను. పర్జన్యాది రూపం ధరించి వర్షిస్తాను. అవసరమయితే సూర్యచంద్రుల ఆకృతులుకూడ నేనే ధరించి దినక్రమం భంగంకాకుండా వెలుగును ప్రసా దిస్తాను. వాయురూపం ధరించి ప్రాణుల అంతర్బహిర్వ్యాప్తిని పొందుతాను. అది ఇది ఎందుకు సమస్త దేవతారూపాలు నేనే ధరిస్తాను. యోగసాధన శక్తితో అంతా నిర్వహిస్తాను. మీరేమీ విచారింపక మీ మీ గృహాలకు పొంది అని ప్రజలను ఓదార్చి పంపాడు. అనంతరం దివోదాసుడు యోగవిద్యా బలంతో సమస్త దేవతా రూపాలు తానే ధరిం చాడు. ప్రజలు యథావిధిగా తమతమ కార్యాలు నిర్వర్తిస్తున్నారు. అయితే అయాచితంగా అన్నీ సమృద్ధిగా లభించటంవల్ల ప్రజలలో సోమరి తనం ఎక్కువైంది.దాంతో దుష్టభావనలు మనస్సులో చిగురింపసాగాయి.

మందర పర్వతంపై ఎంతో సుఖవంతంగాఉన్నా, పరమేశ్వరుడు కాశీని మరచిపోలేక పోయాడు. ఆయనకు కాశీ వియోగం భరింపరాని

ఆలోచన. ఒకనాడు సింహముఖి, గజానన, వికటానన, అష్టవక్ర మొదలయిన అరువదినాల్గు యోగినులను పిలువనంపాడు. పింగళుడు వారితో దివోదాసుడు కాశీనుండి దేవతలను వెడలనడచినాడు. దేవతలు వారణాసిని విడటంతో ఖిన్ను లయినారు. మీరందరు నానావిధములయిన మాయ వేషాలు ధరించి కాశికి చేరండి. ఎట్లయినా ప్రయత్నించి పురుషుల ఆచారాలు చెడగొట్టండి. పుణ్యస్త్రీల పాతివ్రత్యానికి భంగం కలిగేట్లు చేయండి. వర్ణాశ్రమ ధర్మాలు పాడుచేయండి. అప్పుడుగాని మాకు కాశీనగర ప్రవేశానికి వీలుగాదు అని చెప్పారు. యోగినులంతా సరేనని వారణాసికి చేరారు. ఒకరు పూలమ్ము వనిత, ఒకరు సైరంధ్రి, ఒకరు గంధవాహిని, ఒకరు సాముద్రికవేత్త ఇలా భిన్నరూపాలు ధరించారు. చిత్రవేషాలు ధరించి యోగినులెంత ప్రయత్నించినా నవరీకృతులు కాలేకపోయినారు. పని నెరవేరకుండా వస్తే ఈశ్వరుడేమి కోపిస్తాడో అని వారంతా కాశీలోనే ఉండిపోయారు.

ఎంతకాలం గడిచినా యోగినులనుండి వార్త రాకపోవటంతో పరమేశ్వరుడికి ఎంతో బాధ కల్గించింది. ఓర్పు నశించి సూర్యుని పిలిచి ఆదిత్యా! దేవతల ఆర్తి కర్మసాక్షివి నీకు ఎరుకేగదా! దివోదాసుని ధర్మచ్యుతునిచేయ వలసివుంది. కామ క్రోధాది అరిషడ్వర్గానికి అతడు లోబడినప్పుడుగాని అతని చలమూ, బలమూ నశింపవు. ధర్మమునందు సుస్థిరుడయి మానవుడున్నంతకాలం ఏ ఆపద కలుగదుకదా! ఎట్లయిన ఈ చక్రవర్తిని వంచింప వలసిందని ఆజ్ఞాపించాడు. మహా ప్రసాదమని ఆదిత్యుడు కాశీ చేరినాడు.

ఒకసారి యాచకుడుగా, ఒకసారి దూతగా, మరొకమారు నదా

న్యుడుగా, ఇంకొకమాటు దీనుడుగా, ఒక్కొక్కసారి కార్తాంతికుడుగా, పాషండుడుగా, దిగంబరిగా, బ్రహ్మచారిగా, గృహస్థుడుగా నానా రూపాలతో తపనుడు కాశిలో తిరుగాడినాడు. ఎన్ని విధముల ప్రయత్నించినా, రాజునందుగాని, వారణాసిలోని ఆబాలగోపాలం వద్దగాని, చిట్టచివరి కొక వృద్ధురాలియందుగూడ అతడు మార్పు కలుగజేయ లేకపోయినాడు. ఈషత్తయినా అనాచారం కనుగొన లేకపోయినాడు. తను వచ్చినపని విఫలం కాగా దినకరుడు మనస్సులో విచారించాడు.

కార్య సాఫల్యం కాకుండా మందర పర్వతానికి ఎట్లా పోగలను? ఏ ముఖంతో పరమేశ్వరుని చూడగలను? ప్రమథుల నా చేతగానితనానికి హేళన చేయరా? కాశీ వియోగ వ్యథాగ్నిచేత తప్తుడైన ఈశుడు కవలిఉన్నాడు. నా అశక్తతకు అతను కోపిస్తే అడ్డుపడగల వాడెవడు? కనుక మందర పర్వతమునకు పోను. కాశీయందే కాలం గడుపుదును. హరిశ్చంద్రుడు, దధీచి, శిబి మొదలయినవాళ్ళు కాశిలో నివసించి వారి చింతలను పోగొట్టుకున్నారట. సంసార దుఃఖాలను త్యజించినారట.

ఇలా ఆలోచించి సూర్యుడు పన్నెండు మూర్తులయి వారణాసిలోనే ఉండిపోయినాడు. ఉత్తరార్కుడు, సాంబాదిత్యుడు, గరుడాదిత్యుడు, మయూఖాదిత్యుడు, ఖఖోలాదిత్యుడు, అరుణాదిత్యుడు, వృద్ధాదిత్యుడు, కేశవాదిత్యుడు, విమలాదిత్యుడు, గంగాదిత్యుడు, యమాదిత్యుడు, లోలార్కుడని ఆ మూర్తుల పేర్లు. కాశీ విహారానికై లోలురయినాడు కనుక లోలార్కుడయినాడు అని వ్యాసుడు తెల్పగానే అగస్త్యుడు షణ్ముఖస్వామీ! ద్వాదశాదిత్యుల ప్రభావం వివరింప వలసిందని ప్రార్థించాడు.

దానికి కుమారస్వామి ఆనందపడి ఇలా వివరించాడు.

# ఉత్తరార్క ప్రభావం

భాస్కరునియొక్క ఒక మూర్తి కాశీపట్టణంలో ఉత్తర దిశన నెలకొన్న కారణాన ఉత్తరార్కుడని పేరు కల్గింది.

కాశీయందు ప్రియవ్రతు డనే బ్రాహ్మణుడున్నాడు. అతను మిక్కిలి సదాచార సంపన్నుడు. శాంతియుతుడు. అతిధి అభ్యాగతులను ఆదరించే వాడు. అతని భార్య శుభవ్రత. పతిభక్త ఎన్నడూ జవదాటని ఇల్లాలు. అను కూలవతియైన భార్యతో ప్రియవ్రతుడు గార్హస్థ్య ధర్మాన్ని నిర్వర్తించాడు. కొన్నాళ్ళకు ఆ దంపతులకొక కుమార్తె జనించింది. ఆమె మూలా నక్షత్రం మొదటి పాదాన జన్మించింది. ఈ ఒక్క అశుభ విషయంతక్క సర్వ శుభ లక్షణ రూపవతి. తల్లిదండ్రులు సులక్షణ అని నామకరణం చేశారు. శుక్ల పక్ష చంద్రునివలె ఆ బాలిక దినదిన ప్రవర్ధమాన అయి యౌవనవతి అయింది. వివాహ వయస్కురాలయిన ఆ బాలికనుచూచి తండ్రి, ఈ బిడ్డకు తగిన వరుడెవ్వడు? పితృప్రాప్తమైన ఆభిజాత్యం కలవాడు కావాలి అట్టివాడు నాకెక్కడ లభ్యం కాగలడని చింతిస్తుండేవాడు.

మూలా నక్షత్రాన జనిస్తే గండం అంటారు పెద్దలు దాని ప్రభావ మేమో! తండ్రి జ్వరార్తుడై మరణించాడు. అతనిభార్య సహగమనం చేసింది. సులక్షణ ధైర్యం గలది. తల్లిదండ్రులకు ఉత్తరక్రియలు నిర్వర్తింప చేసింది. ఎంతో అల్లారుముద్దుగ పెంచిన జననీజనకులను ఎలా మరువగలను? తల్లిదండ్రులను పోగొట్టుకొన్న నేనెట్లా ఒంటరిగా మనగల్గుతాను? పరమేష్ఠి నాకీ అతిలోక సౌందర్యం ఎందుకు కూర్చాడు? కులశీలాదులు చూచి నన్ను నేనే ఎవరికైనా వివాహంలో ఎట్లా సమర్పించుకొంటాను? ఈ విధంగా విచారించి సులక్షణ బ్రహ్మచర్య నిష్ఠను బూని ఉత్తరార్కుని కరుణించి ఉగ్రమైన తపస్సు చేయసాగింది. ఏమి

కారణమో ఏనాటి అనుబంధమో ఒకమేక ఆమెతోనే ఉంటూ చెలికత్తె వలె మసలింది.

సులక్షణ నిత్యం ఉత్తరాదిత్య కుండికయందు రేపాడి స్నానమాడి, పగలు నాలుగుజాములు నిండైన భక్తితో నీలకంఠుని సేవించింది. కొన్ని వత్సరాలకు నీలకంఠుడు ప్రత్యక్షమై సులక్షణా! నీభక్తికి సంతసించాను వరాలు కోరుకొమ్మన్నాడు. అంతట సులక్షణ ఇంతకాలం ఈమేక నాతోనే నివసించి ప్రాణ స్నేహితునివలె నన్ను వదలకుండా ఉంది. నోరులేని ఈ ప్రాణికి ముందు వరాలిమ్మని వేడుకొన్నది. ఆ మాటలకు ఈశ్వరుడు హర్షపులకితు డయినాడు. సులక్షణా ఈమేక రాబోయే జన్మలో కాశీరాజు కుమార్తెగా జనిస్తుంది. ఆజన్మ కడతేరిం తర్వాత మోక్షం పొందుతుంది అని అంతర్హితుడైనాడు.

అనంతర కాలంలో మేక కాశీపట్టణపు రాజుకు గౌరి అనేపేరుతో కుమార్తెగా జనించింది. సులక్షణను తనసార్కి చెలికత్తెగా, గురువుగా ఆదరించింది. ఈబర్కరీ గాథతో ఉత్తరార్క కుండానికి బర్కరీకుండ మని పేరు కల్గింది.

—o—

# షష్ఠాశ్వాసం

## సాంబాదిత్య ప్రభావం

అనంతరం శ్రీవాహనుడు అగస్త్యునితో కుంభజా! సాంబాదిత్య ప్రభావం వినిపిస్తాను విను.

ద్వాపరాంతంలో దుష్ట దానవులను సంహరించి భూభారాన్ని హరించ టానికి శ్రీమన్నారాయణుడు దేవకీ వసుదేవులకు కృష్ణుడుగా జన్మించాడు. నరకాసురుని సంహరించి అతని చెరలో ఉన్న పదహారువేల రాచకన్యలకు విమోచనం కల్పించి వారి కోరికపై వివాహమాడినాడు. వీరుగాక రుక్మిణి, సత్యభామ, జాంబవతి, మిత్రవింద, సుదంత, నాగ్నజితి, కాళింది, భద్ర అనే అష్టమహిషులున్నారు. ఒకనాడు దేవర్షియైన నారదుడు ద్వారక కేతెంచాడు. ఆ సమయంలో బాలుడుగ ఉన్న సాంబుడు ఇతర బాలు రతో ఆడుకొంటున్నారు. ఆట తమకంలో అతడు నారదుని రాకను గమనించలేదు. ఆయనకు తగిన గౌరవమర్యాదలతో స్వాగతం ఇవ్వ లేదు. తన తోటి పిల్లలు నమస్కరించి వెళ్ళిపోయినా సాంబుడు దేవర్షికి నమస్కరించాలని తోచలేదు. నారదునకు ఆ బాలుని అలక్ష్య వైఖరి నచ్చలేదు. అతడు నేరుగా అంతఃపురానికి వెళ్ళి గోపికావల్లభుని సప ర్యలు స్వీకరించాడు. ఏవో విషయాలను మాట్లాడుతున్న సమయంలో నారదుడు సాంబుని ప్రస్తావించి అతడు మూర్ఖుడని పల్కినాడు. పర మాత్మను దర్శించిన నారదుడు స్వర్గమునకు వెడలినాడు. అంతట మహర్షి కూడ సాంబుడు చేసిన అవజ్ఞ మరచిపోలేక పోయినాడు. ఆ సాంబుని అహంకారానికి తగిన ప్రాయశ్చిత్తం చేయవలెనని సంకల్పించాడు సమయం కొరకు ఎదురుచూడసాగాడు. తరువాత కొన్నాళ్ళకు ద్వారవతి కేతెంచాడు. సాంబుని పిలిచి తన రాక శ్రీ కృష్ణునకు తెలియజేయవలసిం

దన్నాడు. తండ్రి అంతఃపురంలో ఉండటం తెలిసిన సాంబునకు ఏమి చేయటానికి తోచలేదు ఆ సమయంలో తండ్రి వద్దకు వెళ్ళితే దోషం. వెళ్ళకపోతే దేవర్షిని అవమానించి నట్లవుతుంది. ఎట్టకేలకు అతడు అనుచితమని తెలిసికూడ తండ్రివద్ద కేగి నారదుని ఆగమనం వివరించాడు. సాంబుడు చేసిన అనుచితానికి కృష్ణుడు కోపించి కుష్ఠురోగ పీడితుడవు కమ్మని శపించాడు. సాంబుడు విచారింపలేదు. తండ్రికి, నారదునకు నమస్కరించి తాను నిరపరాధినని నమ్రతతో విన్నవించాడు. శాపావసానం తెల్పవలసినదని ప్రార్థించాడు. మురారి మనస్సులో ఎంతో పశ్చాత్తాప పడినాడు. సాంబుని చూచి కుమారా ! కాశీ పట్టణానికేగి విశ్వలభక్తితో ఆదిత్యుని ఆరాధించు. నీకు శాపవిముక్తి లభిస్తుంది అని శాపవిమోచన మార్గం వివరించాడు.

సాంబుడు తండ్రి ఆదేశానుసారం కాశీకేగి విశ్వలభక్తితో అర్కుని ఆరాధించి కుష్ఠువ్యాధినుంచి విముక్తిపొందాడు. సాంబునిచే ఆరాధింపబడిన ఆ మూర్తి సాంబాదిత్యుడని ప్రసిద్ధిచెందాడు. ఇలా వివరించి కుమారుడు గరుడాదిత్యప్రభావం వర్ణించాడు.

## గరుడాదిత్య మాహాత్మ్యం

మహాశానా ! పరమ బ్రహ్మణ్యు డయిన కశ్యప ప్రజాపతికి వినత, కద్రువ అనే ఇద్దరు భార్యలున్నారు. కద్రువకు శేషుడు, వాసుకి, తక్షకుడు, కర్కోటకుడు, ధృతరాష్ట్రుడు మొదలయిన సర్పశ్రేష్ఠులు పుత్రులుగా జన్మించారు. వినత గర్భాన మూడు అండాలు జనించాయి. కొన్నాళ్ళకు ఒకనాటి సూర్యోదయ సమయాన గూబ పులుగు జనించింది. పక్షి సంతతి కంతటికి మొట్టమొదటగా జనించిన కారణాన కౌశికుడే పక్షులకు రాజయినాడు. అనంతరం దాని స్వభావం తెలియగానే పక్షులు

గుడ్లగూబ రావడాన్ని వ్యతిరేకించాయి. దాని ధ్వని శ్రవణ విఘ్నంగా ఉంది. కండ్లు త్రిప్పితే మిడిగ్రుడ్లు కావటంచేత భయపెట్టవచ్చున్నాయి. వికృతాకారంగా ఉన్న గూబపులుగు ఆధిపత్యాన్ని మనోహరాకారంతో కమ్మని కంఠాలతో విరాజిల్లే కలహంసలు, మయూరాలు, చిలుకలు త్రోసి రాజన్నాయి. నైరాశ్యం చెందిన కౌశికుడు రాజ్యాధిపత్యాన్ని వీడి కొండ గుహలో నివసించసాగాడు. అది చూచి వినత చింతించి రెండవ కుమారుని చూడగోరి తక్కిన రెండు అండాలలో ఒక దానిని పగులగొట్టింది. దానినుండి శరీరంలో ఊర్ధ్వభాగం మాత్రం కలిగి క్రిందిభాగం లేని అనూరుడనే అన్వర్థనామధేయుడు జన్మించాడు. ఆలోచనా రహితంగా తల్లి చేసినపనికి తాను అసంపూర్తి శరీరు డయినానవనే కోపంతో అనూరుడు జనని అవిహూతి ఎంతక మూర్ఖురాలవై అండం పగులగొట్టినావు గనుక నీవు నీ సవతికి పెక్కు వత్సరాలు దాసివి కాగలవు అని శాపం ఇచ్చాడు.

వినత ఆ మాటలు విని దుఃఖించి నాయనా! ఏలరా తండ్రీ! ఇంత నిర్దయుడవై నన్ను కఠినంగా శపించావు. పుత్రముఖము చూచి ఆనందించాలని ఆతృతతో నే జేసిన చిన్నతప్పును ఇంత పెద్దదిచేసి ఏమిరా? మాతృ హృదయం తెలియదా ఏ కన్నతల్లి కుమారుడు అంగవిహీనుడు కావాలని కోరుకుంటుంది? అని వాపోయింది. అనూరుడు తన తొందరపాటుకు మనస్సులోనే వేదనపడినాడు. తల్లీ! అసంపూర్తి కాయుడనై నావన్న బాధతో ముందువెనుకలు చూడక జన్మనిచ్చిన మాతృదేవినే శపించాను. నన్ను క్షమించు. అయిదువందల సంవత్సరాలు మాత్రమే నీకీ దాస్యం ఉంటుంది. ఈ మూడవ అండాన్ని కాపాడి దానంతటది పగిలేవరకు రక్షించు. దానినుండి మహా బలిష్ఠుడయిన పుత్రుడు జనిస్తాడు. అతడే

నీ దాస్యాన్ని పోగొట్టగలడు సుమా! అని అరుణుడు జనని అనుమతి పిడసి తారకబ్రహ్మవిధానమయిన కాశికాపురికేగి తపస్సు చేశాడు.

పిమ్మట కొన్నాళ్ళకు ఒకదినం వినతాకద్రువలు సముద్ర తీర ప్రాంతంలో విహరిస్తున్నారు. దూరంగా ఉచ్చైశ్రవం అనే ఇంద్రుడిగుర్రం తిరుగుతున్నది. అశ్వాన్నిచూచి వినత ఆహాయమెంత చక్కగాఉంది. మహాపురుషుని కీర్తివలె స్వచ్ఛంగా తెల్లగా ప్రకాశిస్తున్నది అన్నది. ఆ మాటలకు కద్రువ అక్కా నీవేకన్నులతో చూచావోగాని ఆ గుర్రం వాలం మాత్రం నల్లగఉంది చంద్రునిలోని మచ్చవలె ప్రకాశిస్తున్నది అన్నది. ఆ ఇద్దరు వాలం నీలమని, కాదు ధవళమని వాదులాడి వాదులాడి చివరకు ఓడినవారు దాసీత్వంచేసేటట్లు పన్నిదం వేసుకొన్నారు. ఇంతలో సూర్యుడు అస్తమించాడు. మరునాడు చూతములెమ్మని ఇద్దరు ఇండ్లకేగారు. నిజానికి వాలం ధవళంగానే ఉంది. కద్రువకావలెననే వాలం నల్లగఉందని వాదులాడింది. ఇంటికేగినతరువాత కద్రువ మనస్సులో ఆరాటపడసాగింది. తాను అబద్ధము పల్కిందిగదా! రేపు నిజంబయటకు రాగలదు. తాను దాసి కావలె. అనే భావన కలిగేటప్పటికి కద్రువ కంపించిపోయింది. దిక్కుతోచక చివరకు నల్లనిదేహముగల తన బిడ్డలను సర్పములను పిలిచి నేను వినతతో పందెంవేసినాను మీరు కామరూపులు. తిన్నగవెళ్ళి ఉచ్చైశ్రవం తోకనవ్రేలాడి తోకనల్లగా కనబడేటట్లుచేసి నన్ను గెలిపించండి. అని కోరింది. ఆమె పుత్రులలో పెక్కుమంది ఈ అకృత్యానికి అంగీకరించ లేదు. కద్రువ కోపించి విచక్షణా జ్ఞానంలేక మీరంతా జనమేజయుడనే మహారాజుచేసే సర్పయాగంలో పడిచంపండి అని శపించింది. తల్లి శాపానికి భయపడిన సర్పాలుకొన్ని వెళ్ళి అశ్వంవాలాన్ని పట్టి వ్రేలాడి నల్లగా చేశాయి. మరునాడు సవతులిద్దరు అశ్వాన్ని దూరంనుంచే

చూచారు. శోకవల్లగా కన్పించింది. పందెంప్రకారం వినత కద్రువకు
దాసి అయింది.

అయిదు శతాబ్దాలకాలం దొర్లిపోయింది. మూడవ అండాన్ని
ఛేదించుకొని మహాసత్వసంపన్నుడు మిగులచక్కని వాడయిన గరుత్మంతుడు
జనించాడు. వినతకు ఎన్నో శుభశకునములు కలిగాయి. కద్రువ అంతటి
బలవంతుని ఈసడించి పల్కటమేగాక సేవకాకార్యములను చేయవలసిందని
ఆజ్ఞాపించసాగింది. సౌపర్ణునకిది అవమానకరంగా తోచింది. కద్రువ అలా
చేయటానికి కారణం ఏమిటని తల్లిని ప్రశ్నించాడు. ఆమె జరిగినగాథ
అంతా వివరించింది. గరుడుడు కొంతవడి చింతించాడు. సవతితల్లిని,
సవతిసోదరులను చేరిదాస్యంవదిలే ఉపాయంచెప్పమని అడిగాడు. పేరాశ
గల సర్పరాజులు, కద్రువ అమృతం తెచ్చిఇమ్మని కోరారు. అనుపమబల
సంపన్నుడయిన గరుడుడు గజకచ్ఛపములను తిని తనఆకలి తీర్చుకొని
స్వర్గంవెళ్ళాడు. అమృతభాండం తీసుకొనివెళ్ళకుండాచేయటానికి దేవతలు
చివరకు దేవేంద్రుడుగూడ గరుడునితో యుద్ధానికి తలపడినారు. ఇంద్రుని
వజ్రాయుధమే అతనియందు విఫలమయింది. మహేంద్రుడతనితో సంధి
చేసుకొనినారు. అమృతం సర్పములకు తెచ్చియిచ్చి తల్లిని దాస్యంనుంచి
విముక్తికావించాడు. గరుత్మంతుడు. కాని సర్పములుదాన్ని వినియోగించక
ముందే ఇంద్రుడు మరల అమృతభాండం కొనిపోయి భద్రపరచాడు.

వినత కుమారుని తీసుకొని వారణాసి పట్టణానికేగింది. పరమేశ్వ
రుని అర్కుని ఆరాధించి వారిద్దరు ఇష్టకామ్యములను పొందినారు.
గరుడుడు ఆరాధించినరూపం గరుడాదిత్యుడు అని, గరుడుని అగ్రజుడు
ఉలూఖుడు ఆరాధించిన స్వరూపం మయూఖాదిత్యుడు అని, వినత భక్తితో
పూజించినరూపం ఖఖోలాదిత్యుడు అని, అనూరుడు సేవించినరూపం

అరుణాదిత్యుడని ప్రసిద్ధికెక్కినాయి. సూర్యుని కరుణచే అరుణుడు సూర్యునకు సారథి ఐనాడు. గరుడుడు తపోమహిమచేత నారాయణునకు వాహనమైనాడు.

## వృద్ధాదిత్య, విమలాదిత్య, గంగాదిత్య, యమునాదిత్య మాహాత్మ్యం

అగస్త్యమహర్షీ! తక్కిన ఆదిత్యుల ప్రభావంకూడ వివరిస్తాను. శ్రద్ధగావినమని కుమారస్వామి ఆదిత్యులప్రభావం చెప్పనారంభించాడు.

పూర్వం హారీతుడనేమహర్షి ఉండేవాడు. కాలగమనంలో అతడు వృద్ధుడయినాడు. కాని అతనికి యౌవన సుఖములయందు వాంఛలు నశించలేదు. తరుణత్వాన్ని కోరి అతడు సూర్యునారాధించాడు. రవి ప్రత్యక్షమై అతనికి యౌవనం ప్రసాదించాడు. అతదర్చించిన మూర్తియే వృద్ధాదిత్యుడనే పేరుతో ప్రసిద్ధికెక్కాడు.

పూర్వం విమలుడనేరాజు ప్రజలను కన్నబిడ్డలవలె పాలిస్తున్నాడు. ఎంతో సహృదయుడు. కాని పూర్వజన్మ కృతమేమో అతనికి కుష్ఠువ్యాధి సంభవించింది. అతడారోగంతో బాధపడుతుండగా ఒకనాడు ఒక మునీశ్వరుడు అతనికడకు వచ్చాడు. తానసికి రాజు అతిధిమర్యాదలు జరిపాడు నరనాధుని విచారంచూచిన మునీశ్వరుడు రాజా! నీమనస్సులోని బాధ నాకు అవగతమైంది. నీవు వారణాసికేగి ఆదిత్యుని ఉపాసించవలసింది. నీకీ కుష్ఠరోగమునుండి విముక్తి కలుగుతుంది అనిచెప్పి వెడలినాడు. విమలుడు తాపసికి నమస్కరించి వారణాసికేగినాడు. కాశిలోరాజు గంగయందు స్నానంచేసి నిశ్చలభక్తితో తపమని ప్రార్థించాడు. దినరాజు కరుణించి ప్రత్యక్షమై అతని మనోరుజను పోగొట్టాడు. విమలు డారాధించిన

పద్మబిందువిమూర్తికి విమలాదిత్యుడనే పేరుకల్గింది. ఇంక గంగాదిత్యుని చరిత్రవిను.

పూర్వం సగరుడనే చక్రవర్తి భూమిని పాలించాడు. అతడు తొంబదితొమ్మిది అశ్వమేధయాగాలు చేశాడు. నూరవయజ్ఞం తలపెట్టాడు. శతాశ్వమేధాలు పూర్తిచేసి సగరుడు ఇంద్రత్వం అపేక్షిస్తాడేమోననే భయంతో ఇంద్రుడు యాగాశ్వాన్ని అదృశ్యంచేసి తీసుకొనిపోయి పాతాళ లోకంలోని కపిల మహాముని ప్రక్కన కట్టివైచి వెడలిపోయినాడు. అశ్వాన్ని వెదకుతూ సగరుని అరవైవేలమంది కుమారులు అన్ని ప్రదేశాలుచూచి చివరకు పాతాళలోకం చేరగలందులకు గోయిత్రవ్వినారు. ఆగోయియే నేడు నీటితో నింపబడి సముద్రంఅయింది. సగరుని పుత్రులచే త్రవ్వబడింది గనుకనే దానికి సాగరమనే పేరుకలిగింది.

తాము త్రవ్వినమార్గం ద్వారా సగరపుత్రులు పాతాళంచేరి కపిల మహాముని ప్రక్కన కట్టివేయబడి ఉన్న అశ్వాన్నిచూచారు. దేవేంద్రుని మోసం తెలియని సగరపుత్రులు కపిలుడే అశ్వాన్ని దొంగిలించాడని, తము రాకచూచి కపిలుడు భయపడి కన్నులుమూసి దొంగతపస్సు నటిస్తున్నాడని భ్రమపడ్డారు. కపిలుని చుట్టిరి కఠినంగా మాట్లాడారు. వారి సంరంభానికి ఆర్భాటాలకు కపిలుని ధ్యానవిఘ్నమేర్పడింది. కోపంతో కండ్లుతెరిచాడు. అతని నేత్రాగ్నికి అరవైవేలమంది క్షణకాలంలో భస్మమయినారు. సగర పుత్రులు ఎన్నాళ్ళకు రాకపోవటంవల్ల సగరుని మనుమడు అంశుమంతుడు అశ్వాన్ని తెచ్చి తాతచేత యజ్ఞాన్ని పూర్తిచేయించాడు. అనంతరం కపిలుని నేత్రాగ్నిలో భస్మమయిన పెదతండ్రులకు ఉత్తమలోకాలు ప్రసాదించవలసిందని అంశుమంతుడు కపిలుని ప్రార్థించాడు. కపిలుడు దయార్ద్రచిత్తుడయి 'నాయనా! ఈ బూడిదరాసులపై గంగానది

ప్రవహిస్తే వీళ్ళకు స్వర్గం లభిస్తుంది! అని చెప్పాడు. అంశుమంతుడు గంగను గూర్చి తపస్సుచేశాడు. కాని ఫలింపకముందే మరణించాడు. అనంతరం అంశుమంతుని కుమారుడు భగీరథుడుగూడ గంగనుగూర్చి తపస్సుచేశాడు. గంగ ప్రత్యక్షమై రాజా! నేను నీ కోరిక తీర్చగలను. కాని ఆకసంనుంచి నేను క్రిందికి వచ్చేటప్పుడు నా పతనవేగాన్ని సహింపగలవారు లేరు. ఒక్క మహేశ్వరుడే అందుకు సమర్థుడు. ఆ దేవదేవుని అంగీకరింపచేయవలసిందని చెప్పింది. భగీరథుడు మరల శివుని గురించి తపస్సు ప్రారంభించాడు. పరమేశ్వరుడు ప్రత్యక్షమై గంగ తన శిరస్సుపై దిగటానికి అంగీకరించాడు.

హిమవత్పర్వత సానువులపై జడలు విరబోసుకొని పాదములు రెండు ఎడంగా నిలిపాడు శివుడు. శరీరాన్ని పెంచాడు. మల్లయోధునివలె నిలిచాడు శంభుడు. గంగ భూమికి దిగసాగింది. స్త్రీ రూపం ధరించింది. అలలన్నీ పళులుగా మారినాయి. కలువలు కన్నులయినాయి. పద్మము ముఖమైనది. తుమ్మెదలు అలకలైనవి. తామరతూడులే చేతులయినవి. శైవలమే కేశము లయినాయి. సింగారం ఒలుకుతూ కులుకునడలతో అందాలు చిందిస్తూ గంగ దిగుతున్నది. సమీపంలో పార్వతి ఈ వింత చూస్తూ గంగ లలనారూపం దాల్చటంచూసి ఈర్ష్యతో నందీశ్వరునిపై చేయివైచి ఓరగా నిలుచుంది. ఎకాయెకిన గంగ శివుని శిరస్సుపై దిగింది. శివుని జటాజూటం ముడిచాడు. నీటిచుక్క వెలికిరాలేదు. భగీరథుడు పరమేశ్వరుని ప్రార్థించాడు. శివుడు ఒక జటను సడలించాడు. గంగ హిమవన్నగముపైకి దిగి అటనుండి భూమికి దిగింది. భగీరథుని వెంట పాతాళమునకు ప్రవహింపసాగింది. గంగ ప్రవహిస్తున్న మార్గంలో జహ్నుమహాముని ఆశ్రమముంటుంది. ప్రవాహం

వెళ్లినచోట ఆశ్రమం మునిగింది. జహ్నుడు కోపించి గంగాజలాన్ని త్రాగివేయసాగినాడు. కొంతదూరంపోయి భగీరథుడు వెనుదిరిగి చూచాడు. గంగాప్రవాహం కనిపించలేదు విచారంతో భగీరథుడు వెనుకకు నడచి చూడగా గంగనీటిని జహ్నుమహాముని త్రాగుతున్నాడు. ఆ దృశ్యం చూడగానే సగరుని మునిమనుమడు విచారవదనంతో జహ్నుని కడకేగి ప్రార్థించాడు. తన పూర్వులకు మోక్షంకలిగేటట్లు చేయవలసిందని వేడు కొన్నాడు. దయార్ద్రహృదయుడైన జహ్నుడు తాను త్రాగిననీటిని చెవి నుండి వదలినాడు. ఎట్టకేలకు గంగ పాతాళంచేరింది. సాగరుల భస్మ రాశులపై ప్రవహించింది. వారంతా ఊర్ధ్వలోకవాసులయినారు. భగీరథుని కోరికతీరింది. భగీరథునిచే కొనిరాబడింది గనుక భాగీరథి అని పిలువ బడింది. జహ్నుని కర్ణంనుంచి వెలువడింది కనుక జాహ్నవి అని పేరందిందిగంగ. భగీరథుని తపస్సునకు మెచ్చిభూమికి దిగుతున్న గంగను సూర్యుడు ప్రస్తుతించాడు. నాటినుండి గంగాదిత్యుడని పిలువబడినాడు.

యమతీర్థంలో యముడు తండ్రియైన ఆదిత్యునిగూర్చి తపస్సుచేసి అనుగ్రహింపబడినాడు. ఆ మూర్తియే యమాదిత్యుడు. అగస్త్యమౌనీ! ఈ విధంగా భానుడు పండ్రెండుమూర్తులయి లోకాలను అనుగ్రహిస్తున్నాడు. ఇక దివోదాసు పతనం ఏలా జరిగిందో వివరిస్తాను విను.

ఆదిత్యుడుకూడ కాశికేగి తిరిగిరాకపోవటంతో వ్యథాకలితుడైన పరమేశ్వరుడు మిగుల చింతాక్రాంతుడయినాడు. కాశీవృత్తాంతం తెలుసు కొనవలెనని కుతూహలం ఎక్కువకాగా విధాతనుస్మరించాడు. తలచినవే తడవు చతుర్ముఖుడువచ్చి పరమేశ్వరునకు నమస్కరించాడు. త్రిపురహరునితో పలికాడు! యోగినీబలం పోయినపోకగా పోయింది. కమలబాంధవుడు ఏమయినాడో తెలియబంలేదు. ఏదైనా కాశీకిపోయి దివోదాసుని ప్రజలను

మార్చి వైచి ఆ వార్త వెంటనే నాకు వివరింపవలసిందని ఆదేశించాడు. పరమేశ్వరునివద్ద సెలవుతీసికొని బ్రహ్మ వృద్ధబ్రాహ్మణుని రూపంతో కాశీచేరినాడు. దివోదాసుని కొలువుకుపోయి ఆ తని వి వేదమంత్ర పురస్సరంగా ఆశీర్వదించాడు. రాజు వృద్ధబ్రాహ్మణునకు ఎంతో గౌరవంతో అతిధి సత్కారంచేశాడు. రాజు సపర్యలకు చతుర్ముఖుడు సంతసించాడు. ఆతనితో,దివోదాస చక్రవర్తీ! ఆనంధకాననంలో నేను యజ్ఞంచేయదలచాను. నీవు అనుమతి ఈయవలసింది. రాజు ధర్మాన్ని నడిపించవలెగదా! చూడు. విశ్వనాధుడు లేకకాశీ అనదవోలె కన్పిస్తున్నది. దేవతలు ఎవరువచ్చినా రాకున్నా విశ్వనాధుని రప్పించవలెనుమా! అన్నాడు.

దివోదాసు ఆ బ్రాహ్మణుని మాటలకు ఔనని కాదని అనక ఊరు కున్నాడు. మౌనం అర్ధాంగీకారంగా గ్రహించి విధాత దశాశ్వమేధ యాగాలు నిర్వర్తించాడు. బ్రహ్మ ప్రతిష్ఠించిన మూర్తి బ్రహ్మేశ్వర స్వామి అని పిలువబడినాడు. పరమేష్ఠి కాశిలో యజ్ఞాలు పూర్తిచేస్తు న్నాడు. కాని, కాశికా నగర వృత్తాంతం పరమేశ్వరునకు తెలియపరచ లేదు. అయినను శివుడు పద్మసంభవునిపై కోపింపలేదు. రాజమౌళికి మూర్త్యంతరంగదా బ్రహ్మ. అంత గౌరీశుడు మనస్సులో, పోయిన దేవతలంతా కాశినివిడచి రావటంలేదు. కారణం తెలియటంలేదని మిక్కిలి విశ్వాసపాత్రులయిన ప్రమధులను పంపటానికి యోచనచేశాడు. ఒకనాడు శంకుకర్ణుని, మహోదరుని, సోమనందిని, నందిషేణుని, పింగళుని, కుక్కుటుని తదితర కొందరు ప్రమధులను వారణాసికి పంపాడు. కాని ఏమి కారణమో గాని, ఆనందకాననం చేరగానే ప్రమధులు ఒడలు తెలి యని సంతోషంతో ఉన్నారు. ఇక్కడి విషయాలు ఈశ్వరునకు కబురు పంపవలెనన్న భావనే రాలేదు. శివారాధనతో తక్కిన వన్నీ

మరచారు. శ్మశానమున లౌకిక వాసనలు వదలించి వైరాగ్యభావం కలగ టం సహజమే గదా. గణనాథులంతా తమతమ నామములపై వేర్వేరు లింగములను ప్రతిష్ఠించి స్వామిని అర్చించారు. అందులో కపర్ది అనే ప్రమథుడు ప్రతిష్ఠించిన కపర్దీశ్వర మాహాత్మ్యం వివరిస్తాను. అగస్త్య మునీ విను అని కుమారుడు తరువాతి కథను వివరింపసాగాడు.

కాశికి ఉత్తరదిగ్భాగాన విమలోదకం అనే సరస్సు ఉంది. అది అన్ని కాలములలో స్వచ్ఛమయిన నీటితో నిండి ఉంటుంది. వికసిత కమలాలతో ఆ సరస్సు మనస్సుకు ఎంతో ఆహ్లాదం కొలుపుతూ ఉంటుంది. అందలి నీరు త్రాగినా, అందులో స్నానంచేసినా, ఆ నీటితో పితృదేవతలకు తర్పణ విడిచినా ఎరుని పాపాలు పటాపంచలు కాగలవు. త్రేతాయుగంలో వాల్మీకి అనే శివభక్తుడుండేవాడు. అతడు హేమంత ఋతువు కాలంలో నిత్యం ఈ సరస్సులో స్నానమాడేవాడు. శరీరం నిండా భస్మమలది రుద్రాక్షమాలికలు ధరించేవాడు. స్థిరాసనుడై పంచా క్షరి పంచబ్రహ్మ శతరుద్రీయ మంత్రాలతో పరమేశ్వరుని ఆరాధించేవాడు. చతు, చతుర్పుట, షట్పితా పుత్రిక మొదలయిన తాళగతులతో నాట్యం చేసేవాడు. శంకరాభరణం, రాగరాగాంగ, భాషాంగ, క్రియాంగ, ఉపాంగాది దేశిరాగాలలో గీతములను పాడుతూ, దత్తిల, కోహళ, భరత, మతంగ, నందికేశ్వర మతానుసారంగా వివిధ ప్రబంధాలు నిర్మించి బహు విధములయిన దేశిమార్గ లాస్యతాండవం చేస్తూ ముక్కంటిని దాక్షమైన యోగంతో చింతించేవాడు.

ఒకనాడు పొలసుకంపు వెదజల్లుతూ, ఏవగింపు కలిగించే ఆకా రంతో ఒక రాక్షసుడు వాల్మీకి ఉన్న ప్రదేశానికి వచ్చాడు. పొడిముక్కు, మిడిగ్రుడ్లు, దొప్పచెవులు, పొట్టిచేతులు, పొడవైన తల, లోతుకుపోయిన

చెక్కిళ్ళు, ముడులుపడిన జడలు, ముడుచుకొనిపోయిన ఛాతి, లెక్క పేయటానికి వీలుగా కనబడే ప్రక్కటెముకలు, వీపుకు అతుకుకొనిపోయిన పొట్ట, తీగవలె కారుతున్న నోటిచొంగ, అస్థి చర్మము మాత్రం మిగిలిన దేహంతో రక్కసుడు భక్తుని ఎదుట నిలిచాడు.

వికృతాకారుడయిన రక్కసునిచూచి వాల్మీకి భయములేక నీవెవ్వరని హుంకరించి ప్రశ్నించాడు. రాక్షసుడు బదులుపల్కలేదు. తిరిగి వాల్మీకి ఓరీ నీవెవడవు? ఎక్కడనుంచి ఇక్కడకు వచ్చినావు? నీకిట ఏమిపని? అని గద్దించాడు. అయినా అతడు పల్కలేదు. ఓరీ! ఏలమాట్లాడవు? భూతప్రేతపిశాచాలలోని వాడివా? మేము రుద్రాక్ష మాలికాధారులము. పాశుపతమంత్ర జపరక్షవజ్ర కవచం గలవారము. మాబోంట్లను మీరు భయపెట్టలేరు. దూరంగా నిలువు. అని కఠినంగాపలికాడు. అప్పుడు రాక్షసుడు హీనస్వరంతో ఇలా అన్నాడు.

‹అయ్యా! మాహేశ్వరా! మిమ్ములను బెదరించటానికి నేను రాలేదు. నాదొక దీనచరిత్ర. గోదావరి ఒడ్డునగల ప్రతిష్ఠానపురంలో ఒక బ్రాహ్మణునకు కుమారుడనై జన్మించాను. ధనసంపాదనమే ముఖ్యమని తలపోశాను. వట్టగూడని దానములను పరిగ్రహించాను. ఆ పాపంవలన నాకీ బ్రహ్మరాక్షసరూపం కలిగింది. ఎండలకు వానలకు చాలకాలం బాధపడినాను. నాకు ఆహారంగాని నిలవటానికి నీడగానిలేదు. ఎక్కడెక్కడో తిరుగుతున్నాను. ఎవ్వడయినా ఈ ప్రపంచంలో అనాచారుడులభిస్తే అతనిని ఆలంబనంగా తీసుకుందామనుకొన్నాను. కాని అలాటివాడు నాకు లభింపలేదు. ఎన్ని సంవత్సరాలనుంచో ఇలా ఆధారం దొరకక తిరుగుతున్నాను.

ఒకనాడొక దురాచారుని చూచాను. అతడుగూడ ఒక విప్రుడు. సూర్యోదయానికి పూర్వం ఎన్నడూ నిద్రలేచి ఎరుగడు. సంధ్యావార్జ్వడు.

మాటలాడుతూనే మలమూత్రాలు విసర్జిస్తాడు. యజ్ఞోపవీతం ధరించటానికి సిగ్గుపడతాడు. నిత్యం చద్దిఅన్నం భుజించేవాడు. యుక్తకాలంలో భార్యను సంతోషపరచేవాడుకాదు. పరస్త్రీలకొరకు ప్రాకులాడేవాడు. ఇంతటి దుష్టుని ఆచార విహీనుని చూచి అతనివెంట అనుగమిస్తూ ఒకనాటి మధ్యాహ్న సమయాన అతనిని ఆలంబనం చేసుకొన్నాము. వాడు ధన సంపాదనార్థం ఇప్పుడు కాశీపట్టణానికి వచ్చాడు. ఇది మహాపుణ్యక్షేత్రం గదా! మాబోంట్లకు చొరశక్యంగాదు. అందువలన అతనిని వీడినాము. మరల నిరాధారులమైనాము. మహాత్మా! మిమ్ము శరణువేడుతున్నాము మమ్ము రక్షించవలసింది అని • సాష్టాంగ నమస్కారంచేసి ప్రార్థించారు.

---

• సాష్టాంగ నమస్కారం అంటేనే ఎనిమిది అంగములతో కూడిన నమస్కారం అని అర్థమౌతుంది. రెండు చేతులు, రెండు కాళ్ళు, ఉరము, లలాటస్థలము, రెండు భుజములు ధరణికి మోపి నమస్కరించటమే సాష్టాంగ నమస్కారమని చెప్తుంటారు. ఇందులో ఒక విశేషార్థం ధ్వనిస్తుంది. కాళ్ళు, చేతులు కర్మేంద్రియాలు. వీటిని ముందు ఇతర పనిచేయనీకుండా ఆపాలి. అనంతరం ఉరం మనస్సు లేక హృదయాన్ని అన్యత్రానుసంచరింపకుండ నిలపాలి. పిమ్మట లలాటమును భూమికి అనువర్తి చేయమనటంలో ఒక ప్రత్యేకభావం ఉంది. జ్ఞానేంద్రియములన్నీ ముఖమునందే ఉన్నాయి. వాటిద్వారా మనకు జ్ఞానం లభ్యం అవుతున్నది. ఇలా ఇంద్రియముల కారణంగా లభించిన ప్రాపంచిక పదార్థజ్ఞానం మనస్సును అన్యథానుసంచరింపజేస్తుంది – ఒక ధ్వని మన చెవినపడగానే, అదియేమిటి ? ఎక్కడినుండి వచ్చింది ? మొదలయిన ప్రశ్నలతో మనస్సు అక్కడకు పయనమౌతుంది - కనుక జ్ఞానేంద్రియాల పనిని నిల్పితేనేగాని మనస్సు చలించకుండా ఉండదు.

అతని చరిత్రవినగానే వాల్మీకికి జాలికలిగింది. కమండలంలోని విభూతితీసి పంచాక్షరిచే మంత్రించి అతని ముఖంపై రక్షాతిలకంవలె ఉంచాడు. శరీరానికిగూడ అపూతభస్మమే అలదినాడు. అతనితో ఓయీ నీవింక కాశిని ప్రవేశింపవచ్చు. ఈవిభూతిప్రభావంవల్ల నీకెవ్వరివలన హాని కలుగదు. కపర్దీశ్వరుని దర్శిస్తే నీకీరూపం వదలి మోక్షంకల్గుతుంది అని చెప్పారు. ఆమాటలకు బ్రహ్మరక్షస్సు ఆనందపడి కాశిలో ప్రవేశించి కపర్దీశ్వరుని దర్శనంచేశాడు. వెంటనే అతని వికృతరూపంపోయి దివ్యమైనతేజస్సుతో కూడినరూపం కల్గింది. పిదప కొన్నాళ్ళు అతడు వారణాసిలో నివసించి కడకు మోక్షంపొందాడు.

కుంభసంభవా! ఇది కపర్దీశ్వర మాహాత్మ్యం. ఆనంద కాననంలో మరణం పొందటం ఎంతో శుభప్రదమైనది. కాశీక్షేత్రంలో విభూతి అలదు కొనటమే అలంకారం.

---

అందుకే అవి ఉన్న ముఖమును మీదు పైపుకు త్రిప్పమనటం. ఇక రెండు భుజముల మాట. ముఖం అన్నినపుడే భుజములు వంగుతాయి కదా! మళ్ళీ ప్రత్యేకంగా ఎందుకు చెప్పినట్లు? అహంకారం లేక గర్వం లేకుండా చేసుకొనటమే దాని తాత్పర్యం—ఒకడు చెప్పినమాట వినలేదు—దీనిని చెప్పటానికి, వాడు గర్వంగా ఉన్నాడనటానికి 'వాడు భుజాలు ఎగురవేసుకొంటూ పోయినాడు' అనటం లోకసామాన్యం. కనుక గర్వానికి, అహంకారానికి చిహ్నంగా భుజాలు వాడబడినవన్నమాట. మొత్తం మీద కర్మేంద్రియ వ్యాపారం అణచి, జ్ఞానేంద్రియాలను స్వాధీనం చేసుకొని, అహంకారశూన్యమై ఏకాగ్రతతో మనసున నిలిపి నమస్కరించటమే సాష్టాంగ నమస్కారముయొక్క భావం అని పెద్దలంటారు.

కాశియందు దశాశ్వమేధతీర్థం ఒకటుంది. అక్కడి దశహరాఖ్య ప్రవాహంఒడ్డున గల దశాశ్వమేధేశ్వరుని దర్శిస్తే పదిజన్మలలో చేసిన పాపంగూడ నశిస్తుంది.

కపర్దీశ్వరునకు దక్షిణభాగాన పింగళాక్షేశ్వరుడు కలడు. అవిముక్తేశ్వరుని పశ్చిమాన వీరభద్రేశ్వరుడు కలడు. కేదారేశ్వరుని దక్షిణాన కిరాతేశ్వరుడు, వృద్ధకాళేశ్వరుని ఎదుట చతుర్ముఖేశ్వరుడు, విశ్వేశ్వరునకు దక్షిణభాగాన పంచాక్షేశ్వరుడు అంతర్గృహ ఉత్తరద్వారాన పారభూతేశ్వరుడు, విశ్వేశ్వరునకు ఉత్తరాన లాంగలేశ్వరుడు కలడు. వీరిని సేవించినవారు పంచమహాపాతకములనుండి విముక్తిపొందగలరు. ఆయా ప్రదేశాలలో పారిషదులు మహేశ్వరుని లింగరూపాన ప్రతిష్ఠించి అర్చనలుచేస్తూ వారణాసిలోనే ఉండి మందరపర్వతం మాటే మరచినారు.

పరమేశ్వరునకు కాశీ వార్తలేవీ అందలేదు. ఆలోచనా పరుడయిన మహేశ్వరుడు, 'చిత్రంగా ఉంది. యోగినీమండలి ఏమయింది? కమలాప్తుడెందుకు ఆలస్యం చేశాడు? కాశీకేగిన బ్రహ్మకు సమస్తం మరపునకు వచ్చిందా? గణనాథులేమయినారు? వారణాసీ వృత్తాంతం ఏమీ తెలియరాలేదు అని చింతించినాడు. ఊరకొనలేక వారణాస్యుడు బుద్ధిమంతుడు పలుపోకలుగలాడు విఘ్నేశ్వరుడున్నాడు గదా! అతనిని పంపుదామని నిశ్చయించుకొన్నాడు. వినాయకుని పిలిచి తెల్పవలసినది తెల్పి కాశికంపినాడు.

## శివుడు విఘ్నేశ్వరుని కాశికి పంపుట

విఘ్నేశ్వరుడుముందు దివోదాసుని పరిపాలనా విధానం తెలుసుకొన్నాడు. పొట్టివాడుగదా! పుట్టెడుబుద్ధులు. ఏదో ఆలోచించినాడు. ఉన్నా

తమఃణము కల్పించారు. ప్రజలకు మేఘాలలో గంధర్వనగరాలు కనిపించసా గాయి. అర్ధరాత్రి ఇంద్రధనస్సు గోచరించింది. ఆకాశంలో ధూమకేతువుదయించింది. ప్రజలకు నిద్రలో అరిష్టదాయకములు, భయంకరములయిన కలలు రాసాగినాయి. గంధర్వులు లోకలకు విప్పంటించుకొని వీధులలో తిరుగుతున్నట్లు స్వప్నములు కలుగుతున్నాయి. దేవతావిగ్రహాల కండ్లమండి నీరుకారజొచ్చింది. దుశ్శకునాలు కల్గజేసి వినాయకుడు కాశీకరుదెంచాడు. తుండబొజ్జ, పొట్టి ఆకారం, వ్రేళ్ళకు దర్భాంగుళీయకములు, చిరునవ్వుతో వీధులలో తిరుగాడసాగినాడు. ఢుంఠిభట్టారకుడనే నామంధరించాడు. వీధిని పోతూ ఒకడిని పిలిచి అతనికి క్రితము రాత్రి వచ్చిన కలను వివరించాడు. హస్తరేఖలు చూచి ఒకనికి సాముద్రికం చెప్పాడు. వేరొకరిని పిలిచి వాని సంపాదన వివరములు చెప్పినాడు. మరొకరికి భవిష్యత్తులో కలుగబోయే కష్టాలు చెప్పి వాటిని గడిచేమార్గంకూడ బోధచేశాడు. కొందరిచేత నోములు, వ్రతాలు చేయించాడు. ప్రజలు అతనిని ఒక మహా పురుషుడని భావించేటట్లు ప్రవర్తించినాడు. కాశిలో ఎక్కడ చూచినా ఢుంఠిభట్టారకుని పేరే. అతడు చెప్పే సత్యాలకు ఆశ్చర్యపడినారు.

కొలదిరోజులకే గణపతి కాశీవాసులకు మహామహిమలు కలిగినవాడుగా గోచరించాడు. చాలమంది అతనికి శిష్యులయినారు. పట్టణంలోని ఎల్లరు తాము చేయబోయే ప్రతిపనిని అతనికి విన్నవించటం పరిపాటయింది. వారణాసిలో అతడు చెప్పింది వేదం. దానిని కాదనగలవారులేరు. ప్రజలంతా ఢుంఠిని గురువుగా కొలుస్తున్నారు. భూమిలో ఆకాశంలో జరుగబోయే ఉత్పాతాలు వివరిస్తూ ఒకనాడు అష్టాలోచించినట్లు నటించి కొలది దినాలలో వారణాసీపురానికి ఘోరమైన ఆపద అరిష్టం కలుగబోతున్నట్లు చెప్పాడు. దావానలంవలె ఆ వార్త కాశీఅంతా వ్యాపించింది. కొందరప్పటి

కప్పుడే బయలుదేరి విఘ్నేశ్వరుని చుట్టు చేరినారు. నమస్కారాలు పెట్టి అరిష్టానికి పరిహారం చెప్పమన్నారు. దుండి ఆలోచించి వారందరిని కాశిని వదలి వెళ్ళవలసిందని సలహా ఇచ్చారు. అతని ఉపదేశం మేరకు కొందరు వెంటనే కాశిని వదలిపోవటానికి సిద్ధమయినారు. ప్రజలలో చెప్పరాని భయం అలుముకొంది.

ఇలా చేస్తూ ఒకనాడు గణపతి మాయాబలంతో అంతఃపురానికి చేరాడు. అంతఃపుర స్త్రీలు కొందరప్పటికే దుండి భట్టారకుని గురించి వినియున్నారు. అతనిని దర్శించినవారు కూడా ఉన్నారు. వారు ఆయనను గుర్తుపట్టి ఆయననెంతో గౌరవించారు. ఆరాటం గల కొందరు దాసీలు తమతమ భవిష్యత్తులు చెప్పించుకొంటున్నారు. దుండి వారంతా ఆశ్చర్యపడేటట్లు సమాధానాలు చెబుతున్నాడు. కొందరు తమ రహస్యాలు బయటపడగలవని ఆయనకు దూరంగా వెళ్ళిపోతున్నారు. ఒకరు పట్టపురాణి అయిన లీలావతిని కొనివచ్చారు. అనంగమోహిని చిన్నరాణి. రాణి మెచ్చుకొనేటట్లుగా దుండి ఆమె ప్రశ్నలకు ఉత్తరాలొసగినాడు. రాణికి గురి కుదిరింది. రాజ పురోహితులలో ఒకరుగా ఆమె గణపతిని నియమించుకొన్నది. ఈ మిషతో విఘ్నేశ్వరుడు రాణివాసానికి విశేషంగా రాకపోకలు సాగించాడు. నానాటికి రాణికి అతనిపై భక్తిపెరిగి చివరకు దైవస్వరూపునిగా చూడసాగింది. అంతతో ఊరుకొనక ఒకనాడు ప్రస్తావవశంగా భర్త యైన దివోదాసునకు ఆయనను గురించి చెప్పింది. గోరంతలు కొండంతలు చేసింది.

కొంతకాలంనుంచి వికల మనస్కుడుగా ఉన్న రాజు తనకేదో పట్టుకొమ్మ దొరికినంతగా సంతృప్తిపడినాడు. గణపతిని పిలిచి కాశిలోని ఉత్పాతాలకు కారణం చెప్పి పరిహారం తెల్పమన్నాడు. దుండికి

ఎంతో ఆనందం కలిగింది. తన పాచిక పారిందనుకొన్నాడు. వెంటనే కన్నులుమూసి, ఏదో ఆలోచించినట్లు నటించి దివ్యదృష్టితో చూసినట్లు చూసి దివోదాసుతో మహారాజా! ఈ అరిష్టాలకు రక్షరేఖకట్టి ఉత్పాతాలను పారదోలుతాను. చూడచూడగా నా కొకటి తోస్తున్నది. నీవు కొన్నాళ్ళు కాశిని వదలిపోవటమే శ్రేయస్కర మనిపిస్తున్నది. ఆత్మార్థం ధనం, ధాన్యం, పశువులు, బంధువులు, ఇండ్లు అన్నింటిని వదల తగునని శాస్త్రం అంటుంది. 'ఆత్మార్థే పృథివీంత్యజేత్' అనే ఆర్యోక్తి వినలేదా? నేను త్రికాలజ్ఞుడను. నాకు తోచింది చెబుతాను విను. నేటినుండి పదునెన్మిదో రోజున నీ వద్దకు ఒక విప్రుడు వస్తాడు. అతడు నీకు హితోపదేశం చేస్తాడు. నీ వతని ఆప్తవాక్యాలు విని ఆచరించు. ఇంకా నీకు తగిన వారితో విచారించి కర్తవ్యం నిర్ణయించుకో అని చెప్పి వెడలిపోయినాడు. రాజు ఈయంతి మాటలకు నివ్వెరపోయినాడు. ఏమీ తోచని అయోమయ స్థితిలో పడినాడు.

## శివుడు లక్ష్మీనారాయణులను కాశికి పంపుట

అక్కడ పరమేశ్వరుడు గణపతిని పంపికూడ మనశ్శాంతి పొందక నారాయణుని పిలిచి కాశీ విరహం నాకు భరింపరానిదిగా ఉంది. వినాయకుని పంపాను. నీవుకూడా వెళ్ళి కార్యం వెంటనే సానుకూలం చేసుకు రావలసింది అని ఆదేశించాడు.

మహాదేవుని ఆజ్ఞ నిర్వర్తించటానికి శ్రీ మహావిష్ణువు కాశికి బయలుదేరాడు. తాను పుణ్యకీర్తి అనే బ్రాహ్మణుని రూపం ధరించాడు. గరుత్మంతుడు వినయకీర్తి నామం దాల్చాడు. మహాలక్ష్మినిగూడ పయనం కమ్మన్నాడు. ఆమె విజ్ఞానకౌముది అని పేరు దాల్చి బయలు దేరింది. పుణ్యకీర్తి గురువు. వినయకీర్తి శిష్యుడు. గురువు చేతిలో

తాళపత్ర గ్రంథం ఉంది. గురుశిష్యులు వారణాసి పట్టణ మధ్యభాగంలో ఒక రచ్చబండవద్ద చేరారు. వారి ఆహారాలు వింతగా ఉండటంవలన చుట్టు జనులుచేరారు. గురువు శిష్యులకి వేదాంతం బోధిస్తున్నాడు. ప్రజలంతా ఎంతో ఆసక్తితో వింటున్నారు. కపటనాటక సూత్రధారి చిత్ర విచిత్ర రీతులలో బౌద్ధ ధర్మం చెప్పనారంభించాడు.

తత్వదృష్టి అనాదికాలంనుంచి ఉంది. ప్రపంచానికి సృష్టికర్త అంటూ ఒకడు లేడు. దానంతటదే జన్మిస్తుంది. దానంతటదే కాల గమనములో నశిస్తుంది. బ్రహ్మ, విష్ణు, రుద్రు లనబడేవారు మనవంటి వారే. మన దేహాలు ఎలా నశిస్తున్నాయో, వారి దేహాలుకూడ అలాగే నశిస్తాయి. హంసతూలికాతల్పం మీద పండినవాడు, కటిక నేలపై పవ్వ ళించినవాడు ఇద్దరూ నిద్రకు వశులవుతారు. దప్పికి నీరు, ఆకలికి ఆహా రం అందరికీ అవసరమే. కీటకం మొదలు నారాయణుని వరకు ప్రాణ భయం సమానమే. కనుక తనవలెనే సమస్త భూతకోటిని చూడవలె. చీమ, దోమ, నల్లి, ఈగ ఇవన్నీ అల్పప్రాణులని అనుకోరాదు. సమస్త ప్రాణులయందు కరుణ కలిగి ఉండవలె.

'నహింస్యాత్ సర్వభూతాని' అని ఒకవంక అంటూ యజ్ఞయాగాది క్రతువులలో పశువులకు బలి ఇవ్వమంటుంది వేదం. పరస్పర భిన్నంగా చెప్పే ఈ వేదం మనకు ప్రమాణంకాదు. కనుక అహింసే పరమధర్మం హింసను త్యజించాలి. అన్ని దానాలలో అభీతి దానం చాల గొప్పది. భయపడినవానికి అభయదానం, రోగికి ఔషధదానం, ఆకలితో ఉన్నవారికి అన్నదానం ప్రశస్తములని పెద్దలంటారు. మణి మంత్ర ప్రభావాలు లేవు. అభ్యాసవశాన అన్నింటిని సాధింపవచ్చు. ఇంద్రియములచే పంతవించే జ్ఞానమే సత్యంగాని ప్రమాణాలచే లభించే జ్ఞానం సత్యంగాదు. కనుక

ప్రత్యక్ష జ్ఞానాన్నే ఎల్లరు అనుసరించాలి. ఇలా మృదుమధురమైన మాటలతో మధుసూదనుడు వినయకీర్తికి సౌగత ధర్మాన్ని బోధిస్తున్నాడు. జనులంతా ఎంతో ఉత్సాహంతో వింటున్నారు. వారికీ బోధ ఎంతగానో నచ్చింది.

శ్రీ మహాలక్ష్మి జగన్మోహనమయిన రూపం ధరించింది. ఆమె మాట్లాడుతుంటే వసంతకాలంలో మామిడి చివుళ్ళను మెక్కిన కోకిల పంచమస్వరం ఆలాపించిందా అన్నట్లుంది. చూచినవారు ఆమెను వదలిపోరు. మాటలను విన్నవారు మరోవిధంగా సంచరింపలేరు. ఆమె లావణ్యానికి స్త్రీలుగూడ ఆశ్చర్యపడి చూడసాగారు. క్షణకాలంలో వనితా సమూహం ఆమెచుట్టు మూగింది.

విజ్ఞానకౌముది వారినిచూచి అమ్మలారా! నేను చెప్పేమాటలు శ్రద్ధగా వినండి. బ్రహ్మం ఆనంద స్వరూపం. ఆనందో బ్రహ్మయని గదా సూక్తి. మన కన్నుల ఎదుట ఏం జరుగుతున్నది చూడండి. ముదిమి రాగానే అవయవాల పటుత్వం సన్నగిల్లుతున్నది. కనుక ఇంద్రియముల శక్తి చావకముందే చేతికందినంతవరకు సుఖం అనుభవించవలె. సౌఖ్యార్థియై ఎవరయినా ఈ శరీరాన్ని కాంక్షిస్తే పంచభూతాత్మకమయిన ఈ శరీరం వారికి అప్పగించటం న్యాయం. అది ధర్మసమ్మతమైనది. 'పరోపకారార్థం ఇదం శరీర'మ్మని చెప్పటం వినలేదా ? యౌవనం ఝరీవేగతుల్యం. కాలం గడిస్తే తిరిగిరాదు. చచ్చిపోయిన వాటి శరీరాలను కాకులు, గ్రద్దలు, క్రిములు తినటం చూడటం లేదా? అలాంటి శరీరాన్ని ఒకరు యాచించినప్పుడు సమర్పించవద్దా? తన్ను అర్పించుకొనటం కన్న గొప్పదానం ఉందా ?

ఇంక నావివరునలంటారా? వాటినవలు గణనలోకి తీసుకోరాదు.

పూర్వాచారాలు గమనించండి. బ్రహ్మ కుమారులు మరీచి, దక్షుడు. మరీచి పుత్రుడయిన కశ్యపుడు దక్షుని కూతుంద్రను పెండ్లి చేసుకొన్నాడు. మానవులు అల్పబుద్ధులు కనుక ఇది చేయవచ్చును ఇది చేయరాదు అని విచారణ చేస్తున్నారు. వస్త్రముల ప్రతిహూరు పాటింపననవసరం లేదు. యథేచ్ఛగా స్త్రీ, పురుషులు సంచరించటమే చేయవలసిన పని. ఇలా లక్ష్మీదేవి సమయధర్మం బోధించి ధర్మచ్యుతులను చేయటానికి ప్రయత్నించింది. కొందరు స్త్రీలకా మాటలు ఎంతో సమంజసంగా కనిపించాయి. లక్ష్మి చేయనిదేమున్నది? చేయింపని దేమున్నది? పుర స్త్రీలు తిన్నతిన్నగా ధర్మం వదలసాగారు. శ ప్త్ర సపర్యలను వదలివేశారు.

ఈ విధంగా లక్ష్మీనారాయణులు మారువేషాలలో కాశీకాపురిలో మారువేషములతో సంచరిస్తూ అధర్మాలు బోధింపసాగారు. క్రమంగా వర్ణాశ్రమాచారాలు నశింపసాగాయి.

# దివోదాసు నిర్యాణం

దివోదాసుడు ఢుంఢిభట్టారకుడు చెప్పిన విధంగా విప్రుని దర్శనం ఎప్పుడు కలుగుతుందా అని దినములు లెక్కపెట్టసాగినాడు. పదునెనిమిదవ నాడు సుగతవేషంతో నారాయణుడు దివోదాసుని వద్దకు వేతెంచాడు. దివోదాసు ఆ బ్రాహ్మణుని సగౌరవంగా ఆహ్వానించి తగిన విధంగా పూజించాడు. విష్ణేశ్వరుని మాయవల్ల చక్రవర్తికి వైరాగ్యభావం ఉదయించింది. అతడు సుగతుని చూచి మహాత్మా! చిరకాలం రాజ్యం పాలించిన నాకు విరక్తి కలుగుతున్నది. తపోసామర్థ్యంతో వాయు, అగ్ని, మేఘ రూపాలు ధరించి ఇంతకాలం ప్రజలను కన్నబిడ్డలవలె పాలించాను. నా రాజ్యంలో అకాల మరణాలు, దారిద్ర్యం లేవు ఇంతకాలానికి

ఇప్పుడేమోగాని, భూమి ఆకసములయందు కొన్ని ఉత్పాతాలు కలుగు తున్నాయి. నేను దేవతలను ధిక్కరించానని వారొవర్నే వేదబములు కావలె. బలవంతులతోడి విరోధం చేటుతెస్తుందనటం యాధి యగు తున్నది. ఏమయినా పదివేలేండ్లు రాజ్యం పాలించాను. ఇంద్రియాలు విపశత్వం చెందుతున్నాయి. ఇంక మోక్షం అపేక్షింపవలసి ఉంది. కనుక నాకు మోక్షం సిద్ధించే ఉపాయం తెలుపవలసిందిఅని ప్రశ్నించాడు.

ఆ మాటలకు దానవాంతకుడు హృదయంలో సంతసించాడు. దివోదాసుతో రాజా! కాశీపురంలో పరమేశ్వరుని లింగరూపాన ప్రతిష్ఠించు. దానితో నీవు ఈ దేహంతో కైలాసం చేరగలవు. నీ కుమారునికి తగిన బుద్ధులు చెప్పి పట్టంగట్టు. దేవతలతో విరోధం పెంచుకొనక వారిని ఆరాధింపు మని నయమార్గం బోధించు. వార్ధక్యంలో రాజులు పుత్రులకు రాజ్యం అప్పగించి అరణ్యాలకుపోలేదా? నా ఉపదేశం పాటింపు మని చెప్పి వెడలిపోయినాడు.

దివోదాసుడు సామంతరాజులను, మంత్రులను, ఋత్విజులను అందరిని రావించి వారి సముక్షంలో కుమారుడయిన సమింజయునకు పట్టాభిషేక మొనర్చి తన వైభవానుసారం ఒక దివ్యమందిరం నిర్మింపజేసి అందు ఈశ్వరుని లింగరూపాన ప్రతిష్ఠించాడు. సుగతుడు తెల్పిన విధంగా భూతగణాలు విమానం కొనివచ్చారు. దివోదాసు దాని నధిరో హించి కైలాసంచేరి స్థిరంగా ఉండిపోయినాడు. అతడు ప్రతిష్ఠించిన లింగమే దివోదాసేశ్వరుడు అని ప్రసిద్ధిచెందింది. ఇది భాగీరథీ తటంలో ఉన్నది. అతడు నిర్మించిన మందిరానికి భూపాలశ్రీ అని పేరు. దివోదాసేశ్వరుని అర్చించినవారికి సమస్త ఐశ్వర్యాలు సిద్ధిస్తాయి అని కుమారుడు అగస్త్యునికి దివోదాసు చరిత్ర వివరించాడు. అగస్త్యుడు

అంతటితో ఊరుకోవక కాలకంఠుడు మరల కాశిని ప్రవేశించిన తీరు విశదంగా వివరించమన్నాడు. మునీశ్వరుని కుతూహలం చూచి కుమారస్వామి ఉత్సాహంగా తదనంతర కథ చెప్పాడు.

కుంభసంభవా! కాశిలో జరిగిన విశేషాలన్నీ పరమేశ్వరునకు నారాయణుడు వివరించాడు. మహానందంతో పరమేశ్వరుడు పార్వతీసహిత వారణాసికి విచ్చేసినాడు. ఆయనవెంట చతుష్షష్టి భూతగణాలు కాశిని ప్రవేశించాయి. చిరకాలానికి ఈశ్వరుని వాంఛ నెరవేరింది. మహోల్లాసంతో గిరిజాపతి విందుకొలువు తీర్చాడు. సమస్త దేవతలు తమతమ స్థానాలు అలంకరించియున్నారు. విఘ్నేశ్వరుడు కొలువు ప్రవేశించగానే శంకరుడు ఎదురేగి కౌగలించుకొని మూర్ధమాఘ్రాణించి విఘ్నపతీ! నీ కారణంగా మరల వారణాసిలో అడుగిడగలిగాము. నాకేకాక ఎల్లసురసంఘాలకు ఆనందం కూర్చావు. ఎల్లప్పుడు విఘ్నములను తొలగించి విజయం చేకూర్చే దిట్టవు. నిన్ను ఎంత నుతించినా తనివి తీరదు. నేటినుండి మరింత గురుతరమయిన బాధ్యత నీ భుజస్కంధాలపై మోపుతున్నాను. ఆవరణములలో వివిధ నామాలతో విలసిల్లుతూ, కాశీపురాన్ని అహరహం కాపాడవలసింది అని కోరాడు. తండ్రి మాటలకు వల్లెయన్నాడు గణపతి.

బాహ్యావరణంలో అర్కవినాయకుడు, దుర్గావినాయకుడు, భీమచండి వినాయకుడు, దేహళీ వినాయకుడు, ఉద్దండవినాయకుడు, పాశపాణి వినాయకుడు, ఖర్వ వినాయకుడు, సిద్ధి వినాయకుడు అనే పేర్లతో వెలిశాడు.

ద్వితీయ ఆవరణలో లంబోదర వినాయకుడు, కూటదంత వినాయకుడు, శాలకటంక వినాయకుడు, కూష్మాండ వినాయకుడు, ముండవినా

యకుడు, వికట వినాయకుడు, రాజపుత్ర వినాయకుడు, ప్రణవ వినా యకుడు అనే పేర్లతో పిలుస్తున్నారు.

తృతీయావరణంలో వక్రతుండ గణపతి, ఏకదంత గణపతి, కపి సింహద్విపత్రిముఖ గణపతి, పంచాస్య గణపతి, హేరంబ గణపతి విఘ్నరాజ గణపతి, వరద గణపతి, మోదకప్రియ గణపతి అనే నామా లతో విరాజిల్లుతున్నాడు.

చతుర్థావరణంలో అభయవినాయకుడు, సింహతుండ వినాయకుడు, కూణితాక్ష వినాయకుడు, క్షిప్రప్రసాద వినాయకుడు, చింతామణి గణపతి, దంతహస్త వినాయకుడు, పిచండిల వినాయకుడు. ఉద్దండముండ వినాయకుడు, అనే అష్టమూర్తులతో దర్శనమీయగలడు.

పంచమావరణంలో స్థూలదంత విఘ్నేశ్వరుడు, కలిప్రియ వినా యకుడు చతుర్దంత విఘ్నేశ్వరుడు, ద్వితుండ విఘ్నేశ్వరుడు, జ్యేష్ఠ విఘ్నేశ్వరుడు, గజ వినాయకుడు, కాల విఘ్నేశ్వరుడు, నాగ విఘ్నే శ్వరుడు అనే పేర్లతో పూజింపబడుతుంటాడు.

షష్ఠావరణములో ఆశా వినాయకుడు, సృష్టి వినాయకుడు, స్థూల జంగ వినాయకుడు, యక్ష వినాయకుడు, గజకర్ణ వినాయకుడు, చిత్ర ఘంట వినాయకుడు, మంగళవినాయకుడు, మిత్ర వినాయకుడు అను నామాలతో అలరారుతున్నాడు.

సప్తమావరణంలో మోదాది పంచవినాయకులు, జ్ఞాన వినాయకుడు ద్వారక వినాయకుడు, అవిముక్త గణపతి నామాలతో ఎసగి కాశీక్షేత్రాన్ని కాపాడుతుంటారు.

అగస్త్యమౌనీ! శ్రీహరి లక్ష్మి గరుడులు సంచరించిన ప్రదేశాలు పవిత్రములై వైష్ణవతీర్థము లయ్యాయి. అవే పాదోదక తీర్థం,

క్షీరాబ్ధితీర్థం, గదాతీర్థం, లక్ష్మీతీర్థం। శార్ఙ్గతీర్థం, దత్తాత్రేయతీర్థం, భృగు తీర్థం, వామనతీర్థం, నరనారాయణతీర్థం, విదారణనారసింహతీర్థం, గోపీ గోవిందతీర్థం, శేషతీర్థం, శంఖమాధవతీర్థం, హయగ్రీవతీర్థం. కలశజా। ప్రసంగవశాన నీకు కొన్నితీర్థాల మాహాత్మ్యం, లింగముల మాహాత్మ్యం వివరించాను. వీటానికి కాశీక్షేత్రంలో పవిత్రంగాని ప్రదేశం, తీర్థం మచ్చుకైనాలేదు సుమా। అన్నాడు.

# పంచనద వృత్తాంతము

అతని మాటలకు ఎంతో ఆనందించిన అగస్త్యుడు అంతటితో ఊరకొనలేదు. కొమరుసామీ! పంచనదక్షేత్రాన్ని గురించి వినవలెనని కుతూహలంగా ఉందన్నాడు. ఆ ప్రశ్న షణ్ముఖునకెంతగానో నచ్చి పంచనదక్షేత్రాన్ని గురించి చెప్పబూనుకొన్నాడు.

కుంభజమౌనీ! భృగువంశంలో వేదశిరుడనే విప్రుడున్నాడు. అతడు ఋషితుల్యుడు అతడు తపస్సుచేస్తుండగా శుచి అనే అప్సరస దేవేంద్రుని కొల్వుకు ప్రయాణమైపోతున్నది. త్రోవలో వేదశిరుని ఆశ్రమముంది. తన సమీపంగాపోతున్న అప్సరసను చూడగానే విప్రుని మనస్సు చలించింది. అతని మనస్సు గ్రహించిన శుచి ముందుకువెళ్ళటానికి భయపడి అక్కడనే నిల్చిపోయింది. వేదశిరుడామెను స్వీకరించాడు వారిరువురికి ఒకకుమార్తె జనించింది. పసికందును వేదశిరునకిచ్చివేసి శుచి వెళ్ళిపోయింది. ఆబాలిక పెరిగి యెనిమిదేండ్లప్రాయం కల్గినతరుణంలో వేదశిరుడామెను పిలిచి 'అమ్మా నిన్ను ఎలాటివానికిచ్చి వివాహం కావించమంటావు' అని ప్రశ్నించాడు. బాలిక తండ్రిముఖమును చూచి తండ్రీ। విశ్వాధికుడయిన వానికి నన్నీయవలసింది. అని అన్నది. ఆమె మాటలకు వేదశిరుడు ఆశ్చర్యపడి అమ్మా! నీకోరిక మహత్తరమైనది. అయినా దానిని సాధించాలంటే నీవు

కాశీక్షేత్రానికివెళ్ళి తపస్సుచేయాలి. ఇంతలేతవయసులోనే ధర్మంసిద్ధించింది. పాపములనుండి విముక్తిపొందావు. కనుక నీవీనాటినుంచి ధూతపాప నామంతో పిలుపబడతావు అన్నాడు. దానికామె సంతసించి మహాప్రసాద మని తండ్రివద్ద అనుమతిపొంది వారణాసీక్షేత్రానికిచేరి ఘోరమైన తపస్సు చేయనారంభించింది. ఆమె తపస్సుకు బ్రహ్మదేవుడు సంతసించాడు. ప్రత్యక్షమై వరాలు కోరుకొమ్మన్నాడు. ధూతపాపవిరించిని స్తోత్రంచేసి దేవా! పావనమైన వస్తువులలో నన్ను పావనమైనదానినిగా చేయవలసిందని వరంకోరింది. విధాత తల్లీ! నీకోరికతీరుతుంది. ముక్కోటితీర్థాలు నీరోమ కూపాలలో వసిస్తాయి. దానితో నీవు పవిత్రురాలవు కాగలవు అనిచెప్పి అంతర్థానం చెందాడు.

కొన్నాళ్ళుగడిచాయి. ఆమె యౌవనవతిఅయింది. ధర్ముడు ఆమె నొకనాడుచూచి కామించాడు. దానికామె అంగీకరింపలేదు. యముడు ఆ తిరస్కారాన్ని సైపలేక నీవు హృదయంలేని శిలవలె ప్రవర్తించావు కనుక శిలపైపొమ్మని శాపంఇచ్చాడు. ధూతపాపకోపంతో 'ధర్ముడివైన నీవు అధర్మానికి పాల్పడటంగాక నన్నుశపించావు. కనుక నీవుకూడ జడత్వం పొందగలవని ప్రతిశాపంఇచ్చింది. ధూతపాప చంద్రకాంత శిలా రూపం ధరించి నిత్యం చంద్రకిరణాలకు ద్రవించి, నదిగామారింది. ధర్ముడు ధర్మనదం అనేపేరుతో పుణ్యనదమైనాడు. వేదశిరుడు ఈ వృత్తాంతంవిని మిక్కిలి దుఃఖించాడు. చివరకు ధూతపాపను అంగీకరింప జేసి నదీరూపంతో ఉన్నకుమార్తెను నదరూపుడుగ ఉన్న ధర్మునకిచ్చి వివాహం జరిపించాడు. ఇది ఇలాఉండగా కాంతిపుంజమైన సూర్యుడు, మయూఖాదిత్యతీర్థాన ఉగ్రమైన తపస్సుచేశాడు. అతని కిరణాలనుంచి శ్రమజలం జనించింది. కిరణానది అనేపేరుతో ప్రవహించింది. ధర్మనదం,

ధూతపాప, కిరణాతరంగిణీ, గంగా, యమునలు అయిదుసూ కలిసి పంచనదమని ప్రసిద్ధిచెందాయి.

దివోదాసుడు కైలాసంచేరిన అనంతరం శ్రీమహావిష్ణువు అగ్ని బిందువనే మహర్షిస్తోత్రానికి ఆనందపడి ప్రత్యక్షమై వరాలిచ్చాడు. ఆ మహర్షినామం తననామంకలిసి బిందుమాధవుడనే నామం ధరించాడు.

## కాశిలో విష్ణురూపాలు

అగ్నిబిందుమహర్షి ప్రత్యక్షమైన కేశవునకు నమస్కరించి నారాయణా! కాశిలోని నీ రూపాలెన్ని ఇప్పటికి కలవు? ఇంకా భవిష్యత్తులో ఎన్ని రూపాలు ధరిస్తావు? అనతిమ్మని కోరాడు.

దానికి నారాయణుడు మునికులతిలకా! పాదోదకతీర్థంలో ఆదికేశవుడనే నామంతోను, శ్వేతద్వీపంలో జ్ఞానకేశవరూపంతోను, తార్క్ష్యతీర్థంలో తార్క్ష్యకేశవుడనే ఆఖ్యతోను, నారదతీర్థంలో కేశవుడనే పేరుతోనూ వెలసి ఉన్నాను. ఈ నాల్గు తీర్థములలో స్నానం చేసినవారికి బ్రహ్మవిద్య ఉపనిషదర్థములు తేటతెల్లం అవుతాయి.

ప్రహ్లాదతీర్థంలో ప్రహ్లాదకేశవుడు, అంబరీషతీర్థంలో ఆదిత్యకేశవుడు అనే నామాలతోను, వారణాసిలోని నానాప్రదేశాలలో దత్తాత్రేయ, భృగు, వామన, నరనారాయణ, విదారణనరసింహ, గోపీగోవింద, లక్ష్మీనృసింహ, హయగ్రీవ, కేశవ, భీష్మకేశవ, నిర్వాణకేశవ, త్రిభువనకేశవ, జ్ఞానమాధవ, శ్వేతమాధవ, శేషమాధవ, శంఖమాధవ, ప్రయాగమాధవులనే దివ్యమూర్తులను ధరించి ఉంటాను. మహర్షీ! అత్యంత రహస్యమైనదానిని వివరిస్తాను విను. దీనిని సాధువులకు తప్ప మరెవ్వరికీ వివరింపరాదుసుమా! ఎన్ని తీర్థాలయినా మణికర్ణికతో సమానం కావు. అది వేదపురాణాగను విద్యావిపణిమణి. పంచమహాపాతకము లనే అంధకారానికి

సూర్యుడు. గంగానదికి ఉత్తమభూషణము మణికర్ణిక. మాఘమాసాన ఉదయకాలంలో మణికర్ణికలో స్నానం చేసినవారికి దేవతలు సైతం నమస్కరిస్తారు. హరిశ్చంద్రఘట్టంలో తర్పణ మొనర్చినవారికి పితృ దేవతలు క్షేమాన్ని కూరుస్తారు. ఈ తీర్థంలో స్నానం చేసి గణపతిని అర్చించినవారికి గణపతి కామధేనువై కోరికలు తీరుస్తాడు. మణికర్ణికా తీర్థంలో గాయత్రీమంత్రం జపిస్తే వేయిమడుగులు అధికమైె ఫలాన్ని ఇవ్వగలదు. హోమవిధానం నిర్వర్తిస్తే అక్షయమైన ఫలం కలుగు తుంది. మణికర్ణిక చింతామణివంటిది. అగ్నిబిందుమహర్షీ! మణికర్ణి కలో తీర్థమాడి పుణ్యుడవు కావలసింది.

మణికర్ణికకు దక్షిణాన పాశుపతతీర్థం ఉంది. అక్కడ ఈశ్వరుడు పాశుపతీశ్వరుడని పిలువబడతారు. దీనికి ముందుభాగాన రుద్రావాసతీర్థం ఉంది. రుద్రావాసానికి యామ్యదిగ్భాగాన విశ్వతీర్థం నెలకొన్నది. ఇచ్చటనే విశ్వనాథుడు విశ్వ అనే నామంతో రాజిల్లిన గౌరితో కూడి భక్తులకు మోక్షం ప్రసాదిస్తాడు. ఈ తీర్థానికి ప్రక్కనే మోక్షతీర్థం, మోక్షేశ్వరుడికి అనతిదూరంలో అవిముక్తేశ్వరుడు. ఆయనకు సమీపంలో తారకేశ్వరుడు. తారకతీర్థంవెంట స్కందతీర్థం, దాని కవతల ఢుంఠి తీర్థం, ఢుంఠికి ప్రక్కనే భవానీశంకరతీర్థం ఉన్నాయి. ఈ తీర్థాలకు అవ్వలిప్రదేశంలో 'భవతిభిక్షాందేహి' అన్నవారికి అన్నపూర్ణ సుధాహార భిక్ష ప్రసాదిస్తుంది. భవనీశంకరులు భక్తులను కన్నబిడ్డలవలె కాపాడు తుంటారు. భవానీతీర్థం వెంబడి జ్ఞానతీర్థం. ఇక్కడవెలసిన జ్ఞానేశ్వరుని సేవించినవారికి వరార్థజ్ఞానం కలుగుతుంది. దీనివెంబడి శైలతీర్థం అవెన్క నందితీర్థం. దీనిని అధిగమిస్తే విష్ణుతీర్థంఉంది. అదే నేను నివసించియుండే చోటు.

సముద్రంలో వటపత్రశయనులైన అబ్ధినాథులు నూటయేబదిమంది. కూర్మావతారరూపములు ముప్పది, మత్స్యావతారరూపములు ఇరువది, గోపాలరూపులు కొన్నివేలమంది, పరశురాములు ముప్పదిమంది శ్రీరామావతారములు నూటఒకటి విష్ణురూపముతో ఉన్నవారును నేను ఇవన్నీ కాశీలోని నారూపములే.

విప్రోత్తమా! మరొకవిశేషం ఉంది. చతుర్వింశతినామాలతో నన్ను జపిస్తారు. ఈ అర్చామూర్తులన్నీ నేనేఅయినా మూర్తులలో కొంతభేదం ఉంది విను. నాలుగు హస్తాలలోని ఆయుధధారణలోని మార్పుతో ల రూపాలుంటాయి.

| అర్చామూర్తి | పై భాగం | | క్రింది భాగం | |
|---|---|---|---|---|
| | కుడిచేయి | ఎడమచేయి | కుడిచేయి | ఎడమచేయి |
| కేశవుడు | శంఖం | చక్రం | గద | పద్మం |
| నారాయణుడు | పద్మం | గద | చక్రం | శంఖం |
| మాధవుడు | చక్రం | శంఖం | పద్మం | గద |
| గోవిందుడు | గద | పద్మం | శంఖం | చక్రం |
| విష్ణువు | పద్మం | శంఖం | చక్రం | గద |
| మధుసూదనుడు | శంఖం | పద్మం | గద | చక్రం |
| త్రివిక్రముడు | గద | చక్రం | శంఖం | పద్మం |
| వామనుడు | చక్రం | గద | పద్మం | శంఖం |
| శ్రీధరుడు | చక్రం | గద | శంఖం | పద్మం |
| హృషీకేశుడు | చక్రం | పద్మం | శంఖం | గద |
| పద్మనాభుడు | పద్మం | చక్రం | గద | శంఖం |
| దామోదరుడు | శంఖం | గద | చక్రం | పద్మం |
| సంకర్షణుడు | శంఖం | పద్మం | చక్రం | గద |

| | | | | |
|---|---|---|---|---|
| వాసుదేవుడు | శంఖం | చక్రం | పద్మం | గద |
| ప్రద్యుమ్నుడు | శంఖం | గద | పద్మం | చక్రం |
| అనిరుద్ధుడు | గద | శంఖం | పద్మం | చక్రం |
| పురుషోత్తముడు | పద్మం | శంఖం | గద | చక్రం |
| అధోక్షజుడు | గద | శంఖం | చక్రం | పద్మం |
| నృసింహుడు | పద్మం | గద | శంఖం | చక్రం |
| అచ్యుతుడు | పద్మం | చక్రం | శంఖం | గద |
| జనార్దనుడు | చక్రం | శంఖం | గద | పద్మం |
| ఉపేంద్రుడు | గద | చక్రం | పద్మం | శంఖం |
| హరి | చక్రం | పద్మం | గద | శంఖం |
| శ్రీకృష్ణుడు | గద | పద్మం | చక్రం | శంఖం |

(ఖాపమందనం ప్రకారం వైభవమూర్తుల లక్షణాలు పై విధంగా ఉంటాయి. అయితే ఒక ఆగమం సూచించినట్లు మరొకటి నిర్దేశించదు)

అగ్నిబిందువునకు ఈవిధంగా వివరించి బిందుమాధవుడు అంతర్హితుడైనాడు. అగ్నిబిందుపక్కనే నివసించి మాధవుని ఆరాధించి మోక్షం పొందాడు.

## వృషభధ్వజావిర్భావము

బిందుమాధవ కథనం చెప్పింతర్వాత గాంగేయుడు అగస్త్యమౌనీ! వృషభధ్వజావిర్భావం విను. దివోదాసుని నిర్యాణానంతరం నందీశ్వరుడు మహోత్సాహంతో మహాదేవుని ప్రయాణానికి రథంసిద్ధంచేశాడు. అష్ట గజములు, అష్టవృషభములు, అష్టతురంగాలు, ఆరథానికి అనుసంధింపబడినాయి. కాశీగంగామాతలు రథపు ఈషగామారారు. సంధ్యలు రెండు చక్రములుగామారాయి. తారాపథమంతా శ్వేతాతపత్రమయింది. ప్రణవం

మునికోలగామారింది. గాయత్రి పాదపీఠమయింది. చతుర్వేదాలు సర్వాంగ రక్షకులుగా రూపొందాయి. వృషభధ్వజలాంఛనం అమర్చి నందికేశ్వరుడు మహోన్నతమైన రథాన్ని సిద్ధపరచాడు. మహానందంతో ముప్పదిమూడు కోట్ల దేవతలు తన్ను అనుసరిస్తూరాగా పరమేశ్వరుడు ఆ రథాన్ని అధిరోహించి మందరపర్వత ప్రాంతాన్నుంచి వారణాసికి జ్యేష్ఠశుద్ధ చతుర్దశినాడు విచ్చేశాడు. నాటినుండి ఆతడు వృషభధ్వజుడయినాడు.

అగాధను విన్నకలశజుడు షడాననా! పరమేశ్వరలీలలు అనంతాలు. బహురూపాలతో లోకంలో ఆరాధింపబడుతున్నాడు. ఆయామూర్తులు ఉద్భవించిన తెరగు వివరింపవలసిందని ప్రార్థించాడు. దానికి కుమారుడు సంతోషించి మహర్షీ ప్రపంచంలో పరమేశ్వర లీలాకథనమును మించినది లేదు. ఆయామూర్తుల కథనం విను.

## కందుకేశ్వర. వ్యాఘ్రేశ్వర ప్రాదుర్భావం

ఒకనాడు మా జననియైన పార్వతి పట్టుబంతితో విలాసంగా ఆడుకొంటున్న సమయంలో ఇద్దరు రక్కసులు ప్రమథులవేషాలు ధరించి ఆమెను మోసగించటానికి వచ్చారు. మాతండ్రి రాక్షసులమోసాన్ని గ్రహించాడు. కనుసన్నతోనే ఆ రహస్యాన్ని మాతల్లికి తెలియజేశాడు. శైలజ ఆగ్రహంతో ఆ బంతితోనే వారిద్దరినీ సంహరించింది. ఆ కారణాన కందుకేశ్వరుడని పిలువబడినాడు.

పూర్వం ప్రహ్లాదుని మామ విగ్లాదుడనే రజనీచరుడు ఒకడుండే వాడు. వాడు మహాపాపి. యజ్ఞయాగాదులు చేసేవారిని చంపేవాడు. ఒకనాడా రక్కసుడు కాశీపట్టణానికి వచ్చాడు. నాడు శివరాత్రి. ఒకవిప్రుడు మహాభక్తితో తారాధిపమౌళిని పూజిస్తున్నాడు. అతి క్రూరుని భక్షింపవలెనని రాక్షసుడు వ్యాఘ్రరూపం ధరించాడు. పరమేశ్వరుడు ఆ రాక్షసుని

సంహరించి భక్తుని కాపాడాడు. నాటినుండి వ్యాఘ్రేశ్వరుడని నామం ధరించాడు.

జ్యేష్ఠేశ్వరుని సమీపాన కుక్కుటేశ్వర, పితామహేశ్వర, గదాధరేశ్వర, వాసుకేశ్వర, కపాలభైరవ, సాగరేశ్వర, వృషభేశ్వర. గంధర్వేశ్వర దుంధుమారేశ్వర, కర్కోటకేశ్వర, సుప్రతీకేశ్వర, హండనేశ్వర, దివ్యలింగాలు విరాజిల్లుతూ ఉండగలవు. ఈయాపాలలో ఉన్న శివుని పూజించేవారికి భోగమోక్షములు కరతలామలకములు అనిచెప్పి కుమారుడు శైలేశ్వర, రత్నేశ్వరుల మాహాత్మ్యం వివరించాడు.

## శైలేశ్వర, రత్నేశ్వర ప్రాదుర్భావం

ఒకనాడు హిమవంతునితో భార్యమేనక ఇష్టసంభాషణములాడుతూ, కుమార్తెను గౌరిని తలంచుకొని స్వామి! మనకుమార్తెను ఉమను పేదయింటికిచ్చినాము. మీదిరాతిగుండె కనుక బాధఎరుగరు. అమ్మాయి ప్రస్తుతం కాశిలో ఉన్నదట. ఎలాఉందోఏమో! మన మొకసారి వెళ్ళి చూచివద్దామా అన్నది. అత్తఇంట కుమార్తె సుఖముగా ఉన్నదాలేదాఅని సంశయించటం ఆమెనుగూర్చి వాపోవటం తల్లులకు సహజమేగదా! శైలేశ్వరుడయిన మాతాత సరేననినాడు. మేనక సంతసించింది. తమ వైభవానికి తగినట్లుగా భూషణాలు, అంబరములు తీసుకొని ఆదంపతులు కాశిచేరారు. వారణాసిని చూడగానే మేనక ఆశ్చర్యాన్ని కంతులేదు. కాశిలోని ప్రతిగృహం ఒక రాజాధిరాజ భవనంవలెఉంది. అన్నీబంగారు పూతగలిగిన వాకిళ్ళే అన్నీ వెండిపూతతో తెల్లగా ప్రకాశిస్తున్న కుడ్యములే అన్నివాకిండ్ల తోరణములు నవరత్నమాలాలంకృతములే మహావైభవంతో ఉన్న కాశిపురాన్నిచూచి మేనక ఆశ్చర్యపడింది. ఇంక పార్వతీపరమేశ్వరుల గృహం చూచేటప్పటికి ఆమెకు మతిభ్రమకలిగినట్లయింది. కాశిపట్టణాన్ని చూచింతర్వాత ఆమె తన

అజ్ఞానానికి తానే విందించుకొన్నది. మనస్సులో లజ్జపడింది. శైలేశుడు వారణాసిలో లింగము ఒకదానిని ప్రతిష్ఠించి అర్చించాడు. అతడే శైలేశ్వరుడు.

కుమార్తె భోగభాగ్యాలకు మేనక ఎంతో ఆనందించింది. సంతృప్తి పడింది. ఆత్మజ ఐశ్వర్యంముందు తాము తెచ్చిన కానుకలు వెలవెల పోయినాయి. చివరకామె ఆ ఆభరణాలన్నీ కుప్పపోసి లింగాకృతి నొనర్చి జామాత అనే భావం వదలి మహామహిమాఢ్యుడయిన లోకపతిగా ఆరాధన చేసింది. నవరత్నశోభితమైన ఆలింగమే వివిధ రత్నకాంతులు వెదజల్లుతూ రత్నేశ్వరుడనే విఖ్యాతి గాంచింది. రత్నేశ్వరుని మహత్తు అనంతం. అతి విచిత్రం.

కాశీనగర వేశ్యవాటికలో కర్పూరతిలక అనే సుందరాంగి ఉంది. ఆమె సమస్త విద్యలలో దిట్ట. నాట్యంలో అందెవేసినచేయి. ఆమె నిత్యంతాండవంచేస్తూ తన లాస్యాన్ని తాండవప్రియుడయిన పరమేశ్వరుడు మనస్సున మెచ్చుకొంటున్నాడా లేదా అని సంశయంతో తర్కించుకొం టుండేది. పార్వతీపరమేశ్వరులను హృదయారవిందంలో ప్రతిష్ఠించుకొని అర్చించేది. కొంతకాలాని కామె వృద్ధురాలై మరణించింది. తరువాతి జన్మలో, గంధమాదన పర్వతప్రాంతాన వసుభూతుడనే గంధర్వరాజుకు తనయగా జన్మించింది. ఆమెకు పూర్వజన్మ స్మృతి ఉంది. కాశి చేరి ప్రతిదినం రత్నేశ్వరుని ఆరాధన చేసి పవిత్రురాలయింది. రత్నేశ్వరు డామె భక్తికి సంతోషించి ఆమెను రత్నచూడున కిచ్చి వివాహం కావిం చాడు. రత్నచూడుడు పాతాళాధిపతియైన శేషునివంశంలోవాడు. రత్న లింగేశ్వరుని ప్రాంతభూమికి రత్నచూడ మనిపేరువచ్చింది. కలశజా! ఇంక కృత్తివాసతీర్థమాహాత్మ్యం విను.

# కృత్తివాసతీర్థమాహాత్మ్యం

ఒకప్పుడు గజాసురుడనే పేరుగల దానవుడు కాశిని ప్రవేశించాడు. అతడు గజరూపధారి. కదులుతుంటే అంధకార పర్వతమే కదలినట్లుండేది. చేటలవంటి చెవుల కదలికకు రేగిన ఝంఝామారుతం పురభవనాలను కదిలించేది. దురాచారుడయిన ఆరాక్షసుడు వారణాసిలోని వనాలను ధ్వంసం చేశాడు. తుండంతోను శరీరపు తాకిడులతోను కొన్ని భవనాలను కూల్చి వేశాడు. ప్రాకారాలను నేలమట్టంచేశాడు. వాటిపాదాల క్రిందపడి ఎందరు మానవులు గతించారో తెలియదు. ప్రశాంతంగాఉండే వారణాసి వాతావరణాన్ని కల్లోలపరచసాగాడు. పౌరులంతా హాహాకారాలు చేస్తూ విశ్వనాథుని సంస్మరించారు. కాలగళుడు క్రోధాట్టహాసంతో దుష్టనాశనకరియైన త్రిశూలంతో గజాసురుని కుంభస్థలాన్ని వ్రయ్యలుగా చీల్చివేశాడు. కొండపైనుండి గైరికాదిధాతువులతోకూడిన ఏరుపలె రక్తంచిమ్మి ప్రవహించింది. గజాసురుడు ప్రాణావసాన సమయంలో పరమేశ్వరునకు నమస్కరించి అనాదినిధనా! సాంబశివా! మరణమందరికీ సహజమే. కనుక చావుకు నేను చింతించను. నాకొక కోరికఉంది. దానిని తీర్చు. నీవు భక్తసులభుడవు. నాచర్మం నీవు ఎల్లప్పుడు భుజంపై ధరించు. అది దుర్గంధంలేక కర్కశం గాక చినుగక ఎప్పుడూ ఉండేటట్లు అనుగ్రహింపవలసింది అన్నాడు. దానికి శివుడు సమ్మతించాడు. అసురిమణించాడు. గజచర్మాన్ని ధరించి ఈశుడు కృత్తివాసుడయినాడు. ఆతీర్థం కృత్తివాసతీర్థం అని కుమారుడు కాశిలోగల వివిధరూపాలతో విలసిల్లిన పరమేశ్వరుని ఔన్నత్యం వినిపించాడు.

ఎన్నిగాధలు విన్నా అగస్త్యునికి తృప్తికలగలేదు. ఇంకా వారణాసి ప్రాభవాన్ని మహిమను తెలుసుకొనగోరి స్వామిని ప్రశ్నించాడు. వల్లీ

నాధుడు వాతాపి దమనుని ఉత్సాహానికి ఆనందించి తక్కిన తీర్థముల గొప్పదనం వివరించసాగాడు.

మహర్షీ! కాశీమాహాత్మ్యం ఇలాంటిది అని చెప్పటానికి ఎవ్వరికీ అలవిగాదు. ఒకప్పుడు రెండుకాకులు ఆకాశంలో పోరాటం సాగించాయి. పోరాడిపోరాడి అలసి వారణాసిలోగల ఒక సరస్సులో కూలినాయి. నీటి నుండి మునిగిలేచేటప్పటికి అవి కలహంసలుగా మారాయి. చూచిన ప్రజలంతా ఆశ్చర్యపోయారు. అదే కలహంసతీర్థం. కలహంస తీర్థ ప్రాంతాన మహర్షాదులు తమతమ నా మా ల తో శివలింగములను ప్రతిష్ఠించారు. లోమశేశ్వరుడు, మాలతీశ్వరుడు, అంతకేశ్వరుడు, జనకే శ్వరుడు మొదలయిన అష్టషష్టి ఆయతనాలు. కుబ్జామహాదేవి, కమలనాభుని దేవేరి కాశీలో గ్రామదేవతలు. ఐంద్రి, కౌమారి, మాహేశ్వరి, బ్రాహ్మి వైష్ణవి, చాముండి, పంచమి ఆ పట్టణంలో తమతమ వా హ నా లు అధిరోహించి తిరుగుతుంటారు. చిత్రఘంటాదేవిని కొలిచినవాడు యమ మహిష ఘంటికారావం వినడు. శైలేశ్వరీదేవి భక్తకోటికి కలిగే విఘ్నాలను నాశనంచేస్తుంది. భద్రతీర్థంలో మునిగినవారిని కాశీమాత సంరక్షించి భద్రములు కూర్చగలదు. సిద్ధివినాయకునకు ఏటికోళ్ళు సమర్పించిన వారికి వైభవం బుద్ధి సంప్రాప్తిస్తాయి.

త్రిలోకసుందరీశక్తి, శ్రీకంఠుని సమీపాన వెలసియున్న మహా లక్ష్మి భక్తులకు భోగమోక్షాలు ప్రసాదిస్తారు. విధిశక్తి, అమృతేశ్వరి, సిద్ధలక్ష్మి భాగవక్షేత్రేశ్వరి, భక్తసులభరై అభీష్టవరా లిస్తారు. అవిముక్త సీమయందు శాకజంఘేశ్వరి, విఘ్నాలను హరిస్తుంది. అక్కడే వికటానన అనే దేవత కలదు. ఉద్దాలకతీర్థంలో ఉద్దాలకేశ్వరుడు, యమదంష్ట్రా దేవి ఉన్నారు. దారుకేశ్వరతీర్థంలోని స్వామిని అర్చించేవాడు దవ్వత

ముడు. దారుకేశ్వరుని సమీపాన కాళరాత్రి విరాజిల్లుతుంటుంది. విద్యు ద్దండంవంటి నాల్గు కోరలు, వేయితలలనాగుబాము నాల్కలవంటి జిహ్వతో పాతాళగుహాద్వారంవంటి నోరు తెరచి బ్రహ్మాండాన్ని మింగటానికి ప్రయ త్నిస్తున్నదా అన్నంత భయం కొల్పుతూ ఉంటుంది. ఈమె చర్మ ముండకు చెలికత్తె.

చర్మముండ వ్యాఘ్రచర్మం ధరిస్తుంది. ఫాలభాగాన భస్మత్రిపుం డ్రాలు ధరించి త్రిశూలం చేతిలో ధరించి ఉంటుంది. కన్నులకు నల్లని కాటుక దిద్ది, శరీరానికి రక్తం పూసుకొంటుంది. చేతిలో ఉన్న పాత్ర నుంచి మాటిమాటికి మధువు త్రాగుతూ, మహారుండతో గలసి ప్రేతవనంలో విహారం చేస్తుంటుంది.

మహారుండ ఆకారం చర్మముండవలెనే భయంకరంగా ఉంటుంది. మహారుండకు పశ్చిమదిగ్భాగాన గల స్వప్నేశ్వరిని భజించేవారికి త్రికాల ములలోని శుభాశుభాలు మనస్సున గోచరం అవుతాయి. ఈమెను అష్టమి, నవమి, చతుర్దశీ తిథులందు పూజించటం మహాశ్రేష్ఠం. స్వప్నేశ్వరికి పడమటిభాగాన దుర్గాదేవి. ఈమె కాశీనగరానికి దక్షిణభాగాన గల ద్వారదేశాన్ని రక్షిస్తుంటుంది.

## దుర్గా మాహాత్మ్యం

ఇలా వారణాసిలో గల నానావిధ శక్తిస్వరూపాలు వర్ణించాడు కుమారస్వామి. దుర్గపేరు వినగానే అగస్త్యుడు షడాననా! శైలనందన దుర్గారూపం ధరించటానికి కారణం వివరింపవలసిందని ప్రార్థించాడు. గుహుండు ఆనందపడి కుంభసంభవా! పూర్వం దుర్గుడనే రాక్షసుడు మహా బలసంపన్నుడు. తపోబలాన్ని సైతం పొంది దేవతలకు అవధ్యుడైనాడు. సురలు పరమేశ్వరుని వేడుకొన్నారు. దుర్గునిబారినుండి కాపాడవలసిందని

దీనంగా అర్థించారు. మహేశ్వరుడు వాని శక్తిని యోచించి వీడు పురుషులకు అవధ్యుడని భావించి వానిని చంపవలసిందని దాక్షాయణిని ఆదేశించాడు.

గౌరి తనవెంట కాళరాత్రి అనే శక్తిని తీసుకొని వింధ్యపర్వత ప్రాంతానికి చేరింది. ఆమె కాళరాత్రిని పిలిచి దుర్గుడీప్రాంతాననే నివసించియున్నాడు. వానిని సంహారం చేయమన్నది. శివాని ఆజ్ఞ గైకొని కాళరాత్రి దైత్యుడున్నకడకు వచ్చి రాత్రించరునితో, రాక్షసరాజా! నీ మేలు గోరి చెబుతున్నాను. తులువతనం వదలి మహారాణియైన రుద్రాణిని ఆశ్రయించి సాధువుగా జీవించు. లేకుంటె నిన్ను బంధించి తీసుకొని పోయి ఆమె పాదాలముందు పడవేస్తాను అన్నది. ఆ మాటలకు రాక్షసుడు క్రోధమూర్ఛితుడైనాడు. ఏమిటీ! ఆడుది ప్రతాపోక్తులు పల్కుటమా! నీవు మిగుల సౌందర్యం కలదానివి. నిన్ను పొందినవాడి జీవనమే జీవనం. నామాట విని నన్నేలుకో! అని మన్మథవికారంతో పలికాడు.

రాక్షసుడి మాటలకు కాళరాత్రి ఏవగించుకొన్నది. క్రోధాన్ని మనస్సులోనే అణచుకొని రాక్షసేశ్వరా! మాతగావచ్చిన నన్నెందుకు వరిస్తావు. నావలెక నాకన్నా అందగత్తె! వివాహమాడదలిస్తే ఆమెను పెండ్లియాడు. ఆమెతోబాటు మేమందరం నీకు వశమౌతాముకదా అని శృంగారం తొలకాడేటట్లు పలుకసాగింది. మోహాంధకారంలో ఉన్న దుర్గుడికి ఈమాటలు రుచింపలేదు. మహామాయప్రభావం వాడిని ఆవరించింది. కాళరాత్రిని అప్పుడే అనుభవించాలనే కోరిక పెరిగింది. తన భటులను పిలిచి ఈ అందాలరాశిని పట్టి అంతఃపురానికి చేర్చవలసిందని ఆజ్ఞాపించాడు.

మహాసంరంభంతో రాక్షసులు కాళరాత్రిని చుట్టుముట్టారు. కాళరాత్రి వికటభ్రుకుటితో వెటకారంగా నవ్వింది. కంకణ ఝణత్కారం ప్రళయ

కాల విస్ఫోషను అనుకరించి భయంకరంగా మ్రోగుతుండే చేతిఆయుధంతో రక్కసులను మట్టుపెట్టసాగింది. కరాళజిహ్వను తెరచి రక్తపానం చేస్తున్నది. ఆప్రదేశం అంతా పెరిగినచేతులు, ముక్కలయిన కాళ్ళు, తెగినతలలు రాసులుగా పడినాయి. రక్తం కాల్వలుగ ప్రవహించింది. కొన్ని ప్రదేశాలలో రక్తంమాంసం కలసి బురదవలె తయారైంది. తనపైకి కవిసిన ముష్కరులయిన రక్కసిమూకను సంహరించి హుంకరించి కాళరాత్రి ఒక్కసారిగా ఆకాశానికి ఎగిరింది. దుర్గుడు కాళరాత్రి విజృంభణం తనవాళ్ళ పాటుచూసి ఒక్క క్షణం నివ్వెరపడినాడు. మరల వెంటనే మనస్సు దిట్టపరచుకొని ఆకాశమార్గాన కాళరాత్రిని వెంబడించాడు. అతని వెంట ఆతనిసైన్యం, దిక్పాలురను జయించిన దండనాథులు ఆకాశ మార్గాననే వెంబడించారు.

కాళరాత్రి రుద్రాణికి నమస్కరించి జరిగినదంతా విన్నవించింది. కాళరాత్రి వెనుకవస్తున్న దుర్గుడిని సైన్యాన్ని శర్వాణి చూచింది. ఆమె శరీరంక్రోధంతో జ్వలించింది. సహస్రమార్తాండులు ఒక్కసారి వెలిగితే కలిగే తేజందశదిశలు వ్యాపింపజేస్తూ చేత ఆయుధాన్ని ధరించింది. కండ్ల నుండి విస్ఫులింగాలు రాలుతున్నాయి. ఆరూపం తేరిపార చూడశక్యం గాకుండా ఉంది.

'దుర్గాసురుడు అంబికనుచూచి చకితుడైనాడు. ఆమెకు కొంత దూరంలో ఒక ప్రదేశానదండును ఆపివేశాడు. దుర్గాసురుడు సైన్యాధిపతులనుచూచి రాక్షసవీరులారా! చూచారా ఈవింత! దేవతలను సైతం పుట్టుకొకరినిగా తిరిమినమనలను జయిస్తానని ఒక్క అబలసాహసించటం ఎంతవింత! ఎంత ఆశ్చర్యకరం! ఇది దేవతలమాయ. జగదేకవీరులమైన మనం ఒక స్త్రీని సంహరించగలమా! అది ధర్మంగాదు. మీలో ఎవరయినా నయానగాని భయానగాని మరే ఉపాయంతోగాని ఈశృంగారమూర్తిని

బంధించి తీసుకొనివచ్చిన వారికి ఇంద్రలోకాధిపత్యం బహుమానంగా ఇస్తాను అని ప్రకటించాడు.

దుర్గుడిమాటలతో రాక్షసులు ఒడలుతెలియక తమతమ ఆయుధాలు తీసుకొని ఒక్కుమ్మడిగా జగన్మాతను ముట్టడించటానికి వస్తున్నారు. వారి ఆర్భాటంచూచి అంబ సంకల్పమాత్రంచేతనే తన శరీరాన్నుంచి అనేక శక్తులను సృష్టించింది. వివిధమారణాయుధాలతో విజృంభిస్తున్న శక్తులతో అసురులు యుద్ధంచేయసాగారు. త్రైలోక్యవిజయతో దుర్ధరుడు, తారతో దుర్ముఖుడు, జయతో శిరుడు, త్రిపురతో పాశపాణి, త్రిపురభైరవితో వేపకంపనుడు, త్రిపురావనితో బిడాలాక్షుడు. జయంతితో కుక్కుటాస్యుడు, అపరాజితతో కాకవక్త్రుడు, గజవక్త్రితో శంఖుకర్ణుడు, త్రినేత్రతో ఊర్ధ్వాక్షుడు తలపడినారు. పోరు మహాభయంకరంగా ఉంది. శక్తులు విజృంభించి నక్తంచరులను గుంపులు గుంపులుగా యమపురికిశాఘలుగా పంపసాగారు. ఒకవైపున రక్కసులు వేలసంఖ్యలో మరణిస్తున్నా తక్కిన సైన్యాధిపతులు ఏమాత్రం భయపడక సమర రంగంలోకి దూకుతున్నారు. సమర సంరంభం వీక్షిస్తున్న దాక్షాయణి మహామాయా సమన్వితమైన వాయువ్యాస్త్రాన్ని ప్రయోగించింది. దానిమహిమ ఏమోగాని అసురుల చేతులలోని ఆయుధాలన్నీ క్రిందబడినాయి. మహావాత విజృంభణానికి నిలువలేక రాక్షసులు యుద్ధరంగంనుంచి దూరంగా విసరివేయబడినారు.

అనూహ్యమైన ఈ పరిణామానికి సహించక దుర్గాసురుడు తానే స్వయంగా కాత్యాయనితో తలపడినాడు. గౌరిపై మహిమాన్వితమైన శక్తిని ప్రయోగించాడు. రుద్రాణిరౌద్రరసోద్రేకంతో ఆశక్తిని సమయన్నే త్రుంచివైచింది. అసురేశ్వరుడు బాణప్రయోగం చేయాలని విల్లను పైకెత్తాడు. బాణంతొడిగే లోపునే నగజాత దానిని త్రుంచివైచింది. ఇనుమడించిన కోపంతో అనిమిషారాతి పర్వతోపమానమైన గదను ప్రయోగించాడు. పర్వతరాజపుత్రిదానిని ఆకాశంలోనే చూర్ణంచేసింది. క్రోధ

మాత్సర్యాలతో ఒడలుతెలియని దానవుడు త్రిశూలం పైకెత్తాడు. అతని చేతిలో ఉండగానే శక్తిదానిని ముక్కలుగా చేయటంతో దుర్గుడు అరాశ జర్గంతిసుకొన్నాడు. ఇంక వీనిని బ్రతుకనీయరాదని పర్వతరాజపుత్రి అత్యుగ్రమైన ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించింది. వజ్రాయుధందెబ్బకు కూలిపడే శైలంవలె దుర్గాసురుడు నేలకొరిగి అసువులను విడిచాడు. త్రిలోకాలకు దుర్గునిపీడ వదలింది.

అంతపై దేవతలు పుష్పవర్షం కురిపించారు. బ్రహ్మాదిదేవతలు ప్రత్యక్షమై జగన్మాతకు నమస్కరించారు. జగన్మాతా! త్రైలోక్యవాసినీ! లోకత్రయీజననీ! మహాశక్తీ! విష్ణుస్వరూపిణీ! సర్వసృష్టి విధాయనీ ప్రణవరూపిణీ! సర్వమంత్రాత్మికా! సర్వభూతస్వరూపిణీ! నీకు నమస్సులు. లోకకంటకుడైన దైత్యుని సంహరించి సాధురక్షణం ఒనర్చావు. ఇట్టి నీకు మా ఏటికోళ్ళు, అని అనేకవిధాల స్తోత్రం చేశారు. రుద్రాణి శాంతించి దేవతలను వీడ్కొల్పి పరమేశ్వరునికడ కేగింది.

దుర్గాసురుని సంహరించిన కారణాన ఆమె దుర్గేశ్వరినామం ధరించింది. ఈమెను అర్చించినవారికి శత్రుభయముండదు. సమస్త కల్యాణాలు చేకూరుతాయి. యుద్ధరంగంలో శివాని శరీరంనుండి జనించిన శక్తులలో శతనేత్ర, సహస్రాస్య, అయుతభుజ, అశ్వారూఢ, గజాస్య, త్వరిత, శవవాహిని, విశ్వసౌభాగ్య, గౌరి ఈ నవశక్తులు లోకారాధ్యలు. రురుడు, చండుడు, అసితాంగుడు, కపాలి, క్రోధనుడు, ఉన్మత్తభైరవుడు, సంహారుడు, భీషణుడు మొదలయిన అసంఖ్యాకులయిన భేతాళురుకూడ జనించారు. వీరంతా వారణాసిలో స్థిరంగా ఉండి కాపాడుతుంటారు అని కుమారుడు దుర్గామాహాత్మ్యం వివరించాడు. ఇల్వలారి స్వామీ! కాశీయందు గల లింగములను, వాని ప్రభావాలను విశదంగా తెల్పవలసిందని ప్రార్థించాడు.

# సప్తమాశ్వాసం

అగస్త్యుని ప్రశ్నకు శిఖివాహనుడు కాశిలోని ఇతర లింగములను గురించి వివరించాడు.

## ఓంకారేశ్వర మాహాత్మ్యం

పూర్వం ఒకప్పుడు బ్రహ్మ ఆనందకాననవనంలో మిక్కిలి నిష్ఠతో తపస్సు ఆచరించాడు. పదివందల యుగాలు గతించాయి. అనంతరం ఒకనాడు శతకోటి రవిప్రకాశ తేజంతో ఒక దివ్య లింగం ఆవిర్భవించింది. ఆ సమయంలో భూమి అంతా బ్రద్దలయిపోతున్నదా అన్నంత భయంకరమయిన శబ్దం కలిగింది. ఆ ధ్వనికి పరమేష్ఠి కన్నులు తెరచాడు. ఎదుటనున్న లింగాకృతిని చూచి ఆశ్చర్యం చెందాడు. మొదట అకారంలో శ్రీ మహావిష్ణువు రూపం కన్పించింది. అంతలోనే ఉకారంలో పద్మసంభవుని ఆకృతి కనిపించింది. మరుక్షణంలో మకారాకృతిలో చంద్రశేఖరుని రూపం గోచరించింది. అనంతరం శబ్దబ్రహ్మ నాదంతో భువనకారణమైన బిందువు కనిపించింది. అన్నియు కలసి చివరకు ఓంకారమై నిలిచాయి. సంసార తారకమయిన తారకమును చూచి బ్రహ్మ ఆనందపడినాడు. స్వప్రకాశక చిద్రూపుడయిన పరమేశ్వరుడు ప్రతిబింబించే అకారాదివర్ణాలు ఏకత్వం చెందగా నాద్గుణ అనే సంధితో కూడి మంత్రత్వమునందిన ప్రణవాన్ని చతుర్ముఖుడు స్తోత్రం చేశాడు.

నమ ఓంకార రూపాయ. నమో రుద్రాయ, నమో శివాయ, నమో శర్వాయ, నమో ఉగ్రాయ, నమో నాదాత్మనే, నమో బిందుకళాత్మనే, నమో లింగస్వరూపాయ, నమో నానాపష్ట స్వరూపాయ నమశ్శంకరాయ నమస్తుభ్యం మృత్యుంజయాయ నమస్తుభ్యంనమోనమయని ప్రస్తుతించాడు.

అకార ఉకార మకార నాద బిందురూపాలతో విలసిల్లిన ఐదు లింగములు ప్రణవాత్మకములు.

భరద్వాజ గోత్రుడు దమనుడు అనే బ్రాహ్మణుడు అవిముక్త సీమయందు పాశుపతదీక్ష గైకొని సిద్ధిపొందాడు. భారభూతేశ్వరుడు ఉత్తర దిక్కుకు, మణికర్ణికేశ్వరుడు తూర్పు దిక్కుకు, బ్రహ్మేశ్వరుడు దక్షిణానికి, గోకర్ణేశ్వరుడు పడమటిదిక్కుకు అవిముక్తసీమయందు హద్దులలో ఉన్నారు.

అట్టహాసుడు తూర్పు ద్వారమును, భూతధాత్రీశ్వరుడు దక్షిణ ద్వారమును, గోకర్ణుడు, ఘంటాకర్ణుడు పశ్చిమ ఉత్తర ద్వారములను, ఛాగవక్త్రుడు ఈశాన్యమును, భీషణుడు అగ్నిదిక్కున, శంకుకర్ణుడు నైరృతియందును, ద్రుమచండుడు వాయువ్యదిశను నానావిధ ప్రమథగణపరివృతులై రక్షిస్తుంటారు. వీరభద్ర, నభికర్ణమాలిప్త విగ్రహ, స్థూలకర్ణ మహాబాహులు అసీనదీతీరాన్ని, విశాలాక్ష, మహాభీమ, కుండోదర, మహోదరులు దేహళీదేశమును, నందిషేణ, పంచనఖరపాద, కరంటక, ఆనంద, గోపక, బభ్రులు వరణాతీరాన్ని కాచియుంటారు.

కలశజా! కాశీ గొప్పతనం ఎంతని వర్ణిస్తాం. ఒక మహాభక్తుడు పరమశివుని అర్చింపగా ఒలికిన తిలలను, అక్షతలను తినటానికి ఒక మూషికం వచ్చేది. లింగాకృతిని చుట్టి ఆ అక్షతలనుతిన్న ఎలుక ఆ మరు జన్మలో కైలాసంచేరి స్థిరంగా ఉండిపోయింది. ఉదయకాలముల యందు అవిముక్తసీమ నామాన్ని ఎవరు సంస్మరిస్తారో వారు ధన్యులు సుమా!

ఒక కప్ప కాకికి వెరచి పరిగెత్తుతూ ఓంకారేశ్వరుని భవనం చుట్టు

తిరిగి ప్రదక్షిణం చేసింది. ఆ మహిమ వలన మండూకం శంభునిలో ఐక్యమయింది. ఓంకారేశ్వరుడు మిక్కిలి కరుణగల వాడు. కాశికేగి గంగయందు మునిగి ఓంకారరూపునకు ఎవడు మ్రొక్కలిడడో వాని జన్మం వృథా. అగస్త్యమౌనీ! ఇంక త్రివిష్టపేశ్వరుని మహిమ వివరిస్తాను విను.

## త్రివిష్టపేశ్వర మాహాత్మ్యం

వారణాసిలో విరజాపీఠం అనే ప్రదేశం ఉంది. దానికి దక్షిణంగా కాళింది, సరస్వతి, నర్మద అనే నదులు ప్రవహిస్తుంటాయి. (ఇది వింధ్యము కరనున్న నర్మద కాదు) నిశ్చలమయిన మనస్సుతో త్రివిష్టపేశ్వరుని భజించిన వారికి కర్మబంధాలుండవు. ఈ వాహినీ త్రయ పరిపూత ప్రదేశంలో పితృపితామహులకు పిండప్రదానం చేస్తే, పితృదేవతలు హస్తం దర్శింపచేసి వారు దానిని గ్రహిస్తారు. ఇది గయ కంటె పవిత్రమయినది. త్రివిష్టప స్థానానికి ప్రక్కన సరస్వతీ మహాక్షేత్రం ఉంది. పశ్చిమంలో యమునేశ్వరుడు కలడు. ఈయన దర్శన మాత్రాన నరుడు యమకింకరదర్శనం పీడగలుగుతాడు. త్రివిష్టపునకు తూర్పున కర్మదేశుడు విరాజిల్లుతుంటాడు. ఈ మహాత్ముని సేవించిన వారికి పునర్జన్మ లేదు. ఇచటనే ప్రవహిస్తున్న పిలిప్పిలయందు స్నానమాడి శశికళాధరుని అర్చించినవారు మృత్యువక్త్రాన్ని కాలి మడమచే మోదగలరు.

ఇతర ప్రదేశాలలో చేసిన ఘోరమయిన పాపం అయినా కాశీ పోగొట్టగలదు. కాని కాశియందు పాపంచేసిన వానికి నిష్కృతి లేదు. త్రివిష్టపేశ్వరుని సేవించిన వానికి మోక్షం అరచేతిలో ఉన్నట్లే సుమా! గోఘ్నుడు, గురుతల్పగుడు, కూటసాక్షి, ఆతతాయి, శఠుడు, పరదారాలో

బదుగురుజనద్వేషి, సురాపానరతుడు మరే విధమయిన పాపి కయినా కాశిలో ప్రాయశ్చిత్తం ఉంది. వేద శాస్త్రాలను తలక్రిందుగ వైచి చూచినా నిత్యుడు విశ్వనాథుడే అని తెలుస్తుంది.

త్రివిష్టపేశ్వరునకు పశ్చిమభాగంలో ద్రోణేశ్వరుడు, వానికి అగ్ర భాగంలో అశ్వత్థామేశ్వరుడు, ఆ ప్రక్కన శాంతనవేశ్వరుడు, అశ్వత్థా మేశ్వరునకు వాయువ్యభాగాన వాలఖిల్యేశ్వరుడు, ఆ ప్రక్కనే వాల్మీ కేశ్వరుడు విరాజిల్లుతుంటారు.

త్రివిష్టపేశ్వరుని మందిరాన్ని ఆశ్రయించుకొని ఒక కపోత యుగ్మం నివసిస్తుండేది. అవి రెక్కలతో కుహేశ్వర మందిరాన్ని సమ్మార్జించి ప్రదక్షిణములు చేస్తుండేవి. అభిషేక జలాన్ని తీర్థంగా క్రోలుతూ, నైవేద్యమిడిన ప్రసాదం స్వీకరిస్తూ ఉండేవి. కొన్నాళ్ళకు ఒక డేగ ఆపారావత జంటను చూచి తినవలెనని ఉవ్విళ్ళూరింది. కాని అవి నివసిస్తున్న గూడువద్దకు పోలేక నాడు నిరాశతో వెడలిపోయింది. పారావతి ఇది గమనించింది. భర్తతో ఈ స్థలంవిడచి మనం ప్రమాద రహిత స్థలానికి వెళ్ళిపోదామన్నది. దాని కామె భర్త అంగీకరించలేదు మరునాడు మరల డేగవచ్చి చాలాసేపు పొంచియుంది. కొంతసేపటికి గూడు వదలి బయటకు వచ్చిన పావురాల జంటను పట్టుకొన్నది. ఎక్కడికయినా క్షేమకరమైన ప్రదేశానికి వెళ్ళి భక్షించాలని తలచి డేగ ఆకసంలోకి ఎగిరింది. వచ్చిన ప్రమాదం గమనించిన పారావతి శ్యేని పాదం గట్టిగా కరవవలసిందని సంజ్ఞ చేసింది. భర్తపావురంగట్టిగా కరచింది. పారావతిగూడ శ్యేనిని బాగా నొప్పించింది. డేగ పట్టు వదలింది. వ మ య ం చూసి పావురములు ఎగసిపోయినాయి. అయోధ్యానగరం చేరి ఆ జంట శేషించిన కాలాన్ని గడపినవి. తరు

వారి జన్మలో పారావతి నాగకన్యగాను, ఆమె భర్త మందారకుడనే గంధర్వుడుగాను జనించారు. ఆ యిరువురు మరల దంపతులై కాశి యందలి త్రివిష్టపేశ్వరుని అర్చించి ముక్తిని పొందారు.

కలశజా! ఇంక కేదారేశ్వర చరిత్ర విను.

## కేదారేశ్వర మాహాత్మ్యం

అనేక జన్మలలో చేసిన పాపాలన్నీ కేదారేశ్వరి సంస్మరణ మాత్రంచేత నశిస్తాయి. నిత్యం ఉదయకాలంలో ఆ స్వామిని అర్చిస్తే ఇష్టార్థసిద్ధి కలుగుతుంది. పూర్వం రథంతర కల్పంలో వసిష్ఠ దనే విప్రుడు హిరణ్యగర్భాచార్యుల వలన పాశుపతదీక్ష వహించి కేదారేశ్వరుని భజించి ముక్తుడయినాడు. కాశీ అనే ఉద్యానవనానికి కేదారేశ్వరం ద్రాక్షపందిరి వంటిది.

ఇక్కడ గౌరీకుండం, గౌరీతీర్థం, అమృతస్రవతీర్థం మొదలయినవి అనేక తీర్థాలున్నాయి. ఈ స్వామికి ఉత్తరాన చిత్రాంగదేశ్వరుడు, దక్షిణాన నీలకంఠేశ్వరుడు, వాయువ్యాన అంబరీషేశ్వరుడు, సమీపంలో ఇంద్రద్యుమ్నేశ్వరుడు, ఆయనకు దక్షిణాన కాలంజరేశ్వరుడు చిత్రాంగదునికి ఉత్తరాన క్షేమేశ్వరుడు విరాజిల్లుతుంటారు. ఇది కేదారేశ్వర మాహాత్మ్యం అని షాణ్మాతురుడు కలశసంభవునితో మహర్షీ ఇంక ధర్మరాజేశ్వర మాహాత్మ్యము వినిపిస్తాను సావధానంగా వినవలసిందని అన్నాడు.

## ధర్మరాజేశ్వరలింగ మాహాత్మ్యం

కొమరుసామి అగస్త్యునితో ఇల్వలారీ! ధర్మేశ్వర తీర్థం మిక్కిలి మహిమగలది. ఇది కాశీక్షేత్రానికి మధ్యభాగాన అవస్థితమయిన మణి

లతో విరాజిల్లుతూ ఉంటుంది. ఇటగల ముక్తిమంటపంలో మధ్యాహ్న సమయాన ముక్కంటి బ్రాహ్మణ రూపంతో వైశ్వదేవ బలిహరణములు నిర్వర్తింపచేస్తుంటాడు. మహాప్రాసాదానికి తూర్పుభాగాన జ్ఞానమంటపంలో ఇందుమౌళి దక్షిణామూర్తి స్వరూపంతో బ్రహ్మాదులకు తత్వోపదేశం చేస్తుంటాడు. విశాలాక్షి హర్మ్యమునకు మధ్యాహ్న కాలమున ఏగవలె. అక్కడి సంతర్పణ దృశ్యం చూడవలె. ఎంతో కన్నులు పండువుగా ఉంటుంది.

బంగారు జరీకమ్ములు రాజిల్లే కుసుంభావర్ణపు చీర ధరించి చక్కగా ముడిచిన కురులపై పారిజాత చెంగల్వ కుసుమముల దండలు తాల్చి, మెడలో ఇంద్రనీలమణుల హారం నడుమున వజ్రాల ఒడ్డాణం ప్రకాశిస్తుంటే నుదుట కస్తూరీ తిలకం వదనానికి నిండుదనం కూరుస్తుంటే విశాల నయనాలలో జగన్మాతృత్వం, కరుణ వెలారుస్తూ అర్థిజనులను లాలించి కడుపునిండుగ అమృతాన్నం తినబెట్టుతూ భోజనపంక్తుల నడుమ తిరుగుతుండే శ్రీ విశాలాక్షి కాశీ అన్నపూర్ణ దర్శనమిస్తుంది. ఆమెను దర్శించినంత మాత్రాననే దైహిక, మానసిక, క్షుధార్తులు నశిస్తాయి. కలుషహారిణియే గాదు ఆమె సమస్త జనుల హృదయతోషిణి. ప్రపంచంలో ఎక్కడున్నా నరుడు ఆమె సంస్మరణ మాత్రాన క్షుధాబాధా నివారితుడు కాగలడు. కలశజా! ఆ తల్లి వైభవం వర్ణించటానికి సహస్రముఖునకయినా అలవిగాదు.

దీనికి ప్రక్కన చక్రపుష్కరిణీ తీర్థం ఉంది. తారకబ్రహ్మ మంత్రజప విరాజితుడైన ఫాలనేత్రుడు నిత్యం సంధ్యావందనం నిర్వర్తించే పవిత్ర తీర్థమిది. చక్రపుష్కరిణికి కొంచెందూరంలోనే రత్నేశ్వరలింగం, దాని సమీపాన వృషభధ్వజేశ్వరుడు, ఆ ప్రక్కన ఆదికేశవ పీఠం

ఉన్నవి. ఆ ప్రాంతంలోనే పంచముద్ర మహాపీఠం దాని నానుకొని వీరేశ్వర, సిద్ధేశ్వర, యోగినీ పీఠాలు నెలకొని ఉన్నాయి. ఇన్నింటిలో ధర్మేశపీఠం పెద్దది సుమా! ఇటమన్న విశ్వభుజాదేవి అత్యంత మహిమ కలది. మనోరథతృతీయా వ్రతమున ఈ దేవిని ఆరాధించి అరుంధతి వసిష్ఠుని, అనసూయ అత్రిని, సునీతి ఉత్తానపాదుని భర్తగా పొందగలిగారు. వృత్రాసుర సంహారానంతరం తన్నంటిన బ్రహ్మహత్యా పాతకం పోగొట్టుకొనటానికి ఇంద్రుడు ధర్మపీఠానికి ప్రక్కన మహేశ్వర లింగ ప్రతిష్ఠ చేశాడు. ధర్మేశ్వరునకు నాలుగు దిక్కులను దత్తేశ్వరుడు, వైరాగ్యేశ్వరుడు, జ్ఞానేశ్వరుడు, ఐశ్వర్యేశ్వరుడు విరాజిల్లుతుంటారు.

పూర్వం దముని కుమారుడు దుర్దముడనేవాడు మిక్కిలి దురాచారుడై అనేక పాపకృత్యాలుచేసి ప్రజలను పీడించాడు. కాని వాడి అదృష్టం బాగున్నది. ఒకనాడు ఒక మహాపురుషుడు వాడికి జ్ఞానోపదేశం చేశాడు. దుర్దముడు ఆనాటినుంచి పాపపు ఆలోచనలను మాని వేసి కాశికిచేరి నిశ్చలమయిన భక్తితో పరమేశ్వరుని ఆరాధించి ముక్తుడయినాడు. అతడు ప్రతిష్ఠించిన లింగమే దుర్దమేశ్వరుడు.

మునీశ్వరా మనోరథతృతీయ వ్రతం వ్రతాలలో వైశిష్ట్యం కలది. పూర్వం అమిత్రజిత్తు అనే రాజు ఉండేవాడు. ఇతడు విష్ణుభక్తుడు. ఒకనాడితడు నిద్రపోతుండగా కంకాళకేతువనే రాక్షసుడు ఇతనిని అపహరించికొనిపోయి పాతాళలోకంలో బంధించాడు. రాజు శ్రీ మహావిష్ణువు నామం జపించాడు. ఆ మాహాత్మ్యంతో ఆ రాక్షసుని చెరనుండి విముక్తుడయి తనవలెనే రాక్షసునిచేత బంధింపబడిన ఒక విద్యాధర కన్యను చెరనుండి విడిపించాడు. వారిరువురు పరస్పరం ప్రేమించుకొని

దంపతులయినారు. కాని చిరకాలం వారికి సంతానం లేకపోయింది. ఆ దంపతులు నానా తీర్థములందు మునిగారు. విన్న వ్రతాలనన్నీ చేశారు. చివరకు వారు వీరేశ్వరుని క్షేత్రంలో మహారథతృతీయవ్రతం చేసి పుత్ర లాభం పొందగలిగినారు.

మలయజగంధి కుమారుకు వీరుడను పేరు కలవాడు. తన పేర నొక లింగమును ప్రతిష్ఠించి, అర్చించి మోక్షమందగలిగాడు. ఆ కారణంచేత అక్కడి స్వామి వీరేశ్వరుడని పిలువబడినాడు. ఇక్కడి తీర్థమునకు వీరేశ్వరతీర్థమని పేరు కలిగింది. ఈ తీర్థంలో స్నానంచేస్తే సమస్త తీర్థాలలో స్నానంచేసినట్లే కాగలదు.

పరమేశ్వర తీర్థం, పాదోదక తీర్థం, క్షీరాబ్ధి తీర్థం, శంఖతీర్థం, చక్ర, పద్మ, గరుడ తీర్థములు వైకుంఠ నారద, ప్రహ్లాద, నరనారాయణ యజ్ఞవరాహ, లక్ష్మీనరసింహ, గోవింద, శేష, మహిషాసుర, బాణ, ప్రణవ, పిశంగిలా, పిలిప్పిలా తీర్థములు, నాగేశ్వర, కర్ణాదిత్య, భైరవ విదారణనృసింహ, పంచనద తీర్థములు భోగమోక్ష ప్రదములు. అన్నింట శంఖతీర్థం మహత్తరం. ఇలా నిఖిల తీర్థములను, వాటి మహిమలను వివరించి కుమారస్వామి అగస్త్య మునీంద్రా! నీ సందేహాలు ఇంకేమైనా ఉంటే అడగవలసిందన్నారు.

దానికతడు పార్వతీనందనా! మహాపాప వినాశకరమైన కాశీ క్షేత్రమందలి దివ్యలింగములను, తీర్థములను వాని వైభవమును వివరించి ఎంతో ఆనందం కల్గించావు. దుర్వాసేశ్వరుడని మహేశ్వరుడు పిలువ బడుటకు కారణం వివరించవలసిన దన్నాడు. దానికి కార్తికేయుడిలా చెప్పాడు.

# దుర్వాసేశ్వర ప్రాదుర్భావం

ఒకప్పుడు దుర్వాసమహర్షి సకల దేశాలలో సంచరిస్తూ అవిముక్త సీమకు ఏతెంచారు. కాశీయందలి సమస్త ఘట్టాలలో క్రుంకులిడి విశ్వేశ్వరస్వామిని అర్చించినారు. వారణాసి తపసికి ఎంతో ఆహ్లాదం కూర్చింది. ఆ మహాశ్మశానంలో తపస్సు చేయవలెననే సంకల్పించాడు. వందల సంవత్సరాలు గతించినా ఏలనో విశ్వనాథుడు మాత్రం ప్రత్యక్షం కాలేదు. అత్రినందనుని ఓర్పు నశించింది. పైగా కోపిష్ఠిగదా. 'నా అంతటివాడు కఠోరదీక్ష గైకొన్నా ఫలితం కల్గలేదు. ఈ ఆనందకానన వనాన్ని శోకవనంగా మారేటట్లు శపిస్తాను అని' హుంకరించాడు. శాపం ఇవ్వటానికి కమండలంలోని జలం తీసుకొన్నాడు. ఇంతలో ఓసీదురాత్మా! కాశీ పయి అల్గి శపింప పూనుకొన్నావా? ఏమి నీ అహంకారం? అన్న గంభీర కంఠుని మాటలు వినవచ్చాయి. నేను, ఢుంఠి దుర్వాసుని ఎదిరించటానికి సిద్ధపడినాము. నందీశ్వర, చండీశ్వర, కుంభోదర, అగ్నిజిహ్వాలు ఢమఢ్ఢమరుకా నాదాలతో దిక్కులు పిక్కటిల్లేటట్లు బయలుదేరారు. ధరణి క్రక్కదలింది. అందరి రోషకషాయిత నేత్రములనుండి విస్ఫులింగాలు రాలుతున్నాయి. గణాధీశ్వరుల ఆర్భాటానికి జలధులేడు క్షోభించాయి. క్రోధోద్దీపితముఖంతో అంతకాంతకుడు ఎదుట నిలువగానే దుర్వాసుడు శర్వాణీపతికి నమస్కరించాడు. తలవకార, ఛాందోగ్య ముండక శ్వేతాశ్వతరాది ఉపనిషద్భావ పూరితములైన స్తోత్రములతో శంకరుని ప్రస్తుతించాడు. భక్తసులభుడగు పరమేశ్వరుడు ప్రత్యక్షమై కోరిన వరము లిచ్చి అంతర్హితుడైనాడు. భాగీరథీ తీరంలో అతడు భక్తితో ప్రతిష్ఠించిన లింగమే దుర్వాసేశ్వరుడు. ఈ దివ్య ప్రదేశానికి కొంచెం దూరంలోనే విశ్వకర్మ నామాంకితమైనది మహాఫలప్రదమైనది మరియొక లింగముంది.

త్వష్ట ప్రజాపతికి విశ్వకర్మ అనే పుత్రుడున్నాడు. అతడు విద్యార్జన చేయదలచి గురువువద్ద ఏకాగ్రతతో విద్యాభ్యాసం చేస్తున్నాడు. కాలగమనంలో వర్షాకాలం ఏతెంచింది. కారణమేమో ఆ సంవత్సరం మేఘములు కుండపోతగా వర్షించాయి. గురువు శిష్యుని పిలిచి నాయనా ! నీవు త్వష్ట ప్రజాపతి పుత్రుడవుగదా వర్షానికి దెబ్బతినని ఇల్లు నిర్మించి యిమ్మన్నాడు. గురుపత్ని ఆ బాలుని పిలిచి బాబూ శీతమునుండి రక్షించుకొనటానికి తగిన వస్త్రం ఒకటి రచియింపుమని కోరింది. గురుపుత్రుడు తనకు పాదుకలు నిర్మించియిమ్మన్నాడు. గురుపుత్రి వజ్రాలుకూర్చిన భూషణాలు కావలెనని కోరింది. విశ్వకర్మ వారు అడిగినవన్నీ తెచ్చి యిస్తానని చెప్పి అందరికీ నమస్కరించి వెడలినాడు. ఏకాంత ప్రదేశానికేగి అనేక విధాల యోచించాడు. దైవయోగంచేత ఒక దివ్య పురుషుడచటికి వచ్చి అతని చింతకు కారణం అడిగాడు. విశ్వకర్మ సర్వం అతనికి నివేదించాడు. అతడు చిరునవ్వు నవ్వి నాయనా ! నీవు కాశికేగి విరూపాక్షుని ప్రార్థింపుమని ఉపదేశించాడు. విశ్వకర్మ వారణాసికేగి నిశ్చలభక్తితో గౌరీపతి నర్చించాడు. అతడు అనుగ్రహించి సర్వ ధాతువులకు, దారువులకు, శిలలకు, రత్నములకు, వస్త్రములకు, సర్వ చిత్రములకు అతడు కర్త అయ్యేటట్లు వర మొసంగినాడు. పిమ్మట విశ్వకర్మ గురువు గురుపత్ని గురుపుత్రీ పుత్రుల కోరికలను తీర్చగల్గినాడు. ఆ వరము కారణంగా విశ్వోపకారు డయినాడు. అతడు ప్రతిష్ఠించిన లింగము విశ్వకర్మేశ్వరుడుగా ప్రసిద్ధికెక్కింది. కుంభసంభవా! ఇంక సకల కల్మషహరమైన గాధతోగూడిన దక్షేశ్వర ప్రాదుర్భావం వివరిస్తాను విను.

# దక్షేశ్వర ప్రాదుర్భావం

తొల్లి ఒకనాడు పరమశివుడు కైలాసంలో విందు కొలువున్నాడు. నాటి సభకు పద్మసంభవుడు, పుండరీకాక్షుడు, దేవేంద్రాది దిక్పాలకులు సప్తఋషులు, యక్షకిన్నర, కింపురుషాది దేవగణాలు, పాతాళ వాసు లయిన నాగులు విచ్చేశారు. కొంతవడి వినోద కాలక్షేపము లయిన పిమ్మట దేవతలంతా తమతమ లోకాలకు ప్రయాణమైనారు. నీలగళుడు ఎల్లవారిని సముచిత ప్రకారం గౌరవించి సాగనంపినాడు. ఆ సందడిలో అతడు తన మామయైన దక్షప్రజాపతిని మరచినాడు. ఆ అవజ్ఞత దక్షు నకు కోప కారణమైంది.

దక్షుడు సహజంగానే అహంకారం గలవాడు. స్వగృహం చేరినతర్వాత గూడ యాదృచ్ఛికముగ జరిగిన ఆ సంఘటన ఆతనికి మరపుకు రాలేదు. మనస్సులో అభిమానం మాత్సర్యం దినదినాభివృద్ధి చెందింది. " నేను బిడ్డనిచ్చిన మామనుగదా! అందునా బ్రహ్మమానస పుత్రుడను. దేవత లంతా నాకు నమస్కరిస్తారు. అంతటివానిని యోగక్షేమాలు విచారించి తగినట్లు గౌరవింపవలదా? ఏమి ఈతని గర్వం? అసలు ఈతనికి నేనెట్లు కూతురు నిచ్చినాను? ఇతని వంశమేది? కులమేది? గోత్రమేది! ఏ దేశం వాడు? వృషభ వాహనుడట. ఎన్నడో విషము తిన్నాడట? ఇదా ఈతని గొప్పతనం. ఒకవంక తపసిగా వేషం. మరొకవంక చేతిలో ఆయుధం ధరిస్తాడు. వల్లకాటిలో నివాసం. భార్యతో గృహస్థ ధర్మం. నే నెంత మందమతి నైనాను? ఇతడు పురుషుడా! అర్ధశరీరం స్త్రీ. కొసి స్త్రీ అంటామా గడ్డముంది. గురుతు తెలియని కాలంనుంచి ఉన్నాడు కనుక బాలుడు కాదు తరుణుడుగాదు. వీనికి జరామరణములు లేవే! మరి వృద్ధుడెట్లవుతాడు? కల్పాంతంలో బ్రహ్మాదులను సంహారం

చేసికూడ పాతకి కాదట. ఈతని వృత్తాంతం తెలిసిన వాడెవడు ? ఆహా: పెదవారైనా అల్లుండ్రకు అలుక ఎక్కువ. అత్త మామలపై అపరాధ ములు మోపటం భార్యను నిందించటం అల్లుండ్రకు సహజమే! అట్లని నా వంటివాడు అల్లుని అవగుణాలను సహింపగలడా ? ఒక్క రోహి ణి యందు అనురాగం ఎక్కువ చూపి పక్షపాతముగ వ్యవహరించినాడనే గదా చంద్రుని శపించాను. తల్లిదండ్రుల అదుపులో పెరగనివాడు తిరు వరి ఎదుటివానిని తనను తెలిసికొనలేడు. సమర్థుడైన నావంటివాడు వారికి తగినబుద్ధి చెప్పవలసిందే. సమస్త దేవతా బృందంఎదుట నన్నెలా అవమానించాడో నేను అదే విధంగా చేస్తాను. ఒకయజ్ఞం కల్పించి తనను తిరస్కరిస్తాను అని ఆలోచన చేశాడు.

దక్షుడేమి సామాన్యుడా! సంకల్పించినదే తరువాయి. యజ్ఞ సంభారాలు సమకూర్చాడు. దేవతలకెల్ల ఆహ్వానాలు పంపాడు.

పురుషోత్తముడు ఉపద్రష్టగా, మరీచి, అత్రి, భరద్వా జాదులయిన బ్రహ్మర్షులు ఋత్విజులుగా, బృహస్పతి ఆచార్యుడుగా, భిగుడు, పూషుడు మొదలయిన వారంతా సదస్యులుగా ఏర్పాట్లు జరిగాయి. అల్లుండ్రయిన ధర్ముడు, చంద్రుడు, కశ్యపుడు మామకు సహాయం చేస్తున్నారు. కామ ధేనువుహవిస్సు, కల్పవృక్షం సమిధలు, కుశలు, విశ్వకర్మ అవసర మైన పాత్రలు సమకూర్చసాగారు. భార్యయైన శతరూపాదేవితోకూడి దక్షుడు యజ్ఞదీక్ష గైకొన్నాడు. ఇన్ని యేర్పాటుచేసినాడుకాని దక్షుడు మాత్సర్యంతో మహేశ్వరునకు కబురైన పంపలేదు. చివరకు కుమార్తె సతీదేవినికూడ ఆహ్వానింపలేదు.

యాగసభనిండుగ ఉంది. పరమమాహేశ్వరుడైన దధీచి దక్షుని అవాలోచితకార్యం తెలిసికొన్నాడు. సహింపలేకపోయినాడు. సభామధ్యంలో

నిలిచి మేఘగంభీరస్వరంతో ఇలా అన్నాడు.

ఈ యజ్ఞంయొక్క ప్రాభవం ఎంతో బాగుంది. సరస్వతీదేవి స్తోత్రపాఠములు చదువుతున్నది. బృహస్పతి ఆచార్యపీఠం అధివసించాడు. కర్మకాండ విదుడయిన భృగుడు బ్రహ్మపదం అలంకరించాడు. లక్ష్మి అంతఃపుర స్త్రీలకు అలంకారాలు చేస్తున్నది. సాధ్వీశతరూపతోకూడి దీక్షగైకొన్నావు నీవు. దక్షా! ఒక్క పరమశివుని ఆహ్వానించకపోవటం తప్ప సర్వంసమంజసంగా ఉంది. దధీచికంఠం రుద్ధమౌతున్నది. ఆవేశం పెరుగుతున్నది.

దక్షునకు తోచకున్న విష్ణుమూర్తియినా చెప్పవలదా? శివుడు రానపుడు తానీయజ్ఞానికిరావటం తగునా? చంద్రమౌళికి ఎడమభాగం విష్ణువని కుడిభాగం చతుర్ముఖుడని పెద్దలంటారుగదా! అట్టి మహాత్ముని యజ్ఞానికి పిలిపింపవలదా? ఈ కుబేరునకేమి వచ్చింది? పరమేశ్వరుడు తన చెలికాడుకాదా? ముక్కంటికి మూడవకన్నుగాదా ఈ అగ్నిహోత్రుడు? వ్యోమకేశుని శిరోపుష్పంకాదా నిర్భాగ్యుడైన ఈ చంద్రుడు? ఈశ్వర సేవకులకు సేవకుడే మతిలేని ఈ ఇంద్రుడు. పరమశివుని ఆహ్వానించని యజ్ఞానికి ఏమనివచ్చారు? రుద్రుడు కన్నెర్రచేసినమాత్రాన ఈ పుణ్య పురుషుల ఇల్లాండ్ర మంగళసూత్రాలు పుటుక్కుమనవా? వజ్రాఘాతంవంటి త్రిశూలి ఎడమకాలి మడమతాకు అప్పుడే మరచిపోయినాడా ఈ యముడు? ఆయనను వెలిబెట్టిన యాగానికి వచ్చాడు.

శ్వేతాశ్వతరోపనిషత్తున హరుడేభోక్త అతడే భోగ్యం అతడే ప్రేరితము అని చెప్పబడలేదా? పరమాణువు మొదలు ఆకాశంవరకు సమస్తజగత్తుకు సృష్టిస్థితి లయకారుడు అతడుకాడా? దక్షప్రజాపతీ! నా మాటవిను. ఇప్పుడైనా క్రతుపురుషుని పిలిపించు. అహీనమైన వాక్యం,

కర్మహీనమైన శరీరం, పతిలేని స్త్రీ, నీరు లభింపని ప్రదేశం, పుత్రులులేని దాంపత్యం, స్త్రీహీనమైన సౌఖ్యసంపద, మంత్రిహీనమైనరాజ్యం, దాన హీనమైనసంపద, దర్భహీనమైన సంధ్యావందనం, తిలహీనమైన తర్పణం, హవిర్హీనమైన యజ్ఞం, శివహీనమైనకర్మలు, నిరర్థకాలు. బ్రాహ్మణుడను నీ శ్రేయస్సు కోరినవాడను. భోగికంకణుని వెంటనే పిలిపించు అన్నాడు.

ఆమాటలు వినగానే దక్షునిరోషం ఇనుమడించింది. ఇంత విందు సభలో తనకు బుద్ధిగరపెడివాడా ఇతడు? అతనికి ఒడలుతెలియలేదు. కోపంతోఉన్నవానికి వివేకంఉంటుందా? వెనుకముందు చూడక ఈ విప్రుని బయటకు నెట్టివేయండి అని కేకలువేశాడు.

దధీ: ఆహంకారంతో ఉన్ననీవు దీనిఫలితం సత్వరమే అనుభవిస్తావు. అని దధీచి తవకుతానై సభనుంచి వెడలిపోయినాడు. వెంటనే దుర్వాసుడు, ఉదంకుడు వామదేవుడు మొదలయిన మాహేశ్వరులు సభనుంచి నిష్క్రమించారు. ఈరభస ప్రారంభంకాగానే బ్రహ్మ సత్యలోకానికి వెడలి పోయినాడు.

తన తండ్రి యజ్ఞవృత్తాంతం సతీదేవి నారదునివలన విన్నది. తండ్రికి బుద్ధిగరిప దలచి కైలాసంనుండి బయలుదేరింది. నీలగళుడు ఆమెను వారించాడు. కాని పుట్టింటిపై గల ప్రేమ ఆమెను పతియాజ్ఞను కూడ మీరునట్లు చేసింది. ఇది స్త్రీలందరికి సహజమే.

సతీదేవి యాగమంటపం ప్రవేశించింది. ఆమెను చూడగనే సమస్త దేవతలు నమస్కరించారు. ఆ జగజ్జనని ఎవరిని పల్కరింపక నేరుగా యాగవేదికదకేగి ప్రక్కనున్న సింహాసనంపై కూర్చున్నది. దక్షప్రజాపతి ఆమెను చూచి ముఖం చిట్లించినాడు. అయినా కొంత పెబ్బరించుకొని కుమార్తెతో అమ్మా! నీవు వచ్చినావు చాలు. పితృవచనందారుడు

అమంగళకరుడని తెలియక విన్నిచ్చినాము. ఈ సభలో ఉన్న సువవా రందరిని చూడు. రత్నభూషణాలతో ఎంత చక్కగ ఉన్నారో. తన రూపం తన భాగ్యానికి తోడు అహంకారంకూడ. గర్వంతో నావంకైన చూడలేదు. నా అల్లుండ్రలో కానేపాటివాడు? అతడు రానిలోటు లేదు. సమయానికి నీవు రావటం సంతోషం అన్నారు.

తండ్రిమాటలకు దాక్షాయణి భ్రుకుటి ముడిచింది. ఆవేశం కట్టలు త్రెంచుకొన్నది. తండ్రీ! ఏమి నీ వివేకం. ఎంత బాగున్నది. నీ పిలుపుకు హవిస్సుకు పరమశివుడు ఆరాటపడుతున్నాడా? నీ పెద్దపోకలకు ఆశించి యీ సంతర్పణలో మృష్టాన్నం ఆరగించిపోవటానికి వచ్చినానని అనుకొన్నావా? కండ్లు కానక ఎందుకు పరమేశ్వర ద్రోహం చేస్తావు? అని బుద్ధిగరపి నీకు హితబోధ చేయటానికై వచ్చాను. శివుడే భోక్త. సమస్త ఫలాన్ని ఇచ్చేవాడు. సర్వమూ అతడే. అతడే శాశ్వతుడు. ఆ మహాత్ముని వెలిబెట్టిన క్రియలు ఫలవంతం కావు. ఆవేశంతో ఎందు కింత వెర్రివాడ వయినావు?

వేదమంత్రగోచరుడే అతడు. శంకరుడేగదా సమస్తభూతకోటి ఆత్మసంస్థితమైన తేజం. విష్ణుబ్రహ్మాది సమస్త సురగణకోటీర మణి ప్రభావిరాజితపాదుడే! ప్రణవనాదంతో జగత్తును సృజించి, పాలించి ప్రళయతాండవనాదంతో లయింపచేసే మహాశక్తి [illegible]. కనక శైలమునే విల్లుగా చేసి త్రిపురాసుర సంహార మొనర్చిన రుద్రుడే అతడు. ఢమరుకానినాద విధ్వంసక కరాళమృత్యు గర్వుడైన మృత్యుంజయుడే కాలగళుడు. జనకా! నీకెలా ఆపదూనా కప్పించారయ్యా! ఆ ముక్కంటి మూడవ కన్నెర్రబడిన జలధివనపర్వత దుర్గములతో నిండిన అజాండం నీరైపోయే దుస్థితి సంభవిస్తుందిగదా. ఏమిచంద్రా! ఏమి

బృహస్పతీః ఏమి వైశ్వానరాః మీరైనా ఇదికూడదని పల్కకమౌనం వహించారు. దీని పరిణామం ఎంత భయంకరంగా ఉంటుందో ఊహింప లేదాః ఏమి దుర్గతిపొందమన్నారో గదా అనిపల్కి రుద్రాణి ఒక్కక్షణం కండ్లుమూసింది.

క్షణంలో కాలిబొటనవ్రేలినుండి అగ్నిజనించింది. అది పాదములకడ నుండి పైకివస్తున్నది మొదట ఆమె పాదములపారాణిగా, కటి ప్రదేశమున బంగారు మొలనూలుగా, పాపటమీది సింధూర రజంవలె యోగమంటపంలో ప్రకాశిస్తున్నది. బంధువులంతా హాహాకారాలు చేస్తున్నారు. దేవతలు మునులు అయ్యోః అయ్యో! అంటూ ఏమి చేయుటకు తోచక చేతులు పిసికి కొంటున్నారు. ఋత్విక్కులు మ్రాన్పడి చూస్తున్నారు. శతరూపాదేవి విశ్చేష్టఅయినది. రెప్పపాటుకాలంలో అగ్నిభగ్గుమన్నది. భవానియోగాగ్నిలో భస్మమైనది.

సతీదేవి వెంటవచ్చిన గణాధిపతులు ఈ ఘోరంచూచి దుఃఖిస్తూ, ఆక్రోశిస్తూ అతివేగంగా పరువెత్తిపోయి శంకరునకీవార్త విన్నవించారు.

గణాధిపతుల మాటలు చెవినిపడెనోలేదో శివుడు మహాకాల రుద్రుడయినాడు. కనుబొమలు ముడివైచి రోషాగ్ని వెలిగ్రక్కినాడు. అంతలోనే ఒక మహాతేజస్సు వెలువడింది. దానిలోనుండి భయంకరా కారుడయిన ఒక దివ్యపురుషుడు ఆవిర్భవించాడు. రుద్రునితో దేవాః వదనగహ్వరం తెరచి బ్రహ్మాండభాండం మ్రింగివేసేదాః కాలదండంతో పర్వతాలన్నీ పిండిపిండిగా చేయమంటారాః ఆదిశేషుని వేయిఫణములు శిథిలమయ్యేటట్లు మడమలచే తాడించేదాః దిక్కులన్నీ నాభరవభరాలచే చీల్చివేసేదాః ఏమిఆజ్ఞ అని నమస్కరించి భుజాలు అస్ఫాలించాడు. ఆ ధ్వనికే వర్తనముద్రాలు మూర్ఛిల్లినాయి.

రుద్రుడు ఆతని రౌద్రరసోద్రేకానికి సంతుష్టపడి భద్రా! వీరభద్ర నామమంధరించు. తత్క్షణంబోయి దాక్షాయణీ ప్రాణపరిత్యాగానికి హేతువైన ఆదక్షుని అధ్వరం విధ్వంసంకావించిరా. ప్రమధబలాలన్నీ నీతో కదలి రాగలవు అనగానే మహాప్రసాదమని వీరభద్రుడు విరూపాక్షునకు ప్రదక్షిణం కావించాడు. సమస్తపారిష ద్భూధగణాలు జయ జయ రావాలతో అనుకరిస్తూరాగా అక్షీణక్రోధంతో దక్షిణదిశగా పయనించాడు.

నిమిషకాలంలో ప్రమధగణాలతో వీరభద్రుడు దక్షుని యాగస్థలానికి విచ్చేశాడు. ప్రమధులు యజ్ఞమంటపం ప్రవేశించి యజ్ఞకుండాలు పూడ్చి వేశారు. మంటపాలు పడగొట్టారు. యూపస్తంభాలు విరిచివేశారు. కొందరు నేతులుత్రావినారు. పిండివంటకములను కొందరు మ్రింగినారు. కొందరు బండ్లను విరుగదన్నినారు. వారి ఆర్భాటంచూచి ఋత్విజులు, సభాసదులు కకావికలయినారు. శంభుపుత్రుని ఆకారదర్శన మాత్రంచేతనే దేవతలు గుండెలు తడబడి ప్రాణాలు అరచేతపెట్టుకొని పరుగులు పెట్టినారు.

వీరభద్రుడు దేవతాముఖ్యులను తాకినాడు. ఆతనిపైకి వజ్రమెత్తిన దేవేంద్రునిహస్తం స్తంభించింది. వెన్నుడు ప్రయోగించిన చక్రాన్ని వీర భద్రుడు చక్కిలంవలె నమలివైచినాడు ఒక్క చెంపపెట్టుతో సూర్యుని పండ్లురాలి క్రిందపడినవి. ముత్యపుచిప్పనుంచి ముత్యాన్నిరాల్చినట్లు భగుని రెండుగ్రుడ్లు పెరికివేశాడు వీరుడు. యజ్ఞమృగం శిరం ఒక్కవ్రేటుతో నరకినాడు. తనతండ్రి నామంధరించినారని తలచినాడేమో; ఏకాదశ రుద్రులను మాత్రం హింసించక విడిచినాడు. శ్రాద్ధదేవుని మహిషాలలో తలక్రిందుగ వ్రేలాడదీసినాడు. కుబేరుని ముఖముమోదినాడు. లేశమాత్రమైనా కరుణ లేక అర్యముని రెండుచేతులు నరకివైచినాడు. చంద్రుని క్రిందపడవైచి మడమలతో మట్టినాడు. ఆ తాకుడుల మచ్చయే నేటికి శశాంకునిలో

కన్పిస్తుంది. దేవతలు ఎక్కడివారక్కడ పంచబంగాళమై పారిపోయినారు. దేవేంద్రుడు దూరంగాపోయి నెమలి ఆకృతి ధరించి వీరభద్రుని విజృంభణాన్ని తిలకిస్తున్నాడు.

దక్షుని చూడగానే వీరభద్రుడు మహోగ్రుడయినాడు. క్రోధంతో ఓరీ! ఈశ్వరద్రోహీ! నీ గర్వాంధకారపాపకర్మం మూలాన ఎందరు మరణించారో చూడు. నీవుకూడ వారివద్దకే పొమ్మని దక్షుని తల తెగ వ్రేసినాడు.

అనంతరం బ్రహ్మ అక్కడి కేగుదెంచి సమూశ్వాసవచనాలతో వీరభద్రుని శాంతింపచేసినాడు. తిన్నగా బ్రహ్మ వెనుకగా వచ్చి దేవతలంతా ఆయనకు ప్రణమిల్లారు. నీలకంఠసూతి శాంతించి సురల శరీరాలపై కలిగిన వ్రణాలు పోవునట్లు చేశాడు. శతరూపాదేవి పతిభిక్ష వేడుకొన్నది, భద్రుడు మేకతలను తెచ్చి అతికించి దక్షుని బ్రతికించినాడు. గర్వం తూలిన దక్షుడు మునుమని ఆజ్ఞను గైకొని శివద్రోహపాపం పోగొట్టుకొనడానికి కాశిలో తపస్సు చేసి పరమేశ్వరలింగాన్ని ప్రతిష్ఠించాడు. అదియే దక్షేశ్వరలింగం.

దగ్ధమైన సతీదేవి తిరిగి హిమవంతునకు పుత్రికగా జన్మించింది. తపస్సుచేసి పరమేశ్వరుని మెప్పించి ఆయన అర్ధాంగి అయినది. 'అంబకు పుట్టిల్లు మంచుమల. అత్తవారిల్లు కాశి. సాంబశివునకు పుట్టిల్లు కాశి. శ్వశుర గృహం శ్వేతశైలము.

ఇలా వివరించి కుమారస్వామి అగస్త్యమునీంద్రా ఇంక వ్యాసేశ్వరుని ఆవిర్భావం వినుమన్నాడు.

# వ్యాసేశ్వర ఆవిర్భావం

ఒకప్పుడు వ్యాసుడు భూమిలోని సమస్త తీర్థాలు సేవించాడు. వెంట శిష్యులను ఉన్నారు. వ్యాసుడు కాశీక్షేత్రానికి చేరాడు. కాశీలోని పంచనదతీర్థంలో స్నానంచేసి నిత్యం శ్రీ మహావిష్ణువును అర్చించి వైష్ణవ భక్తి ప్రబోధం చేసేవారు. విష్ణువే సత్యమైన దేవుడు. వేదపురాణశాస్త్ర ఇతిహాస నిర్ఘశాస్త్రం సత్యం. ముమ్మాటికి విష్ణువే దైవం. కేశవునికంటె పరదైవం లేదు. వేదశాస్త్రాలకు మించిన జ్ఞానం లేదు అని ఒకనాడు విశ్వేశ్వరమందిరద్వారంవద్ద ఎలుగెత్తి చాట సాగినాడు.

అదివిని నంది ఒకనాడు వ్యాసభట్టాచార్యా! ఏదీ ఏమని నీ ప్రబోధం అనినాడు. బాదరాయణుడు ఏదో పల్కబోయినాడు. కాని మాట పెగల లేదు. చేతితో ఏదియో సంజ్ఞ చేయబోవ హస్తం స్తంభించింది. వ్యాసుని శిష్యులు అది చూచి నివ్వెరపడినారు. వ్యాసున కేమియు తోచక జనార్దనుని మనస్సులో ధ్యానించాడు.

విష్ణువు ప్రత్యక్షమై సాత్యవతేయా! బుద్ధిమంతుడవే! ఇలాటి అపరాధం ఎందుకు చేశావు ? అని మందలించి నందితో, నందికేశ్వరా! నాకు ప్రియంగా ఇతనిని కరుణాదృష్టితో చూడవలసింది అన్నాడు. శిలాద తనయుడు విష్ణువుమాటను మన్నించాడు. వ్యాసుడు యథాస్థితిని పొంది పరమేశ్వరుని స్తుతించి తనపేర వ్యాసేశ్వరలింగం ప్రతిష్ఠించాడు.

ఆమాటలువిన్న అగస్త్యుడు షణ్ముఖా! వ్యాసుడు పరమేశ్వరలింగ ప్రతిష్ఠయొనర్చి ఈశ్వరుని ఆరాధింపచేసినాడుగదా. ఏకారణంచేత కోపాన్ని జయింపలేక కాశీపురాన్ని శపింపబూనుకొన్నాడు. వివరంగా చెప్పవలసిం దన్నాడు. దానికి కార్తికేయుడు మహామునీ! నీకావిషయం వివరిస్తానని చెప్పసాగాడు.

వ్యాసుడు వేలమంది శిష్యులతో ఆనందకాననవనంలో నివసించాడు. వారంతా నిత్యం భాగీరథీస్నానానంతరం సంధ్యాకృత్యం తీర్చేవాడు. వ్యాసుడు శివధర్మాన్ని ఉపదేశించేవాడు. మధ్యాహ్నవేళ వ్యాసుడు శిష్యులు మధుకర వృత్తితో ఆకలితీర్చుకొనేవారు. ఇలా చాలకాలం కాశిలోఉన్నాడు. ఒకనాడు విశాలాక్షీదేవితో ఈశ్వరుడు వ్యాసునిభక్తి పరీక్షింపవలసిం దన్నాడు. ఆమె మనస్సులో ఏదో సంకల్పించింది.

కృష్ణద్వైపాయనుడు ఒకనాడు యధావిధి నిత్యనైమిత్తిక కార్యములు తీర్చి మధుకరమునకు బయలుదేరాడు. శిష్యులు చేతులలో కుట్టిన మోదుగాకు విస్తరులు తామరపత్రములు ధరించి వెంటవస్తున్నారు. ఎండ తీక్షంగాఉంది. కాళ్ళు బొబ్బలెక్కసాగినవి. శిష్యులు నలువంకలకు వెళ్ళారు. తానొకవీధికేగినాడు. ఆశ్చర్యకరమైన సంఘటన జరిగింది. ఎవరికీ భిక్షలభింపలేదు. వండుతున్నానని ఒకామె. మరలరమ్మని ఒక సతీమణి, నేడు వీలుగాదని మరియొకపురంధ్రి పలికినారు. అసలు తలుపులే తీయలేదు ఒక తన్వి. తిరిగి తిరిగి వ్యాసుడు మఠానికి చేరినాడు. వెనుక శిష్యులుగూడ వట్టిచేతులతో తిరిగివచ్చారు. వారి వదనాలుచూచి ద్వైపా యనుడు శిష్యులారా! మీకు భిక్షదొరికిందా! నాకువలెనే శూన్యమైనదా? మీ ముఖాలుచూస్తే ఈవల్లకాటిలో ఆహారం దొరికినట్లులేదే! అన్నాడు.

స్వామీ! మాస్థితి ఏమని విన్నవిస్తాం. ఒకఇంట్లో సూతకమన్నారు. మరొకయింట దుర్భిక్షదోషమన్నారు. ఒకగృహంలో ఎవరో మృతి చెందారు. ఒకయింట రాజభటులు దండుగలు పుచ్చుకొన్నారని వాపోయినారు. ఒకఇల్లు తగులబడింది. ఒకఇంట పితృకార్యం అన్నారు. మరొకచోట మైలసోకిందన్నారు. ఒకఇంట్లో వేల్పులకు నివేదన కాలేదన్నారు. ఒకచోట ఇంకా శ్రాద్ధపోవలెనన్నారు. ఇదేమి పాపం

స్వామీ! ఒక్క గృహంలోకూడ భిక్ష తీసుకొమ్మని అన్నవారు లేరు. ఇంత కాలంనుంచి కాశీలో ఉన్నాం ఈవిధంగా ఎప్పుడయినా జరిగిందా?

కుతపకాలంలో బ్రాహ్మణ గృహాల ముంగిళ్ళలో గోమయంతో అలికి ముగ్గులుతీర్చి అతిథినక్కడ నిలిపి పాదాలుకడిగి పుష్పములతో పూజించేవారు బంగారుపళ్ళెములో అన్నముంచి అభిఘరించి పాయసం అపూపాలతోసహా ఎంతోభక్తితో సమర్పించేవారు. నేడుదయాన లేచినపుడు ఎవ్వరిమొగం చూచామోగాని ఏ పుణ్యాంగనా భిక్ష దయసేయలేదు. పురుషార్థాలకు పుట్టినిల్లయిన వారణాసిలో భిక్ష దొరకకపోవటానికి కారణం ఏమిటో? ఏమికీడువాటిల్లిందో విచారించిరమ్మని వ్యాసుడు శిష్యులతో అన్నాడు.

సుమంతుడు జైమిని, మొదలయిన వారంతా తిరిగితిరిగి కారణం తెలియక కాళ్ళీడ్చుకొంటూ మఠానికిచేరారు. గురువునకు నమస్కరించి ఇలా అన్నారు.

నారాయణావతారా! బాదరాయణా! పుణ్యాత్ములెందరో [illegible] నివసిస్తుంటే ఈ పట్టణానికి ఏమి ఇక్కట్టు కలుగుతుంది. విశ్వేశ్వరుడు, గంగ, డుంఠి, లోలార్కుడు, కేశవాదిదేవతలు తమవంటి పురాణపురుషులు ఉన్న పవిత్రప్రదేశంగదా! నానావిధ భూషణాలతో కరుణాభూషిణి పెద్ద ముత్తయిదువ అయిన అన్నపూర్ణాదేవి మధ్యాహ్నసమయాన అమృతాన్నం పంచుతుందంటారుగదా. మనకు మాత్రమే భిక్షకరవయింది. ఇదిమనం పూర్వజన్మలోచేసిన కర్మఫలంకావలె. ఆనందవనంలోని వారంతా శంకరుని అంతటి మహాపాపులే. పురశాసనుని అనుమతిలేక కాశీలో కలిప్రవేశిస్తుందా? శేషునివంటివాడు అర్ధరాత్రంలో పాతాళమునుంచివచ్చి పోరకోవడాని [illegible]

పూజించివెళ్ళే పవిత్రప్రదేశం. ఇదిమన ప్రారబ్ధమే సుమా! అని వాపోయారు.

వ్యాసుడువారితో నాయనలారా! సంధ్యాసమయం కావస్తున్నది. నేటికి భోజనంమీద ఆశలుడిగి ఉపవాసం ఉందాం. రేపు ప్రయత్నం చేదాముమన్నాడు సంధ్యాకృత్యములు తీర్చి కడుపులు నిండుగ నీరుత్రావి వారా రాత్రికి విశ్రమించారు.

ఆరాత్రి ఎట్లోగడిపి శిష్యులు మరునాడు బ్రాహ్మీముహూర్తంలో మేల్కొని నిత్యకృత్యములు తీర్చుకొన్నారు. మధ్యాహ్న సమయానికి మరల భిక్షకు బయలుదేరినారు. క్రిందటిరోజు జరిగినట్లే ఆనాడును జరిగింది. ద్వైపాయనుడు శిష్యులు ఈవిధంగా ఏడుదినములు నిరుపవాసం చేశారు. ఎనిమదవనాడుకూడభిక్షదొరకకపోవటంతో వ్యాసునిలోని ఓర్పు నశించింది. క్రోధంమిన్నుముట్టింది. చేతిలోని భిక్షపాత్రను నట్టనడివీధిలో ముక్కలగు నట్లు విసరికొట్టినాడు. వారణాసిలోనివారికి ధనమదం, విద్యామదం, మోక్షలక్ష్మిని పొందగలమనే మదం ముదిరింది. కాపుననే అతిథి అభ్యాగతపూజ నశించింది. ఇందరు బ్రాహ్మణు లుండి నాయంతటివాని నిట్లు అవమానపరచారు. శాపంతోగాని వీరిగర్వం నశింపదు అని కాశిలో మూడుతరముల వరకు విద్య, ధనం, మోక్షప్రాప్తి లేకుండుగాక అని శపింప దలచుకొని వ్యాసుడు కమండలంలోని జలాన్ని చేతిలోకి తీసుకున్నాడు.

ఇంతలో 'ఓయీ తాపసీ! శాపంపెట్టక ఇటురా. మీకు భిక్ష సిద్ధంగా ఉంది' అన్నమాటలు వినిపించాయి. అనునయంగానేఉన్నా ఆ పలుకులలో కొంచెం అధికారం ధ్వనిస్తున్నది. వ్యాసుడు ఆ వైపు చూచాడు. ఒక నడివయస్కురాలు ముత్తయిదువ దివ్యమైన ముఖతేజంతో నిలువబడి

యుంది. మంత్రాధీనమైన భుజంగంవలె రోజుతూ వ్యాసు డామెయున్న చోటికి వెళ్ళాడు. ఆమెను దర్శింపగానే ఆయనలోని కోపం మంచువలె కరగిపోయింది. ఆ స్వరూపం అటువంటిది. నలుబదేండ్లకు పైబడి యుండవచ్చు. కేశములు తిలతండుల న్యాయంగా ఉన్నాయి. మంద హాసంతోకూడిన ప్రసన్నవదనం. జిలుగు బంగరుటంచుల చీర ధరించినది.

సమీపానికి వచ్చిన వ్యాసునితో ఆమె, ఏమయ్యా! చూడబోతే గొప్ప ఋషీశ్వరునివలె కనబడుతున్నావు. గొంతులవరకు మధురాన్నం దొరకలేదని అంగలారుస్తున్నావు. అడవిలో దొరికిన కందమూలాలు, శిలోంఛయములు, నీవారధాన్యం కాయలు గడ్డలు తినే తాపసులు ఎంత ప్రశాంతంగా ఉంటారు? వారేమి నీకంటె తక్కువవారు గాదు. వ్యాస మహర్షీ! ఉన్న ఊరు కన్నతల్లి ఒక్కటేగదా! పుణ్యగుణరాశి కాశిపై అలిగినావేమయ్యా? వారణాసి పరమేశ్వరునకు అతిప్రియమైన అర్ధాంగి అని నీ వెరుగవా? వేదాలు విభజించినవాడవే! వేయి శాఖలతో సామవేదం, ఇరువదొక్క శాఖలతో ఋగ్వేదం, నూరొక్క శాఖలతో యజుర్వేదం, తొమ్మిదిశాఖాభేదాలతో అధర్వణవేదం కాశిలో ఉంటాయని నీకు తెలియదా? నీ కొక్కనికి భిక్షలేని కారణంగా కాశినే శపించటానికి పూనుకొంటావా? అవునులే. బ్రాహ్మణుడవు నీ వేమన్నా చెల్లుతుంది. ఆకలితో అలమటిస్తున్న నీతో ఇప్పుడు మాటలాడరాదు. వైశ్వదేవం తీర్చి నాభర్త సిద్ధంగాఉన్నారు. అతిథిప్రక్కన లేకుండా ఆతడారగింపడు సత్వరంగా గంగలో స్నానమొనర్చి త్వరగారావయ్యా. మహాత్మా జాప్యం అయితే నాభర్త ఓర్చుకొనలేడు అన్నది. వ్యాసుడు విశ్లిష్టుడైనాడు. అప్రయత్నంగా ఆమెకు నమస్కరించాడు.

ఆమెతో అమ్మా నీవెవ్వరు? ఇంతకు మునుపెపుడు ఈ పట్టణంలో

చూడలేదే! నీసందర్శన మాత్రంచేతనే ఏదోశాంతి లభిస్తున్నది. నీవు భూమికి దిగివచ్చిన చంద్రకళవా? కాదు నన్ను రక్షించటానికి వచ్చిన భాగ్యదేవతవలె ఉన్నావు. కాక కైవల్యలక్ష్మివో? స్త్రీరూపం ధరించిన వారణాసివో, లేక కాశీవిశాలాక్షీదేవివి నీవో? అన్నాడు.

ఆమాటలకు ఆమెనవ్వుకొని నేను నాస్వరూపం వివరిస్తుంటే నీవు ఊకొట్టుతుంటె ఇట్టేకాలం గడచిపోతుంది. భోజనమై ఆత్మసంతృప్తిపడిన పిదప వివరములు తెలుసుకొందువుగాక. ముందు భోజనమునకు దయ చేయమన్నది. వ్యాసునకు మరో సందియం పట్టుకొన్నది. తానొక్కడే రావలెనా? ఆమెతో దేవతారూపిణివైన ఓజననీ! నిత్యం శిష్యులు ఈ షహరంలో ఆయావీధులు తిరిగితెచ్చిన భిక్షమంతా రాశిగాపోస్తారు. అన్నమును సూప అపూపాదులను వేరుచేసి అన్నింటిలో సగం అభ్యాగతులకు వేర్పరచి తక్కినసగం గంగాజలంతో ప్రక్షాళన గావించి శిష్యులు నేను పంచుకొనితినటం పరిపాటి. కాని సాధ్వీ! ఎన్నడును కాశిలో ఇట్టివింత చూడలేదు సుమా! నాతోబాటుగ శిష్యులంతా ఈ ఏడుదినాలనుండి ఉపవాసం చేస్తున్నవాళ్ళే. వారిని వదలి నేనొక్కడినే ఎలా రాగలను అది ధర్మ మౌతుందా అనగానే అతని మాటలలోని భావంగ్రహించిన అన్నపూర్ణాదేవి వ్యాసమునీ! నీవు నీశిష్యులు కలసిరండి. అందరికి భోజనములు సిద్ధంగా ఉండగలవు అన్నది.

అమృతంతో సమానమైన ఆమె మాటలకు వ్యాసుడు మనస్సులోనే నమస్కరించాడు. శిష్యులనుతీసికొని భాగీరధిలో స్నానమొనర్చి క్షణ కాలంలో విచ్చేశాడు. ఆ పుణ్యాంగన వారందరిని పంక్తులుగా తీర్చి కూర్చుండబెట్టింది. సంకల్ప మాత్రంచేతనే సర్వపదార్థాలు సృష్టించి రంభాపత్రాల లోవడ్డించినది. పరమేశ్వరుడు స్వయముగా ఆపోశనలు

వేసినాడు. వారంతా ఎంతో సంతోషముగా మృష్టాన్నం ఆరగించి కడుపు నిండుగతిని గరుళ్ళిన త్రేన్చినారు. అనంతరం ఒక శాలలో కూర్చుంది తాంబూల చర్వణం చేయసాగినారు.

కోలాహలం అంతా సద్దుమణిగింది. పార్వతీపరమేశ్వరులు వేంచేస్తున్నారని హెచ్చరికలు చేయబడినాయి. క్రొంజిగురు శోభలతో విరాజిల్లే జిలుగు బంగరుటంచు ధోవతి ధట్టిగాగట్టి శశికళామకుటుడు పర్వత రాజపుత్రికేలు పట్టికొనిఏతెంచినాడు. అటగల ఉన్నతాసనంపై ఆది దంపతులు కూర్చున్నారు. వారిని చూడగానే వ్యాసుడు, శిష్యులు నిలువబడి ప్రణామాలు ఆచరించారు. శ్వేతాశ్వతరోపనిషత్తు మంత్రార్థాలతో స్తోత్రములు చేసారు. వ్యాసుని చూడగానే పరమేశ్వరుని మొగం జేవురించింది.

ఓయీ సాత్యవతేయా ! వేదాలను విభజించి లోకముల కొసంగినావు సకలపురాణ శాస్త్రములను రచించినావు. ఇంతటి యుక్తాయుక్త పరిజ్ఞాన శూన్యుడవు ఎలా అయ్యావు ? కైవల్య సద్గుణరాశిని కాశీపురిని శపించునంతటి వాడవా ? ఏడు దినములు నీకు నీ శిష్యులకు భిక్షదొరకనంతమాత్రాన సర్వ తీర్థ పవిత్రాశియగు కాశిని నాశనమొనర్చటానికి పూనుకొంటావా ?

ఏమినీ అహంకారం ! క్రోధాన్ని జయింపలేని తపస్సెందుకు ? ఇన్ని పుణ్య తీర్థములందు మునింకిన ఫలమేముంది ? ముక్తిస్థానమగు వారణాసికి ఎవడు కీడుచేయవలెనను కొంటాడో వాడు రుద్రపిశాచిగా మారగలడు. నీవి కాశీక్షేత్రంలో ఉండజగదు. కాశీ పొలిమేరలను విడచి తక్షణం వెళ్ళిపో అని తీవ్రముగా పలికాడు.

విరూపాక్షుని పరుష వచనాలకు వ్యాసుడు భయంతో వణకి పోయినాడు. ఆ దంపతులకు నమస్కరించి తన అపరాధం క్షమించమని సాష్టాంగ దండ ప్రణామం ఆచరించాడు. అనేకవిధాల వేడుకొన్నాడు

ఉలూక కోపనుడు భక్తసులభుడగు రుద్రుడు వారియందు కరుణ కలిగి
కాశికి పదిమైళ్ళ దూరంలో నివసిస్తూ పుణ్యకాల పర్వదినాలలో మాత్రం
కాశిలో ప్రవేశిస్తుండు ఏ తీర్థమును, ఏ క్షేత్రమును నిందింపక బుద్ధిమంతు
డవుగా బ్రతుకమని తెల్పి విశాలాక్షితో గూడ విశ్వనాధుడు అంతర్హితుడై
నాడు. ఈశ్వరుడాన తిచ్చిన విధంగా వ్యాసుడు కాశికి వెలుపల శిష్యులతో
ఆవాసం ఏర్పరచు కొన్నాడు.

కలశజా! ఈ వృత్తాంతం అంతా మాతండ్రి వివరించిన విధంగా
నీకు తెల్పినానుసుమా అన్నాడు. అగస్త్యుడు షాణ్మాతురా! పరమే
శ్వరగాధలెన్ని విన్నాతనివి తీరదు. ఇంకను వినవలెననే ఉంటుంది. కాశీ
క్షేత్రనగర విశేషాలు ఇంకా వివరింప వలసింది అని ప్రార్థించాడు.
కుమారస్వామి ఇలా చెప్ప సాగాడు.

దివోదాస నిర్యాణానంతరం మహేశ్వరుడు కాశి ప్రవేశించినపుడొక
వింతజరిగింది. ఈశ్వరుడు కాశిలో తిరిగి పట్టాభిషిక్తుడయిన పిమ్మట
ఆ మహోత్సవానికి వచ్చిన దేవతలంతా ఒక్కొక్కరే సెలవుగైకొని
తమతమ లోకాలకు పయనమైనారు. వారందరినీ సాగనంపుతూ నీలకంఠుడు
నీలమేఘశ్యామునితో, నారాయణా! నీ వలన నేను తిరిగి ఆనందకాననం
చేరగలిగాను. విఘ్నేశ్వరునకు నీకును తక్క దివిషద్వేషుడయిన, దివోదా
సుని వెడల నడచుట సాధ్యమవుతుందా? నీకు వరమొకటి ఇవ్వవలెనని
సంకల్పించాను. కోరుకొమ్ము అన్నాడు. దానికి జలజనాభుడు సంతసపడి
మహేశ్వరా! నేనుకూడ కాశిలో నివసించడానికి అనుమతి ఒసంగవల
సిందని అనినాడు.

శంకరుడు అందులకు సమ్మతించి విశ్వంభరా! నీవు నాసాన్నిధ్యమునే

యుండు. నిన్ను ఆరాధించినవిమ్మటనే ప్రజలు నన్ను దర్శిస్తారు. కాశీ యందలి తీర్థాలలో చక్రతీర్థం మిక్కిలి ప్రసిద్ధికెక్కుతుంది. ఈ ముక్తి మంటపానికి రాబోయేకాలంలో కుక్కుటమంటపం అని పేరు కల్గుతుంది. భవిష్యత్తులో జరుగబోయే కథను విను.

ఆనందకాననంలో మహానందు డనే బ్రాహ్మణుడు జన్మిస్తాడు. చిన్ననాడే అతడు తల్లిదండ్రులను పోగొట్టుకొనగలడు. అదుపాజ్ఞలు లేక పెరగటంవల్ల అతడు చెడులక్షణుడై వ్యసనాలకు గురియౌతాడు. యౌవనవంతుడయినపిదప అతడు విషయాసక్తుడయి యథేచ్ఛగాతిరుగుతూ పొరుగింటి బ్రాహ్మణుని భార్యను అపహరించుకొని పోగలడు. మిక్కిలి అనాచారుడు.ఒకప్పుడు ఒడలినింద విభూతి బూసి రుద్రాక్షమాలికలుధరించి శైవుడవుతాడు. మరియొకనాడు ఊర్ధ్వపుండ్రములు దరించి వైష్ణవుడయి శ్రీ గీత పఠిస్తున్నట్లు నటిస్తాడు. మరొకనాడు గౌరగ. వేరొకప్పుడు శాక్తేయుడు, బౌద్ధుడుగ ఒకసారి. కాపాలికుడుగ మరునాడు తిరుగుతాడు. శైవులతో చేరి వైష్ణవులను గేలిచేస్తాడు. జియ్యరు స్వాములతో కలసి శివదూషణ చేస్తాడు. ఇంతకు అత డే మతమువాడును కాదు. పరమ ధూర్తుడు. కేవల స్వార్థపరచింతనుడు. ధనాశాపూరితుడు. ఎవ రెట్టి దానాలిచ్చినా పరిగ్రహిస్తాడు. కొంతకాలానికి వానికి కుందుడు, గోకుం దని ఇద్దరు పుత్రులు కలుగుతారు.

ఆ రోజులలో మిక్కిలి ధనవంతుడయిన చండాల దొకడుండ గలడు. అతడు తీర్థయాత్రలు చేస్తూ కాశికి వచ్చి చక్రపుష్కరిణిలో స్నానం చేసి తడిగుడ్డలతో ఒడ్డునకు వచ్చి, నేను వింధ్యపర్వత సమీప వాస్తవ్యుడను. కాశికి వచ్చి చక్రతీర్థంలో మునిగినాను. శక్తికొద్దీ నా మాతాపితరుల సంతోషం కొరకు బంగారం వెండి దానం యిస్తున్నాను

విద్వాంసుడైన విప్రుడు దానం గ్రహించవలసిందని కేకలు వేస్తాడు. అక్కడ ఉన్నవారెవరు లేక నందుని చూపుతాడు.

నందుడు గంగాతీరంలో మిక్కిలి భక్తితో యోగసమాధిలో ఉన్నవానివలె నటిస్తాడు. చండాలుడు అతనివద్దకు వెళ్ళి ప్రార్థిస్తాడు.

స్వామీ నా ఇచ్చేదానం గ్రహించండి.

మాకు దానములపై ఆసలేదు. శివభక్తితో లభ్యమయింది చాలు.

మీరు అట్లనరాదు. నావలన దానం గ్రహించి నన్ననుగ్రహించండి.

నీ కొరకని దానం గ్రహించవలె ? ఏమి తెచ్చావు ?

లెక్కకు మిక్కిలిగ వెండి బంగారు నాణెములు.

ఏవీ చూపు ?

అతడు బంగారునాణెములు చూపిస్తాడు. నందునికి ఆశ ఎక్కువౌతుంది.

ఏమోయి అంతా నాకే ఇస్తావా ? దీనిలో వేరొకరికి పంచితే నేనసలు దానం తీసుకోనుసుమా !

చండాలుడు సరేనని సర్వం అతనికే దానం మివ్వగలడు. వానిని కాశీలోని అందరూ హేళనచేస్తారు. పైగా అతి హీనంగా నిందింపగలరు. అతడు కాశీలో ఉండలేక భార్యా, పుత్రులను తీసుకొని మరో చోటికి ప్రయాణం సాగిస్తాడు. మార్గమధ్యంలో దొంగలు పీడిస్తున్నా ధనం బంగారం దోచుకుంటారు. తీవ్రమ ప్రాణాలతో వదిలితే రాజుకు చెప్పి

దండనకు గురిచేయగలరని దొంగలువారిని చంపదలచు కొంటారు. పంచభూతములందు ఇష్టదైవములకు ప్రార్థన చేసుకొమ్ముంటారు. ఏమిటో ఒక బ్రాహ్మణుడు వస్తు, బ్రాహ్మణి విగ్రాలకి దేవిని, కాలుడు ఉంటి మహేశ్వరుని తలచుకొంటారు.

నందుడు మనసులో నేనేం పొరుగువానిభార్యను అపహరించాను. ఉత్తమమైన బ్రాహ్మణాచారాలను ఎందుకు మట్టిలో కలిపినాను. మద మాంసాలకు అలవడి ఎందుకు పాషండమతం అవలంబించాను. ఇంతటి పేరాశతో దానమెందుకు గ్రహించాను. నామమిత్రద్రోహికి ఇట్టి దుర్మరణమే ప్రాప్తించాలి అంటూ పశ్చాత్తాపపడి వస్తూ ధ్యానిస్తాడు అనంతరం దొంగలువారిని సంహరిస్తారు.

ప్రాణావసాన సమయంలో వేల్పులను తలచుకోవటంవల్ల అనంతర జన్మలో కోళ్ళుగా జన్మిస్తారు. కొందరుపత్రకులు ఈ కోళ్ళనుకొని, పచ్చి కాశిలో విక్రయిస్తారు. అవినిత్యం మణికర్ణికలో మునుగుతాయి. ముక్తిమంటపంలో ఋషీశ్వరులుచేసే ప్రసంగాలు వింటాయి. విశ్వేశ్వర లింగమునకు ప్రదక్షిణలుచేస్తాయి. ఆలయద్వారంవద్ద పడిన బలి అన్నం మెతుకులను తిని జీవిస్తాయి. నాలుగుజాములు కొమరుసామిని తలచు కుంటూ కొక్కొరుకోయని ప్రణవనాదం చేస్తాయి.

పూర్వస్మృతితో ఈవిధంగా జీవితాలు గడిపి అవి కుక్కుట జన్మములనువీడి ముక్తిపొందుతాయి. కుక్కుటములకు ముక్తికలిగించే కారణంగా ఈముక్తిమంటపానికి కుక్కుటమంటపం అని పేరుకల్గుతుంది.

అగస్త్యమౌనీ! ఇది మాతండ్రి వెన్నునకు చెప్పెనగాద అని కుమారస్వామి కలశంభవునకు కాశీమాహాత్మ్యం సాకల్యంగా వివరించాడు.

అగస్త్యుడు లోపాముద్ర తమ జన్మలు పావనమైనట్లు భావించారు.

అనంతరం మునీశ్వరుని కోరికమీద దేవయాత్రావిధానం కుమారుడు వివరించాడు. చక్రపుష్కరిణిలో దేవపితృతర్పణలు చేసి లోలార్క క్షేత్రములను సేవించి విశ్వనాధుని సేవ చేయవలె. అనంతరం ఓంకారేశ్వరాది లింగములను విఘ్నేశ్వరులను అర్చింపవలసి ఉంటుంది. ఇది దేవయాత్ర విధానం.

మహర్షీ! ఇది స్కాందమనే పర్వతంలో జనించిన కాశీమాహాత్మ్య పవిత్రధార. దీనియందు మునిగినవారి పాతకములు హరించి విశ్వనాథుడు ముక్తినిస్తాడు. కాశీ విశాలాక్షి ఇహలోక సౌఖ్యములతోబాటు ఆముష్మిక ఫలసిద్ధి కలుగజేస్తుంది.



